


# దుర్గాబాయమ్మ

"భవోహి లోకాభ్యుదయాయ తాదృశాం"

పేరుచేతనేగాక ప్రవర్తనమునందును దుర్గాంశవెలయించుచు ఆంధ్రకీర్తికి ప్రచారకర్త్రియై ప్రఖ్యాతిగాంచుచున్న శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మ త్రివర్ణచిత్రమును దుర్గపూజాదినములలో ఆంధ్రుల కరకమలములకు నివేదింపబడుచున్న ఈసంచికయందు తిలకచిత్రముగ ప్రచురింపగలిగినందులకు ప్రమోదమునందుచున్నాము.

సౌమ్యసంవత్సరఆషాఢబహుళస్థిరవారము (10-7-1909) నాడు బ్రాహ్మణవంశమున దుర్గాబాయమ్మ జన్మించెను. ఉచితజ్ఞులగు తలిదండ్రులు ఈమెకు క్రమశిక్షనిచ్చి విద్యాబుద్ధులుగఱపిరి; పండ్రెండువత్సరములవయస్సున ఈమెకు హిందూధర్మశాస్త్రప్రకారము వివాహముగావించిరి. దుర్గాబాయమ్మ భర్త విద్యాప్రియుడు. అగుటచే ఈమెచదువు కాకినాడ అత్తవారింటికివచ్చుటతో కోటాకువేయలేదు. ఈమె తన 13-వ ఏట హిందీ భాషాభ్యసనమునకు దొరకొనెను. ఆఱుమాసములలో ఈమెకు అందు మంచిప్రవేశము కుదురుకొనెను. తోడనే ఈమె హిందీపాఠశాలను ఏర్పఱచి బాలికలకు విద్యాప్రదానమొనర్ప ప్రారంభించెను. ఆపాఠశాలానిర్వహణమునకగుఖర్చు ఈమె స్వయముగనే భరించుచుండెను.

ఈమె కాపురపుకాణాచియగు కాకినాడపట్టణమున అఖిలభారతదేశీయమహాసభ కూడుసరికి ఈమెకు పదునాలుగుసంవత్సరములు. ఈపదునాలుగుసంవత్సరములబాలిక నిర్వహించుచున్న హిందీపాఠశాలయందు అప్పటికి నూర్గురువిద్యార్థినులుండిరి. నాయకులీసంస్థనుచూచి ఆహాఅనిరి. ఈపాఠశాలయందు దుర్గాబాయమ్మ ఉపాధ్యాయిని; ఇంటివద్ద ఈమె ఇంగ్లీషు, సంగీతము నేర్చుకొనువిద్యార్థిని. మాతృభాషయగు ఆంధ్రమునుకూడ ఈమె ఏమఱలేదు. విశాఖపట్టణమున మఱియొక హిందీపాఠశాలను స్థాపించియు, విద్యావ్యాసంగమున పూర్తిగ నిమగ్నయయ్యు ఈమె దేశసేవచేయ సమయమునకొఱకు వేచియుండెను.

1929-వ సంవత్సరమున మహాత్ముడు ఆంధ్రదేశసంచారమునకు వచ్చెను. అప్పుడు దుర్గాబాయి మహాత్మునితోగూడ ఇరువదియైదుదినములుండి వారి ఆదర్శజీవితమునందలి అంతర్యమును గ్రహించెను. ఇందుతో ఈమెబుద్ధికి గొప్పసంస్కారము కలిగెను. దేశసేవకు ఈమె మనము ఉవ్విళ్లూరుచుండెను. 1930-వ సంవత్సరప్రారంభమున ఈమె తూర్పు గోదావరిజిల్లాబోర్డుసభ్యత్వమును పొందెను. స్థానికప్రజాసేవ చేయుటకుతగియున్న ఈ సదవకాశము నుపయోగించుకొనుటకు ఈమెకు వీలుచిక్కలేదు.

మగని ఆరోగ్యముకొఱకు ఈమె మదరాసురావలసివచ్చెను. మదరాసునందు ఈమె చిన్ననాటనుండి తానుచేసిన విద్యావ్యాసంగము సాగలుబట్ట భారతీగృహలక్ష్ములకు వ్యాసములువ్రాయ ఉవ్విళ్లూరినది. కాని ఇంతలో సబర్మతీఆశ్రమమునుండి మహాత్ముడు సత్యాగ్రహశంఖమును పూరించినాడు. ఉత్తరమున హిమాలయపర్వతగహ్వరములును, దక్షిణమున హిందూమహాసముద్రతరంగములును ప్రతిధ్వనించినవి. అందుతో ఢిల్లీఅసెంబ్లీసభను కాలదన్ని ఆంధ్రనాయకులకునాయకుడు ఆంధ్రకేసరి మద్రాసురంగమున కాలుపెట్టినాడు. నివురుగప్పిన నిప్పులుగా దుర్గాబాయమ్మయందు నిక్షిప్తమైయున్న ధైర్యసాహసాదిగుణముల నాతడు పసిపట్టినాడు. మహాత్మునియనంతరము సరోజనీదేవి యచ్చట దర్శనయందు సత్యాగ్రహనియంత్రికాగా ప్రకాశముపంతులుఅనంతరము ఈమె ఇచ్చట మదరాసునందు సత్యాగ్రహనియంత్రియైనది. రాష్ట్రకీర్తిని రంగాయించినది.

1930-వ సంవత్సరపు ఏప్రియలు 25-వ తేదీనాటి ఉదయభానుడు ఉద్ద్యోతించుచున్నాడు. ఉన్నతన్యాయస్థానమునకెదుట. ఉదాకరతీరమున. ఉపరక్షణమునకైన రక్షకభటులు విధ్యుక్తధర్మమునువిడిచి చేతిదురుసుతనమునుచూపినారు. పోలీసుడు క్యాగి యొకడు దుర్గాబాయమ్మను చేతితోగెంటినాడు, చేపాటికర్రతో కొట్టినాడు. గెంటెనుగాక, కొట్టెనుగాక! ఈమెముఖము కోపముచే కించిత్తును కుంచితముకాలేదు, రోషముచే ఈషత్తును కషాయితముకాలేదు. ఈమె ఈరక్కసతాల్మికి సహస్రకిరణుడు చండకిరణుడయ్యెను. అయినను ఈమె క్షమాధృతియందు జారుపాటు కానరాలేదు. జారుపాటు కానరాలేదు కావుననే లవణసత్యాగ్రహము చారుతరఫలమునిచ్చినది.

అతిలోకమైన ఈక్షమాధృతి ప్రదర్శింపబడిన ముప్పదిదినములకు పిమ్మట మే 25-వ తేదీని ఆర్కాటునందు ఈమె అరెస్టుచేయబడినది. శిక్షాస్మృతి 117-వ నిబంధనము క్రింద తొమ్మిదిమాసములు, ఉప్పుచట్టము 74-వ నిబంధనముక్రింద మూడుమాసములు మొత్తము సంవత్సరము ఈమెకు శిక్ష విధింపబడెను. అందుతో ఈమె దేశసేవకు పట ్టాపుట్టినది. పట్టా పొందిన ఈజాతీయవాదిని జయిలునందును కాలమువృథాచేయలేదు. రాట్నచాలనమో, హిందీబోధనమో. గాంధిఇర్విను ఒడంబడిక ఇతరసత్యాగ్రహులతోబాటు ఈమెకును విడుదల గానివచ్చినది. ఈదేశసేవిక తరువాతిచరిత్ర దేశీయులసొమ్మయిఉన్నది.

# ఐదు మాసముల యిరువది దినములు

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ గారు

౧

ఎటుచూచిన సుకుమారము, నాగరికత ద్యోతకమగుచుండెడిది గోపాలరావునందు. సన్ననిగోరంచు ధోవతులు. మెత్తనిపట్టుచొక్కాయిలు, పాముకుబుసములాగు మిసమిసలాడే జరీఖండువాలు తప్ప అతడు వేఱొకవస్త్రమే వాడియెఱుగడు. ఎప్పుడును పాపిటచెదరని క్రాపింగు, పాలిష్‌మాయని బూట్సులు, నల్లనిఫ్రేములో అమర్చిన గుండ్రని కంటియద్దములు, రిష్టువాచీగలిగి తాను జన్మించిన యున్నతకుటుంబమునకును, తాను చదివెడి యున్నతవిద్యకును తగిన ఆకారమును, వర్తనమును కలిగియుండేవాడతడు. ఇంత నాగరికతగానుండునని వర్ణించుటచే అతడు పట్టిపోతులరాయడని పాఠకులు భ్రమకు లోనగుదురేమో? వినయకారుణ్యాదిగుణవిశేషములు అతనికి పెట్టనిసొమ్ములు. సుప్రసన్నమైన అతని ఆననము సౌమ్యతకు కుదురు. మాతృదేశమనిన అతనికి పరమభక్తి. ఎవనికి దేశముపై ప్రేమయున్నదో వాడు దేశహితైకకార్యములందు పాల్గొనకెట్లుండగలడు? మహాత్ముడు సత్యాగ్రహము నారంభించి దేశీయులనెల్లర రండురండని ఆహ్వానించినప్పుడు ఆయన ఆహ్వానమునందుకొనిన విద్యార్థిగణములో గోపాలరావు ఒకడు. అతడువరించినకార్యక్షేత్రము విదేశవస్త్రబహిష్కారము.

౨

రుక్మిణి పురిటినిమిత్తము ఏడుమాసములక్రిందట పుట్టినింటి కేగినది. కొమారుడు కలిగినాడు. పిల్లవానికి అయిదవమాసము వచ్చినది. బారసాలచేసికొని భార్యను, బిడ్డను తీసికొని వెళ్లవలసినదని మామగారు మూడవనెలను, అయిదవనెలనుగూడ జాబులువ్రాసినాడు గోపాలరావునకు. సత్యాగ్రహోద్యమములో మునిగితేలుచున్న గోపాలు డాయుత్తరములకు జబాబియ్యలేదు. పోలేదు. రుక్మిణికి అత్తవారింటి కేగవలయుననెడి ఆతురత అధికముగా నుండుట గమనించి తలిదండ్రులు బిడ్డసారెపెట్టి రుక్మిణిని అత్తవారింటికంపినారు. తాను పుత్రవతియైనది. ఆసమయముననే తనభర్త ఎం.ఏ. పరీక్షయందుత్తీర్ణుడైనాడను సమాచారము వినినది. భార్యాభర్తలు మనసుకలిసినవారు. ఎలప్రాయముననున్నవారు. ఎన్నిముచ్చట లుండును? తమ సుఖమయసంభాషణలచే అథమమొకవారముదినములైనను విరామముండ దని రుక్మిణి మదిలోని అభిప్రాయము. రైలులో పయనించినంతసేపు తమప్రసంగము లెట్టివిగానుండునో ఊహించి మురియుచు, తనువుకంటె ముందుగా పెనిమిటిసన్నిధికి పరువులు పెట్టుచున్న చిత్తముయొక్క ఉరవడికి నవ్వుకొనుచు, జబాబు వ్రాయనందులకు బాగుగా నిష్ఠురములాడవలయును, పరీక్షప్యాసైనందుకు బాగుగా అభినందించవలయును, బారసాలకు రానందులకు బాగుగా నెగతాళిచేయవలయును అని యేవేవో జాగ్రత్స్వప్నములు, ఆకాశ

హర్మ్యములు నిర్మించుకొనుచు వచ్చినది. స్టేషనువద్దనే తనభర్త ముఖారవిందము తప్పక నయనపర్వమొనర్చునని ఆమె దృఢనిశ్చయము. రైలుదిగగనే ప్లాటుఫారమంతయు కలయ చూసినది. ఆమె హృదయాకాశమున చిఱుమబ్బులు ఆవరించినవి.

3

ఆనాడు విదేశవస్త్రదుకాణములవద్ద తీవ్రముగా పికెటింగు జరుపుటచే అలసిసొలసి మధ్యాహ్నము పదిరెండుగంటలకు ఇంటికివచ్చినాడు గోపాలరావు. భార్యరాకను పనితొందరలచే మఱచిపోయిన గోపాలరావు భార్యనుచూచి 'అవును, యీదినము వస్తానని వ్రాసినారుగాదూ?' అని జ్ఞాపకము తెచ్చుకొనినాడు. ఉత్తరము వ్రాయకపోయిననేమి, రైలువద్దకు రాకపోయిననేమి తన్నుచూచినప్పుడు ఉల్లాసముగా భాషింపడనునది రుక్మిణి ఊహింపని ఆపద. అప్పుడు రుక్మిణిధరించియున్న చీర ఆర్టుసిల్కు, రవిక గ్లాస్గోమల్లు. ఆమె కొమారునకు తొడిగినదిగూడ విదేశపుదువ్వాలువే. గోపాలరావుకన్నులలో కోపము, అసహ్యము నృత్యము సల్పినవి. మధురమందహాసములేదు. మనోజ్ఞభాషణములులేవు. అడావిడిగా నాల్గుమెదుకులు నోటవేసికొని వెళ్లిపోయినాడు.

మగనివర్తనము రుక్మిణికి పిడుగు అడచినట్లైనది. పచ్చబొమ్మబంతువలె మిసమిసలాడుచు, నవ్వుచు, కేకిసలుకొట్టుచు, ఊఁఆ అంటూ నల్లనిముంగురులు ముఖముపై క్రమ్ముచుండ చూచినవారినెల్ల ముద్దులవిందులకుపిలిచే పాలబుగ్గలతో నొప్పుచున్న కుమారుని క్రిందికి దింపకుండా యెత్తుకొనుచునున్న పెనిమిటిచూపిన ఉదాసీనమునకు కారణము ఆమెకు తెలియలేదు. వేషమేమాఱినది. భాషేమాఱినది. మనిషేమాఱినాడు. ఈపరిణామమునకు కారణమేమిటో రాత్రికి తప్పకుండా తెలిసికొనవలయును. అస్తమయమునకొఱకు సూర్యునివంక చూచుచున్నది రుక్మిణి. ఆనాడు ఆమెఅన్నము మునిపంటకొఱికినది. కూర్కు అసలేయెఱుగదు. తల్లియొక్క కళవళపాటునకు ఫలితముగా పిల్లవాడు దినమంతయు పోరుపెట్టి యేడ్చుచునే యున్నాడు.

4

రాత్రి పదిగంటలకు గోపాలరావు ఇంటికివచ్చి చొక్కావిప్పుచున్నాడు. పోలీసు సబుయిన్స్పెక్టరువచ్చి "గోపాలరావుగారూ!" అన్నాడు. వెంటనే గోపాలరావు "ఎవరు" అనుచు వాకిలిలోనికివచ్చినాడు. "గోపాలరావుగారు తమరేనా?" అని వారంటుఉత్తరువుజారీచేసినాడు ఇన్స్పెక్టరు. గోపాలరావు నిశ్చలుడై నిలువబడినాడు. అతనిముఖసీమపై ఎట్టి వికారమును కనుపించలేదు.

"ఒకగంట సెలవిస్తారా?" అన్నాడు యిన్స్పెక్టరుతో. 'వీలుకాదు.'-'భోజనము చేసియైన రావచ్చునా?'-'ఉత్తరువులేదు.'-'సరె, రెడీ' అని ఇన్స్పెక్టరు వెంటనడిచినాడు గోపాలరావు.

౫

ఓపికగల మేజస్ట్రీటు ఆరాత్రివేళగూడ కోర్టులోనే కూర్చున్నాడు. జీతము మామూలేకాని న్యాయాధికారులకిప్పుడు పనిమాత్రము డబుల్. పట్టుదలగల ప్రచారకుల నెంతత్వరగా ఊరినుండి తరిమివేసిననంత హాయిగా నిద్రపోవచ్చునని అధికారులఊహ. గోపాలరావు యిన్‌స్పెక్టర్లు ముందూ, వారివెనుక నిరువురు రక్షకభటులూ. మేజస్ట్రీటు గోపాలరావునుచూచి 'ఏమయ్యా! విదేశవస్త్రములుధరింపరాదని ప్రజలలో తీవ్రప్రబోధము గావించుచున్నావట గదా?'-'అవును.'

'విదేశవస్త్రములు దహించివేయుమన్నావుటగాదూ?'-'నిజమే.'

'విదేశవస్త్రపుదుకాణములవద్ద గుంపులుచేర్చి విదేశవస్త్రములు కొనవద్దని ప్రజలను బాధించుచుంటివట గాదూ?'

'బాధించుటలేదు. బ్రతిమలాడుటే.'

'అయితే నీవు నేరస్తుడవే.'

'మీదృష్టిలో.'

'డిఫెన్సు పెట్టుకుంటావా?' 'ఊహూం.'

'అపాల్జీ?'

గోపాలరావులోని శౌర్యరసమును వెలికిదిమ్ముచున్నట్లుగా అయిపోయినవి దృక్కులు. మేఘగంభీరమైననినదంతో అన్నాడు: "సత్యాగ్రహవీరుల నిఘంటువునుండి డిఫెన్సు, అపాల్జీ అనేపదములు తుడిచివేయబడినవి."

మేజస్ట్రీటు చకితుడైనాడు. మాటతడబడినది. "దృష్ట్వాహిత్వాం ప్రవ్యథితాంతరాత్మాధృతింనవిందామిశమంచవిష్ణో" అని అర్జునుడు కృష్ణుని విశ్వరూపమునుచూచి భయార్తుడై వలవలలాడినచందమున నించుకసేపు లోలోనకొట్టుకాడినది అతని అంతరాత్మ. అయినను కర్తవ్యముతప్పదు. బిడియముతో, భయముతో గద్గదకంఠుడై ఆఱునెలలు కఠినశిక్ష, సి. క్లాసు అన్నాడు మేజస్ట్రీటు.

"వందనములు" అన్నాడు గోపాలరావు.

౬

రుక్మిణికి ఇల్లు అరణ్యమైపోయినది. ఎనిమిదినెలలక్రితము పుట్టినింటికేగి అదినమే వచ్చినది రుక్మిణి. కొడుకును చూపలేదు, మాటలు మాటాడలేదు, నవ్వులు నవ్వలేదు, హాస్యములాడలేదు, తనహృదయమాతనికి తెలుపలేదు, ఆతనిహృదయము తాను తెలిసికొనలేదు. హా! ఎట్టియుత్కంఠ కెట్టివిఘాతము? పెనిమిటిశిక్షావర్తమానమువిని పిడుగడచినట్లు నేలగూలిపోయినది రుక్మిణి.

"ఎండకోర్చలేవు, ఆకలికోర్చలేవు, కష్టమైనపని చేయలేవు, గరగర నేతితో వేగిన కూరలుగాని పనికిరావు. మెత్తనిపక్కపైగాని మేనువాల్చవు. బజారునుండి ఒక్కవస్తువు తేరా బాబూ! అంటే అభిమానము, సిగ్గు. ఇటువంటివాడివే, నాతండ్రీ! ఈఆఱునెలలు ఆచెఱలో ఎట్లుగడపి వస్తావురా? మాకన్నులెప్పుడు చల్లబఱుస్తావురా?" అని తల్లిదండ్రులగోల. అన్నాలులేవు, నీళ్లులేవు. మిన్నువిరిగి మీదబడ్డట్టయినది ఆసంసారస్థితి.

౨

రుక్మిణి సిరిగలయింటబుట్టినది. ఆమెతండ్రి గొప్పఉన్నతోద్యోగి. కాన స్వార్థప్రేరితమైన రాజభక్తి వారిచిత్తములకు పెట్టనికోట. బహిర్ప్రపంచములోని వ్యవహారములు వారి చెవికిచేరవు. పేదసాదల కష్టనిష్ఠురములు, విదేశవస్తువులవలని యనర్థకములు, పరాధీన భారతదేశపు అగచాట్లు వారెప్పుడును వినినసంగతులుగావు. ఇంటిలోని ఆడవారు నల్గురు ఒక్కచో కూర్చుండినచో వారి ప్రసంగవిషయములు చీరలు, నగలు, కాకపోతే పిండివంటలు, వేపుడుకూరలు, కాఫీలు, టీలు. ఇట్టిభోగప్రపంచములో పుట్టిపెరిగినదగుటచేత రుక్మిణి జ్ఞానముగూడ వీనికి మించలేదు. సత్యాగ్రహోద్యమముచే దేశమట్టుడికినట్లుడికి పోవుచున్నను వానినిగుఱించి ఆమె కొంచెముగూడ విచారించియుండలేదు. నేడు తనదేశమునందు తయారైన వస్త్రములను దానుధరించి యితరులనుగూడ ధరింపుడని ప్రబోధించినందులకు తన మగనికి దొంగలకు, దోపిడిగాండ్రకు, హంతకులకువేసినట్లు కఠినశిక్షవేసినారనివిని రుక్మిణి ఆశ్చర్యచకితురాలై పోయినది.

"ఏమి! మనదేశపుగుడ్డ మనము కట్టుకొనుటగూడ తప్పేనా? నేడిదైనది. తేపు మీకుగావలసిన ఆహారపదార్థములను మేమే పచనముచేసి పంపెదముగాని మీరు తయారు చేసికొనరాదనినచో మనప్రాయియ్యలు తవ్వివేసికొనవలసినదేనా? ఎంత అధమపుబ్రదుకు. నాపెనిమిటి నాతో మాట్లాడలేదని యెంతోవేదన పడితిని. కాని కారణము తెలిసికొనలేక పోతిని. నేను,పిల్లవాడు ధరించియున్న విదేశవస్త్రములే వారికి అసహ్యకారణమై యుండవలయును. విదేశవస్త్రములలో నైసూ, నాజూకూ ఉన్నదనుకొనుచుంటిమిగాని వానిలో ఇంతపరాధీనతయున్నదని గమనించలేదు. ఛీ! నాపతికి అప్రియములగుటయేగాక శిక్షాహేతువులైన ఈవిదేశవస్త్రములు నాకేల?" అనియోచించి తత్క్షణమే రుక్మిణి తన చీనిచీనాంబరములకు సెలవొసంగినది. ఆమెయిప్పుడు ఖద్దరువస్త్రధారిణి. ఏహార్మోనియము వాయిద్యమో, ఫిడేలు వాయిద్యమో వినబడుచుండెడిది రుక్మిణి మేడమీదగదిలో మునుపు. ఇప్పుడు ఎల్లవేళల రాట్నపునినదము.

౩

కాలచక్రము గిఱ్ఱునదిరిగిపోవుచున్నది. గోపాలురావు బళ్లారిజెయిలులో శిక్షననుభవించుచున్నాడు. జెయిలుభోజనము సరిపడలేదనియు, చాలచిక్కిపోయినాడనియు, జిగటవిరే

చనములు పట్టుకొనినవనియు, ప్రదేశమునూర్చెనారనియు, యేవేవో వార్తలువచ్చుచున్నవి గాని తండ్రి, మామగార్ల బలవంతముచే గోపాలరావు క్షమాపణయిచ్చివచ్చుననువార్తను మాత్రము కలలోనివార్తచేసినాడు గోపాలరావు. రుక్మిణికి వేరుపనిలేదు. ఆమె చిత్తము పెనిమిటిమీద, చేయి రాటముమీద. గోపాలరావు జైలుకువెళ్లి దాదాపుఅయిదుమాసములైనది. ఈఅయిదునెలలలో ఆమె పెనిమిటికొఱకొకఉత్తరీయములజతను, ధోవతులజతను, ఒక చొక్కా-తానును తన స్వంతదారముతో నేయించియుంచినది. అల్లుడు చెఱసాలప్రవేశము వినినంతనే తండ్రివచ్చి, "అమ్మాయీ! ఇకనీవు ఇక్కడెందుకు? అతను వచ్చినదాకా మనయింట్లోనే ఉండుగానిరా"అని రుక్మిణిని పిలిచినాడు. రుక్మిణి జబాబుచెప్పలేదు. చెక్కిళ్లపై దిగజారిన కన్నీళ్లను గోటికొనలతో చిమ్ముకొని, పైటచెఱగుతో తడి తుడిచికొనినది. తండ్రి మరల ఆప్రస్తావనచేయలేదు.

౯

సంక్రాంతి పండుగవచ్చినది, వెళ్లినది. కాని మువ్వంతుయిండ్లలో ఆయేడు పండువు లేదు. ఇంటింట తండ్రియో, కొమరుడో, తోడబుట్టినవాడో, అల్లుడో ఎవరో ఒకరు చెఱసాలక్లేశమనుభవించుచున్నప్పుడు పండుగపై ప్రేమయెవరికి?

రుక్మిణి అత్తవారింట యెన్నివత్సరములనుండియో సావిత్రీగౌరిని ప్రతిష్ఠించుట వాడుక. "నీకిష్టమైతే ఈయేడుగూడ అమ్మవారినిపెట్టి నోమునోచుకో అమ్మా! అమ్మవారి నోమునూనుకోడమెందుకూ?" అన్నది వాళ్లత్తగారు రుక్మిణితో. భర్తకు శుభములగూర్చు జేయు నావ్రతమును జరుపుటకు రుక్మిణికిగూడ కుతూహలము గలిగినది. కాని సావిత్రీగౌరీ వ్రతము ఒక్కరుచేయునదికాదుగదా. చాలమంది కలిసినోచుకొనవలెను. తమయింట సావిత్రీ గౌరిని పెట్టితిమని తెలిసినచో ఈయేడుగూడ పెక్కుమంది యువతులువచ్చి నోచుకొనెదరని ఆమెకెఱుకయే. అయితే వారు తొల్లిటివలె విదేశవస్త్రముల ధరించివచ్చి నోమునోచుకొనినచో తాను పతికి హితమైన వ్రతము జరిపినదెట్లగును? రుక్మిణికి గల్గిన ఈసందియము నిట్లుపూరించినది. "ఈవత్సరము మాయింట నోము నోచుకొనువారు ఖద్దరువస్త్రములు ధరించియే నోచుకొనవలయును"అని నోమునోచుకొన నెంచువారికికబురంపినది. ఈనియమమునకు బద్ధులుకాలేకపోవుటచే రుక్మిణియింట నోమునోచుకొనువారు కొద్దిమందియైనారు. రుక్మిణి నిరుత్సాహముజెందలేదు. ఆకొద్దిమందితోనే సావిత్రీగౌరీవ్రతమారంభించినది.

౧౦

సావిత్రీగౌరినిపెట్టి నాటికి ఎనిమిదిదినములు. సావిత్రీపూజాతత్పరలగు నారీరత్నములతో సావడి కలకలలాడిపోవుచున్నది. తెల్లవారితే తొమ్మిదిదినములు. వ్రతము ముగియును. దేవికుద్వాసనముచెప్పబడును. కాన ఆయెనిమిదవనాటిరాత్రి సావిత్రీదేవియొక్క-

యుజ్జ్వలరూపము దర్శనీయము. కడపటిదినమగుటచే ఆదినము నోమునోచుకొనెడివారేగాక చూడవచ్చినపేరటాండ్రుగూడ గుంపులుగుంపులే. వారముదినములనుండి ప్రాతస్సంధ్యల సల్పిన పూజలచే నాడు దేవీరూపము పసుపుకుంకుమములకుప్ప, పుష్పాక్షతలరాసి. ఆమె చుట్టు భక్త్యుత్సాహములతో వినమ్రలై దేవినర్చించు తొయ్యలులు. ఎక్కడజూచిన దీపములు! ఎక్కడజూచిన పిండిముగ్గులు! ఎక్కడజూచిన పసుపుకుంకుమలు! ఎక్కడజూచిన గంధాక్షతలు! ఎక్కడజూచిన అగరుధూమములు! ఎక్కడజూచిన పుష్పములు! ఎక్కడజూచిన కర్పూరనీరాజనములు! ఎక్కడజూచిన నివేద్యపదార్థములు! అహో! ఆరాత్రివేళ, ఆ దీపముల సన్నిధిని, ఆదేవీమూర్తియెదుట శుద్ధఖద్దరువస్త్రధారిణులై నిశ్చలదీక్షతో దేవి నర్చించుచున్న యామానవతీమానసములలో ఎట్టిభావములు, ఎట్టి ఆకాంక్షలు, ఎట్టి సంకల్పములు ఉద్భూతమై దేవికి నివేదింపబడుచున్నవో యెవరికెఱుక?

౧౧

నాటికి గోపాలరావు ఖైదుకువెళ్లి అయిదునెలల ఇరువదిదినములు. తక్కిన పదిదినములు వ్రేళ్లపై లెక్కించుచున్నది రుక్మిణి. కాని గోపాలరావు తన సత్ప్రవర్తనచే శిక్షాకాలములో పదిరెండుదినములు ముందుగనే విడుదలయైవచ్చునని ఆమెకేమి తెలియును? రాత్రియెనిమిదిగంటలకు పడమటినుండివచ్చు బండివచ్చినది. వెళ్లినది. వెళ్లుచు కూతగూడ బెట్టినది. ఎవరును వినలేదు. తమసావిత్రీపూజాసంరంభములో ఆయువతుల కీరైలురాకపోక లేమియెఱుక?

రైలువచ్చివెళ్లిన ఇరువదినిముసములకు-ఇంటినిండ క్రిక్కిరిసియున్న నారీమణులలో- 'గోపాలరావుగారు వచ్చినారు, గోపాలరావుగారు వచ్చినారు' అని ఒకచిన్నకలకలము పుట్టి రుక్మిణి చెవికెక్కినది. ఎక్కుటయేతడవు. ఇక ఆమె మోదవారాశికి పారమెక్కడ? దేవికై కూర్చిన కుసుమమాలలు ఒరులకై వినియోగింపవచ్చునా అను ఆలోచనయేదీ? ఆమెదృష్టిలో పతియుదైవమే. దేవికిసమర్పించుటకై కూర్చియుంచిన కుసుమమాలికను కరములగైకొని యెక్కుడుదుటున పతిసందర్శనమునకేగినది రుక్మిణి. చేతనున్న పుష్పమాలను చేతికందించునో, కంఠసీమనలంకరించునో, చరణయుగళిపై సమర్పించునో-రుక్మిణి మనస్సంకల్పమప్పుడెట్లుండెనో కాని కుసుమమాలికాకీలితకరాబ్జయై మహోత్కంఠతో నేతెంచు రుక్మిణి నల్లంతనే చూచినాడు గోపాలరావు. తనువు కృశించినది. జవము సడలిపోయినది. మాఱురూపుపడిపోయినాడు. కాని యుజ్జ్వలములైన ఆనేత్రములలో దీపించు ఆదేశభక్తికి తఱుగుబెఱుగులులేవు. 'రుక్మిణీ! ఆపూలదండ సీమనూలుతో గట్టినదేమో, నేను ముట్టను' అన్నాడు గోపాలరావు. అనిశితశరాపాతమువంటి వాక్యప్రయోగమున కుపహతినొంది నేలగూలుటకు రుక్మిణి మునుపటిరుక్మిణియా? కాదు. ఆయోధపత్ని ఇట్లు ధీరతతో జవాబిచ్చినది: "సీమనూలు నాచేతినుండితొలగి అయిదుమాసములయిరువదిదినములు,"

# స్వాతంత్ర్యలక్ష్మి

శ్రీమతి వోలేటి నిత్యకళ్యాణమ్మగారు

౧

ప్రబలనై దాఘభీకరభానుదృష్టి
నెదఁజలింపక సంద్రంపుటిసుకనేల
లవణమును సేకరించు భారతకుమారి!
దర్శనంబిచ్చు నీకు స్వాతంత్ర్యలక్ష్మి.

౨

లలితవిపీలాలకలసొంపుముడిపీడి జఘనాంససీమల జాఱిచెదర
ఇంద్రచాపపురంగులీనెడు తలిరాకుచేతుల గాజులు చిట్లిరాల
చెలువంబుగాదిద్దు సిందూరతిలకంబు స్వేదబిందులరూపుచెడినశింప
నెత్తురోడికలలో నిత్యావగాహంబుచేశాటిభారంబుఁ జెందుచుండ
రక్షకభటాళిలాఠీలశిక్షకోర్చి
వీఁక దివ్యజాతీయపతాకలక్ష్మి
పోఁగాపాడు 'బోర్సాదు' పుణ్యకాంత!
సకియయగుగాక నీకు స్వేచ్ఛాపురంధ్రి.

3

బ్రతుకుక్రొన్నన నీదు వరపాదపూజనునలుపు మీరాబాయి లలనయుండ
'దర్శనా'లవణంపుదాడిఁ బ్రతాపవాసనలుజల్లిన సరోజని మసంగ
బ్రతుకుమిన్నేయల్ల స్వాతంత్ర్యదేవతానగరిబాటగ రుక్మిణమ్మ వెలయు
విమలహృద్వీణ పవిత్రజాతీయగీతికలఁ పాడు కమలాదేవికలుగఁ
బ్రాణములు పీడియైన స్వాతంత్ర్యశోభ
లలితగతి నీకుఁ గూర్పంగఁదలచు నితర
పుత్రికలు వేలకొలదిని పోరుసల్ప
భారతాంబా! శుభంబు చేకూరదొక్కొ?

౪

సతతగృహప్రదీపితల సన్మణిరాజములట్లు వెల్గు భా
రతనవపుష్పకోమలులు గ్రక్కున శాటిబిగించివచ్చి య
ద్భుతగతి నిత్యశాంతిరణభూమినిసిల్చిరి; యింకదాస్యవృ
త్తితొలఁగ భారతాంబ! నినదించుఁజుమీ జయగీతికావళుల్.

# తేనెపల్కులు

శ్రీమతి వెంపటి జానకీపురుషోత్తంగారు

"నేనూ ఆలుకునేందుకు వస్తాను ఉండలా అన్నయ్యా!"

"నేను వెళ్లడంలేదురా"

"మరి, ఎందుకు క్లాఫింగ్ దువ్వుకు చొక్కాయేసుకున్నావు?"

"ఊరికే నే"

"కాదు, ఆలుకునేందుకు వెలతావు"

"వెడితే వెడతాను."

"నేను లావద్దూ?"

"వద్దు, అల్లరిచేస్తావు."

"తెయ్యనుగా!"

"తెయ్యవూ? అట్లాగేఅంటావు. వద్దుపో"

"ఊఁ...ఊఁ...చూలవేఅమ్మా అన్నయ్యా"

"ఏమన్నాడు?"

"వెక్కిలిస్తున్నాడు."

"ఎందుకురా పాపాయిని వెక్కిరిస్తున్నావు?"

"లేదే, వాడుముద్దుగా తెయ్యనుగా అంటే మళ్లీ నేను అట్లాగేఅన్నానే. వెక్కిరించలేదే."

"నన్నుకూడా ఆలుకునేందుకు తీసుకెల్లమని చెప్పవూ అమ్మా!"

"వాణ్ణికూడాతీసుకుని వెళ్లరా బాబూ."

"అక్కడ అల్లరిచేస్తాడేవాడు."

"తెయ్యనని తెప్పడంలేదుటే నేను?"

"ఇప్పుడిట్లాగే అంటాడు. అక్కడ కొంతసేపు వుండు ఆడుకుందుగాని అని తక్కినపిల్ల లెవరేనా అంటే వాళ్లనికొడతాడు."

"తప్పు, పాపాయి, కొట్టకూడదుఎవర్నీ."

"కొత్తనులే."

"కొట్టడుతీసుకువెళ్లరా"

"సరే, దా, పాపాయి, వెడదాం."

"ఉండు తల్లో చెండుపెత్తుకు వత్తున్నా."

"చప్పునరా."

"పదండి. పాపాయిని జాగ్రత్తరా బాబూ! పెందరాడేరండి. చీకటిపడకుండా రావాలి."

* * *

"ఆఁ.ఆఁ. పొయిలో పుల్లలు లాగుతున్నావుగా? పాపాయి!"

"లే, చూలవేఅన్నంఎల్లాపొంగుతోందో అమ్మా!"

"దూరంగావుండు. అవన్నీ నీవు తాకకూడదు, అన్నంపొంగి మీదపడుతుంది. అన్నంవుడికిందిపద."

"అయితే ఊడ్చి నాచిన్నపీట వేసుకోనా? అన్నంపెత్తావు మరి?"

"అదుగో చీపురుతో చెంబులన్నీ తోస్తున్నావు కదూ? వస్తున్నావుండు."

"నువ్వలాకే. నేనేంచేచానేం?"

"ఇంకా, ఏంచెయ్యాలేం? అన్నీ అల్లరిపన్లే. పప్పంతా పారపోశావు. పో అవతలికి."

"ఎక్కలికిపోనే? పక్కింతికిపోనా అమ్మా?"

"వద్దు."

"మరి?"

"ఒంటరిగాపోతే వీధిలో మోటార్లువస్తాయి."

"అయితే అన్నయ్యదగ్గిరికెల్లనా?"

"ఎందుకు? అక్కడకూడా అల్లరిచేసి వాడిపుస్తకాలు చించడానికా? చూడు: మరీ చెప్పినకొద్దీ నీళ్లుముంచి పారపోస్తున్నావు."

"నీల్లు పాలపొయ్యలేదే. నీళ్లు పోచుకుంతున్నాను."

"ఇందాక నేను సోపురుద్ది నీళ్లుపోస్తే మళ్లీ పోసుకుంటున్నావా? పద. నాన్నగారు పిలుస్తున్నారు."

"నాన్నారు పిలుత్తున్నారా?"

"అవును పద."

"మలి, బూ తినొద్దూ?"

"నేపిలుస్తాలే వెళ్లు."

"నాన్నారినికూడా పిలుస్తావే అమ్మా?"

"ఆఁ"

"ఇదోవస్తున్నా. నాన్నారూ?"

* * *

"అబ్బబ్బ ఈకాగితాలు అన్నీతీసి అల్లరిచేయకు, పాపాయి!"

"నాకూకాయితాలు యియ్య నాన్నా."

"ఇస్తే యేంచేస్తావు?"

"ఏంచేస్తానా? లాచుకుంటా."

"ఇప్పుడుకాదు, తర్వాత యిస్తా. ఇప్పుడు నీవు యిక్కడినుంచి వెళ్లి చిలకతో ఆడుకో."

"నేను చిలకతో ఆలుకోను. లాచుకుంటాను. కాయితాలు యియ్య నాన్నా."

"ఏంరాస్తావు నీ మొహం."

"బొమ్మలేచుకుంటాగా."

"పట్టుకుంటే వదలవు అన్నిటికి. ఎవ్రా బాబూ ఈబల్లమీద సిరా వొలకపోసింది?"

"నేనుకాదు నాన్నా. ఇందాకనీవు బయటికెళ్లినప్పుడు పాపాయి కుర్చీమీదెక్కేడు."

"ఏంపాపాయి నీవేనా?"

"మలే. ఇందాకేకుచ్చీలో యెక్కానా చెయ్యి తగిలి పలిపోయింది నాన్నా—"

"నీవు మహాఅల్లరిచేస్తున్నావు. కొడతా రానిన్ను."

"కొత్తకు నాన్నా! నేను పాపాయిని గదూ? నాకు నొప్పెత్తదూ? చాలవేఅమ్మా నాన్న కాకితా లివ్వడంలేదే."

"ఇందతీసుకుపో."

"అయి యిదుగో కాకితం అమ్మా! నాన్న మంచి వాడుకాడే. నువ్వేమంచిదానవు అమ్మా! నన్నుముద్దు పెత్తుకోవు అమ్మా?"

* * *

"అమ్మతో తెప్పనా అన్నయ్యా?"

"ఏంచెపుతావు?"

"నువ్వేయిత్తూల్లో చదువుకోలేదని."

"చెప్పకు పాపాయి!"

"తెపుతా."

"అయితే నీసంగతి నేచెపుతా."

"అమ్మా, అమ్మా, అన్నయ్యేయిత్తూల్లో చదువుకోలేదే."

"అమ్మా, అమ్మా బిస్కెట్లు అన్నీ రొండటింటి పిల్లలకి పెట్టాడే తమ్ముడు."

"ఉండు నీవే చదూకోకుండా దీపంతగ్గిస్తా."

"దీపంతగ్గిస్తే నేకొడతా."

"నేఅమ్మతో తెపుతా."

"నేమాత్రంచెప్పలేనా?"

"తూడవేఅమ్మా అన్నయ్య."

"బిస్కెట్లు అందరికీ పెడుతున్నాడే తమ్ముడు"

"నిజమేనా పాపాయి?"

"పెత్తానే."

"ఎందుకుపెట్టావు."

"వాల్లుయేలుత్తుంటే పెత్తానే."

"ఏడుస్తూంటే నీవు పెట్టడంయెందుకు?"

"నేయేలుత్తుంటే నువ్వు పెలతావుగా?"

"పెడితే"

"అందుకనే నేనూ వాల్లుయేలుత్తూంటే పెత్తా."

"పెడితే ఊరుకున్నార్రా?"

"ఆఁ. అది తింటూ దోలుకున్నారే" అన్నాడు నవ్వుతూ.

"అదుగో దీపంజోలికి వెళ్లక అన్నయ్యని చదువుకోనీ నీవు నాదగ్గిరికిరా."

* * *

"ఇంతసేపేమిరా బాబూ? పాపాయి! అల్లరి చేశావా?"

"అక్కలే మేమే ఓలమాసాచూశామేఅమ్మా!"

"నువ్వుండరాతమ్ముడు నేచెపుతాను."

"నూ తెప్పు"

"ఏమిటిరాఅది?"

"నేనూ, తమ్ముడూ, ఇంకా పిల్లలు అంతా కలిసి ప్రక్కసందులో పెద్దమామిడిచెట్టువుందే అక్కడికి వెళ్లామే."

"వెళ్లి యేంచేశారు?"

"దానిక్రింద అంతా కూర్చున్నాం. కూర్చుని ఒక పిల్లాడే చెట్టుపైని చూచి కొమ్మలనిండా చిలకలు వున్నాయిఅన్నాడే. నేనూ మాయింట్లో పంజరంలో ఇట్లాంటిచిలకవుంది, దానికి మాఅమ్మ మాటలు నేర్పింది, అదిబాగామాట్లాడుతుంది. మాతమ్ముడుదాంతో ఆడుకుంటూవుంటాడని చెప్పానే. నేను అంటూండగానే కొమ్మమీదకూర్చున్న చిలకల్లో ఒకటి క్రింద పడిపోయిందే. దానికోసరం తక్కినచిలకలు అన్నీ దాని చుట్టూ చేరి అరుస్తూవుంటే చూస్తూ కూర్చున్నామే."

"ఇత్తాపడిపోయిందే అమ్మా!"

"అదేమిటిరా పాపాయి! పంజరంలో చిలకని వదిలిపెట్టేవు?"

"కాదే అమ్మా—నే నే......అబ్బ! అన్నయ్య కొడుతున్నాడే అమ్మా చూడు."

"వాడికేం తెలుసురా పాపం? అట్లా కొడతావు చిట్టివాణ్ణి! పోనీలే. రేపుమీనాన్నగారితో చెప్పి బజారునుంచి యింకోచిలక తెప్పించుకుందుగాని. పాపాయి! నావొళ్లోకూర్చో. అమ్మా అల్లరిచెయ్యకూడదమ్మా మరి."

"అయితే అమ్మా! ఆచెట్టునుంచి పడ్డచిలక చచ్చిపోయిందా యేమిటేఅమ్మా?"

"కాబోలు బాబూ! నువ్వుచూడలే?"

"అమ్మా! మనతిలకే ఆచచ్చిపోయిన చిలకని చూడ్డానికెళ్లిందే-కాదేఅమ్మా?"

"అవునులే యేం మాటలు నేర్చేవురా పాపాయి! ముద్దేది? ఒకముద్దేది?"

# కుంతీసందేశము

శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు

కలుషపు జూదకార్యమునగాసిలి రాజ్యపదచ్యుతిన్ యశః
కలనములేక వైభవసుఖమ్ముదొరంగియు జ్ఞాతిహేళనో
కులకు కృశించి దైన్యమున ఘోరవనాంతరవాసులౌటచే
తొలివిలపించి మాధవునితో దెగువాడితిసుమ్ము ధర్మజా!
పదివేలేన్గులతో సమానబలమున్ ప్రఖ్యాతశౌర్యాదిసం
పదలన్గ్రాలెడు భీమసేను డకటా! ప్రాణావశిష్టుండునై
పదిమూడేండ్లు వనమ్ములన్దిరిగె నేప్రారబ్ధమోయంచు మున్
కదనోత్సాహముబుట్టగా పలికితిన్ కాలానుగుణ్యంబుగన్.

భయదశాత్రవమథను డీపార్థుడెలమి
పార్వతీశునిమెప్పించి పాశుపతము
వడసి కారడవులబడి బడలిపోయి
వగలబొగులంగ జూచి యే దెగువజెపితి.

అతిసుకుమారులు పిన్నలు
మతిమంతులు గతపితరులు మాద్రీతనయుల్
ధృతిచెడి పేరాకలిచే
నతిము కృశింపన్గాంచి డివితి సంగ్రామవిధుల్.



అనాగరిక ద్రావిడ బాలికలు

*'Reproduced From 'IndianPictorial Educaticn'*

భీష్మాదిగురువృద్ధవీరపాలితమైన సభయందు తులువ దుశ్శాసనుండు ద్యూతాపహృతరాజ్యదుఃఖాబ్ధిలో మున్గి దరిగానకున్న మీదరికి నాథు పెన్నదవుల్గునాఁ గన్నులబాష్పముల్ నించి ఘోరున విలపించుచుండ స్త్రీధర్మిణియు యువతీలలామయునైన పాంచాలిచికురముల్ పాయుదిగిచి

బలిమిమై యీడ్చి పరిపరి పరిభవించి
వెతలపాల్చేయుచుండిన విధముగాంచి
ధార్తరాష్ట్రుల కికచావు తప్పదనుచు
అతులసంగ్రామసందేశమంపినాను.

వివిధధర్మోపదేష్టలౌ విదురకేశ
వాదిమహనీయవాక్యాళిననుసరించి
విమలభవదీయతేజోవివృద్ధికొఱకె
కలుగజేసితి సవ్వేళ కదనబుద్ధి.

ప్రథితపాండుభూవరకుమారకులు మీరు
దాస్యశృంఖలాబద్ధులై తల్లడిలుట
కాంచి సైరింపనోపక కదనరంగ
విధులబోధించితినిగాని వేరుగాదు.

అదియునుంగాక,

అవిరళనిత్యభోగవిభవాతిశయోల్లసితుండు పాండుపా
ర్థివుపరిపాలనమ్మున నతీతమహోజ్జ్వలరాజ్యసంపదల్
దవిలిభుజించి శాస్త్రవిధిదానములన్ పరమేశుతృప్తికై
దివిజనుతమ్ముగా జరిపి దీప్తినిబొందితి చాలు ధర్మజా!
ఇటుపై సాంద్రతపోవనాంతరమునం దేకాగ్రచిత్తంబుతో
జటినై ఘోరతపంబొనర్చి తనువున్ చాలించి నానాథు డే
స్ఫుటపుణ్యార్జితలోకమందుగలడో శోధించి నేనాస్థలిన్
దిటమై పొంది సుఖింతుగాని వలదీతీక్ష్ణోరుసామ్రాజ్యముల్.

కాన నావనవాసదుఃఖమునుమాని
భీమసేనాదితమ్ములు పేర్మిగొలువ
చతురుదధివలయితధరాచక్రమెల్ల
ధర్మమున నేలుకొనుమోయి ధర్మరాజ!

# ఇదే చిన్నతనం

శ్రీమతి దామోజీపురపు లక్ష్మీనరసమ్మగారు

౧

వెంకాయమ్మగారు తులసికోటవద్ద వత్తులు చేస్తూ మధ్యమధ్య మనుమరాలితో కబుర్లుచెపుతూ గోవింద నామాలు పాడుకుంటూ కూర్చున్నది. ఒక చరణమన్నా సాగకుండా లలిత మాటలు సాగుతూవున్నాయి.

"బామ్మా! విజయదశమి ఇంకా ఎన్నిరోజులుందే? మేము బొమ్మలుపెట్టుకోటం ఎప్పుడమ్మా ఇంకాను? మాఅక్క రాలేదు. ఇంకెప్పుడువస్తుందో తెలియదు. చెబుదూ?" అంది లలిత.

"బొమ్మలు ఎల్లుండే పెట్టడం. మీఅక్కను, పిల్లను తీసుకునివస్తానని మీబాబ వ్రాశాడుటకు త్తరం."

"బామ్మా! అచ్చంగా మనఇల్లు పెళ్లివారి ఇల్లులా కలకల్లాడుతూవుండే."

"మనఇల్లు ఒక్కటేనా, తల్లీ! ఈహిందూదేశమంతా ఆమహాతల్లి రాకచేత కలకల్లాడుతూ ఉంటుందమ్మా!"

"బామ్మా! ఎవరే ఆమహాదేవి? ఆమెపేరు ఎవ్వరు? ఎక్కడున్నదో ఆమె? అంతాసరీగ్గా చెబుదూ, వింటాను."

"ఆమెపేరు ఏమని చెప్పమన్నావు? అనంతనామధారిణి; ఈశ్వరుని పత్ని; మహాపతివ్రత. ఆదేవి స్వరూపాన్ని ధ్యానిస్తె అన్నిపాపాలు పోతాయమ్మా! ఆమెను తలచినమాత్రాన అన్నికోరికలు ఫలిస్తా యమ్మా! నువ్వు ఎప్పుడూ తలుచుగో అమ్మా! మంచిమొగుడువస్తాడు. త్వరగా పెళ్లిఅవుతుంది."

పెళ్లిపేరుచెప్పగానే-హిందూబాలకే సహజభూషణమైన-సిగ్గు ఆవరించింది లలితని. ముసిముసినవ్వులు దాచి కపటకోపములో లలిత బామ్మమీద ధుమధుమలాడింది. "చాల్లేదమ్మా! సరిగా చెబుదూ. లేకపోతే పోతాను. ఇంకా ఆడుకోవాలి" అంది లలిత.

"ఇంకా ఏమిచెప్పమన్నావు?" అంది బామ్మ.

"ఈవిజయదశమిరోజుల్లో ఎందుకు పూజచెయ్యాలి ఆవిణ్ణి. ఆదేవి చేసినపనులు చెప్పమ్మా!" అంది లలిత.

"పూర్వం మహిషాసురుడనే రాక్షసుడుండేవాడుట. ఎంతో దుర్మార్గుడైనవాడితో యుద్ధముచేసి ఈదేవి వాణ్ణి సంహరించినరోజే విజయదశమి. ఆమె సంతసముకోరకే దేవీనవరాత్రములు జరుపుతారు. లోక కళ్యాణియైన ఆదేవినిపూజించి ప్రజలందరు భక్తిని, ముక్తిని అన్నిసద్గుణాలు పొందుతారమ్మా!"

"అక్కా! అక్కా! నువ్వు రావూ? నేవెడుతున్నాను ఆడుకోటానికి" అని సుదర్శనం పిలిచేడు లలితని.

"బాబ్బోయి! అడుగో సుదర్శనంవచ్చేడు. అయిదయింది, బాబు! నేవెడతా ఆడుకోటానికి" అని వెళ్లింది లలిత.

వెంకాయమ్మగారు బుట్టపుచ్చుకుని లోపలికివెళ్లింది.

౨

గోపాలంగారికి ఇరువురుకొమార్తెలు, ఒకకొడుకూను. పెద్దకూతురు సత్యబాల. కాపురము చేయుచున్నది. రెండవయామె లలిత. కొడుకుపేరే సుదర్శనం. వెంకాయమ్మగారు, కోడలు జగదాంబ ఎడ మొగము పెడమొగముగాక ఎంతో కలిసిమెలిసేయుంటారు. అనుకూలమైన కుటుంబం.

పెద్దకూతురు బాలకి మేనరికం జేశారు. లలితకి ఇంకా సంబంధం కుదుర లేదు. పిల్ల తెలివితేటలు చూసి ఏనిర్భాగ్యుడికో ముడిపెట్టలేక వెతుకుతూయున్నారు.

బాల సంకురాత్రికివచ్చింది. మళ్లీ రానిమూలాన్ని తండ్రి పదిఉత్తరాలు వ్రాయగా పెద్దబ్రహ్మాండం మీద తీసుకొస్తానన్నాడు పెద్దల్లుడు. వచ్చేరోజు వచ్చింది.

మహా ఆడావిడిగాఉన్నారు లలితా సుదర్శనవునూ. అక్కగారు రాగానే చూపించాలని గిలకల బద్దా, క్రొత్తచొక్కాల్లు డ్రాయరుదగ్గిర పెట్టేడు సుదర్శనం. లలిత కంగారు చెప్పశక్యములేకుండాయుంది. బొమ్మలదగ్గిర పూజకు అన్నీ సిద్ధంజేసింది. పదిగంటలయింది. ఇహ అక్కగారువస్తుందని ఇంట్లోంచి వీధిలోకి వీధిలోంచి ఇంట్లోకి ఇద్దరూ తిరుగుతూయున్నారు. వీధిలోకి ఏబండీవచ్చినా "అదుగో నేవ్వా అక్కవచ్చిం" దనగానే లలిత వెనక్కి తిరిగిచూడగానే "మొగుణ్ణివెతుక్కుందోయి, వోతాయిలారు" అని ఉడికిస్తున్నాడు సుదర్శనం. ఆమాటకి ఇద్దరికీ ద్వంద్వయుద్ధం జరుగుతూయుంది.

ఇంతలో బండివచ్చి ఆగింది గుమ్మంలో. కూతురు శ్యామలనిఎత్తుకుని దిగింది బాల. గుమ్మంలోకి లలితాసుదర్శనులిద్దరూ వక్కఅంగలో పరుగెత్తేరు. శ్యామలని బలవంతంగా తీసుకుపోయింది లలిత.

సూటుకేసు సుదర్శనం లోపలకితెచ్చేడు. కూతుర్ని చూసి పొంగిపోయింది జగదాంబ. "రా, అమ్మా! మీఆయనేడీ? కాళ్లుకడుక్కోండి. పిల్ల ఏదీ? మీనాన్నగారువ్రాసిన ఉత్తరాలు అందేయా?" ప్రశ్న మీదప్రశ్న. తల్లిప్రాణము.

"ఆ, అందేయి. అప్పుడేవద్దామనుకున్నాము. వారికి శలవులేక రాలేదు. బామ్మేది? లోపలవుందా?"

"మీబామ్మ మడిగట్టుకుంటూన్నారు. మీరుకూడా లేండి. వంటయింది. లలితా! మీబావకీ, నాన్న గారికి నీళ్లుతోడు. ఏదీ చిట్టితల్లిని యిల్లా తీసుకురా."

"పిన్నీ! మనుమరాలు వచ్చిందేవిటి? మీగుమ్మంలో బండి ఆగింది" అని ప్రక్కయింటి సూరమ్మ స్నానంజేస్తూయున్న వెంకాయమ్మగారిని అడిగింది.

"మరేనమ్మా! రామారావు బాలని, పిల్లనితీసుకుని ఈబండిలో నేవచ్చేడు" అని సమాధానంచెప్పి గబ గబా లోపలకువెళ్లింది.

విజయదశమిపండుగలు పరమానందంగా వెళ్లేయి. ఏకాదశినాడుబయలుదేరేడు రామారావు. బాలని పౌర్ణమివెళ్లిన విదియనాడు పంపమని మామగారితో చెపుతూయున్నాడు.

"విదియనాడు లలిత పుట్టినరోజుపండుగ. అదిగాక అట్లతద్దినోము నోచుకోవాలి. వచ్చివార్ధంరోజు లయినా కాలేదు. దీపావళివెళ్లగానే పంపుతాములే" అని సర్ది చెప్పింది అల్లుడికి జగదాంబ.

సరేనని వెళ్లేడు రామారావు శ్యామలని ముద్దుపెట్టుకుని.

## 3

నేడు అట్లతద్దిభోగి. లలితపుట్టినది ఆరోజేగనుక అందరు తలంటుకున్నారు. లలితకి సగంజడవేసి రిబ్బనుబెట్టి, కాళ్లకు పసుపుపారాణిబెట్టి, మోముకు పౌడర్ వేసి, దమ్మిడిఅంత చుక్క బొట్టుపెట్టి తన నామగొలుసుబెట్టి పల్లెటూరిపిల్ల పట్నవాసంపిల్ల గాకుండా ముస్తాబుజేసింది బాల.

"పెళ్లికూతుర్లావుంది లలిత. ఇక పెళ్లికొడుకు రావాలి" అని లలితని ఉడికిస్తున్నాడు సుదర్శనం. పుట్టినరోజుపండుగ పిండివంటలతో బ్రహ్మాండంగాజేశారు. అందరికి కాళ్ళకిచేతులకి చిత్రవిచిత్రంగాఅలంక రించింది వాళ్లబామ్మ. శ్యామలకి-బంతియాకువేసి ఒకచెయ్యి, చందమామలోటి వక చెయ్యి-గోరింటాకువేసి గుడ్డలతోటికట్టింది బాల.

తెల్లవారగట్లు ఆటలకి ఎక్కడికివెడదామాయని ఆలోచిస్తున్నారు అక్కాచెల్లెలూను.

"అక్కా! తెల్లవారగట్ల సుదర్శనాన్ని లేపొద్దమ్మా అల్లరిచేస్తాడు, బాబు" అంది లలిత.

"చూశారా? నన్ను లేపరూ. అల్లాగే, పాపం. నేను నిద్దరేపోను. ఇల్లాగే కూర్చుంటా తెల్లవార్లు. నన్నెందుకులేపరో చూస్తాగా!" అన్నాడు సుదర్శనం.

"జాగారం చేస్తావేమిటిరా? రాత్రి తెల్లవార్లునూ" అంది లలిత.

ఇంతలో సరోజని సీతవాళ్లు వచ్చేరు. సరోజని వాళ్లయింటికి రమ్మన్నది. మాయింటికి రమ్మని సీత పిలిచింది. ఆఖరుకి ఆటలకి పెద్దదొడ్డివుందని సరోజనిగారింటికి మార్చేరు ప్లాను.

ఒంటిగంటకు లేచేరు ముగ్గురూను. భోజనాలతోను, ముస్తాబులతోను రెండయింది. పిల్లని వాళ్లమ్మని చూడమని ముగ్గురు బయలుదేరేరు. ఇరుగుపొరుగుపిల్లల్ని తీసుకుని సరోజనిగారింటికి వెళ్లేరు.

చాలామందిపిల్లలు పోగయారు. వోపావుగంట గోరింటాకు పరీక్షలతోను, భోజనాలప్రశంసతోను, ముస్తాబులవ్యత్యాసములతోను జరిగింది కాలం.

ఆటల్లో పెండ్లీసపెద్దలు, పెద్దపిల్లలున్నారని కోపంవచ్చేపిల్లలు కొందరూ. అబ్బా ఆస్తమానం మీకు కలుర్లేనమ్మా మేముపడతామని బెదరించే పిల్లలుకొందరూనూ. మొత్తంమీద పిల్లలంతా రాజీపడ్డారు. కళ్ళ గంతలు, దాగుడుమూతలు, అల్లలాకోడి మొదలయిన ఆటలుఆడి అలసిపోయారు.

ఇక అడమని పెద్దపిల్లలు కోలాటమువేసి కృష్ణుడికి గొబ్బితట్టి పాటలుపాడేరు. ఇంతలో తెల్లవారినది. పిల్లలందరూ ఆనందముగా ఎవరింటిదారి వాళ్లుబట్టేరు.

పిల్ల ఏడ్చిందని చీవాట్లుపెట్టింది బాలని వాళ్లబామ్మ.

## ౪

వెంకాయమ్మగారు "లలితా! ఎక్కడపారేశావు? సరిక్రొత్తదే. అయ్యయ్యో! దానిమొగుడు కేకలు వేస్తాడే. వెతుకు" అని చెప్తతూయుంది.

"దానికి ఒళ్లు తెలియదు ఆటలంటే. మరీపడిచస్తుంది వెధవఆటలుఇదీను. మొద్దులావుంది. ఆరుకాసుల వాను. మొన్న నేకొన్నాడు. జిగినీ మెళ్లోంచి పడితే ఎందుకు తెలియదు? వెధవ్వేషాలు. ఇల్లంతా వెతికారా?" అంది వాళ్లమ్మ జగదాంబ.

"ఆ, వెతికేము. నన్నేంచేయ్యమన్నావు? ఎక్కడా కనుపించలేదు." అంది లలిత.

"నేనెరగనుబాబూ ఎక్కడపడిపోయిందోను. నన్ను తెల్లవారగట్ల లేపనంది. అంచేతే దీనికీశాస్తి అయింది" అన్నాడు సుదర్శనం.

"వెధవా! అవతలకిపో. అసలేఏడుస్తూంటే ఇంకా ఏడిపిస్తావెందుకూ?"

ఈసందడిలో వాళ్లనాన్నగారు ఆఫీసునుంచి వచ్చేరు. "ఏమిటీ ఈఅడావిడి?" అన్నారు. సుదర్శనం అందుకున్నాడు: "నాన్నోయి! నిన్న లలిత పుట్టినరోజుకాదూ, అక్కయ్య గొలుసుపెట్టింది. అది తెల్లవారగట్ల ఎక్కడో పారేసింది. ఇంకాదొరకలేదు" అని అంటగాల్చేడు.

"అందుకా? మీఅమ్మ దాన్నితిడుతూఉంది. సరి, పండుగపూటా దాన్నితిట్టడమెందుకూ? దొరక్కపోతే చేయిద్దాములే. దానికిపెట్టడం బుద్ధితక్కువ నీదేనూ" అన్నాడు వాళ్లమ్మతోటి.

లలితంటే తండ్రికిప్రేమఎక్కువ. అందుచేత ఏమీఅనలేదు. "లలితా! వూరుకో. ఏడవకు. ఇంకోమాటు సరోజనిగారింటికి వెళ్ళి వెతుక్కురావమ్మా! వెర్రితల్లీ! ఇల్లా ఏడుస్తారా? పెద్దవాళ్లయితే పారేస్తారా? ఇదే చిన్నతనం" అన్నాడు వాళ్లనాన్న.

సరోజనిగారింటికి వెళ్ళింది లలిత. వెతుకుతూయుంది. వాళ్ళ బామ్మ చెప్పిన ప్రార్థనపద్యాల్లోది 'అమ్మలగన్నయమ్మ' (భాగవతము)లోని పద్యంచదువుకుంది. ఆదేవిని ధ్యాన్నించింది నాను దొరకాలని.

కష్టపడివెతగ్గా వాళ్ల గాదిచాటున దారిలోవుంది నాను. తెల్లవారగట్ల అక్కడపడింది. తీసుకొచ్చి వాళ్లమ్మకు ఇచ్చింది. "అమ్మా! బామ్మేదీ?"

తులశమ్మకి పూజచేసుకుంటున్నారని చెప్పింది వాళ్లమ్మ.

"బామ్మోయ్! నాను నీమూలాన్నిదొరికింది. నువ్వుచెప్పినపద్యం చదువుకుంటేనూ, ఆదేవిని తలుచుకుంటేను దొరికింది. లేకపోతే దొరక్కేపోను" అంది లలిత.

"అమ్మా! నువ్వు మంచిదానివమ్మా. అంచేతదొరికింది నాను. అదృష్టవంతురాలివమ్మా. ఇంతకూ లేచిన వేళ మంచిది" అంది బామ్మ.

ఇంట్లో అందరూ సంతోషించేరు నాను దొరికిందని. వెంటనే బాలమెళ్లో పెట్టింది జగదాంబ.

సుదర్శనం అందుకున్నాడు మళ్లీమాటలకే: "లలితా! నాను నామూలాన్నిదొరికింది. నేను నాన్నతో చెప్పబట్టే లేకపోతే దొరక్కేపోను."

వానిమాటలకి అందరూ నవ్వుకున్నారు.

## దేశసేవిక

శ్రీమతి సామవేదుల చిరంజీవమ్మగారు

రాతిరిగప్పు హైమపుతెరన్ మరుగొందిన కేతకీసుమం
బాతపకాంతి మందమలయానిలు కూర్మిమఱుంగవాయుచున్
వీతసమస్తమాంద్యమయి విస్ఫురతేజములొల్కునట్లు కా
రాతమము విడంబడి విరాజిలుచుండిరి దేశసేవికల్.

ఆతపవహ్నికీల లవణాంబుధితీరమునందు నుప్పు దా
చేతులచేసిపట్టి నవచెల్వమొ కృష్ణుని జన్మభూమికిన్
జాతరచేయుటన్‌గలుగు శాంతరసంబొ ముఖంబునింప వి
ద్యాతతగౌరవాన్వయవిభాతి మనోజ్ఞవిలాసమొందెడిన్.

భారతదేశ మీగతిని బానిసబంధములెల్లద్రెంచి స్వే
చ్ఛారమయై ప్రపంచమున సాదృశసోదరియై చెలంగు నం
చారయదెల్పుచుండెననినట్లు వివర్జితబంధపాశయై
భారతదేశసేవిక ప్రభాతపుభేరిని మ్రోయవింటిరే!

తల్లి సమస్తదీక్షలకు దక్షిణభూమియ! దేశభక్తులన్
పిల్లలలోన "ఆంధ్రి"యను పేరిటిదెంతయు ధైర్యశీల యం
చెల్లజగంబు దన్వొగడ నింతలుజేసిన దాస్వతంత్రభా
స్వల్లిక దేశసేవికయ, భారతభావివిశుద్ధలక్ష్మిగా.

# విజయదశమి: పాఱువేట

శ్రీమతి జి. శేషమ్మగారు

౧

తుంగభద్రానదీపరిసరగ్రామాదులలో పూర్వాచారపరాయణులును, ఉత్తమకుల సంజాతులును, వీరరసపోషకులును నగు క్షత్రియశూరశిఖామణులు పాఱువేటఉత్సవము నతి వేడ్కతో విజయదశమినాడు నేటికినిసల్పుచుండుట అందరునెఱింగియేయుందురు. విజయదశమింకొకనెలకు వచ్చుచున్నదనగనే దేశమందంతటను ఆబాలగోపాలము పాఱువేటను గురించియే చెప్పుకొనుచుందురు. వేట క్షత్రియకులధర్మముగాన వారిలో నుత్సాహము మరింత హెచ్చుగనుండును. కావలసిన సన్నాహమునంతయు ముందుగనే సమకూర్చుకొందురు. విజయదశమి ఎప్పుడు వచ్చునాయని అత్యాతురతతో గనిపెట్టుకొనియుండిన పౌరులందరును ఆదినమున పెందలకడ భోజనములనుచేసి మంచిదుస్తులనుధరించి, గ్రామమున కావలయున్న శమీవృక్షమువద్దకరగి గుమిగూడియుందురు. ఇట్లు ముందుగనే గుమిగూడిన జనులందరును మృగయావిహారముసల్పబోవు క్షత్రియబృందమునకై ఎదురుచూచుచుందురు. దూరమునసే డప్పుల ధమధమధ్వనులును, బాకాలరవంబులును వినబడినంతనే బాలురుచేయు కోలాహలము వర్ణనాతీతము. కొంతతడవునకు మృగయాసక్తులగు శూరక్షత్రియసమూహము కుందేటి నొకదానిని వెంటబెట్టుకొని శమీవృక్షమును సమీపించి 10 లేక 20 గజముల పొడవుగల త్రాటినొకదానినితెచ్చి మొదటికొనను కుందేటి మెడకుగట్టి, రెండవ కొనను శమీవృక్షపుమొదలునకు బిగింతురు. అమ్ములపొదులను ధరించి ధనుష్టంకారములనుజేయుచు శమీవృక్షమున కిరుపైపులను, రెండుమూడువందల గజములదూరముననుండి నానావిధజంతువులను మధ్యప్రదేశమునకు తరుముకొని వచ్చుచున్నట్లునటించి చెట్టునకు గట్టబడియున్న కుందేటికి మాత్రము దెబ్బతగులకుండ శరవర్షమును గురిపించుచు, ఒకటిరెండు జాములకాలము మృగయాక్రీడను సల్పుదురు. వేటను ముగించునప్పుడు తిరిగి ముందుసంవత్సరమునకు కావలసిన కుందేలింకొకటింటియందున్న పక్షమున నీకుందేటిని పొడిచిచంపెదరు. మఱొకటిలేనిచో దీనినేభద్రముగా ఇంటికి గొనిపోయి మరుచటిసంవత్సరమువరకు గాపాడెదరు. వేటముగియగనే విండ్లను, తూణీరములను జమ్మిచెట్టుపై నుంచెదరు. ఇంతలో మేళతాళములతోను, మంగళతూర్యారవములతోను బయలుదేరి వేదఘోషసల్పుచు అర్చకులు ధూపదీపనైవేద్యములతో శమీవృక్షమును పూజించి చెట్టుమీద దాచబడియున్న ఆయుధములను తీసి కృత్రిమమృగయావినోదముసల్పిన క్షత్రియశూరుల కిచ్చివేసి శమీపత్రముల కొన్నిటినికోసి అచ్చటనున్నవారిలో పెద్దలకిచ్చిన వారు మహాప్రసాదమని స్వీకరించి కండ్ల కద్దుకొనెదరు. పిమ్మట అచ్చటనున్నవారందరు శమీవృక్షమునకు ప్రదక్షిణముచేసి దాని పత్రములనుకోసి మూటలనుగూడ కట్టుకొని ఇండ్లకువెడలి పెద్దలనక, పిన్నలనక గనబడిన

వారందరికిని తలయొక పత్రమునిచ్చి వందనమాచరించెదరు. కొందరుత్సాహపూరితులు కొన్ని పత్రములను కవరులలోఁ పెట్టి దూరమందున్న బంధుజనులకును, మిత్రవర్గమునకునుగూడ టపాద్వారాపంపెదరు. ఆదినమున నెంతఆకును పంచిపెట్టిన అంతబంగారమును దానము చేసినట్టులని వారుభావించెదరు.

౨

పై నవర్ణించిన పాలువేటకును, మనదేశమందు అనగా కృష్ణా, గోదావరి మండలము లందుజరిగెడి పాలువేటకును నొకగొప్పతేడాగాన్పించుచున్నది. అది కుందేటినివేటాడుటయే. ఇట్టివేట మనప్రాంతములందెచ్చటను గాన్పించదు. ఈసందర్భమున చదువరుల కొకసందేహము పొడజూపవచ్చును. జంతువులన్నిటిలోను పిరికితనమునకు ప్రసిద్ధిచెందిన కుందేటిని వేటాడుటలో పౌరుషముగాని, శూరత్వముగాని యేమున్నదని అనుకొనవచ్చును. కాని అట్లనుకొనుట పొరపాటు. ఈకుందేటివేట చరిత్రాంశము. పూర్వము హరిహరరాయల వారు ఆనెగొందిని పరిపాలించుచుండగా ఒకదినమున మృగయావిహారార్థము తుంగభద్రా నదినిదాటి అచ్చటి అరణ్యప్రదేశములలో వేటాడుచుండగా వేటకుక్కలు బెదరి పరుగెత్తు చుండెను. ఇట్టివింతను అంతకుమునుపెన్నడును కనివినియుండలేదు. కావున ఆప్రదేశమందేదో గొప్పమహాత్మ్యమున్నదని హరిహరరాయలు గ్రహించి అనతిదూరములోనున్న విరూపాక్ష దేవాలయమునందు తపస్సుజేసికొనుచున్న విద్యారణ్యస్వాములవారిచెంతకేగి వారిని సందర్శించి ఈఅద్భుతమును వారితోఁజెప్పగా ఆప్రదేశము చాలా పవిత్రమైనదనియు, అదియే పూర్వకాలపు కిష్కింధయనియు, సుగ్రీవాదులును రామలక్ష్మణులును సంచరించిన పుణ్యభూమియనియు, ఆచుట్టుప్రక్కలనున్న పర్వతములే ఋష్యమూకము మాల్యవంతము మతంగపర్వతములనియు అచ్చట కన్పించునదే పంపాసరోవరమనియు, ఆప్రదేశమంతయు అంత పావనమైనది గనుకనే అచ్చట నివసించు అల్పజంతువులుకూడ మహాబలముకల విగనుండుననియు, అందుచేతనే కుందేళ్లకు జంకి వేటకుక్కలు పారిపోవుచున్నవనియు, ఆప్రదేశమున కోటనుగట్టి పట్టణమునునిర్మించిన శత్రునిర్భేద్యమగుననియు వారుసెలవిచ్చిరి. అదేప్రకారము రాయలవారాప్రదేశమునందొకశుభదినమున శంకుస్థాపనముజేసి విజయ నగరనిర్మాణమును గావించిరి. అంతటిమహావైభవముతో దులదూగుచుండిన పట్టణము అంతకుమునుపెన్నడునుగాని, తరువాతగాని, ప్రపంచమందెచ్చట నుండలేదని చరిత్రకారులే జెప్పెదరు. దీనికంతకును మూలకారణమచ్చటికుందేళ్లుజేసిన చర్యయే గనుక అప్పటి నుండియు దసరాఉత్సవములతోఁపాటు కుందేటివేటనుగూడ జేయుట విజయనగరరాజులకు ఆచారమైయుండనోవు. ఈఆచారము కాలక్రమమున చుట్టుపట్లప్రదేశములలోనికి ప్రాకి, ఇప్పుడు విజయనగరసామ్రాజ్యమంతరించినను కుందేటినివేటాడునట్టి యాచారముమాత్రము ఆప్రదేశములందిప్పటికిని మిగిలియున్నది.

# దసరా కానుక

శ్రీమతి బొడ్డు సీతామహాలక్ష్మిగారు

శ్యామలకు వచ్చే భాద్రపదమాసానికి పదమూడు వెళ్ళి పదునాల్గవ ఏడు వస్తుంది. నిండు చందమామ వంటి గుండ్రని మొగం, మొగానికితగిన చారెడేసి కనులు, ఒడ్డుపొడుగు సరిపోయిన శరీరము, మేలిమి బంగారంవంటి శరీరచ్ఛాయ, అన్నిటికంటె చదువుకున్నదవటం ఆమెను అంతా మెచ్చుకుంటానికి కారణము లైనవి. శ్యామలకు పెండ్లయి రెండుసంవత్సరములు గడిచాయి. ఇంతవరకు శ్యామల అత్తవారింటికి వెళ్ళడం కాని, వినాయకరావు రావటంకాని జరుగలేదు. దానికి కారణం శ్యామలావినాయకరావుల వివాహంలో నాకబలిరోజున పెట్టుపోతలవిషయమై వియ్యంకులిద్దరకుకలిగిన కలహమే.

శ్యామల తండ్రి విశ్వనాథం ఏలూరులో ఒక సాహుకారువద్ద గుమాస్తాగిరీకి కుదురుకొని కుటుంబమును గౌరవముగా గడుపుకొని వస్తున్నాడు. పాపం, శ్యామలకాక ఇంకా యిద్దరు ఆడపిల్లలు పెండ్లికున్నారు. నెల వచ్చేటప్పటికి ఇంటిఅద్దెక్రింద పదిరూపాయలు; కొడుకు రాజారావు బడిజీతంక్రింద, పుస్తకాలక్రింద ఇంకొక పదిరూపాయలు మొక్కుబడిగా చెల్లించవలసినదే. ఇంకా చాకలికి, మంగలికి, దాసీదానికి, అప్పుల స్వామికొట్లో కాతావాడకంకు అతీతంరాళ్ళు నాలుగూ తెచ్చేటేపటంతోనే చేతిలోనివి చేతిలో అఖరయేవి. ఆపేదబ్రాహ్మణునకు రాగాపోగా మిగిలేది నెలకొక పచ్చనినిట్టూర్పుమాత్రమే.

*　　　*　　　*　　　*　　　*

విశ్వనాథం వియ్యంకుడు సీతారామయ్య కలెక్టరుకచేరిలో గుమాస్తా. తనూ, భార్యా, ఒకకొడుకే గనుక జీతం సంసారంక్రిందఅయిపోయినా పైరాబడిమట్టుకు నిల్వచేస్తున్నాడు. సీతారామయ్య మహాలోభి. ఒకవిధంగా తలతిక్కమనిషికూడాను. పెండ్లిలో తనకు మంచిబట్టలు పెట్టలేదని, వియ్యపరాలి లాంఛనాలు సరిగా ముట్టలేదని, అల్లునకు అలకపాన్పుపై కోరిన నూటపదునారులు ఇవ్వలేదని ఇత్యాది క్షుద్రకారణముల చేత పెండ్లి అయినదిమొదలుకొని వారిగడప త్రొక్కలేదు. ఏడాదిలోపల అల్లునితీసుకొనివెళ్ళి బట్టలుపెట్ట వలెనని విశ్వనాథం ఎన్నిఉత్తరాలువ్రాసినా ప్రత్యుత్తరము వ్రాయలేదు. స్వయంగా విశ్వనాథంవచ్చి అల్లునిపంపుటకు వియ్యంకుని చేతులుపుచ్చుకొని బ్రతిమాలినప్పటికి పంపుట కొప్పుకొనక ఖచ్చితంగా నూట పదారులు ఇస్తేగాని పంపనన్నాడు. పెండ్లికిచేసిన అప్పే నెమ్మదిగా తీర్చుకుంటూన్న విశ్వనాథానికి ఈమాటలు వినేటప్పటికి పైప్రాణాలు పైనపోయినవి.

*　　　*　　　*　　　*　　　*

వినాయకరావు విశాఖపట్నంలో డాక్టరుపరీక్షకు చదువుతున్నాడు. అతనికి తండ్రి అంటే అధిక భక్తి. భయంకూడాను. అందుచేత అత్తవారింటికి వెళ్ళాలని అభిలాషఉన్నా వెళ్ళలేకపోయాడు. తండ్రివద్ద నుంచివచ్చే ప్రతిఉత్తరంలోనూ మామగారింటికి వెళ్ళవద్దన్న హెచ్చరిక తప్పకుండాఉంటూంది. అందుచేత అతనికి వెళ్ళటానికి జంకుగాఉండేది. ఆరోజున తీరుబడిగా ఉండటంచేత అతని మానసనాటకమున జరిగి పోయినప్రదర్శనములన్నీ తిరిగి ప్రత్యక్షముకాజొచ్చినవి. న్యాయమునకు తప్పంతయూ తండ్రిగారిదే అను కున్నాడు. డబ్బులేనప్పుడు తనమామగారు అంతకంటే చేసేదేముంది అనుకున్నాడు. మామగారు వ్రాసిన ఉత్తరాలకు తానుకూడా జవాబువ్రాయకపోవటం మూర్ఖ్యం అనుకున్నాడు. కొంతసేపటికి ఆలోచనలన్నీ భార్యవైపునకు తిరిగినవి. రెండేండ్లక్రితంజూచిన తనభార్య ఇప్పటికి ఎట్లా ఉంటుందో? తన్ను గుర్తించ గలదో లేదో అనుకున్నాడు. తమపెండ్లినాటిసంగతులు జ్ఞప్తికితెచ్చుకొనుచు తీయనిఆలోచనలో మునిగి



తిరువేంద్రమునందలికోవెల, కోనేరు

తెలుసుకున్నాడు. అంతలో పోస్టుబంట్రోతువచ్చి రెండుకవర్లు యిచ్చేడు. ఒకటి తండ్రివద్దనుంచి వచ్చినదని పైవ్రాతనుబట్టి తెలుసుకున్నాడు. రెండవది ఎవరో స్నేహితులు వ్రాశారనుకున్నాడు కాని ఆదస్తూరీ ఎప్పుడూ చూచినట్టు లేదు. అక్షరాలు ముత్యాలవలె ఉన్నాయి. కవరు చింపిచూశాడు. చూచిందే పది సార్లు చూచేడు. ఆనందంపట్టలేక అందులోఉన్న రెండుపంక్తులు పైకి బిగ్గరగా చదివేశాడు.

"మీారు తప్పకుండా ఈవిజయదశమిపండుగనాటికి మాయింటికి రాగోరుచున్నాను.

మీాశ్యామల"

తండ్రిగారి ఉత్తరంకూడా విప్పి చదివేడు. అందులో - ఈవిజయదశమికి ఇంట్లో దేవీపూజ చేయుటకు తలపెట్టినాముగనుక నీవానాటికి తప్పక రావలసినది - అనిఉన్నది. అది చదుకొనేటప్పటికి అతనికేమీా పాలుపోలేదు. తండ్రిగారియాజ్ఞ ఉల్లంఘించటమా? ప్రియురాలికోరిక తిరస్కరించటమా? ఏదిముఖ్యం.

అతని కేవిధంగానైనా అత్తవారింటికి వెళ్ళాలనివుంది. తండ్రిమాట త్రోసివేయడానికి శక్తిచాలదు. కొంతసేపు అక్కడకని కొంతసేపు ఇక్కడకని అతనిమనస్సు ఊగులాడుతూంది. ఈవిజయదశమి ప్రియురాలి కోరికననుసరించి సంతోషంగా ఏలూరులో అత్తవారింట గడపాలనుకున్నాడు. తండ్రికి - ఈదసరాకు మాసహాధ్యాయులమంతా కలసి సింహాచలం వెళ్ళాలనుకుంటున్నాంగనుక మీారుఉత్తరంప్రకారం రాజాలనందుకు మన్నించవలెను-అని వ్రాసినాడు.

* * * * *

ఇంకా దసరా రెండురోజులున్నదనగానే వినాయకరావు ఏలూరు చేరుకున్నాడు. అత్తమామలకు అల్లుని చూడడంతోనే పరమానందం అయింది. అదివరకు ఆటలతోపాటలతో ఇల్లంతా ఎగరకొట్టే శ్యామల ఇప్పుడు సిగ్గులపెళ్ళికూతురయింది. వినాయకరావునకు మాట్లాడటానికైనా తీరికలేకుండా బావమఱదితో, మరదళ్ళతో ఆటలాడటమేసరిపోయింది. అతనికి అత్తవారుచేసే మర్యాదలకంటే భార్యచూసే ఓరచూపులు ఆనందమిచ్చినవి.

పండుగనాడు విశ్వనాథం వినాయకరావును కూర్చుండబెట్టి తాంబూలమిచ్చి కద్దరుబట్టలు, వారంరోజులు శ్యామల కష్టపడి రంగురంగుల తడపలతో అల్లిన చిన్నపూలబుట్టలో దొడ్లోవి సందివర్ధనగులాబీ పువ్వులు వేసియిచ్చేడు. ఆకెంటిలో ఏదిప్రియమోచెప్పవలెనా? ఆపూలబుట్టకొకవైపున ముద్దులమూటగట్టు అక్షరములతో 'దసరాకానుక' అని వ్రాసినకాగితం అంటించి ఉన్నది. అదిచూచి వినాయకరావు పొందిన సంతోషమునకు మేరలేదు.

మరునాడు వినాయకరావు దసరాకానుకను తన సూటుకేసులో నలగకుండా జాగ్రత్తచేసుకొని అత్తవారిచ్చిన క్రొత్తబట్టలు కట్టుకొని అందరివద్ద సెలవుతీసుకొన్నాడు. తలుపోరచేసుకొని చూస్తున్న శ్యామలతో వెళ్ళివస్తానని కండ్లతోనే మాట్లాడాడు. బావమరది సూటుకేసు చేతితోపట్టుకొని స్టేషనుదాకా ప్రయాణమయ్యాడు. అత్తగారు పోనీ రెండురోజులుండగూడదాఅని మామూలుమాట జారవిడిచింది. మరదళ్ళిద్దరు చెరోవైపు జేరారు. మామగారు స్టేషనుకు బండిమాట్లాడుకొని వచ్చి అల్లుని పిలిచేరు. వినాయకరావు మరల అందరివద్ద సెలవుతీసుకొని బండియెక్కేడు. సాయంకాలానికి విశాఖపట్నం సురక్షితంగా చేరాడు.

సీతారామయ్యకు ఈరహస్యవ్యాపారం తెలియలేదు. వినాయకరావు తండ్రిగారికోపానికిలోకాలేదు. పాఠకులు తాముకూడా ఈవిషయం గోప్యంగా ఉంచడమే మంచిది.

# జానకి బొమ్మలకొలువు

శ్రీమతి పాకల శ్రీలక్ష్మీకామేశ్వరమ్మగారు

సీతారామారావుగారికి కొమార్తె ఒకతే. తండ్రికి తల్లికి జానకిఅంటే ఎంతో ముద్దు. పదవయేటనే పెండ్లి చేశారు జానకికి. ప్రతీఏటా దసరాకి వాళ్ళయింట్లో జానకి, జానకి మేనమామకూతురు కాంత కలిసి బొమ్మల కొలువుపెట్టారు. దసరా ఇంకాపది హేనురోజులు వున్నదనగానే ఖద్దరుపైటపావళ్లు, జాకెట్లు కుట్టించుకుంది జానకి వాళ్లనాన్నతో చెప్పి. ఆబట్టలు, అత్తవారుచేయించిన ముత్యాలవడ్డాణం, అత్తవారు శ్రావణపట్టీతో పంపిన వాచీగొలుసు పెట్టుకొని ఎప్పుడు కొలువుపిలుపుకి బయలుదేరుదామా అని ఆదుర్దాపడుతోంది జానకి. మేనమామకూతురుతో ఇల్లాఅంది: "కాంతా! నిరుడు మనకొలువుచూచి సీత బాగులేదని నవ్వింది కదూ? అందరితోను, మనంపెట్టినకొలువుబాగులేదనీ, నాకు తనకు ఉన్నన్ని బొమ్మలులేవనీ చెప్పిందట. ఈసారి అది ఉడుక్కునేటట్టు కొలువుపెడదాం మనం. ఏం?"

... ... ... ...

జానకి నాయనమ్మ సుభద్రమ్మ వసారాలో కూర్చొని అప్పడాలువత్తుతోంది. ఇంటిల్లోకి జానకివచ్చింది.

జా:—నాయనమ్మగారూ! నాకు బొమ్మలకొలువుకి బొమ్మలు చాలవండీ. నిరుడు సీతపెట్టినకొలువు ఎంతో బాగుంది. గదినిండా బొమ్మలతో నింపేసింది. అన్నీదొరసానిబొమ్మలే. నేనుపెట్టిన కొలువుచూచి నవ్వింది. నాకేమీ బొమ్మలులేవనీ, నాకొలువుబాగాలేదనీ అందరితో చెప్పింది. నన్నుచూస్తేసరి నవ్వుతుంది. ఈసారి అది ఉడుక్కునేటట్టు పెడ్తాను కొలువు. నాన్నతో చెప్పరూ? అన్నయ్యకి బొమ్మలకోసం వ్రాయమని.

సు:—అలాగేచెబుతాను. నాన్నరాగానే చెప్తా. సీత నిన్నుచూస్తే నవ్వుతుందని చెప్పేవు. నవ్వితే నవ్వనీ. దానిమాటేపంకర. దాన్ని నాదగ్గిరకు తీసుకురాలేకపోయావూ? నాలుగుచీవాట్లుపెడుదును. వెళ్లు నాన్న వచ్చేడేమో చూడు.

... ... ... ...

జానకికి ఇప్పుడుపదకొండో సంవత్సరం. సెకండుఫారం చదువుతుంది. ఈఏడుతో చదువుమానిపించెయ్యమని సుభద్రమ్మ సీతారామారావుతో చెప్పింది. కాని ఆయనకుమాత్రం కూతురికి మెట్రిక్యులేషన్ వరకూ చెప్పించాలనివుంది. జానకితల్లి విశాలక్ష్మికికూడా అదేఇష్టం. అందుచేత సుభద్రమ్మగారిమాటలు వినలేదు సీతారామారావు.

... ... ... ...

సు:—సీతారామం! చూచావూ? జానకికి, కొలువుపెట్టడానికి బొమ్మలుచాలవట. వాళ్లఅన్నకివ్రాసి తెప్పించమని నీతో చెప్పమని నాకు ప్రొద్దుటనుండీ ప్రాణంతీ సేస్తుంది.

సీ:—(నవ్వుతూ) జానకీ! ఇలారా.

జానకి తండ్రి పిలువగానే వెళ్లి తండ్రిఒడిలో కూర్చుంది.

సీ:—జానకీ! ఏం! నాయనమ్మదగ్గిర అల్లరిచేస్తున్నావట. బొమ్మలుకావాలీ?

జా:—దొరసానిబొమ్మలుకావాలి నాన్నా! నాకు నిరుడుబొమ్మలపరీక్షలో దొరసానిబొమ్మఇచ్చేరే? అలాంటివి కావాలి.

సీ:—అలాగే. మీఅన్న ప్రభాకరం పట్నంలో ఉన్నాడుకదూ? ఎన్నికావాలంటే అన్ని తెస్తాడు. వెళ్లేటప్పుడు ప్రభాకరం ఏంచెప్పేడు నీతో? ఈపరీక్షలలో బాగా మార్కులుతెచ్చుకుంటే నీకుపట్టుచీరలు

తెస్తావన్నావుకదూ? బాగాచదువుకుంటే ఎన్నికావాలంటే అన్నీ తెప్పిస్తాను. తప్పకుండా ఈరోజే వ్రాస్తాను అన్నయ్యకిబొమ్మలు తెమ్మని. అన్నయ్యా, వదినా వస్తారుగా దసరాకి? అప్పుడు తెస్తారు.

... ... ... ...

జానకి మంచి తెలివిగల అమ్మాయి. ఈడుకిమించిన తెలివి. ప్రతీఏటా ఫ్యాసుఅవుతోంది స్కూల్లో. పరీక్షలలో బాగా అందరికంటే ఎక్కువగా మార్కులువచ్చేయి. తనకి బాగామార్కులువచ్చేయని జానకి స్వయంగా వ్రాసింది వాళ్లఅన్నకి.

... ... ... ...

"జానకీ! జ్ఞాపకంఉందా? మరిచిపోయావా?" అని అప్పుడే రైలునుండివచ్చి బండిదిగుతూ సీతారామారావుగారికోడలు కమల అన్నది. జానకి కమలదగ్గిరకు నవ్వుతూ వెళ్లింది.

"పిల్లవాడుబాగున్నాడా? ఇప్పుడేంజబ్బులేదుకదా?" అంటూ సుభద్రమ్మ కమలదగ్గిరఉన్న పిల్లవాడిని తీసికొని ఎత్తుకుంది.

"ఇంతచిక్కిపోయావేం? మరీనూ? బలానికేదైనా టానిక్ తీసుకుంటున్నావా?" అంటూ కమల చెయ్యిపట్టుకొని లోపలికి తీసుకువెళ్లింది అత్తవిశాలక్ష్మి.

వీళ్లంతా ఈసందడిలో ఉంటూండగా కమలావాళ్లు తెచ్చిన సామానంతా పరీక్ష చేయసాగింది జానకి. ఎందుకూ? అందులో తనబొమ్మలపెట్టె ఎక్కడఉన్నదో అని.

"జానకీ! బొమ్మలు నాదగ్గిరఉన్నాయి. ఇలాగురా" అని ప్రభాకరరావు పిలిచేడు చెల్లెలిని.

జా:—ఎక్కడఉన్నాయి అన్నయ్యా! బొమ్మలూ?

ప్ర:—అదుగో ఆపెట్టెలోఉన్నాయి. నీవు ఈపరీక్షలో బాగా మార్కులు తెచ్చుకున్నావని వ్రాశావు? ఎప్పుడూ అలాగే మార్కులు తెచ్చుకోవాలి. నీకోసం మీవదిన పట్టుచీరలు లోలక్కులు తెచ్చింది. వెళ్లి. మీవదినను అడుగు. నాకు స్నానానికి వేళయింది. స్నానంచేసివచ్చి బొమ్మలుఇస్తాను.

పట్టుచీరలు, లోలక్కులుఅనగానే జానకికి సంతోషంఅయిందిగాని, బొమ్మలకన్నా ఇవి ముఖ్యంకావు జానకికి. "ఎప్పుడెప్పుడు బొమ్మలుచూస్తానాఅని అనుకుంటుంటే ఇంకాఎప్పుడో స్నానంచేసి వచ్చిచూపిస్తాడట" అని గొణుక్కుంటూ లోపలికివెళ్లింది జానకి.

... ... ... ...

లోపల కమల పిల్లవాడికి పాలుపడుతోంది.

జా:—వదినా! నాకోసం పట్టుచీరలు, లోలక్కులు తెచ్చేవని అన్నయ్యచెప్పేడు. ఏవీ? (అని సిగ్గుతో అడిగింది.)

క:—అవును. తెచ్చేను. ఆపెట్లోఉన్నాయి. ఇదిగోతాళాలు. పెట్టెతీసిచూడు.

జా:—తొందరలేదు. చూస్తాను. (పిల్లడివైపు చేతులుచాపి) బాబూ? నాదగ్గిరకురావూ?

క:—వెళ్లురా? అత్తకదూ? వెళ్లితేబంగారం అంటుకుంటుందేమిటి?

జా:—ఉండు వదినా! ఒకమంత్రంవేస్తాను (అంటూ గదిలోకివెళ్లి బీరువాతీసి, పిప్పరమెంట్లుతీసి పిల్లవాడికి ఇచ్చింది.) చూశావు వదినా? ఇప్పుడు నాదగ్గిరకువచ్చేడు.

క:—ఇప్పుడెలాగురా వెళ్లేవు?

... ... ... ...

ఇంతలో ప్రభాకరరావు స్నానంచేసి రావడంచేత అతనిదగ్గరకువెళ్లింది జానకి.

ప్ర:—ఇవిగో బొమ్మలు. పెట్టెనిండా తెచ్చేను. బాగున్నవా?

జా:—(వాటిని చూస్తూ) బాగున్నవన్నయ్యా! ఇవన్నీ కొలువులో పెడితే ఎంతో బాగుంటుంది. (అని శాంతాన్ని పిలుచుకురావడానికి వెళ్లింది.)

శాంత, జానకి ఆబొమ్మలుచూచి, కొలువు పెట్టేటప్పుడు ఆబొమ్మలు ఎలాగు పెట్టవలెనో అనుకుంటూ ఆరాత్రిఅంతా వేగించారు.

... ... ... ...

సీత:—శాంతా! మీజానకికి వాళ్లన్న మంచిదొరసానిబొమ్మలు తెచ్చేడట నిజమేనా?

శాంత:—అబ్బా! ఎంతమంచిబొమ్మలనుకున్నావు? చూడడానికి రెండుకళ్లూచాలవే? పాపంజానకికి బొమ్మలులేవని వెక్కిరించేవు కాని, నీబొమ్మలకు మించినట్లున్నాయి.

సీత:—ఆ! అలాగా? (అని మొఖంముడుచుకు వెళ్లిపోయింది.)

... ... ... ...

మర్నాడు జానకి, శాంత, కమల ఒకగదిలో బల్లలువేసి, గుడ్డలుపరిచి కొలువు పెట్టేరు. కమలకూడా వాళ్లతో కలిసి కొలువు ఎలాగు పెట్టవలెనో అలాగు పెట్టడంచేత కొలువుగది బాగా వెలుగుతోంది.

జానకి తల్లితో చెప్పి కొలువుచూడడానికి వచ్చినవాళ్లందరికీ ఇవ్వడానికి రవ్వుకారావుండలు, అరటిపళ్లు, ఆకులు, చెక్కలు, గంధం, పన్నీరు అన్నీ సిద్ధంచేసింది.

మర్నాడుప్రొద్దుట పదిగంటలకల్లా జానకికి, శాంతానికి కమల వదులుగా జడలువేసి పట్టుచీరెలు కట్టించి నగలు పెట్టిముస్తాబుచేసింది. అన్నట్టు చెప్పడం మరచిపోయాను. తాను తెచ్చిన లోలక్కులుకూడా పెట్టింది జానకికి కమల.

"నాయనమ్మగారూ? ఇక మేంపిలుపులకి వెళ్లుతున్నాం" అన్నది జానకి.

సుభ:—ఇలారా జానకీ! ఏమిటూహడావిడి? ఇలా రా చూస్తాను. మెడలో ఏమిటివగలు వేసుకున్నావ్? మెడనిండుగా లేదే! అచ్చే ఒక్క వాచీగొలుసేనా వేసుకున్నావు? నీకంటె వేసుకున్నావు కావేమి? వేసుకో. నామిరియాలపేరుకూడా వేస్తాను, రా.

జా:—వద్దండీ! నాయనమ్మగారూ! అదివేసుకుంటే అసహ్యంగా ఉంటుంది.

సు:—చూశావే? విశాలక్ష్మి! మెడనిండుగా లేదని దానికంటె నామిరియాలపేరు వేసుకోమంటే వేసుకోదట. నేనుచెపితే వినదు. నీవేనా చెప్పు.

వి:—(నవ్వుతూ) అలాంటివి ఇప్పుడెవరూ వేసుకో ర త్తగారూ!

సు:—సరేబాగుంది నాలుగుచీవాట్లు పెట్టి వేసుకోమనాలిగాని, ఫలానివారిపిల్లకి నగలేమిలేవంటే ఎవరికి అప్రతిష్ఠ? ఇదేమి పాడుకాలంవచ్చిందమ్మా. ఎక్కడికైనా పిలుపులకివెళితే చక్కావంటినిండా నగలు పెట్టుకొని వెళ్లుతారుగాని ఎక్కువనగలు పెట్టుకుంటేకూడా మోటైపోతుందా? ఇప్పటివేషాలన్నీ చూస్తే నాకు కళ్లుమండుతుంది.

జా:—ఫర్వాలేదు నాయనమ్మగారూ! ఎవ్వరూ ఏమీఅనుకోరు లెండి. మాకువేళయిపోతుంది. వెళుతున్నాం (అని వెళ్లుదురు).

సు:—పోనీ మీఅమ్మకాసులపేరైనా వేసుకోవే (అని గట్టిగా కేకవేసింది)

సుభద్రమ్మగారి మాటలువినిపించుకోకుండా వెళ్లిపోయారు.

... ... ... ...

జానకి:—పదివా! ఆబొట్టుభరిణ ఇలాతీసుకురా.

శాంత:—నేనుగంధంరాస్తాను జానకీ!

లక్ష్మి:—(సీతచెవిలో) జానకిపెట్టిన కొలువు ఎంతబాగుందో చూశావు?

పార్వతి:—(సీతచెవిలో) జానకికి వున్నలాంటి బొమ్మలు మనదగ్గిర ఎవళ్లదగ్గిర లేవు.

ఇంతలో జానకి వెండిపళ్లెంతో రవ్వూరావుండలు అన్నీ వేసుకొనివచ్చి కమల అందరికీ బొట్టుపెడితే; శాంత గంధం, పన్నీరు, రాస్తే; తాను అత్తరూ, ఆకులూ, చెక్కలూ, రవ్వూరావుండలూ, అరటిపళ్లూ అందరికీ ఇచ్చింది.

తరువాత జానకి గ్రామఫోను పెట్టి రామనాథశాస్త్రిగారి ప్లేట్లు పెట్టింది. తరువాత అందరూ తలకొక పాట పాడేరు. కాని ఇవన్నీచూచి సీత ఉడుక్కుపోయి ఎప్పుడెప్పుడు అక్కడనుండి లేచిపోదామా అని చూస్తూఉంది.

శాంత:—సీతా! ఈసారిఎలాగుఉందే మాకొలువు?

ఈమాటవినగానే సీత ఏడుపుమొఖంపెట్టుకొని ఎవ్వరితో చెప్పకుండా చివాలునలేచి వెళ్ళిపోయింది వాళ్ళఇంటికి.

## నీవులేకున్న నాయున్కి నీరసంబు

శ్రీమతి ఆర్. శారద గారు

శ్రీ హరీంద్రనాథచట్టోపాధ్యాయుని గీతమునకు అనువాదము

ముద్దువన్నెలం దఱఁగినపువ్వువోలె
రమ్యలహరీవిహీనవారాశివోలె
బరువుగలవాజిలేని సంగరమువోలె
నీవులేకున్న నాయున్కి నీరసంబు.

అతులసుఖంబు తఱఁగినగీతివోలె
వాగురవిహీనుఁడౌ బెస్తవానివోలెఁ
గనగలంగరుల్ లేనినౌకలనుబోలె
నీవులేకున్న నాయున్కి నీరసంబు.

డంబగుకవాటహీనసౌధంబువోలె
గమ్మమాధురి లేఁగుఫలమ్మువోలెఁ
బక్షరక్షణ మెఱుఁగనిపక్షివోలె
నీవులేకున్న నాయున్కి నీరసంబు.

మిసిమిగలపృథ్వి లేనియాకసమువోలెఁ
బ్రాణతతినిగోలుపడుశరీరంబువోలె
మృదుజలకణరహితవారిదమువోలె
నీవులేకున్న నాయున్కి నీరసంబు.

ఘననినదశూన్యమామృదంగంబువోలె
మేలిమెఱుఁగుల విడనాడుమెఱుపువోలెఁ
గసదతులకాంతిలేని ఖడ్గంబువోలె
నీవులేకున్న నాయున్కి నీరసంబు.

పరమగ్రంథవిహీనుఁడౌ గురువువోలెఁ
బయనమునఁ ద్రోవదప్పినపాంథువోలె
సంతమెఱుఁగనిసంతతచింతవోలె
నీవులేకున్న నాయున్కి నీరసంబు.

ప్రియులసందేశ మెఱుఁగనిప్రియులవోలె
సంధకారము తెలియనియున్నవోలె
నిమ్ముమినుకులులేని దీపమ్మువోలె
నీవులేకున్న నాయున్కి నీరసంబు.

నాగసర్పము లేని కాననమువోలె
వహ్ని లేకున్న యగ్నిపర్వతమువోలె
సౌమ్యసంగీతరసమేదుజలధివోలె
నీవులేకున్న నాయున్కి నీరసంబు.

# కృష్ణవేణి దసరా ప్రసాదం

శ్రీమతి సమయమంత్రి రాజ్యలక్ష్మమ్మగారు

కృష్ణాతీరమున కొండవీటిసీమలో కృష్ణాపురమను అగ్రహారముగలదు. పూర్వము రెడ్డిప్రభువులెవరో జగత్పండితుఁడగు నొకబ్రాహ్మణున కదిదానమొసంగియుండిరి. అయ్యది సుక్షేత్రమగుటచే ముద్దినుసుముక్కారుపంటలు పండుచుండును. కాన వలయుపదార్థములు వారింట సవ్వారిగాఁగ వారలరుచుయజ్ఞాదిక్రతువులు చేయుటయేగాక, నిరతాన్నప్రదాతలు గూడ నగుటచే వారి కన్నదానమువారను పౌరుషనామ మలవడెను. పుట్టుపేరులో, పెట్టు పేరులోగాని దీక్షితులు, సోమయాజిపదములు వారింట నామధేయములకు మకుటములుగా తగిలింపబడుచుండెడివి.

ఒకప్పుడు తద్వంశీయులగు యజ్ఞేశ్వరసోమయాజులుగారును, వారిభార్య సోదెమ్మ యును గలరు. వారును నిరతాన్నప్రదాతలై యుండిరి. సుబ్రహ్మణ్యదీక్షితులువారి కేక పుత్రుడు. ఇరువదిసంవత్సరములవాడు. పాండిత్యమందసమానప్రజ్ఞగలవాడు. అతనిభార్య కృష్ణవేణి. కృష్ణవేణి పుట్టింటివారిది పండితవంశమగుటచే వారింట నిత్యమును పెక్కండ్రు శిష్యులు పాఠములువల్లించి చదువుచుండుటగలదు. అట్టిగృహమున పెరిగినదగుటచే నక్షర జ్ఞానములేకున్నను కృష్ణవేణికి శ్రుతపాండిత్యము చక్కగా కుదిరినది. వేదశాస్త్రపురాణము లందలి కథలు చక్కగా నెరిగినది. ఎరుకయందెంత వన్నెకెక్కినదో సౌందర్యమునగూడ నంత మిన్నయనిపించుకున్నది.

అప్పటికప్పుడే మనదేశ మాంగ్లేయులపాలనములోనికి వచ్చియున్నది. తత్పూర్వము స్వదేశప్రభువులచే దత్తములై యుండిన దేవాదాయ, ధర్మాదాయ, శ్రోత్రియములైన యీనాములను, అగ్రహారములను ఎవరిఅనుభవముకందున్నవి వారికే నిలబెట్టుటకు యీనాంకమీషనరుదొరవారు ఆంధ్రదేశమునందంతటను తనిఖీకి బయలుదేరిరి. కృష్ణాపురము పూర్వమెప్పుడో దత్తమైయుండుటచే ఆఅగ్రహారీకులవద్ద ప్రస్తుతమెట్టి నిదర్శనమును లేకుం డెను. కాని దయాళుఁడగు కమీషనరుదొరవారు మూడుమాసములు గడువిచ్చిచనిరి.

గడవుదినములు చనుచుండుటయేగాని నిదర్శనము దొరకుననను ఆశలేదు. వంశపరం పరాగతమైన అగ్రహారము తనతరమునందంతరింపనై యున్నదని సోమయాజులుగారు బెంగచేకృశించి తుదకు మంచముపట్టిరి. నేను అగ్రహారమూడిపోవుటకు సిద్ధపడుటయు, అంతకు కొలది దినములక్రితమే కోడలు తొలిసారి కాపురమునకు వచ్చుటయు కనిపెట్టి ఈదుస్థితి యంతయు కోడలిదౌర్భాగ్యమేయని స్థిరపరచి, పాపమాచిన్నపిల్లను నిందించుచు సోదెమ్మ గారు తననామము సార్థకపరచుచుండెను. యజ్ఞేశ్వరులుగారును క్రమముగా నీమొమతము లోనికే వచ్చిరి. బాలుఁడగు సుబ్రహ్మణ్యమునకును తలిదండ్రుల యభిప్రాయమేనచ్చినది.

ఇక కృష్ణవేణి నాయింట నాదరించువారెవరు? ఎప్పుడును దూషణయే. గజ్జలతల్లి, పెద్దక్కయ్య ఇత్యాదిబిరుదముల నామెకు తగిలింపదొడగిరి. నిద్రాహారములులేక అగ్ర

హారము పోయినదన్న చింతకంటె తనకీయపనిందవచ్చినదన్న దుఃఖము మెండై ఆచిన్నది నానాటికిఁ గృశింపజొచ్చెను. తుద కామెను పుట్టినింటికిఁబంపి వేఱొకకన్యను తమకొమరునకు చేయవలెనని సోదెమ్మ స్థిరపరచినది. ముసలాయనయు కొంతవరకుసిద్ధపడెను. కుమారుఁడును ప్రతికూలసూచనలు చేయలేదు. కృష్ణవేణి పుట్టింటనుండి బండికూడ వచ్చినది. కాని వ్యక్తరాలగు నాచిన్నది అత్తిల్లు విడువలేదు. ఇరుగు పొరుగు వారలీయింటివారి దుర్మార్గమునకు నిందింపుచు కృష్ణవేణి నూరార్చుచుండిరి.

దేవీనవరాత్రములు వచ్చినవి. అన్నదానము వారింట నన్నపూర్ణకు నిత్యారాధన గలదు. దేవీనవరాత్రులలో వీరింట పాడ్యమిమొదలు దశమివరకు దేవీపూజ మహావైభవముతో నేయేటను జరుగుచుండెడిది. ఈయేఁడుమాత్ర మది యెవరును తలపెట్టలేదు.

నాఁడువిజయదశమి. ఆశుద్ధద్వాదశితో సర్కారువారిచ్చిన గడువు కడచనున్నది. తమకు వచ్చిన దుస్థితికివారు దిక్కులివిచారింపదొడగిరి. ఎవరెన్నితిట్టినను ఓర్చుకుని నోరెత్తకుండిన కృష్ణవేణి మతమందరకు దురవగాహముగానుండెను. సాయంత్రము పెరటి గుమ్మముదాటి కృష్ణవేణి సమీపములోనున్న జమ్మిచెట్టునకు మూఁడుప్రదక్షిణములు చేసి నమస్కరించి తనయీప్సితమును నెరవేర్పుమని ప్రార్థించి జమ్మిదళములను కన్నులకద్దుకొని అలంకృతముగాని శిరోజములందు నాజమ్మిదళముల నమర్చికొని యింటికివచ్చి దేవుని గదిలో అన్నపూర్ణకు సాగిలపడి "తల్లీ! నావలన ఈకుటుంబమునకు ఈనష్టము సంభవించిన దన్న అపఖ్యాతి నేమోయలేను. అమ్మా! జగజ్జననీ! ఈరాత్రి ఈఅగ్రహారమునకు కావలసిన నిదర్శనమెద్దియేని నీవుజూపింపవేని ఉదయముగాకమునుపే నేను ప్రాణముల తెగింతు"నని భక్తిపూర్వకముగా పలికి లేచివెళ్లినది. ఆరాత్రి ఎవరును భోజనములనుచేయక పరుండిరి. రాత్రి 12 గంటలకు కృష్ణవేణిలేచి తనభర్తనులేపి తనకువచ్చిన స్వప్నగాథ వినుపింప నారంభించెను. అత డుపేక్షాపరుఁడై ఆమెను నిందించిపంపెను. ఆచిన్నది అత్తగారి దరికేగి ఆమెనులేపి తనకు స్వప్నములో నొకముసలిముత్తయిదువవచ్చి దేవతాపీఠముక్రింద బారెఁడు లోఁతులో నొకరాగిపట్టాగలదనియును, త్రవ్వించూచుకొమ్మనియును తనకు చెప్పినట్లు అత్తగారితో సాహసించిచెప్పెను. కాని సోదెమ్మ వినుగుకొని కోడలిని దుర్భాషలాడి అవల కంపెను. కాని మేల్కొనియుండిన యజ్ఞేశ్వరులుగారు మాత్రము నిదానించి ఆస్వప్నమందలి శ్రీ అన్నపూర్ణయనియును, తానదిపరీక్షించి చూచెదననియును, తనకిది తుదియాస యనియుచెప్పి చేగునపముతో దేవతాపీఠముక్రింద త్రవ్వనారంభించెను. ఆయనభార్యయు, పుత్రుఁడునుగూడ నాయనకు సాయమొనర్చుచుండిరి.

కృష్ణవేణి అమ్మవారికెదురుగ సాష్టాంగపడి నమస్కరించి మనస్సులో ప్రార్థనము చేయుచుండెను. వారాశపీడక ఓపికకొలదిత్రవ్వుచుండిరి. తుదకు గునపమునకు కంగుననెద్దియో తగిలినది. వారి యాశలును చెంగలించినవి. రెట్టించిన ఉత్సాహముతో వారింకను

త్రవ్వి యొకరాగిపాత్రను పైకిదీసి పైమూతను తొలగించి అందుండి ఒకరేకుచుట్టను పైకిలాగిరి. అదిత్రుప్పుపట్టియుండలేదు. ఆచుట్టను బలవంతముగా విప్పిచూచిరి. అందు తెలిసీయు తెలియని ఆంధ్రాక్షరములు గోచరించినవి. ప్రాణములు లేచివచ్చిన సోమయాజులు గారు దేవికి నమస్కరించి కోడలిని లేవదీసి "బిడ్డా! నీవలన నాకీ అగ్రహారము నిల్చినది. నిన్ను నేను నిందించితిని." అని యేమేమో చెప్పుచు ఆనందబాష్పముల రాల్చుచుండెను. అదివరకే యానందపూరితురాలైన సోదెమ్మ కోడలిని కౌగలించికొని "అమ్మా! నీవు నామహాలక్ష్మివి, నాయింటికివచ్చిన మహాలక్ష్మి ననేకవిధముల నిందించుకుంటి"నను ప్రసంగములతో కోడలినాదరించుచుండెను. నౌకర్లవలన యీవార్త విన్నవారై యిరుగుపొరుగు వారు లేచివచ్చి, వీరిదుదృష్టమును కొనియాడుచు కృష్ణవేణి భక్తి కభినందించుచుండిరి. సోదెమ్మ పెట్టితీసి ఒక అర్ధచంద్రహారమును బైటికిఁదెచ్చి, తన కోడలిమెడలో వేసి "అమ్మా! పూర్వ మొకమహారాజగారు ఈహారము నీయింటివారి కిచ్చియుండిరట. నాటనుండియు ఈయింటి యజమానురాలు ధరించు టాచారమైయున్నది. ఇది నాఅత్తగారు నాకిచ్చినది. నేడే నీకిచ్చుచున్నాను. నేటినుండియు ఈయింటికి నీవేయజమానురాలవు. సర్వము నిపుడే నీయధీనము చేయుచున్నాను"అని అందరిలో చెప్పెను. పాపము యజ్ఞేశ్వరులుగారు కన్నీరుగార్చుచు తామాకోడలిని చేసిననిందకును, ఆమెను పెట్టిన ఉసురునకును ప్రాయశ్చిత్తముగా సకుటుంబముగా కాశీయాత్రకు పోదమనిరి.

మరునా డారేకును తీసికొనిపోయి దొరగారికి దాఖలుచేసిరి. అగ్రహారమునిల్చినది. పట్టాపుట్టినది. సౌభాగ్యవతియగు కృష్ణవేణి అత్తమామలనుపూజించుచు, పతివ్రతయై, అన్నదానప్రదాత్రియై, సంతానవతియై సుఖముగా కాపురము చేయుచుండెను. పోయినదనుకున్న అగ్రహారము ఆదసరాలో తిరిగివచ్చుటచే నెల్లరు "నిది కృష్ణవేణికి దసరాప్రసాదము" అని చెప్పుకొనసాగిరి.

## ప్రేమ

శ్రీమతి పోతాప్రగడ రాజ్యరత్నమ్మగారు

రాజయి నేనుబుట్ట సతిరో! నీవు భిక్షుణివై జనించినన్
రాజులచిహ్నమై తనరు రమ్యకిరీటము మూలద్రోచి వే
రాజుల మన్ననల్గనుచు రంజిలు నాశిరమంత వంచి నీ
రాజితపాదపీఠి దగభృత్యునికై వడి నుంతునెంతయున్.

రాణివిగాజనింప సతి! భృత్యునిగా నిల నేజనించినన్
రాణువమీఱ నీహృదయరాజ్యమునందలివంకదీర్పగాఁ
బ్రాణములిచ్చిబాసి మహిమోన్నతినొప్పెడు పాదరాజిపైఁ
బ్రాణములేనిబొందెనిడ భేషజమెంతయుగాదు నైజమే.

# సుశీల

శ్రీమతి నాయిని హనుమాయమ్మగారు

(ప్రవేశము: రాజలక్ష్మమ్మ, రాఘవమ్మ)

రాఘు:—ఏమి? రాజమ్మవదినా! మీ యింట్లో భోజనాలు అయినవా?

రాజ:—రా! కూర్చో! భోజనాలు అయినవి.

రాఘు:—ఇల్లు సందడి లేదు. మీ కోడలు ఎక్కడ?

రాజ:—ఎవరో స్నేహితురాలింటికి వెళ్ళి, ఎక్కడో గానసభ అట, అక్కడకు వెళ్ళి, సాయంకాలము వస్తానని చెప్పి వెళ్ళినది.

రాఘు:—సరే గాని, సంసారికదా? గానసభ లేమిటి? స్నేహితులయింట్లకు వెళ్ళడమేమిటి? ఏమోనమ్మ! నాకు యివన్నీ సరిపడవు.

రాజ:—అయితే ఏమిలే! ఈకాలపువాళ్లని మనలాగే ఉండమంటే ఉంటారా? ఏదో చిన్నతనము! వారి యిష్టప్రకారం తిరగనియ్యి! యింట్లో ఉండి చేసేదేమిటి?

రాఘు:—ప్రభాకరు డేడీ! వానిని నీ కోడలు బాగా చూచుచున్నదా? ఎంతైనా మారుతల్లి. కన్నతల్లిలాగ చూచునా? వాడిఖర్మము. తల్లిపోయెను. మారుతల్లి వచ్చెను.

రాజ:—రామ, రామ, యిట్లామాటలు అనకమ్మా! నాకోడలు సుశీల చాలా మంచిది. యోగ్యురాలు. తన కొడుకు మురళితో సమానముగా ప్రభాకరుని ప్రేమించును. నన్ను గౌరవించును. నాకొడుకును భక్తితో చూచును. ప్రభాకరుని హృదయపూర్వకముగా ప్రేమిస్తుంది. నాపుణ్యము బాగుండి మంచికోడలు దొరికింది.

రాఘు:—(తనలో) నాపాచిక పడలేదు. (ప్రకాశముగా) సరే వదినా! వెళ్ళివస్తా. నీకూతురు కమల ఎప్పుడువస్తుంది?

రాజ:—సుశీల రమ్మని వ్రాస్తూవున్నది. పండుగకు వచ్చునేమో!

రాఘు:—మంచిది. వెళ్ళివస్తానమ్మా!

—నిష్క్రమించును.

*　　*　　*　　*　　*

(వాసుదేవరావు, సుశీల జడవేసికొనుచు ప్రవేశము)

సుశీల:—ఈ రోజు నేనొక తప్పుచేసితిని.

వాసు:—ఏ మది?

సుశీల:—ప్రభాకరుని కొట్టితిని.

వాసు:—ఎందులకు?

సుశీల:—ప్రక్కయింటి పిల్లలు బంతి ఆడుకొనుచుండగా బంతి వచ్చి మన దొడ్డిలో పడినదట. దానిని మన ప్రభాకరుడు బాల్యచాపల్యముచే తీసికొని దాచిపెట్టి, వారడుగగా లేదని చెప్పి వారితో జగడమాడుచుండగా, నేను వెళ్ళి బంతి వారికిప్పించి, అబద్ధము చెప్పినందుకు, దాచిపెట్టి జగడమాడినందుకు ప్రభాకరుని కొట్టితిని. ఇప్పుడు పశ్చాత్తాపముకలుగుచున్నది.

వాసు:—సరే! ఇందులో నీతప్పేమియున్నది? వాడు చేసినది దండనార్హమైన తప్పు. నీవు కొట్టి, బుద్ధిచెప్పి మంచిత్రోవకు తెచ్చుట మంచిపని. ఇందు నీవు పశ్చాత్తాపపడవలసిన పనిలేదు.

సుశీల:—ఏమైననూ, వానికి ఒక చిన్న సైకిలు కొనియివ్వవలెను. అప్పటికిగాని నాకు తృప్తి కలుగదు. అన్నట్లు వానికి దసరాలోపల బట్టలు కుట్టించవలెను. పిల్లలందరు క్రొత్తబట్టలు కట్టుకొంటే వీనికి మనస్సు చిన్నబోవును.

వాసు:—ఏడేండ్లవానికి అప్పుడే సైకిలెందుకు? వీనికి కొంటే మురళికి కొనవద్దా?

సుశీల:—మురళికి ఇంకా మూడేండ్లేకదా? వానికేమియూ తొందరలేదు. అదిగో! మాటలలోనే వచ్చుచున్నాడు.

(ప్రవేశము: ప్రభాకరుడు)

ప్రభా:—అమ్మా! దసరాకు నాకు ఏమి కొనిపెట్టతావమ్మా! మంచిమంచిబట్టలు, బంగారు బత్తాసులు కొని ఇస్తావా?

వాసు:—నాన్నా! ప్రభాకరా! అమ్మదగ్గరకు వెళ్ళకురా! అమ్మ నిన్ను కొట్టిందికదూ? రా! నాదగ్గరకురా. అన్నీ కొనిస్తాను.

ప్రభా:—వద్దు, నాకు అమ్మయేకావలెను. అమ్మ కొట్టినా నాకు అన్నీ కొనిస్తుంది. అమ్మా! నేను పెద్దవాడనైనప్పుడు నీకుకూడా అన్నీ కొనిస్తానమ్మా!

వాసు:—(తనలో) ఔరా! వీనికి సుశీలయందు మాతృభావమున్నది? సుశీల వీనిని తన కన్నకొడుకు మురళికంటే ఎక్కువ ప్రేమతో జూచుచున్నందునకదా! వీనికి మాతృభావము కల్గుచున్నది. ఇట్టి సాధ్విని భార్యగా బడయుట నాపూర్వ జన్మసుకృతము.

సుశీల:—సరేలే! బాబూ! తమ్ముడెక్కడ? పద, మీ ఇద్దరికీ నీళ్లుపోసి అన్నము పెట్టెదను (జడ వేసికొని) రా, వెళ్ళుదము.

—నిష్క్రమింతురు.

* * * * *

(ప్రవేశము: రాఘవమ్మ, సుశీల.)

రాఘ:—సుశీలా! మీ అత్తగారు ఎక్కడ? కొంచము పనివుండి వచ్చినాను.

సుశీల:— కామాక్షమ్మగారియింటికి వెళ్ళినారు. కూర్చొండి, యిప్పుడే వచ్చెదరు.

రాఘ:—మీనాన్న, అమ్మ బాగా వున్నట్లు ఉత్తరాలు వస్తూన్నవా? నీవు మళ్లీ పుట్టింటికి ఎపుడు వెళ్ళుతావు?

సుశీల:—శారదానవరాత్రులకు రమ్మని వ్రాస్తూయున్నారు. వీలుగావుంటే వెళ్ళెదము.

రాఘ:—ఎవరెవరు వెళ్ళెదరు? వాసుకూడా వస్తాడా?

సుశీల:—లీవు దొరకదట. నేను, ప్రభాకరుడు, మురళివెళ్ళెదము.

రాఘ:—ప్రభాకరుడెందుకు? వాడేమైనా నీకొడుకు గనుకనా?

సుశీల:—నాకు మురళి ఎట్లనో, ప్రభాకరుడు అంతే.

రాఘ:—మీఅత్తగార్కిమాత్రం ప్రభాకరునిమీదే ఎక్కువ ప్రేమ. అదేమిటమ్మా! తనకు నీకొడు కెట్లనో, వాడున్నూ అంతేకదా?



పర్దేషికులకాంత

(ఉత్తరహిందూస్థానము)

*Reproduced From 'IndianPictorial Education'*



నూనె అమ్మకము

(మదరాసురాజధాని)

*Reproduced from 'Indian Pictorial Education'*

సుశీల:—ఉండవచ్చును. వానికి తల్లిలేదు కనుక అట్లు చూచెదరేకాని ఆమెకు అందరియందు సమాన ప్రేమకలదు. ఆమె చాలా తెలిసినవారు. మమ్ముల నందరను సమదృష్టితో చూచెదరు.

రాఘు:—(తనలో) అబ్బో! వీరికి కలహముగల్పించుటకు నావల్లగాదు. నేను వచ్చినపని కాలేదు. నాపాచికపడలేదు. (ప్రకాశముగా) అమ్మాయీ! వెళ్ళివస్తా. మీ అత్తగారు వస్తే నేను వచ్చినట్లు చెప్పు.

సుశీల:—మంచిది.

*   *   *   *   *

(సుశీల ఆయాసము, జ్వరముతో బాధపడుచూ మంచముపై పరుండియుండును.

రాజలక్ష్మమ్మ, వాసుదేవరావు, డాక్టరు, ప్రభాకరుడు, మురళి.)

వాసు:—నిన్నటికంటే కొంత గుణమేనా ?

డాక్టరు:—అట్లనేవున్నది. బహుశః రేపటికి తగ్గవచ్చును.

రాజ:—డాక్టరు బాబూ ! నాసుశీలను బ్రతికించు నాయనా? ఈ జబ్బునయమవుతుందా? నీదే భారము.

డాక్టరు:—అవ్వగారూ ! మీరేమియూ భయపడకండి. రేపటికి నయముకావచ్చును. ఈమందే యిస్తూయుండండి.

ప్రభాకరుడు:—మా అమ్మకు నేను మందిస్తానండీ !

మురళి:—ఆ, నేనిస్తాను.

ప్రభాకరుడు:—(మంచమువద్ద కేగి) అమ్మా ! కాళ్లు పట్టేదా ?

సుశీల:—వద్దు, నాయనా !

రాజ:—డాక్టరుబాబు! నాకేమో బెంగగావున్నది. నాకోడలు అట్లాపడిఉంటే ఈఇల్లుచూడండి. ఏమైనా కాంతివున్నదేమో? నాయనా! మంచిమందు ఇచ్చి త్వరలో మాకష్టముతీర్చు. (కన్నులనీరునించును)

డాక్టరు:—అవ్వగారూ! మీరు పూరికే అధైర్యపడకండి. నేను వెళ్ళుచున్నాను. ఈమందే ఇవ్వండి. రేపు మరల వచ్చి చూచెదను.

—నిష్క్రమించును.

రాజ:—స్వామీ ! తూర్పుదిక్కున ఉన్న జగన్నాథస్వామీ! నాకోడలికి త్వరలో జబ్బు నయమై ఆరోగ్యముకలిగ నేని, నా కొడుకును, కోడలిని, నీసన్నిధికిపంపిస్తాను. స్వామీ! నా మొరఆలకింపు.

*   *   *   *   *

క్రమముగా సుశీలకు కొన్నాళ్లలో ఆరోగ్యము కలిగెను. రాజలక్ష్మమ్మ తను దేవుని వేడుకొన్న విధమున కొడుకును, కోడలిని, మనుమలను జగన్నాథయాత్రకు పంపించెను. ఒకపరి స్వామిని తాను దర్శించియుండుటచే తను యింటివద్దయుండెను. వాసుదేవరావు, సుశీల, వారిబిడ్డలు జగన్నాథము వెళ్ళి స్వామిని సేవించి, శక్తికొలది దానధర్మలు చేసికొని సురక్షితముగా స్వగృహము చేరిరి. సుశీల అత్తగారికి నమస్కరించెను. రాజలక్ష్మమ్మ కోడలిని లేవనెత్తి "బిడ్డా! నీ సదయహృదయము, సాధువర్తనమే నిన్ను రక్షించుగాక! నాపుణ్యము బాగుండబట్టి కన్నులచల్లగా మిమ్ములనంతా చూచుచున్నాను. దైవము నిన్ను రక్షించెను. సౌభాగ్యవతివై వర్ధిల్లుము!" అని ఆశీర్వదించెను.

## శారదావిలాసము

శ్రీమతి కొరప్రోలు వేంకటరంగమ్మగారు

గగనమున మేఘజాలంబు గర్జిలంగ
భాద్రపదవర్షధారలు వసుధఁ బొఱల
ఆర్ద్రమీశానమారుతుఁ డడవులందు
వేణువితతుల సంగీతవిసరమూదె.

గుంపులై వచ్చి యెటనుండొ కుసుమచయము
పచ్చికను నవ్వి నటియించు ప్రమదమలర
పసుపు తెలుపు గులాబియా వసనములతో
వర్షకాలంపు శెలవుల వనములొప్పె.

అంతటఁ దోచె శారదనితాంతమనోహరనవ్యజ్యోత్స్నికా
క్రాంతవియత్ప్రధాంతరవికాసతనుద్యుతితో మరాళవి
భ్రాంతవిధూతపక్షరుచిభాసిసితాంబుజవారివాహవి
శ్రాంతదిగంతయై కుముదసౌరభభాసయశోవికాసియై.

పవనమున ముగ్ధపరిమళస్పర్శయగుచు
నివిరిమేనులు వెన్నెలనీటఁ గ్రుంకి
మందమృదులోర్మిమాలికాస్పందనమున
తనివితీరంగ ముద్దులదనరుచుండె.

సరసిజమిత్రరాగనవసారసబృందమనోజ్ఞచంద్రికా
స్ఫురితవినీలవ్యోమనవశోభితతారకకైరవప్రభా
శరసుమజాలసైకతవిశాలవితర్దికవాహినీమనో
హరవిహగస్వరూపముల నందెదు శారదవిశ్వమూర్తియై.

జన్మమృతులను చక్రముల్ జరుగుచుండ
కాలరథమెక్కి యశ్రాంతకౌతుకమున
విహరణమొనర్చు శారదవిశ్వమూర్తి
కంజలిఘటింతు కృపనుగాపాడునట్లు.

# అల్లుని అలుక

శ్రీమతి అద్దంపూడి అన్నపూర్ణమ్మ గారు

విశ్వనాథానికి చిన్నప్పటినుంచీ చిల్లరతిళ్లుఅంటే ఆశయెక్కువ. వాళ్లమ్మ ఎప్పుడూ యేజంతికలో, చేగోడీలో, పాలకాయలో ఏవోఒకటి చేసిపెడుతూనేఉండేది. అలావుంటే కూడా వాడికి చాలేదికాదు. అస్తమానూ విశ్వనాథానికి తిండివుంటేచాలు. ఇవేవైనా ఒకపూట లేకపోతే ఆవేళ ఇల్లు ఇల్లులాగుండదు. అప్పుడు యేమీతోచక వాళ్లమ్మ డబ్బులు ఇచ్చును. ఆడబ్బులు తీసుకుపోయి యేపకోడీలో, ఖారప్పూసో యేవోఇలాటివి కొనుక్కుని తినును. ఇవీచాలక సూరమ్మచూడనప్పుడు గదులపెట్టెలో యేమైనా డబ్బులున్నాయేమో అని వెదుకును. దొరికేయిఅంటే పట్టుకునివెళ్లిపోవును. లేకపోతే వడ్లో, బియ్యమో, చోళ్లో, జొన్నలో ఇలాటివేవైనా పట్టుకుపోయి కొనుక్కునితినును.

విశ్వనాథంతండ్రి సాంబయ్యగారికి భూముల్లోనుంచి ధాన్యపుసరుకులు పండుతాయి. పెద్ద పెంకుటిల్లూ తోటాదొడ్డీ అన్నీవున్నాయి. ఎప్పుడుచూస్తేనూ బస్తాలుబస్తాలుగా ధాన్యం, జొన్నలూ ఇలాటివి కట్టిపడివుంటాయి. విశ్వనాథం ఒక్కడేపిల్లవాడు. తరువాత పిల్లలులేరు. అందుచేత తల్లిదండ్రులకు గారాబముయెక్కువ. విశ్వనాథానికి ఇరవై రెండేళ్లు; ఎన్నియేళ్లుఅయితేనేమి? వాడిచిరితిండీ ఆతిండికోసం దొంగతనం ఇంకా మానలేదు.

విశ్వనాథం ఈకాలంమనిషికాడు; కొంచెంఅమాయకుడు. చూపుకు అంతఅందగాడు కాదు. పెద్దతల, చిన్నపిలకజుట్టుముడీను. అతనికిసాయంగా చిన్నచెవులూ, పొట్టిమెడానూ. కొంచెంస్థూలపైనవాడే; వాడునడుస్తూవుంటే ఆడుతూన్నట్టుంటుంది. సంగీతంయేమీరాకపోయినా ఎప్పుడుచూస్తేనూ తింటూ కూనిరాగంతీస్తూ కూచునివుంటాడు. అప్పుడు మనకు చూడబుద్ధివేస్తుంది. చదువుఅట్టేరాదు. ఏదోఅక్షరజ్ఞానంవుంది. అలాటి పల్లెటూరివాళ్లకు పెద్దపెద్దచదువులు యేలావస్తాయి?

విశ్వనాథానికి పెళ్లిఅయి రెండేండ్లయింది. ఈరెండేళ్లనుంచీ వాడికికొంచెం యెవళ్లేనా యెదురు చెప్పేరంటే అత్తవారింటికి బయలుదేరుతాడు. వీడికిసాయంగా అత్తారిల్లుకూడా దగ్గిరగానేవుంది. సాయంకాలం ఈవూరివాళ్లంతా సముద్రపుగట్టుకి షికారు వెడతారు. ఆపల్లెటూరివాళ్లకి ఏముంది? ఏమీతోచకపోతే పాలానికెళ్లి నాలుగుమూల్లా యెవరేమి చేస్తున్నారో అని చూస్తారు. విశ్వనాథానికి అలాటివియేమీ అక్కరలేదు. ఎప్పుడుచూస్తేనూతినడం; తిండిదొరక్కపోతే దెబ్బలాడ్డం, దొంగతనంచేయడం, యెందుకో కాదు తినేందుకే; మిగతయేమీ తెలియదు. కూనిరాగంకూడా తెలుసును. ఈలాటివాడికి యెవరుపిల్లని ఇచ్చేరని మనకందరికీ సందేహంరావచ్చును. విశ్వనాథం అందం, చదువూ చూసి ఇవ్వలేదు. చాలాడబ్బుందికదా, ఒకేపిల్లవాడు, గింజాగిట్రాపండుతాయి అని ఇచ్చేరు.

విశ్వనాథానికి ఖారపుతిళ్లుఅంటే ఇష్టం; తీపూఇష్టమే. అన్నింటికన్నా తిప్పేలా బిళ్లలంటే మొక్కువఇష్టం. శనివారం యెప్పుడువస్తుందీ, మాఅమ్మ ఎప్పుడు తప్పేలాబిళ్లలు చేస్తుందీ అని ధ్యానంచేస్తూవుండేవాడు.

ఒకనాడు తెల్లవారి సూరమ్మకు మేనత్తవచ్చింది. పిల్లవాడికి తిండిఅంటే ఇష్టంఅని వచ్చేటప్పుడు పీకకాజాలున్నూ, పాతికజంతికలున్నూ పట్టుకొచ్చింది. వస్తూనే విశ్వనాథానికి ఇవోనాలుగూ అవోనోలుగూ ఇచ్చింది. అవి తినేసి వాళ్లఅమ్మనిమళ్లీ అడిగేడు. వాళ్లమ్మా కొంచెం ఇచ్చింది. అవీ తిన్నాడు. వాడికి ఇంకాచాలలేదు. ఏలాగో మధ్యాన్నం రెండు గంటలదాకా జరిపేడు. అప్పుడువాళ్లమ్మని మెల్లిగా "నాకింకాపెట్టవా? అమ్మా!" అనిఅడిగేడు.

"అదేమిరా? విశ్వనాథం! ఆలాఅస్తమానూతింటే ఎలాగరా; వెధవతిండీ? తరవాత జబ్బుచేస్తే యెవరేడ్చేవాళ్లు? నీతిండి మండిపోనూ. చూసేవుటే; అత్తా! ఇదేవేపుకుతినటం. ఇందతినూ" అని ఇంతపట్టుకొచ్చి ఇయ్యడానికి వెళ్లింది. విశ్వనాథానికి కోపంవచ్చింది.

"నాకేమీవొద్దు. అంతానువ్వేతిను. నువ్వు తిట్టిందికాకుండా అందరితోటీ చెప్పడం కూడాను." అని ఆతక్షణంబయలుదేరి అత్తవారివూరికి చెప్పకుండా వెళ్లిపోయేడు.

విశ్వనాథంవెళ్లినతరువాత సూరమ్మనిచూసి "ఏమిటో వెఱ్ఱిబాగులవాడు. లేకపోతే ఈఅల్పానికేనాకోపగించుకోవడం?ఏళ్లయితేవెళ్లేయిగాని, బుద్ధిమారలేదుగదా?సూరమ్మా!"

"ఈలాటివాడిని పెట్టుకుని యేలాగువేగుతున్నావే?" అంది అత్త.

"ఏమిటో. ఏంచేయనూ? ఒక్కపిల్లాడు. చిన్నప్పటినుంచీ వాడికి ఆలా సాగుతూంది. దానికిసాయంగా ఈఅత్తారిల్లోటి దొరికింది వాడికి అస్తమానూ. చీటికీమాటికీ పరుగెత్తడానికి" అనిచెప్పి సూరమ్మ కంటనీళ్లుపెట్టుకుంది.

విశ్వనాథం ఇల్లువిడచి బయలుదేరేటప్పుడే తినేందుకు కావలెనుగదా అని ధాన్యం కొంచెంపట్టికెళ్లి దారిపొడూగునా తనకు ఏమికావలెనో అవన్నీకొనితింటూ మెల్లిమెల్లిగా ఆడుతూపాడుతూ మధ్యమధ్య వేడుకలన్నీ చూస్తూ రాత్రియేడుగంటలకు చదరాడ మామ గారిఇల్లుచేరేడు. విశ్వనాథం వెళ్లినతోడనే మామగారు సీతారామయ్య, అత్తగారు రవణమ్మ మర్యాదతోటి పిలిచి కాళ్లుకడుక్కోమని చెప్పేరు. అందరి క్షేమసమాచారాలు అడిగి, భోంచేసేవేళ అయినది అందరూ భోజనానికిరండి,అని చెప్పింది రవణమ్మ.

సీతారామయ్యగారికికొడుకులులేరు. కనకం ఒక్కత్తేపిల్ల. చాలాడబ్బువుంది. కనకానికి పదోయేటనేపెండ్లిచేసినారు. అల్లుడుఅప్పుడప్పుడువస్తాడు. ముద్దుముచ్చట్లన్నీచూసుకో వచ్చునని దగ్గిరవూరేచూసి పెండ్లిచేసినారు. కనకం మంచి తెలివితేటలుగలది. మనవిశ్వనాథం లాటిది కాదు. సీతారామయ్యకి అంతడబ్బు లేకపోతేకూడా రొఖ్ఖంగా సుమారు పాతికవేలున్నాయి . భూముల్లోకూడా ధాన్యపుసరుకులన్నీ పండుతాయి. మంచిసామర్థ్యంకలవాడు.

కనకం పినతల్లి కొంచెంపేదరాలు. ఆట్టేడబ్బులేదు. కాబట్టి ఆమెబిడ్డ పెద్దవాడైన సత్యం వీళ్లదగ్గరనేవున్నాడు. సత్యానికి పదహారేళ్లు. నాలుగేళ్లనుంచి ఇక్కడనేవున్నాడు. సత్యానికి హాస్యంచేయడమంటే బహుసరదా. ఎప్పుడుచూసినా విశ్వనాథాన్ని వేళాకోళం చేస్తూనేవుంటాడు. అప్పుడప్పుడు కనకాన్నికూడా "బావగారువస్తారోయ్, తప్పేలాబిళ్లలోయ్, నీకోయ్" అని యేడిపించేవాడు సత్యం. అప్పుడు కనకానికి ఉడుకుమోత్తనంవచ్చేది. వస్తే యేంచేయగలదు? ఇంక ఆవేళ చెప్పనక్కరలేదు. సత్యానికి విశ్వనాథం చూడనప్పుడంతా తప్పేలాబిళ్ల, తప్పేలాబిళ్ల అని స్మరణచేస్తూ వుండేవాడు. నాలుగైదురోజులయింది అల్లుడొచ్చి ఒకనాడైనా తప్పేలాబిళ్లలు చేయువద్దా అని ఆవేళచేసింది రవణమ్మ.

రాత్రిభోంచేసేటప్పుడు అందరి ఆకుల్లోనూ తప్పేలాబిళ్లలువేసింది. అందరూ రెండు మూడు వెయ్యగానే "చాలు", "చాలు" అన్నారు. విశ్వనాథం అయిదారువేస్తేకూడా చాలనలేదు. అదిచూచి మారుపట్టుకొద్దామని వెళ్లిపోయింది రవణమ్మ. విశ్వనాథం తినేసి ఇటూఅటూ చూస్తున్నాడు. ఇంకా కావలెనేమో అని పట్టుకొచ్చి ఇంకోనాల్గువేసింది. వేసినాకూడా చాలుఅనలేదు. పళ్లెంనిండా బిళ్లలువుంటేకూడా ఇంకావేస్తే అల్లుడికి జబ్బుచేస్తుందేమో అని యెదురుగుండావున్న వంటఇంట్లోపెట్టి మూసింది రవణమ్మ.

అదిచూసి సత్యం "బావా! వేసుకో. ఆలాసంకోచంపడతావేమిటి? నీకిష్టమని మాకు తెలియదనుకున్నావా? తిను;తిను. ఇంకొంచెంవేసుకో" అన్నాడు. విశ్వనాథం మాటాడకుండా తినివేసి లేచిపోయేడు. అందరూలేచి తాంబూలాలువేసుకొని యెవరిపక్కలు వాళ్లువేసుకుని పడుక్కున్నారు.

రవణమ్మ భోజనం అయినతరువాత ఇల్లంతాసర్దుకొని, వంటఇంటి కెదురుగాఉన్న సావిట్లో పక్కేసుకొని కనకం, తనూ పడుక్కున్నారు.

ఆవిడకు చాలాసేపటిదాకా నిద్దరపట్టలేదు. తరువాత కళ్లుమూసుకొని పడుక్కుంది. కునుకుపట్టుతూవుంది. ఆసమయంలో యేదోకొంచెం చప్పుడైనట్టు వినిపిస్తే కళ్లుతెరిచి చూసింది. అది వెన్నెలకాలం గనుక బాగావెలుతురుగావుంది. విశ్వనాథం జరీకండువా వేసుకొని వంటఇంట్లోకి వెళ్లుతూన్నట్లు కనబడ్డది. అదిచూచి అల్లుడే తప్పేలాబిళ్లలకోసం వెడుతున్నాడని చప్పుడుచేయకుండాపడుక్కుంది. పడుక్కుని నేనువేసినవి చాలలేదు కాబోలు అందుకనే వెడుతున్నాడు. ఇంతతిండిమీద ఆశవుంటేయేలాగు, వెర్రిబాగులవాడు, చూసి చూసి దొరికింది మాకీసంబంధం, మనఘటన ఈలాగుంది అని అనుకుంటూవుంది. అంతలోపల దగ్గులూ, తుమ్ములూ యెక్కువయి ఉక్కిరిబిక్కిరి చేసుకుంటూన్నట్టు వినపడ్డది. "అయ్యో? ఇలాగికష్టపడుతున్నాడే; అప్పుడే ఇంకా వెయ్యమనకూడదా" అని దీపం వెలిగించి వంటఇంటిదగ్గరకు వెళ్లింది రవణమ్మ. అంతలోపల దభాలుని రవణమ్మని కిందతోసి దాటుకొని ఒక్కగంతులోవెళ్లిపోయినాడు.

రవణమ్మ కిందపడి మోచేతిఎముక విరిగిపోయి బాధతాళలేక "అయ్యో, అయ్యో" అనియేడుస్తూవుంది. ఆయేడుపువిని ఇంట్లోవున్నవాళ్లందరూలేచి "ఏమి? ఏమి?"అనిఅడుగుతున్నారు. చుట్టుపక్కలవాళ్లందరూకూడావచ్చి "ఏమిటి? రవణమ్మగారూ! ఎందుకలా యేడుస్తున్నారూ? యేంజరిగింది?" అని వాళ్లోపక్క అడుగుతున్నారు.

అంతలోపల విశ్వనాథం లేచి "నాజరిగివేసినకండువాకూడా కనిపించడంలేదే. ఎవరుతీసేరు. దొంగలేవొచ్చేరా?" అంటున్నాడు.

సత్యంలేచి "దొడ్డితలుపు తెరిచివుంది. పెదనాయనా" అంటున్నాడు.

కనకం "పెట్టెలన్నీ విజ్జిమ్మివున్నాయమ్మోయి; దొంగలే వొచ్చేరేవు. నీచెయ్యి కూడావిరిగిందేవు"అని అరుస్తూంది. ఎవరికితోచినట్టు వాళ్లు అంటున్నారు.

రవణమ్మ మోచేతినిపట్టుకుని హాశ్చర్యపడి "దొంగా? దొంగా? నేను అల్లుడు అనుకున్నానే" అంది.

"అల్లుడేమిటి?"అని అడిగినాడు సీతారామయ్య.

"వంటఇంట్లో దూరినప్పుడు అల్లుడుజరిగకండువా కనిపించినందువల్ల అల్లుడేమో అనుకున్నాను. తరువాత ఆదగ్గులూ, తుమ్ములూకూడా వింటే పాలబారుతూందేమో అని దీపంవెలిగించుకుని వచ్చేను. అంతలోపల....."

"నీకెంతబుద్ధే? అర్ధరాత్రివేళ అల్లుడెందుకు వంటఇంట్లోకి వెడతాడు? నీకింత తెలియక పోయిందా?"

"ఆయనకు తప్పేలాబిళ్లలు ఇష్టమే, అవిమూసిపెట్టేను. వాటికోసరం వెడుతున్నాడేమో అని."

"చాలు. నోరుమూయ్. నీకేమి పిచ్చియెత్తిందా?......"

ఆమాటవింటూనే విశ్వనాథం అమాయకత్వం అంతా పోయి అతనికి చెప్పరానంత కోపంవచ్చింది.

"ఓహో! తత్తత్తప్పేలాబిళ్లలకు గగ్గతిలేక మీయింటికి వచ్చేననుకున్నారా?"అని కోపాన్ని అణుచుకోలేక, సత్తితో మాటాడలేకపోయేడు విశ్వనాథం.

సీతారామయ్య తనభార్యని కసురుకొని వంటఇంటికి అందరితోటీకలసి వెళ్లినాడు.

అక్కడ కందిపొడుం ఇల్లంతాచల్లివుంది. అదిచూచి "అయ్యో! ఆవెధవ ఈకంది పొడుం తినేదేమోఅనుకొని బొక్కి దగ్గులూతుమ్ములూతోటి ఆలాచచ్చేడు"అందిరవణమ్మ.

ఆరాత్రిఅంతా విశ్వనాథం ఎవ్వరితోటీ పలుకకుండా ఒకచోటపడుక్కొని, తెల్లవారు ఝూమునలేచి యెవ్వరితోనూ చెప్పకుండా వెళ్లిపోయెను.

పాపం, రవణమ్మగారికి మూడువందలరూపాయిలూపోయి, మోచెయ్యూవిరిగింది; యిదీకాకుండా, అల్లుడుకూడా కోపగించుకొని పోయినాడు.



తిరుమలనాయకమందిరము : మధుర



చొక్కనాడు జలపాతము : తిరువాన్కూరు



ఏనుగుల పోట్లాట



ఉదకమండలమునందలి సరస్సు

# ఆంధ్రస్త్రీజనోద్ధారకుడు

శ్రీమతి పాలపర్తి సరోజనిదేవిగారు

ఏప్రిలు 16-వ తేదీ శ్రీ రావుబహదూర్ కందుకూరి వీరేశలింగముపంతులుగారి జన్మదినోత్సవము. ఆయన జన్మించి ఇప్పటికి ఎనుబదిమూడు వత్సరములైనది. శ్రీ వీరేశలింగముపంతులుగారు కావించిన ఘనకార్యములలోనెల్ల స్త్రీజనాభివృద్ధికై వారు చేసిన పని మిక్కిలి ప్రశంసనీయమైనది. అట్లగుటంజేసి స్త్రీల అభ్యున్నతికి ఆయన చేసిన కృషిని గూర్చి ఇపుడు స్మరించుట అప్రస్తుతము కానేరదు.

ఆయన పుట్టినకాలమునందు స్త్రీలస్థితి కడుశోచనీయముగానుండెను. స్త్రీలు అనువారు ఉన్నారా లేరా అనునట్లుగా నుండెను. వారికేమాత్రము స్వాతంత్ర్యముకాని, లోకానుభవముకాని లేదయ్యెను.

పూర్వము మన పెద్దలు స్త్రీ పురుషునికి అర్ధాంగియని చెప్పిరి. శంకరుని అర్ధనారీశ్వరునిగా అభివర్ణించిరి. వీనినిబట్టి స్త్రీని వారు పురుషునితో సమానురాలినిగా చూచుచుండిరని తెలియగలదు. కాని వీరేశలింగముపంతులుగారు జన్మించునప్పటికి ఆస్థితియంతయు మారిపోయి స్త్రీలు (Tennyson) టెన్నిసను మహాకవిచెప్పినట్లు **'Man is the Hunter: Woman is his game'** (అనగా 'పురుషుడు వేటగాడు: స్త్రీ వేటాడబడు జంతువు') అనునట్లుండెను.

ప్రజాసామాన్యము అజ్ఞానాంబుధియందు మునిగియుండెను. పురుషులలోనే చదువు నేర్చినవారు చాల కొద్దిగానుండిరి. చదువునేర్చిన కొలదిమంది ప్రభుత్వముక్రింద ఉద్యోగము సలుపుచుండిరి. పురుషులలోనే విద్య సరిగా వ్యాపింపని అక్కాలమునందు, స్త్రీవిద్యనుగురించి తడవనేల? ఆనాడు స్త్రీవిద్యనుగూర్చి ముచ్చటించినవారు గేలిచేయబడుచుండిరి. స్త్రీవిద్యను ప్రతిఘటించుచు నెన్నియో కుయుక్తులు చెప్పబడుచుండెను. వానినెల్ల వీరేశలింగముపంతులుగారు ఖండించిరి.

స్త్రీ విద్యావిహీనురాలైయున్న గృహధర్మము చక్కగా నెరవేరదనితలంచి ఆయన తాచేయబూనిన సంఘసంస్కారములలో, స్త్రీవిద్యోద్ధరణమునకు మొట్టమొదటి స్థానము నిచ్చి, అందుకై సమ్మందుగా, కృషిచేసియుండెను. బాలికా పాఠశాల లాకాలమునందు మిక్కిలి తక్కువగానుండెను. ఉన్నబడులకైనను ఆడుబిడ్డల నంపునట్టి తల్లిదండ్రులు అరుదుగా నుండిరి. ఆకాలమునందు పంతులుగారు హృదయరంజకమగు ఉపన్యాసముల మూలమునను, సులభశైలిలో రచించిన చంద్రమతిచరిత్ర మొదలగు సద్గ్రంథరాజములవల్లను జనులకు స్త్రీవిద్యయందు ప్రోత్సాహము కలిగించిరి. ఆయన సొంతవ్యయముతో ఒక బాలికాపాఠశాలను స్థాపించిరి. స్త్రీలను గౌరవించు సదాచారసంపదగల ప్రభుత్వమువారి సాహాయ్యముగూడ పంతులువారి కృషికి తోడ్పడినదని చెప్పకతప్పదు. ఆయన బాలికలను పాఠశాలలకు పంపుడని మిత్రులను ప్రోత్సహించుచుండిరి. వీలుచిక్కినపుడెల్ల స్త్రీవిద్యనుగూర్చి ప్రసంగించుచుండిరి. ఆయన కృషిచేతనే ప్రస్తుతస్థితిలో మనము ఆంధ్రస్త్రీలను గాంచగలుగుచున్నాము. స్త్రీలకు ఒకవిధమైన స్థితిని సంఘమునందు ఆయన కలుగజేసిరని చెప్పవచ్చును.

స్త్రీలకు ఆధ్యాత్మికోన్నతి ఆవశ్యకమని తలంచినవాడై ఆయన తానమ్మిన బ్రాహ్మమతసిద్ధాంతముల ననుసరించి ఒక స్త్రీసమాజమును స్థాపించెను. దానికొఱకై ఆయన ఎంతయో కృషిచేసి, తమ సొంతగృహము నొకదానిని తత్సమాజప్రార్థనాదికములనిమిత్త మిచ్చివేసిరి.

తాను ప్రార్థనమందిరము నొకదానిని రాజమహేంద్రవరమునందుకట్టింప బూనినపుడు ముగ్గురుస్త్రీలు తాను అడుగకయే హృదయపూర్వకమయిన భక్తితో నొకరు మూడురూపాయలును, మరియిద్దరై దేసి

రూపాయలును ముత్తెమువిూద పదుమూడురూపాయలను తమయొద్దకు బంపినట్లు పంతులుగారు తమ స్వీయచరిత్రమున వ్రాసికొనియున్నారు. 'ధనికులును, ధనార్జనము చేయుచున్నవారునైన పురుషులిచ్చిన నూరులు నిన్నూరులు మున్నూరులకంటె నస్వతంత్రలయిన యబలలు భక్తిపూర్వకముగ నిచ్చిన యీ మూళ్లును, నైదులును భగవంతుని కధికప్రీతికరములని నేను భావించెదను. పురుషుల తోడ్పాటువలన స్త్రీలలో నిట్టి పరిశుద్ధాస్తికభక్తి యంతకంతకు వర్ధిల్లునుగాక' యనికూడ ఆయన వ్రాసిరి.

వీరేశలింగముగారు ఒకప్పుడు ఏలూరులో జరిగిన మండలసాంఘికసభకు అగ్రాసనాధిపత్యము వహించిరి. అసలకప్పుడును స్త్రీలు పురుషులసభలకు వచ్చుట యాచారములేదు. సాంఘికవిషయములు, సాధారణముగా స్త్రీలతో సంబంధించినవగుటచేత నట్టి విషయము లాలోచింపబడునప్పుడు స్త్రీలుండుట యభ్యర్థనీయమని పంతులుగారు అచ్చట పెద్దమనుష్యులు కొందఱితో ముచ్చటించిరి. అప్పటికి స్త్రీలు తమలో తాముకూడ సభలు చేసికొనుట యెఱుంగరైరి. పంతులుగారు స్త్రీలకు కొంతవరకు దేశవ్యవహారములలో సంబంధము కలిగించిరి.

ఆనాడు స్త్రీలకు వివాహవిషయమున స్వాతంత్ర్యము లేదు. బాల్యవివాహములు, కన్యాశుల్కములు మెండుగానుండెను. నారీలోకము నుద్ధరింప బద్ధకంకణుడగు ఆయన కివియన్నియు కష్టములుగా దోచెను. అందువలన ఆయన అతిబాల్యవివాహములవలన నూడెడు నష్టములగూర్చి బోధించిరి. కన్యాశుల్కములవలనకలిగెడు చెడుగులను వివరించిరి. అనేకవిధముల ఆయన బాల్యవివాహముల నాప యత్నించిరి. బాల్యవివాహములు సర్వసామాన్యములుగా నుండుటచే సంఘములో బాలవిధవలును చాలమంది యుండిరి. వారి మొఱలు అరణ్యరోదనము లగుచుండెను. వారు ఆచరింపవలసిన విధులు అతికఠినములుగానుండెను. అందరును వానిని నాచరింప జాలకుండిరి. పవిత్రముగా ప్రవర్తింప జాలకుండిరి. శిశుహత్యలు మొదలగునవి యెక్కువగుచుండెను. వితంతువుల స్థితి మిక్కిలి దుర్భరముగా నుండెను. శ్రీ పంతులుగారు వీని నన్నిటిని జూచి యూరకుండ జాలరైరి. బాలవితంతువుల మొఱలాలకించిరి. వితంతువుల స్థితిని వర్ణించుచు స్త్రీ పునర్వివాహముయొక్క ఆవశ్యకతనుగూర్చి ప్రకటించిరి. కేవలము ప్రకటించుటయేగాక, సకలేతరసంస్కారములకన్న నిది మిక్కిలి ముఖ్యమైనదిగా తోచుటచే పంతులుగారు వితంతూద్వాహోద్యమమును ఉపక్రమించిరి. వీరేశలింగముగారి నామము ఈమహత్కార్యముతో అచ్ఛేద్యమగు సంబంధమును గలిగియున్నది. స్త్రీ పునర్వివాహములు న్యాయసమ్మతములని స్మృతులనుండి ప్రమాణములతీసి చూపించిరి. ఆకాలమునందు హిందూమతమంతయు మూఢాచారములలో మునిగిపోయి యుండెను. అందున వితంతుపునర్వివాహమన్న పూర్వాచారపరాయణులకు అరికాలిమంట తలకెక్కుచుండెను. వారు వీరేశలింగముగారిని బహుకష్టములకు లోనుగావించిరి. ప్రతికక్షులు సభలుచేసి వీరేశలింగముగారియొక్కయు, వారి మిత్రులయొక్కయు ప్రయత్నములకు విఘ్నములు కలుగజేయుటకయి యుపాయములనాలోచింప మొదలుపెట్టిరి. ఒకదినమున పూర్వాచారపరాయణులయిన లౌక్యులును, వైదికులును సభచేసి పంతులుగారిని వర్ణమునుండి బహిష్కారముచేయుటకును, ఆయనకు తోడ్పాటు చూపెదమన్న వారినందరిని వెలివేసెదమని వెఱపించుటకును ముందే నిశ్చయించుకొనివచ్చి తగు మనుష్యునొకనిని బంపి పంతులుగారిని బిలువపనిచిరి. వారు అప్పుడు పంతులుగారిని కొట్టవలెననికూడ నూహించి వచ్చిరట. కాని అది దైవసహాయమున తప్పినది. పంతులుగారు తానడపుచున్న వివేకవర్ధనీపత్రికయందు స్త్రీపునర్వివాహమునుగూర్చి ప్రకటించుచు వచ్చిరి. ఎన్ని కష్టములకు లోనుగావించినను ఆత్మబలముచేతను, ఆత్మపటుత్వముచేతను, ఈశ్వరవిశ్వాసముచేతను ఆయన జనకంటకమయిన వితంతువివాహసంస్కారమును సాధించిరి. ఈనాటికిని

వితంతువివాహము చేసుకొన్నవారు బహువిధములయిన వ్యయప్రయాసలకు లోనుగావలసినవారగు చున్నారు. అట్టి స్థితియందు ఇప్పటికి ఏబదిసంవత్సరములకు పూర్వము పంతులుగారు ఎన్నియో కష్టములు పడవలసి వచ్చుటలో ఆశ్చర్యమేమి? కాని పట్టినపట్టు విడువని పంతులుగారీకష్టములకు వెనుదీయుదురా? ద్విగుణీకృతస్థైర్యముతో పని సాగింప మొదలిడిరి. మాటలమూలమునను, వ్రాతలమూలముననే గాక క్రియారూపముననుగూడ తమ అభిమానమును చూపింపవలెనని ఆయన ఊహ. కనుక వివాహముచేసికొన నిచ్ఛగల యువతీయువకులను ఆయన సంపాదింప మొదలిడెను. ఆయనకు ఈవిషయమందు కొంతమంది మిత్రులును, కళాశాలయందలి విద్యార్థులును ఎక్కువగా సాహాయ్యము చేసిరి. పంతులుగారు క్రమముగ తామును, తమమిత్రులును ఎవరైన ఒకయువతిని వివాహముచేసికొన నిచ్ఛగలదని ఎఱింగించిన ముప్పుతిప్పలు పడి ఆమెను తమ ఇంటికి తీసుకొని వచ్చెడివారు. అందుకగు వ్యయమును తామే భరించుచుండెడివారు. వివాహముచేసికొనుటకు యువకులు సిద్ధముగానున్నపుడు యువతులు తటస్థింపరైరి. వడతులు లభ్యమైనపుడు యువకులు లేకుండిరి. ఈవిధముగ వీరేశలింగముగారు మొట్టమొదట అధికవ్యయప్రయాసలకు లోనై 1881-వ సంవత్సరమున డిసెంబరు నెల 11 వ తేదీ రాత్రి రాజమహేంద్రవరములో, మొదటిస్త్రీపునర్వివాహము జరిపించిరి. తదనంతరము అనేకవివాహములు జరిగెను. నేడు స్త్రీ పునర్వివాహముల సాక్షీభవించువారే కఱవయినారు. శ్రీ వీరేశలింగముగారు వితంతువులకొఱకు రాజమహేంద్రవరమునందు ఒక వితంతుశరణాలయమును స్థాపించి దానికొఱకై తమ యావదాస్తిని ఇచ్చివేసిరి.

శ్రీ వీరేశలింగముపంతులుగారు తమ యావజ్జీవితమును సంఘసంస్కారమునకై వినియోగించిరి. అందు స్త్రీల ఔన్నత్యముకొఱకై ముఖ్యముగా పాటుపడిరని నుడువవచ్చును. కావున శ్రీ వీరేశలింగము పంతులుగారు ఆంధ్రస్త్రీజనోద్ధారకులని వినుతింపదగియున్నారు.

## సోదరీ!

శ్రీమతి జె. కామేశ్వరిగారు

౧

తరతరమ్ములనుండివచ్చే
మురువుజూపెడిస్వైరరాజ్యపు
ధరణికోటను రెడ్డిరాజుల
చరితపాడవె సోదరీ!

౨

ఢిల్లిసుల్తాను పట్టుకొనగా
ఢిల్లికేమోసమ్ముతెచ్చియు
వల్లిఖాను శిరమ్ముగొట్టిన
చరితపాడవె సోదరీ!

౩

వెచ్చవెచ్చని విజయనగరపు
పచ్చిపచ్చిశౌర్యమూర్తుల
పచ్చనై నాజయపతాకపు
చరితపాడవె సోదరీ!

౪

వెలమశేకులు రెడ్డపటిమయు
పాలబుగ్గల శౌర్యదీధితి
బాలచంద్రుని ఖడ్గధాటుల
చరితపాడవె సోదరీ!

౫

రాజ్యరమకై పోర్పునల్పియు
ప్రాజ్యముగ తురకలనుసరికిన
రాజశ్రీ సింహాచలేశ్వరు
చరితపాడవె సోదరీ!

## మానసపూజ

శ్రీమతి అనుమర్లపూడి పున్నమ్మగారు

నందసునందన, వందితమునిజన, మందరగిరిధర, యిందిరవల్లభ,
సుందరధనము జేకొందుపావన, పాహిమాం ఫణితగోవిందస్వామి, బహువాహినిగల
గోవిందస్వామి, నీవెందు బోవద్దురార గోవిందస్వామి.

గజ్జెలందెల్లిందరా గోవిందస్వామి
నీబొజ్జాకుబువ్విందరా గోవిందస్వామి
ముజ్జగములేలేటి గోవిందస్వామి
గుజ్జంగిపడ్లిందరా గోవిందస్వామి
వారాకొండిచేసేరా గోవిందస్వామి
నిండాగుంసుమల్లెలుచుట్టేరా గోవిందస్వామి
అందముగతిరుమణిదిద్ది గోవిందస్వామి
దివ్యగంధమలదేరా గోవిందస్వామి
గంటలమొలనూళ్లు గోవిందస్వామి
జంటవడ్డాణం గోవిందస్వామి
కంఠసరిహారము గోవిందస్వామి
పచ్చలపులిగోరు గోవిందస్వామి
గుచ్చిమెడలోవేసేరా గోవిందస్వామి
పట్టిరట్టులేలాకేసేవురా గోవిందస్వామి
సంపెంగనూనంటి గోవిందస్వామి
యింపుతోజలకమార్చి గోవిందస్వామి
సొంపుతోనేఅలంకరింతు గోవిందస్వామి
శంభోరారాననుగన్నయ్య గోవిందస్వామి
కనకాంబరముగట్టేరా గోవిందస్వామి
గంగనుకన్నయ్య గోవిందస్వామి
పసిడివుంగరములుబెట్టేరా గోవిందస్వామి
పుండరీకనయన గోవిందస్వామి
మకరకుండలములుబెట్టేరా గోవిందస్వామి
రంగైనభూషణములచే గోవిందస్వామి
సర్వాంగమునధరియించేరా గోవిందస్వామి
వాసుకీశయనుడ గోవిందస్వామి

నీరజాజీ, జాజీ, తులసీచే గోవిందస్వామి
పూజలదేసేనురా గోవిందస్వామి
భజనను జేకొనరా గోవిందస్వామి
నీపాదపద్మములకు గోవిందస్వామి
ధూపదీపములిచ్చేరా గోవిందస్వామి
వెన్నాలునీకురా గోవిందస్వామి
దివ్యఅన్నముపప్పునెయిరా గోవిందస్వామి
పంచభక్షపరవాన్నములు గోవిందస్వామి
ప్రసన్నుడవై గోవిందస్వామి
వారాధిశయనుడ గోవిందస్వామి
వీడెమునిచ్చేరా గోవిందస్వామి
మంత్రపుష్పముబెట్టి గోవిందస్వామి
ప్రదక్షిణనమస్కారములుజేసెరా
గోవిందస్వామి
పక్షివాహనుడా గోవిందస్వామి
లక్ష్మివక్షస్థలమునవెలసిన గోవిందస్వామి
సాక్షాత్కారరూపమై గోవిందస్వామి
నాకుమోక్షమియ్యారా గోవిందస్వామి
ఉట్లమీదపెరుగంతా గోవిందస్వామి
క్రొత్తచట్లల్లోవెన్నంతా గోవిందస్వామి
నీవుతిన్నాగుట్టంతా తెలిపేరా గోవిందస్వామి
పట్టిరట్టులేలా గోవిందస్వామి
దివ్యపానుపుపరచి గోవిందస్వామి
పవ్వళింపబెట్టేరా గోవిందస్వామి
జోలలుపాడుచుఊచెరా గోవిందస్వామి
నీవుశయనించివుండు గోవిందస్వామి.

# స్త్రీ లయాధిక్యత

శ్రీమతి చావలి అన్నపూర్ణమ్మగారు

సృష్టికిఁబూర్వము సచ్చిదానందబ్రహ్మాత్మకంబగు దేవి యొక్కతియేయుండెను. ఆదేవి లలితయనియు, త్రిపురసుందరియనియు, గాయత్రియనియు, దుర్గయనియు, అవ్యక్తమనియు, సదాశివుఁడనియు, చంద్రకళయనియు, పరమాత్మయనియు బహువిధములుగాఁ జేర్కొనఁబడుచుండును. అది యద్వితీయము. ఆయవ్యక్తమునుండి వ్యక్తము, గుణత్రయమయియగు నీశ్వరశక్తిపుట్టెను. ఆయీశ్వరశక్తివలన మూఁడుబ్రహ్మాండములు జనించెను. ఆత్రికమునుండి పురుషలీలలతోఁగూడిన బ్రహ్మవిష్ణుమహేశ్వరులును, లక్ష్మీగౌరీసరస్వతులును నావిర్భవించిరి. బహ్వృచోపనిషత్తునందును, దేవ్యుపనిషత్తునందును, దత్తాత్రేయసంహితాదులయందును వివిశేషములఁగనఁదగును.

దేవీభాగవతమునందలి పంచమస్కంధము పందొమ్మిదవయధ్యాయమునందు:—"ఓతల్లీ! నీశక్తిచేతనే బ్రహ్మ, విష్ణు, రుద్రులు సృష్టిస్థితిలయములు చేయుచున్నారు. కాని నిన్ను విడిచినకాలమందు వారట్లొనర్ప సమర్థులుకారు. ఇట్లు సృష్టి, స్థితి, లయములు చేయుదానవునీవే. సర్వరూపములునీవే. శక్తిలేక యెవరును నేమియుఁజేయఁజాలరు. దుష్టతరమైన కలియుగమున మనుజులు ధూర్తులగు పౌరాణికులచే వంచితులై, నిన్ను సేవింపలేక, నీవలననిర్మింపఁబడిన హరిహరాదులును సేవించుచుందురు. రాక్షసులచేత దేవతలు పీడింపఁబడి నిన్నుశరణుపొంది సుఖించిరని తెలిసియు ఆదేవతలనే సేవింతురు. హరిహరబ్రహ్మాదులే నీపాదపద్మములను సేవింపుచుండఁగా నల్పబుద్ధిగల నరులు సుఖమునిచ్చు నీసేవను మానవగునా? ఓతల్లీ! మహిషాసురుని సంహరించి దేవగణమునురక్షించితివి" అని దేవతలందరుఁబొగడ నాయాదిశక్తి "మీకసాధ్యములగు కార్యములు తటస్థించినపుడు నన్నుస్మరింపుడు. నేను వెంటనే మీయాపదలను నశింపఁజేయుచున్నా"నని పలికెననిగలదు.

త్రిగుణాత్మకంబులగు లక్ష్మీగౌరీసరస్వతుల కనురక్తులైయుండి, వారిసహాయముతో సృష్టిస్థితిలయము లొనర్చుటకు పురుషరూపులగు బ్రహ్మాదులను దేవియేకల్పించెను. కొన్నిసమయములందు పుంరూపులగు బ్రహ్మాదులు కార్యనిర్వహణదక్షులుకాలేని తాను స్వయముగనే యావిర్భవించి దేవకార్యములు నిర్వహించుచుండెను. భండాసురుని వధించుటకు దేవతలును, హరిహరాదులును శక్తులుకానపుడు పరదేవత లలితారూపంబుఁదాల్చి, యనేకస్త్రీరూపశక్తిగణంబుల నుద్భవిల్లఁజేసి వారిసహాయముతో ఆమె భండాసురుని వధించెను. అట్లే దుర్గారూపంబుదాల్చి మహిషాసురునిఁ బరిమార్చెను.

"లలితాత్రిపురసుందరి పురుషరూపమునఁ గృష్ణుఁడై వేణుగానముచేత జగత్తును పరవశముఁజేసెను." అని త్రిపురతాపిన్యుపనిషత్తునందును, తంత్రరాజాదిగ్రంథములయందును నున్నయది.

ఒకప్పుడాదిశక్తియగు తార రావణాదిసంహారార్థమై పురుషరూపంబుదాల్చి శ్రీరాముఁడుగను, భువనేశ్వరీదేవి వరాహమూర్తిగను, భైరవి నృసింహమూర్తిగను, ధూమావతీదేవి వామనుఁడుగను, చిన్నమస్తాదేవి పరశురాముఁడుగను, కమలాదేవి మత్స్యమూర్తిగను, బగళాముఖి కూర్మమూర్తిగను నవతరించిరని ముండమాలా, శక్తిసంగమతంత్రాదులయందుఁగానవచ్చును.

శ్రీశంకరాచార్యులవారు శైవ, వైష్ణవ, గాణాపత్యాది సర్వమతములను ఖండించి జయముఁగాంచిరి. ప్రమాదమేమియు నొందలేదు. అనంతరము శాక్తమతము-అనఁగా శ్రీదేవిని యారాధించుమతము-గూడ ఖండించిరి. అట్లొనర్చి సాయంకాలము నిత్యవిధులందీర్చుకొనుటకు నదికేగి యందలిజలంబున నిలుచుండి, కృత్యములు తీరినవెంటనే, గట్టునకాలిడఁ బ్రయత్నింపఁగాఁ గాలుఁగదల్పలేకుండెను. ఆసమయమునఁ బరదేవత స్త్రీరూపధారిణియై జలంబుఁగొనిపోవ నదికేతెంచినట్లగుపడఁగా శంకరు లామెను

గాంచి "కుమారీ! నాకుఁజేయూతనిడు"మని కోరఁగాఁ "జేయూతయెందు"కనియామెప్రశ్నించెను. శంకరులు "పైకిలేచుటకు నాకుశక్తిలే"దనిరి. అందులకామె "శక్తిలేకుండుటయే నీయభిమతముకాదా"యనిన శంకరు లందులకచ్చెరువంది, యామెయెవ్వతెయని శంకించి, ధ్యానవిశేషంబుచే నామె పరదేవతయగు లలితయే యని తెలిసికొని, యామె పాదారవిందములకు మ్రొక్కి యామెను "సౌందర్యలహరి" యను నూరుశ్లోకము లచేఁ గొనియాడెను. అందలి మొదటిశ్లోకమున "తల్లీ! ఈశ్వరుఁడును జగన్నిర్మాణశక్తితోఁగూడినచో జగములు నిర్మింపఁజాలునుగాని యదిలేనియెడ కదలుటకైనను సమర్థుఁడుకాఁడు. కనుక హరిహరబ్రహ్మాదు లచేఁ బరిచర్యసేయఁబడు నిన్ను పుణ్యలేశమైనఁజేసియుండని వాఁడెట్టివాఁడు మ్రొక్కుటకుఁగాని, పొగడుటకుఁగాని యెట్లర్హుఁడగును?"; ఇరువదినాలవశ్లోకమున "తల్లీ! నీకటాక్షమవలంబించియే బ్రహ్మ లోకములను సృజించును, విష్ణువు రక్షించును, రుద్రుఁడు లయమొనరించును. ఈముగ్గురను నీశ్వరుఁడు తనశరీరముతోడ లయమొందించును. సదాశివుఁడు నీకటాక్షమాత్రమును సహాయముగాఁబడసి యీనలువురను మరల నుద్ధరించుచున్నాఁడు." అని స్త్రీరూపశక్తియొక్క యాధిక్యతనంగీకరించి, నాటనుండియు, శ్రీశంకరులు జగదీశ్వరిని శ్రీశృంగగిరి, ద్వారక, శ్రీనగరము, జగన్నాథము మొదలగు మఠములయందు స్థాపనచేసి పరంపరగా నారాధించునట్లుచేసెను.

నాలుగువేదములకును భాష్యమొనరించిన విద్యారణ్యులుకూడ నేబదివేలశ్లోకములుగల విద్యార్ణవ మను విపులగ్రంథమును శ్రీపరమేశ్వరియగు త్రిపురసుందరియొక్క యారాధనగూర్చియే వ్రాసెను. సుప్రసిద్ధులగు నప్పయదీక్షితులువారును నేబదివేలు మితిగల "సౌభాగ్యకల్పద్రుమ" మను గ్రంథరాజమును పరమేశ్వరియొక్క యారాధనగూర్చి ప్రకటించెను. శ్రీశంకరుల పరమగురులగు గౌడపాదులవారు శక్తి సూత్రములను రచించి పరమేశ్వరియొక్క యారాధనాధిక్యతను నిరూపించిరి. వేయేల? ద్విజులు నిత్యము నుపాసించు సంధ్యాదేవియగు గాయత్రి వేదమాతగను, ముక్తావిద్రుమహేమనీలధవళచ్ఛాయలుగల పంచ ముఖములుగల స్త్రీదేవతగను ఆరాధింపఁబడుచున్నది. స్త్రీరూపశక్తికే యాధిక్యతగాని పురుషరూపశక్తికి లేదు. అట్టి సంధ్యోపాసనఁజేయకయే యితరకర్మలొనర్చుటకు నధికారము లేదు. గాయత్రీమాత్రసారుఁడైనను ద్విజత్వము గోల్పోవఁడని మనుస్మృతిచెప్పుచున్నది.

బ్రహ్మాండపురాణమునందలి లలితోపాఖ్యానములో భండాసురుని వధించుటకుఁ బరమేశ్వరి లలితా రూపముందాల్చినప్పుడా లలితాంబికను సమస్తదేవతలును బట్టాభిషిక్తురాలవుకమ్మని కోరిరి. అప్పుడు బ్రహ్మ పురుషుఁడులేని స్త్రీగాని, స్త్రీలేని పురుషుఁడుగాని రాజ్యార్హులుకారని స్మృతియున్నదనెను. అప్పుడు లలితాదేవి "దేవతలారా! నేను సదా స్వతంత్రురాలను, స్వేచ్ఛాచారవిహారములు కలదాన"ననినఁ జతుర్ముఖుఁడు "మహేశ్వరీ! ముందునీవేసృజించి, నీవేరక్షింతువు. క్షణకాలములో నీవేహరింతువు. అందువలనఁ బ్రియునిఁజేబట్టుటవలన నీస్వాతంత్ర్యమునకు భంగముకలుగదు. లోకసంగ్రహార్థమై పురుషు నొకనినంగీకరింపు"మనినఁ బరదేవతయపుడు సంకల్పించినంతమాత్రమున కోటిమన్మథలావణ్యముతోఁ గూడిన దివ్య శరీరముఁగలవాఁడును, దివ్యాంబరమాల్యాధరుడును, దివ్యగంధానులేపుండును, కిరీటాదులచే నలంకరింపఁబడిన వాఁడునునగు జగన్మోహనాకారుండగుఁ బురుషుఁడొకఁడెదుటనిలచెను. బ్రహ్మ యతనికిఁ గామేశ్వరుఁడని నామంబిడెను. అనురూపచరితుండగు గామేశ్వరుని లలిత ధర్మపాలనార్థంబై స్వీకరించెను. బ్రహ్మాదులు కల్యాణమహోత్సవముల జరపిరి.

శ్రీశంకరులును "తల్లీ! సద్యోజాతాదిపంచపురుషులు నీపుంభావలీలలు" అని దేవిని వర్ణించి యున్నారు. త్రిపురోపనిషత్తు పదునాలవఋక్కునకు భాస్కరరాయభాష్యమునందు "శివుఁడును, శక్తియు

తనభక్తులకు ధర్మార్థకామములను సమముగ నీయఁగలవాఁడయ్యును భక్తులకోరికను దీర్చుటయందు శివునకు శక్త్యపేక్షకలదు. కాని శక్తికి శివునియపేక్షలేదు. బ్రహ్మేంద్రాదులెవరును శక్తిలేకుండనే పనిఁజేయఁజాలరు. కాన స్త్రీరూపశక్తిధ్యానమే కోరికలను శీఘ్రకాలమున స్వతంత్రముగనిచ్చు"నని సిద్ధాంతీకరించియున్నారు.

ఇట్లు పురుషరూపంబులు స్త్రీలలీలాసార్థమై సృజింపఁబడెనేగాని స్వతంత్రములుకావు. స్త్రీరూపములే స్వతంత్రములు. పురుషరూపములు పరతన్త్రములు. పురుషరూపములన్నియు తుదకు స్త్రీరూపములందే లయమొందును. చరాచరాత్మకంబగు జగమంతయు లయముకాఁగా స్త్రీరూపమే యగు పరదేవతయే మిగులును.

స్త్రీలయాధిక్యతఁ దెలుపుటకు స్త్రీపురుషులనియు, గౌరీశంకరులనియు, లక్ష్మీనారాయణులనియు, సీతారాములనియు, భార్యాభర్తలనియు మొదలుగాఁగల ప్రయోగములే ప్రబలసాక్ష్యము. ప్రపంచమందంతటను స్త్రీల కిట్టియాదరణయేయున్నది. తండ్రికంటె తల్లి పదిరెట్లు గౌరవమున నతిశయించునని వృద్ధగౌతమస్మృతి వచించుచున్నది.

మఱియు స్త్రీలు సర్వవిద్యలయందును సంపూర్ణాధికారులే యనుటకు విద్యాదేవత స్త్రీదేవతయే యగుట నిదర్శనము. అందువలననే స్త్రీలు పురుషులకంటె శీఘ్రకాలముననే విద్యనార్జింపగల్గుచున్నారు. పురుషులకంటె స్త్రీలే మేధావంతులని వేఱుగఁజెప్ప నగత్యములేదు.

భాగ్యదేవతయగు లక్ష్మి స్త్రీదేవతయే యగుటవలన పరిపూర్ణభాగ్యభోగ్యము లనుభవించుటకు స్త్రీలే సర్వవిధముల శ్రేష్ఠులని వేఱుగఁజెప్పనక్కఱలేదు. లోకమర్యాదయు నట్లే యున్నది.

యుద్ధకౌశలమందును; కార్యనిర్వహణదక్షతయందును బురుషులకంటె స్త్రీలే యున్నతపదవినధిష్ఠించిరనుటకు నిచ్ఛాశక్తియగు మహేశ్వరియే యాదర్శము.

లోపాముద్ర మానవులలో మొట్టమొదటనే చిద్విద్యామంత్రసిద్ధిఁబొంది మానవులను, సిద్ధులను నతిక్రమించి దేవగురుపరంపరలోఁ జేర్చుకొనఁబడినదనియు, దేవత లమరత్వమందుటకు లోపాముద్రాప్రభావమే కారణమనియు బ్రహ్మాండపురాణమందు ప్రసిద్ధమే. మహామహుఁడగు నగస్త్యుఁడు లోపాముద్రాపతియని పిలువఁబడును. స్త్రీలయాధిక్యత నిరూపించుటకీమెయేచాలును. మండనమిశ్రుని భార్యయగు నుభయభారతి సమస్తవేదశాస్త్రవిద్యలయందును, కళలయందును పురుషులందరికంటె ఎంతయో యాధిక్యతఁ గాంచినట్లు శ్రీశంకరాచార్యదిగ్విజయచరిత్ర చాటుచున్నది. దివ్యజ్ఞానసమాజమును ప్రపంచమందంతటను బ్రవర్తింపఁజేసి యపూర్వవాక్పటిమనుగనఁబఱచి హోమురూలను పేరుతో హిందూదేశమునంతను దల్లడిలఁజేయఁగలిగిన యసాధారణప్రతిభగల పాశ్చాత్యస్త్రీరత్నమగు అనిబిశంటుతోఁదుల్యమగు పురుషునొక్కనినైన గనఁబఱచగలమా?

స్త్రీలలోఁ బురుషులమించిన సాహిత్యవిశారదలు, గానకవితాకోవిదలు, కళానిపుణలు, వైద్యశిఖామణులు, శెట్టులు, న్యాయవాదినులు, రాజ్యతంత్రజ్ఞులు, మహారాణులు, యోగినులు నెందఱెందరోకలరు.

తొల్లి సత్యభామ యజేయుఁడగు నరకాసురునితో మహాయుద్ధమొనర్చి వానిని వధించెను. కైకేయి యుద్ధనైపుణ్యమెఱుంగనివారెవ్వరు? అహల్యాబాయి, రుద్రమదేవ్యాదుల ఘోరయుద్ధములు చేసి విజయలక్ష్మిని బడసిరి. విక్టోరియాచక్రవర్తిని, తిరువాన్కూరుమహారాణులును నెంతనిపుణతతో రాజ్యము లేలిరో చరిత్రలే తెలుపుచున్నవి. వారలకంటె తద్రాజ్యము లేలిన పురుషరాజుల విశేషమెందును లేదు.

పురుషశిశువుల జననము స్త్రీశిశువులజననముకంటె మిక్కిలి హెచ్చయినను పురుషశిశువులు శీఘ్రమరణమునొందుచున్నారు. స్త్రీలకు స్వభావసిద్ధమగు శరీరపాటవముగలదు. పురుషులు ప్రకృతియందే దుర్బ

లురు. నిజస్థితియిట్లున్నను అమంగళవారమునకు మంగళవారసంజ్ఞయున్నట్లు పురుషులు స్త్రీలను నబలలని పేరిడి తామే బలశాలురుగ దలచుచున్నారు. అది దురాగ్రహము. ప్రపంచమం దన్నిదేశములందునుగూడ పురుషులసంఖ్యకంటె స్త్రీలసంఖ్యయే మితిమీఱియున్నది. ఇందులకు స్త్రీలశరీరపాటవమే కారణము. రావణాసురునికైనను నెత్తదుస్సాధ్యంబైన శివధనస్సును సీతయెంత యవలీలగా నెత్తగల్గెనో శ్రీమద్రామాయణమే ప్రమాణము. తారాబాయి, రుక్మిణీబాయి మొదలగు యోధనారీరత్నములు, సర్కసులందు తమ బలాధిక్యతను గనబఱచుచున్నారు. ఆఫ్రికాఖండమందలి యమజానులను స్త్రీజాతి యుద్ధమునందారితేరినవారు.

వేరేల? ఇప్పటి సహాయనిరాకరణపక్షమవలంబించి కాంగ్రెసుప్రచారము కొనసాగించుటకు ముఖ్యకారణము స్త్రీలేకారా? అపూర్వమృదుమధురవచోగాంభీర్యములచే నొప్పునాకవయిత్రియగు సరోజనీదేవి లవణసత్యాగ్రహమున గనబఱచిన యసదృశధైర్యసాహసము లామెను కౌద్రశక్తిగ నొనర్పలేదా? ఆమెను జూచి రాజభటులును, అధికారులును, భయవిభ్రాంతుల నొందలేదా? ఆంధ్రులలో రాజకీయరంగమున నిరుపమానదీక్షతోఁ గృషియొనర్చి స్త్రీలోకమునకు నుత్తేజముకలిగించిన యసమానప్రతిభాశాలురును, నిజవాక్సుధారసమున సభికుల నావేశపూరితులుగఁజేయఁగల దువ్వూరి సుబ్బమ్మ మొదలగువారల యాధిక్యతఁగొనియాడఁజాలనివారలుందురా? దుర్గాబాయి మొదలగువారు మదరాసునందొనర్చిన వర్ణనాతీతమైన యాందోళనము వెనుకబడియున్న తమిళనాడును నచిరకాలముననే ముందంజవేయింపలేదా? ఆయారాష్ట్రములందలి స్త్రీలు కాంగ్రెసువిధానములయందెట్టి యనాదరణభావమున్నవారినైనను, పికెటింగులలో నట్టివారి చిత్తవృత్తులను నిరోధించి తమకనువర్తులుగఁ జేయుచుండలేదా?

ముత్తులక్ష్మిరెడ్డి పూర్వానుభవములేనిదయ్యు, తన మేధాబలంబునఁ జట్టనిర్మాణవిధులఁ జక్కఁగఁదెలిసి విశేషానుభవముగల రాజకీయవేత్తలగు పురుషులనతిశయించి మంచివాకచక్యముతో దేవదాసీచట్టమును నిర్మింపజేసెను.

స్త్రీలయాధిక్యతకుఁ గారణంబెద్ది? వారియందలి స్త్రీత్వమే. స్త్రీత్వమనగా శక్తిత్వమే. దేవీభాగవతము నవమస్కంధమున "సకలబ్రహ్మాండమండలంబునందును దేవ్యంశరూపధారిణులై సకలస్త్రీలు రాజిల్లుచుందురు. మఱియు శ్రీదేవీస్వరూపంబగు ప్రకృతి కంశంబులైన యంగనారత్నంబు లందెవ్వరెవ్వరిభార్యలై యెట్లు కీర్తివహించి రయ్యదివివరింపుమనిన నారాయణుండు ఇన్నిచెప్పగనేల? ఎల్లయోషిత్తులు ప్రకృతికళాలవప్రాప్తిగలదు, ఆఁడువారల నవవస్త్రాలంకృతులచే బూజించవలయును. పుత్రవతుల నెక్కుడుగఁజూడవలయు, నట్లయిన ప్రకృతి మెచ్చు, దేవి మెచ్చిన మున్మూఁడుదీవులందు నందరానట్టిదున్నదే యనఘచరిత! అట్టి స్త్రీలు సాత్త్విక, రాజస, తామసగుణయుక్తలై యుత్తమమధ్యమాధమములను మూఁడుతెఱంగులనుందు"రనియున్నది. కలియుగమున నింటింటను శక్తియుండునను వార్యోక్తి యెంతయుసమంజసము.

ఆధునికప్రకృతిశాస్త్రజ్ఞులుగూడ జగమంతయు శక్తిమయమేకాని పదార్థమయముకాదనియు, శక్తియే తీవ్రసంచలనావస్థయందు జగదాకారముగ దృశ్యమగుచున్నదనియు శాస్త్రపరిశోధనలచే నిరూపించియున్నారు. ఇందుగలదందులేదని సందేహమువలదు, శక్తిసర్వోపగతంబెందెందు వెదకిచూచిన నందందేగలదని యార్యులువచింతురు.

కావున పురుషరూపములు గౌణములనియు, స్త్రీలవిలాసార్థము సృజింపఁబడినవనియు, స్త్రీలే ప్రధానశక్తిరూపములనియుఁ దేలుచున్నది.

వేదకాలమునుండియు సర్వవిధములఁ బురుషులకంటె యున్నతదశయందున్న స్త్రీలను కాలక్రమమున, వారియుపేక్షాభావమువలన వారికి సౌఖ్యములను జేకూర్చుటకు బ్రహ్మచే నియమింపబడిన పురుషులు, స్త్రీలను



శ్రీమతి పద్మావతీ ఆషర్ గారు




మద్రాసు సేవాసదనము: ఉపాధ్యాయవర్గము; విద్యార్థినీగణము

సహధర్మచారిణులుగ నైనను నెంచక, సేనాధిపతి సైనికులతో గుట్రచేసి తానే రాజ్యమాక్రమించుకొనినట్లు, స్త్రీలహక్కులను ధర్మవిరుద్ధముగహరించి, శాస్త్రవిధులకు విపరీతార్థములను గల్పనజేసి ధర్మచ్యుతులైరి. స్త్రీలు గృహనిర్వహణము జేసికొనుచునింటనుండి యాస్తిసంపాదన మొదలగు తక్కిన కార్యభారమంతయు పురుషులయందుంచినందున, నంతమాత్రముచేతనే పురుషులు తామే యధికులమనుకొని, స్త్రీలను జులకనగఁ జూడఁజొచ్చిరి. మంత్రులు, సేనాధిపతులు మొదలగువారు రాజ్యభారమెంత జక్కబెట్టినను రాజ్యభారము రాజునందే యారోపింపఁబడునుకాని తక్కిన యనుచరులయందు కాదుకదా? అట్లే స్త్రీలవిషయమునను. సామ్రాజ్యమునఁ బరిపాలించురాజు స్వేచ్ఛగ నాహారవిహారములు సల్పుట కన్నియో నిర్బంధములను పాటించవలసియుండును. అంతమాత్రమున రాజునకు స్వతంత్రములేదనియు, పరతంత్రుడేయనియుఁ జెప్పనగునా?

కాని దేవీభాగవతము, నవమస్కంధమున:—"కలియుగమునఁ బతివేలేదులు చన నెల్లరు స్త్రీపరాధీనులై, స్త్రీలు గృహమునకధిపతులుగను, పురుషులు స్త్రీలకు భృత్యమాత్రులుగనునుందు"రనియున్నది. దీనివలన కొంతకాలమునకు పురుషులు తామాక్రమముగా నాక్రమించుకొనిన స్థితినిగోల్పోయి, పూర్వపుసామాన్య స్థితికి వచ్చితీరుదురనియు, స్త్రీలు మఱల తమపూర్వపుటున్నతస్థితికివచ్చెదరనియు సూచింపఁబడుచున్నది.

కాని పాశ్చాత్యనారీమణులు సర్వస్వాతంత్ర్యముల ననుభవించుచుండినను అనేకయకార్యకరణములకు లోనై గృహకార్యములను నిర్వర్తింపక స్వైరిణులై పురుషులగణింపక వారిని కడునిడుముల పాలగునట్లు చేసి సంసారము నరకప్రాయముగ దోచునట్లొనరించి జీవితము దుఃఖభూయిష్ఠముగఁ జేయుచున్నారు.

కావున నెంతస్వాతంత్ర్యము నొందినను స్త్రీలు దానిని దుర్వినియోగముజేసి సనాతనధర్మవిరుద్ధముగ సంచరింపరాదు. పాతివ్రత్యధర్మములను, నీతిని విడనాడరాదు. పురుషులకు తాము సహధర్మచారిణులుగ నెంచికొనుచు, తమ స్వభావసిద్ధమగు నాధిక్యతను జ్ఞప్తియందుంచుకొనుచు, ధర్మబద్ధులై వ్యవహరింపవలెను. లలితాత్రిపురసుందరి యెంతస్వతంత్రురాలయినను లోకమర్యాదను, ధర్మమును సంరక్షించుటకై బ్రహ్మాదులు గోరినవిధమున దనకనురూపచరితుఁడగు బురుషునొకనిని స్వీకరించలేదా? ఆమెనే యాదర్శముగఁ గైకొని స్త్రీలు విహరింతురు గాక!

# దైవమా! సుతుఁడు లేనిది జన్మమా?

శ్రీమతి యస్. కాంతారత్నమ్మగారు

నానాసుఖవ్రాత
నక్షత్రపంక్తిలో
సుతుఁడుశశియనిబల్కవమా?
దైవమా! సుతుఁడులేనిదిజన్మమా?

చిత్రచిత్రవిచిత్ర
చిత్రమాకథలను
సుతుఁడు తల్లికిజెప్పడా?
దైవమా! సుతుఁడులేనిదిజన్మమా?

సంసారమనియెడు
సాగరంబుననుతుఁడు
నావయంచునుజెప్పమా?
దైవమా! సుతుఁడులేనిదిజన్మమా?

కష్టదావాగ్నిలో
గాలుచుండినముదిత
సుతునిజూచియు మఱువదా?
దైవమా! సుతుఁడులేనిదిజన్మమా?

# రాటపు పాటలు

(సంపాదకురాలు) శ్రీమతి ఇనగంటీ రత్నమ్మగారు

౧

రాటంబుచిన్నాది కదురుచిన్నాది
సరసనావడికేటి చీడెచిన్నాది
చీడెకట్టినచీరెచెరగుచిన్నాది.

౨

రాటాలమోతమ్మ రవ్వాలమోత
కనకసిరిగొల్లారి కవ్వాలమోత
యేకులొడకలేను యెదురెట్టలేను
పాపజాతిదేశానికి పన్నెట్టలేను.

౩

ఏకులువడికితే యేకదరిద్రమ్ము
పడుకోనినిద్రోతె వచ్చుభాగ్యమ్ము
యేకులురాటమ్మ కాళ్లసంకెళ్లు
యేపాపకర్మకు కావించినాడో?

౪

అందరిరాటాలు అవిటికుక్కాలు
అందులో నారాటము చిలకలకొలికి
చిలకలకొలికిని పలికిలోబెటితే
పలికంత తెగగాలి వచ్చెరాటంబు.

౫

పుంజమొడికేయిల్లు పూజింతమంటె
గుంజవిరిగి మూల కూలబడుతుంది
ఇదియేమివింతమ్మా-అత్తో-నాకు
రాటమొడకబోతే కొత్తో.

౬

జగడాలమారి దీయింటనుండాది
జాబువేసినాడె యమధర్మరాజు
జగడాలమారి దీదండుసిపాయి
కత్తిపీటకుపోయి కయ్యంబుతెచ్చు.

౭

పిత్తనాలగింప నెత్తినెట్టుకొని
విచారపడ్డాడె విష్ణుక్రాంతుండు.

౮

కసువూడ్చి కళ్లాపిచల్లేవారెవరు?
కస్తూరినగళ్ల నడిచేవారెవరు?
కసువూడ్చి కళ్లాపిచల్లె మాయక్క-
కస్తూరినగళ్ల నడిచె మాబావ.

౯

పేరులేనివృక్షాలు పెద్దవెలగల్లు
కారుగోగులసరస కదలె బావన్న
తుంగభద్రగదలు తులశమ్మగదలు
వనరాశితుంగభద్ర వనమంతగదలు.

౧౦

అప్పుజేసినాడు హరిశ్చంద్రరాజు
అప్పుకనిబిడ్డని అమ్ముకున్నాడు
పడ్డికనిభార్యను వప్పుకున్నాడు
చెరబోయి చెల్లెల్ని తెచ్చుకున్నాడు
జగతిలో తనప్రజ్ఞ నిలుపుకున్నాడు.

౧౧

ఆదివారమునాడు ఆగడియనాడు
ఆబోతుజన్మించు ఆవుగర్భాన
ముందరకాలితెలుపు మూత్రానసలుపు
ముందుగాబసవన్న మందగదిలేడు.

౧౨

మందచుట్టూతిరిగి మందేరుపరచి
మందగంగా నిన్ను మామలుగొల్చేరు
దొడ్డిచుట్టూతిరిగి దొడ్డేరుపరచి
దొడ్డిగంగా నిన్ను దొరలుగొల్చేరు

మందకేమామంద మారుమందైతే
విడుతు వెంకటరమణ యింటజన్నేవు
పెడుతు వెంకటరమణ పట్టెడన్నంబు
కడుతు వెంకటరమణ స్తంభానకోడె.

౧౩
కాటుకచుక్క బొట్టు కడిగినాపోదు
నొష్ట వ్రాసినవ్రాలు తుడిచినాపోదు
అడ్డచెరుగులు బెట్టి అద్దినాబోదు
పైటచెరగులు బెట్టి పులిమినాబోదు.

౧౪
బాలింతవచ్చింది బావినీళ్లానికి.
యేదమ్మ బాలింత? యేరాజు దేవి?
మాసిందిపట్టుచీరె మడమలపసుపు
మావాడబాలింత రామయ్యదేవి.

౧౫
కరివేపకాయలు కంతానబోసి
కలిగినవారంపితే గాంభీర్యమాయె
పేరినసేతులు బెల్లపచ్చల్లు
పేదవారంపితే చేవరవయాయె.

౧౬
నల్లగొండలమీద వుతికేటిచాకి
నాయన్న వేసిన దట్టిపేరేమి?
చినకొండచేరంచు పెదకొండలొంగురు
నాదెళ్ల నల్లపట్టు అన్నసడికట్టు
బందరుపచ్చిపట్టు బావసడికట్టు.

౧౭
బందరుపోయ్యేటి బావ! పెదబావ!
పసుపాడె అప్పలకి పట్టుచీరె దెమ్మి
నీదేవి చెల్లెలిని నీకుమరదలిని
నిలిచికట్టనాకు నిండువన్నె దేవు
పండికట్టనాకు పట్టువన్నె దేవు.

౧౮
కాకమ్మ! నీకాల కట్టెముగజ్జె
రత్తమ్మ మావారిని రాగుయ్యో కాకి!
కాకెమ్మకూతలు కల్లలుగావు
కన్నవారొచ్చేటి వేళలుగావు.

౧౯
అనుబోయ నేల? అసతప్ప నేల?
మాలామతిట్ట నేల? మాటబడ నేల!

౨౦
పుంజమ్మనూలుకి పోగుతక్కువా
కొండమీదపొద్దుంది కొట్టబోకత్తా!
చేనివారొస్తారు చెప్పబోకత్తా!

—సశేషము.

## శరన్నవరాత్రములు

శ్రీమతి ఎమ్. వేదవల్లి తాయారమ్మ గారు

సరససౌభాగ్యవిలసితసస్యములును
సౌరభోపేతములు సరసీరుహములు
స్వచ్ఛమై పావనములగు సలిలములును
అల శరచ్చంద్రచంద్రికావిలసనము
జలరహితమైన తెల్లనిజలదచయము
కానుకలుగావె యీశరత్కాలమునకు.
ఆశ్వయుజమాసశుద్ధపాడ్యమిమొదలుగ
వచ్చునవరాత్రములయందు వరుసగాను
భారతీశ్రీభవానుల భక్తిమీర
ప్రజలుపూజింపుచుందురు భద్రమనుచు
నెచటజూచిన ఫలపుష్పనిచయములిడి
కలశమును స్థాపనముచేసి కలకొలంది
దైవతప్రీతికొఱకు సంతర్పణములు
చేసెదరు భక్తులీశుభవాసరముల.

## ఆశ్వయుజమాసవిశేషములు

శ్రీమతి నుసర్ల లక్ష్మీనరసమాంబగారు

అశ్వనీనక్షత్రయుక్తపూర్ణిమగలదగుటచే దీనికి ఆశ్వయుజమాసమని పేరువచ్చినది. ఈమాసముకూడ శ్రావణమాసమువలె శుభప్రదమైనది. ఆశ్వయుజశుద్ధపాడ్యమి నవరాత్రులారంభము. సప్తమి మూలానక్షత్రప్రవేశము. అష్టమి మహాఅష్టమి. నవమి మహార్నవమి. దశమి విజయదశమి. ఆశ్వయుజశుద్ధదశమి విజయదశమి. పాండవులు కౌరవులతో యుద్ధసంకల్పముజేసి ఉత్తరగోగ్రహణసందర్భమున శమీవృక్షముపైని దాచుంచిన బాణములను గైకొని వాటిని పూజించిన సుదినమగుటచే ఆయుధపూజాదినముగ నెంచబడుచున్నది. అర్జునునకు విజయుడను నామముగలదు గాన అతడు బాణములను గైకొనిన రోజగాన విజయదశమి అని పేరుగలిగినదని కొందరు చెప్పుదురు. మరియు శ్రీరామచంద్రుడు రావణసంహారణార్థము యుద్ధముచేయుటకుముందు ఈశమీపూజ చేసినందున దిగ్విజయముబడసి రావణసంహారము చేయుటనుబట్టి దీనిని విజయదశమి అనిఅందురు అని కొందరు చెప్పుదురు. మరియు జగన్మాతయగు మహిషాసురమర్దని రాక్షసుని సంహరించి విజయమందినరోజగాన విజయదశమిఅని మరికొందరందురు. ఇందు యేదినిజమైనను జయముగోరు ప్రతివారును శమీపూజ చేయదగినదై యున్నట్లు కన్పట్టుచున్నది.

### దేవీనవరాత్రులు

ఆశ్వయుజశుద్ధపాడ్యమిమొదలు తొమ్మిదిదినములు దేవీనవరాత్రులు చాలమంది చేయుదురు. ప్రతిదేవాలయములందునూ దేవికి గొప్పఉత్సవములు జరుగుచుండును. ఎచ్చట చూచినను దుర్గపూజలు, హరికథలు, మంగళవాద్యములు వినబడుచుండును. ప్రతియింట బాలికలు బొమ్మలకొలువు పెట్టుకొని వేడుకచేయుచుందురు. స్కూలుపిల్లలు (మాపప్పుబెల్లములు మాకుదయజేసి శీఘ్రముగ బంపుడీ శ్రీమంతులార!)అని పాడుతూ బుక్కా సంచుల నిండ గట్టుకొని విల్లులు చేతబుచ్చుకొని బారులుబారులుగ నడచుచుందురు. ఏవీథిచూచినను వీరే. ఈతొమ్మిదిదినములైనతరువాత దశమిపండుగతోకూడ పదిరోజులుగాన దీనికి దసరాఅని అందురు.

### నరకచతుర్దశి: దీపావళి

ఆశ్వయుజబహుళచతుర్దశినాడు నరకాసురుడు చనిపోయినరోజు. నరకాసురుడు పెట్టు బాధకోర్వలేక సత్యభామచే యుద్ధముచేయించి శ్రీకృష్ణభగవానుడు నరకాసురుని సంహరించెను. కావుననే ఆరోజున జనము తప్పక తలకు స్నానముచేయుదురు. ఆశ్వయుజబహుళ అమావాశ్య దీపావళిఅమావాశ్య. దీనికి ఆంధ్రులందరును తప్పక తమతమ అల్లుళ్లను అత్తవారిండ్లకుతోడ్కొనివచ్చి క్రొత్తపుట్టములు కట్టబెట్టుదురు. హిందువులందరు తమగృహములయందు శోభాయమానముగ దీపములచే నలంకరింతురు. కావుననే దీపావళిఅను పేరుగల్గెను.

మరియు ఆరోజు ప్రతియింటను మందుసామానులుగాల్చి సంతోషముతోనుందురు. ఇవి గంధకముతో తయారుచేయబడినవగుటచే విషపుపురుగులు చచ్చిపోవుటకు సందియములేదు. ఈఅమావాశ్యమొదలు మరల కార్తీకపౌర్ణమివరకూ 15 రోజులు క్రొత్తపెండ్లికుమార్తెలు మోచేతిపద్మంనోముఅని మాట్లాడకుండా ముత్తయిదువులకు బొట్లుపెట్టుదురు. అటుతర్వాత లెక్కప్రకారము నక్షత్రములు లెక్కపెట్టుకొని మఱియు మాట్లాడుదురు. ఇవి ఆశ్వయుజ మాసవిశేషములు.

## రాధవలపు

శ్రీమతి కె. గంగమ్మగారు

రాధ

సఖియ! నావిభుఁ డేతెంచుజాడఁగనుము
విరహవేదన భరియింపఁదరముగాదు
ప్రాణములనిల్పి పుణ్యంబుఁబడయుమమ్మ
వందనముసేతు నావిభు నిందుఁదెమ్ము.

చెలి

దేవి! ద్వారకావాసుండు దేవదేవుఁ
డష్టమహిషీవిభుండగు యాదవుండు
శంఖచక్రగదాఖడ్గశార్ఙ్గధరుడు
కృష్ణుఁ డిదెవచ్చెఁ గాంచుమీతృష్ణదీర.

రాధ

ఏఁడి? ఏఁడి? నాగోపాలకృష్ణమూర్తి,
నందనందనుఁ డేఁడి? నామందిరంబుఁ
జేరవచ్చెనే? ప్రియసఖి! చెప్పుమమ్మ
నీఋణంబెట్లుదీర్తునో నీరజాక్షి!

(పరికించి చూచి)

సఖియ! యీతఁడెవ్వరోమహాచక్రవర్తి
కరణిఁజూపట్టు శంఖచక్రములతోడ
నతిగభీరరూపంబుతో నరయరాక,
నామనోహరు శ్రీకృష్ణు నాకుఁదెమ్ము.

గొల్లపల్లెను వసియించిచిల్లపనులు
సలుపుచుండు వ్రేవెలందులవలపుకాఁడు
ఇతఁడు కాఁడమ్మ యాతనినెఱుగువిధము
తెలుపుదును విని తేగదే! చెలువమిన్న!
సిగను నెమిలిపింఛంబును, చెవుల కుండ
లంబులును, ముకుతుద మౌక్తికంబు, మఱియు
నుదుటఁగస్తురితిలకంబు, నెదను ముత్తి
యములపేరును, హరిచందనము తనువునఁ,
గరములం గంకణంబులు, చరణములను
గజ్జెలందెలు, మొలనూలు గటితలమున
వెలుగ, ముంగురులు నొసటఁదొలఁకుచుండ,
గొల్లపొట్టెలతో వని గోగణములఁ
గాయుచును వెన్నెలల శరత్కాలరాత్రు
లందు జంగమస్థావరమైనజగతి
వేణుగానసుధామధువృష్టిముంచి
తన్మయులఁజేసి నూత్నచైతన్యమిచ్చి
లీలవిహరించు నైదేండ్లబాలకుండు
నీలనీరదగాత్రుండు నీరజాక్షుఁ
డరయ మదవతీ! నవమనోహరుఁడుసుమ్ము
నావిభుం డాతనిందెమ్ము నాతిమిన్న!

# సీత సినీమా

శ్రీమతి ప్రాతూరి లక్ష్మమ్మ గారు

శివరావు స్కూలు ఫైనలు చదువుతున్నాడు. పదహారేళ్లు ఉంటాయి. అతని స్వగ్రామం పల్లెటూరగుటచేత మేనమామగారివూళ్లో చదువుతున్నాడు. మేనమామకుమారుడు ఆనందరావు కూడా యితని క్లాసె. ఆనందరావుకు ఇద్దరుచెల్లెళ్లు. పెద్దపిల్ల సీత. రెండవచెల్లెలు పూర్ణ. సీతను పుట్టినప్పటినుంచి శివరావుకు ఇస్తామనుకునే వారు. సీత చాలచురుకైన తెలివిగల పిల్ల. తెల్లటి ముఖము, చక్రముల వంటి కళ్లు, చిన్ననోరు చాల అందముగా ఉంటుంది. ఆనందరావు, సీత ఒక పోలికగాఉంటారు. అంతా ఒకచోట ఉండుటవల్ల కలసిమెలసి యుండేవారు. శివరావు ముక్కోపి. సీతపట్టుదల కలది; పెంకిపిల్ల. పూర్ణ అమాయకురాలు. ఆనందరావు సరదామనిషిఅవుటచేత, సాయంకాలం యిస్కూలునుంచి రాగానె, చెల్లెళ్లనుకూడా తీసుకొని షికారువెడుతూఉండేవాడు. సీత శివరావుతోటి కబుర్లుచెపుతూ ఒకపక్కనె నడుస్తూ వెడుతూయుండేవారు.

ఒకరోజు శివరావు సీతను తీసుకొని బజారువయిపు వెళ్లేడు. ఆనందరావు పూర్ణ కూడావచ్చేరు. జనసమ్మర్దంగా ఉండుటచేత శివరావు సీత చెయ్యిపుచ్చుకొని నిమ్మదిగా నడుస్తూయున్నాడు. పూర్ణ అన్నగారితో కబుర్లుచెపుతు వెనకాల వస్తూంది. ఒకబొమ్మలదుకాణంమీదుగా అంతా వస్తున్నారు. సీతకి బొమ్మలంటె సరదా. బొమ్మలు కావాలని అడుగుతే కొనిపెడదామని నిమ్మదిగా నడస్తూ వెడుతున్నాడు శివరావు. సీతకి చిన్నప్పటినుంచి చూచినదల్లా కావాలని అడిగేస్వభావము కాదు. తనకి కావాలసినది తెలుసుకుని కొనియిస్తే ఆనందపడేస్వభావం సీతది. వాళ్లఅమ్మకూడ సీత అడగకుండానె కావలసినది తెలుసుకుని కొనియిచ్చేది. సీతకి రంగుబట్టలంటే యిష్టంలేదు. తెల్లపరికిణీలయంటె ఆమెకు ఉత్సాహంజాస్తి. వాళ్ల అమ్మ యెప్పుడు సీతకి తెల్లబట్టలే కుట్టిస్తూయుండేది. ఎవరేనా బంధువులిండ్లకు వెడితె రంగుపరికిణీ పెడితె సీత ముఖముతిప్పుకుని పూర్ణకు యిచ్చేసేది. సీతమాత్రం తనపట్టు చెల్లించుకునే సమర్థురాలు. నాడు బావ బొమ్మలదుకాణంవద్ద నిమ్మదిగా నుంచోపెట్టి అటు యిటు చూస్తున్నట్టు నటిస్తూ, సీతకేసి చూస్తూనుంచున్నాడు. కాని సీతమాత్రం కావాలని అడుగలేదు. బొమ్మలకేసి ఉత్సాహంతో చూస్తునుంచుంది. కొంతసేపయినాక శివరావు "సీతా! నీకు యేబొమ్మలు బాగున్నాయి?" అన్నాడు. అప్పుడు ఆమె "ఆ పెద్దబొమ్మలు రెండూ యెంతఅందముగా ఉన్నాయో; చూడు, బావ!" అంది. "సరే! పద. నీకు కావలసిన బొమ్మలు తీసుకుందువుగాని" అన్నాడు. "రేపు, అమ్మని అడిగి డబ్బులు తెచ్చుకుని కొనవచ్చునులే, బావ!" అంది. సీత తెలివికి, మాటనేర్పుకు శివరావు చాల సంతోషించేడు. "సీతా! నీకు కావలసినబొమ్మలు తీసుకో. డబ్బులకోసరం మీఅమ్మను అడగనక్కరలేదులే" అన్నాడు. సీత కోరిన పెద్దబొమ్మలు, పూర్ణకు కొన్ని చిన్న చిన్న బొమ్మలు అతడు కొన్నాడు. ఈ లోపల వెనకపడ్డ పూర్ణ, ఆనందరావు వచ్చి కలుసుకున్నారు. పూర్ణ సీతచేతులో బొమ్మలు చూచి "అక్కయ్యా! నాకేనా యివి?" అంది. "నీకు కూడా కొన్నాను. నీకు కావలసినవి తీసుకో పూర్ణ!" అంది సీత. అప్పుడు పూర్ణ సంతోషంతో ఆలోచిస్తూ బొమ్మలవయిపుచూస్తూంది. సీత కోరిన బొమ్మలు పూర్ణకాజేస్తుందేమోనని చూస్తూనుంచున్నాడు శివరావు. "అన్నయ్యా! ఇంత పెద్ద బొమ్మలు నాకొద్దు. లక్కపిడతలు, చిన్న బొమ్మలు తీసుకుంటాను" అంది పూర్ణ. శివుడి ముఖం వికసించింది. సీతకు ఆనందం కల్గింది. ఇంటికి వచ్చేరు.

దొడ్లో మామిడిచెట్లు ఉన్నాయి. శివరావు, ఆనందుడు మామిడిచెట్లు యెక్కి కాయలు కోస్తున్నారు. సీత, పూర్ణ, యింకా యితరపిల్లలు దొడ్లో ఆడుకుంటున్నారు. వీళ్లు చెట్టుయెక్కి కాయలు కొయ్యడంచూశారు. పిల్లలంతా చెట్టువద్దకు పరిగెత్తుకు వచ్చేరు. మాకు మామిడికాయ వెయ్యవు అని శివానందులను అడిగేరు. సీత అడగకుండానే నుంచుంది. తను చాకుతో మామిడికాయ కోసుకులిని లోపల జీడి సీతమీద పడేశాడు శివుడు. జీడిపడి సీత తెల్లచొక్కా పాడయింది. సీతకు ఉడుకుమోత్తనం వచ్చింది. సీత వెళ్లిపోయింది. పూర్ణ తల్లిదగ్గరకెళ్లి ఫిరియాదుచేసింది; బావ, అన్నయ్యా మామిడికాయలు తింటూ తనకు పెట్టలేదని. తల్లి "ఆనందా! కాస్త దాని కొకకాయ యియ్యరాదురా?" అంది. "ఏదే? పూర్ణ నన్ను అడుగలేదు. రా, పూర్ణ! యివిగో, కాయలు" అన్నాడు ఆనందం. పూర్ణ మామిడికాయలు తెచ్చుకు తింటూ వెళ్లిపోయింది. సీతకు ఉడుకుమోత్తనం వచ్చినసంగతి శివుడు కనిపెట్టేడు. కాని అందరు కాయలడిగితే సీతమాత్రం యెందుకు తనను అడగకూడదు అని శివుడికి కోపంవచ్చింది.

సీత మూడవఫారం చదువుతూంది. తండ్రివద్ద సంస్కృతము నేర్చుకుంటూంది అప్పుడప్పుడు. బావవద్ద హిందీ కూడా నేర్చుకుంటూయుంటుంది. పాఠములేమయినా తెలియనప్పుడు బావే చెప్తూయుంటాడు. సీత యీయేడు పరీక్షలో మొదటిబహుమానము అందినది. శివుడికి నాలుగు వాల్గు వేలు వస్తాయి. ఒక్కడే పిల్లవాడు. వీరిది పల్లెటూరు. ఇంటివద్ద అతనితల్లి, విధవమేనత్త యుంటారు. వారు పూర్వాచారపరాయణులు. సీత యింకా చదువుట అతనితల్లి, మేనత్తలకు ఇష్టములేదు. కాని శివానందుల ప్రోత్సాహము వలననే చదివిస్తూయున్నారు. శివరావుతల్లి యీసంవత్సరం పెళ్లిచేస్తేనే గాని వీలులేదని పట్టుపట్టింది. కాని పరీక్ష ప్యాసవుతేగాని• పెళ్లిమాట తలపెట్టవద్దన్నాడు శివుడు. ఇప్పుడు బి. యే. చదువుతున్నారు శివానందులు.

శివరావు మంచిమామిడికాయలు రెండు కోసుకొని జేబులో వేసుకొని చెట్టుదిగి యింట్లోకి వచ్చేడు. సీత అంటే శివుడుకి ఒకవిధమయినప్రేమ. చిన్నప్పటినుంచి ఒకచోట పెరుగుటవలన, అంతాస్నేహంగా కూడా ఉండేవారు. శలవలు వచ్చినయడల అందరు కలిసే వెళ్లేవారు. ఒకవేళ ఆనందు, సీత, పూర్ణ రాకపోతే "శివా! వాళ్లను కూడ తీస్కురాకపోయినావురా?" అనేది శివుడితల్లి. మరువాడే మనిషిని పంపి అందరను తీస్కురప్పించేది ఆమె. సీత కనుక ఒకరోజు కనపడకపోతే శివుడికి యెలాగో యుండేది. సీత యొక్క తెలివికి, ఆమె యొక్క బుద్ధిసూక్ష్మతకు, పట్టుదలకు చాల ఆనందపడేవాడు. సీతవంటి బాలిక తనకు భార్యకాబోవటంచేత తను ధన్యుడననుకునేవాడు. కాని సీతకు కూడా ఇష్టముందోలేదో కనుక్కోవాలని అతని అభిప్రాయం.

సీతకు పదమూడేళ్లు వచ్చేయి. కనుక బాగా ఊహవచ్చిన పిల్ల. సీత కోసరం యిల్లంతా వెతికేడు. తోటలోకి వెళ్లిందేమొనని చూచేడు. ఎక్కడా కనపడలేదు. సావిట్లో కుర్చీలో కూర్చున్నాడు. "పూర్ణ యింట్లోనుంచి పరిగెత్తుకువచ్చింది. "పూర్ణ! మాట, యిలరా" అన్నాడు బావ. "ఎందుకమ్మా! ఇందాక మామిడికాయ యియ్యలేదు, కాని" అంది పూర్ణ. "ఇస్తాను గాని. నిన్న నీకు లక్కపిడతలు, బొమ్మలు యియ్యలేదు" అన్నాడు. లక్కపిడతలుమాట చెప్పేటప్పటికి పూర్ణముఖం వికసించింది. "ఏంకావాలి నీకు?" అంది. "మీఅన్నయ్య యేడి?" అన్నాడు. "స్నానం చేస్తున్నాడు, అమ్మ నిన్నుకూడా స్నానం చెయ్యమంది" అంది. "చూడు, సీత యేది?" అన్నాడు బావ. "మైడాబామీద చదువుకుంటూంది, ఎవరడిగినా చెప్పవద్దంది. ఎవరికి చెప్పకేం? బావ!" అని పూర్ణ పరిగెత్తుకు వెళ్లింది. శివుడు నెమ్మదిగా

డాభామీదకు వెళ్లి సీత వెనకాలనుంచున్నాడు. సీత హిందీ చదువుకుంటుంది. వెనక్కాలె వెళ్లి కళ్లు మూశాడు. సీత ఆనందరావేమోఅనుకుంది. కాని చెయ్యి తడివిచూసింది. ఉంగరం కనిపించింది. "అన్నయ్యకు ఉంగరం లేదు, బావవేలే, చేతులు తియ్యి" అంది. "సీతా! ఇక్కడ ఒక్కదానవు కూర్చున్నావేం?" అన్నాడు. "ఏమిలేదు. చదువుకుంటున్నాను" అంది. "ఏదైనా పాఠం చెప్పాలా?" అన్నాడు. "అక్కర లేదు. పాతపాఠాలు చదువుకుంటున్నాను" అంది. "సీతా! చొక్కామీద సిరా పోసుకున్నావేమిటి?" అన్నాడు. "అది సిరామరక కాదు. బావ జీడిమరక. అంటుకుంటే వదలదు" అని బావకేసి కోపంగా చూసింది. బావకు కోపం, నవ్వుకూడా వచ్చినవి. "పోనిలే. జీడెందుకు? కాయలివిగో, తిను." అని మామిడి ముక్కలుపెట్టేడు. "నాకు వద్దు" అని చదువుకుంటూ కూర్చుంది. "సీతా! నిన్ను ఒకసంగతి అడగాలని వచ్చేను. అడగనా?" అన్నాడు. "అడుగు, నీకు నేను చెప్పవలసిన సంగతు లేమిటి? నాకే యెన్నో సంగతులు పాఠములలో చెపుతూఉంటావు" అంది. "నీకు మీవాళ్లు పెళ్లిచేయాలనుకుంటూ యున్నారని విన్నాను, నిజమేనా?" అన్నాడు. పెళ్లిమాట చెప్పేటప్పటికి సీత సిగ్గుతో తలవంచుకుని "యేమో, నాకు తెలియదు" అంది. "నీకు తెలియకున్న నేను చెపుతున్నాగా, విను. పక్కయింటి క్రిష్ణమూర్తికి యిస్తారట" అన్నాడు. "ఆమాట నిన్ను నాతో చెప్పమనే యిక్కడకుపంపేరా" అంది కొంచెం కోపంగా. శివుడికి అల్పకోపసుందరమైన సీతముఖమును చూచేటప్పటికి నవ్వు వచ్చింది. "సీతా! నన్ను పెళ్లిచేసుకొనుట నీకిష్ట మేనా?" అని జవాబుకొరకు యెదురుచూస్తూ నుంచున్నాడు. "నీవు నీచదువు పూర్తి అవుతేగాని పెళ్లి చేసుకోవు కదా? ఇప్పుడు, యీమాటలెందుకు?" అంది నవ్వుతూను. "నీ యిష్టం తెలియనిదె పెళ్లిచేసు కొనుట యిష్టములేకనే అలాగ చెప్పినాను" అన్నాడు. సీత నవ్వి ఊరుకుంది. "సీతా! ఈచిన్నమామిడి ముక్క తినకూడదా?" అన్నాడు. "మామిడిముక్కలు తింటారా? జీడి తింటారనుకున్నాను" అని నవ్వి రెండుముక్కలు తీసుకుంది సీత. ఇద్దరు కిందకి వెళ్లిపోయారు.

సీతకు పరీక్షలుఅయి శలవులు అగుటవలన అంతా మేనత్తగారింటివద్దనె ఉన్నారు. సీతతండ్రి ఒకరోజు అక్కగారితో సీతపెళ్లిమాట తెచ్చేడు. "శివుడితో చెప్పితే మాట్లాడలేదు, ఏమంటావు? అక్కయ్యా! నీ అభిప్రాయమేమిటి?" అని అడిగేడు. "సీతవంటిపిల్ల నాకోడలవడంకంటె నాకేమి కావాలి? అన్నయ్యా! అబ్బాయిని అడుగుతాను." అంది ఆమె. ఒకరోజున ఆమె "శివా! మామయ్య సీతకు పెళ్లిచేయాలని తొందర పడుతున్నాడు. నీ అభిప్రాయమేమిరా?" అంది. "సీతకు పెళ్లిచేయుట నాకు అభిప్రాయమేను. నేను వస్తాను సీతపెళ్లికి పిలుస్తేను." అన్నాడు శివుడు. తల్లి నవ్వి "అదికాదురా. నీవు సీతను చేసుకొనుటకు అభ్యంతరమేమి లేదు కదా అని అడుగుతున్నాడు, మామయ్య. ఇప్పటికాలంలో అంతా పిల్లల యిష్టమేగా, నాయనా!" అంది. "అదా? నీకడిగేది. సీతను నేను పెళ్లిచేసుకు గెలవ గలనా? పూర్ణను అవుతే చేసుకుంటాను. సీత పెంకిపిల్ల. వద్దు, బాబు" అని సీతముఖంకేసి నవ్వుతూ చూశాడు. సీత కోపంగా బావకేసిచూసి అక్కడనుంచి లేచిపోయింది. "ఏమిటిరా? శివా! మాట్లాడవు? వాళ్లు పిల్ల పెద్దదవుతూందని, ఉంచుటకు వీలులేదని తొందరపడుతున్నారు." అంది. "అబ్బ! ఏమిటమ్మా? ఎప్పుడూ పెళ్లి పెళ్లి అని వేపించుకుతింటావు. ఏంతొందరవచ్చింది?" అన్నాడు. "అది కాదురా, పెళ్లీడుదాటిందని తొందరపడుతున్నారు వాళ్లు" అంది. "ఏమి యీడుదాటింది? పదమూడో యేడేగా దానికి? పెద్దవుతె నుంచుకుపోయిందేయేమిటి" అన్నాడు. "బాగా నేవుంది. ఆఖరికి చదివిన చదువు ఇందులోకి దిగిందాయేమిటి?" అంది వాళ్ళమ్మ. "సరే. నీయిష్టం. నీతో జవాబు చెప్పడం



కాకినాడ శ్రీవిద్యార్థినీసమాజ షోడశవార్షికోత్సవము
శ్రీమతి ర. కృష్ణాబాయిగారు అధ్యక్షురాలు



కాకినాడ: శ్రీవిద్యార్థినీ సమాజము



'గంగెద్దు దాసుడడుగో'



'చిట్టికి నీళ్లపోత'

కష్టం బాబు" అని షికారుకి లేచేడు. ఆనందు, పూర్ణ, శివుడు కలసి షికారుకి వెళ్ళేరు. సీతకోసరం చూచేడుకాని సీత కనబడలేదు. సీత బావన్నమాటకు కోపంవచ్చి తనస్నేహితురాలింటికి వెళ్ళి రుమాలు కుట్టుకుంటూ కూర్చుంది.

షికారు కెళ్ళివచ్చిన శివుడు, రుమాలు తయారుచేసుకుని సీతా ఒకమారే గుమ్మంలోకి వచ్చేరు. "సీతా! ఎక్కడికి వెళ్ళేవు? కనపడలేదు" అన్నాడు బావ. "ఎక్కడికీ వెళ్ళలేదు. ఈవూళ్ళోనె యున్నాను." అంది సీత. "అబ్బా! నవ్వుతూ అంటే నీకంత కోపమెందుకు? సీతా! అందుకనే నిన్ను చూస్తే నవ్వువస్తుంది" అన్నాడు. మండితే చన్నీళ్ళ స్నానంచెయ్యి" అని నవ్వుతూ లోపలకు వెళ్ళింది సీత. సెలవలు అయిపోవుటవలన అంతా వెళ్ళిపోయారు. శివరావు బి. యే. ప్యాసయి, పట్నంలో ప్లీడరు పరీక్ష చదువుతున్నాడు. అప్పుడేవో కొన్ని యిబ్బందుల వల్ల మంచిలగ్నములులేవని రెండుమాసముల వరకు ఆగేరు. సీత పెద్దమనిషి అయింది. ఇంట్లో సీతతల్లి యేడుపు మొదలుపెట్టింది. అందరికి ఈశుభ వార్త తెలిపింది. ఒకకడుపుబ్బుబ్రాహ్మణుడు యీవార్త కాస్తా సీతమేనత్తకి జేరవేశాడు. శివుడితల్లికి పిడుగుపడినట్లయింది. ఆపిల్లను తనకోడుక్కి చేసుకొని కులంలో వెలిపడడమా, చేసుకోకుండా వుండి పుట్టింటిఆశ వదులుకోడమా తెలియటంలేదు. ఆఖరికి ఆమె కులంచెడుంతుందనే అభిప్రాయంతో సీతను తనకోడలిగా చేసుకొనుటకు అంగీకరించలేదు. అన్నగారు వస్తేకూడా మాట్లాడలేదు. భోజన మయినా చేయకుండా వెళ్ళిపోయినాడాయన. ఈ సంగతంతా శివరావుకు ఉత్తరంవ్రాశాడు. శివుడు వెంటనే జవాబువ్రాశాడు. రజస్వలానంతరవివాహమె తనకు సమ్మతమనియు, సీతనుతప్ప యింకొకబాలికను వివాహమాడననియు, మీరు యేమిభయపడవద్దు అనియు వ్రాశాడు. సీతను ఇస్కూలుమానిపించి యింటివద్దనె తండ్రి, అన్నగారు చదువుచెపుతూ ఉండేవారు. ఇంటివద్ద తల్లికి పనులలో సహాయపడుతూయుండేది. శివరావు వచ్చి ఒకశుభముహూర్తమున సీతను వివాహమయినాడు. కాని బంధువులెవరూ రాలేదు. ఆఖరికి తల్లికూడా రాలేదు. శివరావు పట్నంలోనె ప్రాక్టీసు చేసుకుంటూ మంచిపకీలని పేరు పొందేడు.

శివరావు తల్లికి బోధించి పట్నం తీసుకెళ్లేడు. ఆమెకూడా ఒక్కకొడుకుని వదలియుండలేక కొడుకువద్దనే ఉంది. సంవత్సరాదిపండుగ వచ్చింది. సీతకు కొత్తచీర పండుగకు కావాలన్నఅభిప్రాయం. కాని శివరావుతో కావాలి అని ఆమె చెప్పలేదు. అయినా అతనికి తెలుసు. అదివరకే మంచిచీర తెచ్చి పెట్టిలో దాచి ఉంచేడు. కాని పయికి తేనట్టుగానే ఊరుకున్నాడు. పండుగనాడు కొడుక్కి, కోడలికి తలంటినీళ్లు పోసింది తల్లి. సీత ఆవేళ యింట్లో పద్దుకోవడంతోటె సరిపుచ్చుతూంది. లేనిపనులుకూడా కల్పించుకుని తన పాతచీరతోటె కూర్చుంది. సీత యొక్క కోపం శివరావు మధ్యాన్నంనుంచి అన్నీ కని పెడుతూనె యున్నాడు. కాని యెరగనట్టుగా ఊరుకున్నాడు. "సీతా! పాతబట్టతోనె ఉన్నావు. మంచిచీరకట్టుకు, వస్తువులు పెట్టుకోరాదుటె" అంది అత్తగారు. కాని ఆమె యేమీ జవాబు చెప్పక "ఏదయితె నేమిలే" అని యేదో లేనిపోనిపనులు కల్పించుకు తన పాతచీరతోటె కూర్చుంది. మధ్యాహ్నం ఫలాహారంవేళ అయింది. శివరావు, సీత ఫలాహారంచేశారు. శివరావు "ఈవేళ సినీమాకు వెడదామా?" అన్నాడు. విననట్టుగా ఊరుకుంది సీత. శివరావుకు కోపము, నవ్వుకూడా వచ్చినవి. "సీతా! ఈవేళ సినీమాకు వెళ్లాలి. పండగపూట కోపమేకాకుండా చెముడుకూడా వచ్చిందా యేమిటి?" అన్నాడు శివ రావు. "ఫలాహారం అయిందికదా వెళ్లండి" అంది సీత. "ఓహో! నాకు సెలవు యిచ్చేవుకదా? నీవు కూడా

రావాలి అని నేను అడగడం" అన్నాడు. "నేను రాకపోతే సినిమా కాదా" అంది. "ముమ్మాటికి సినిమాకాదు" అన్నాడు. "సరే పదండి." అంది. "ఇలాగేనా? సినిమాకు రావడం" అన్నాడు. "ఇంకే లాగో నాకర్థమగుట లేదు" అంది. సీత పట్టుదలకు తనలో నవ్వుకుని "సరే, నా తోలుసంచి యిలా తెచ్చి పెట్టు" అన్నాడు. సీత తోలుసంచి తెచ్చింది. సంచి తెరచి అందులోవున్న అందమయిన చీరతీసి "ఇదుగో చీర" అని సీత చేతికిచ్చి "అబ్బ! నీవెంత అసాధ్యురాలవో నాకు తెలుసు. అందుకనే చిన్నప్పుడే చెప్పేను. సీతతో వేగలేను బాబు అని."ఇట్లని నవ్వేడు. సీత ముఖంవికసించింది. చీకటిగావున్నగది సీత నవ్వులో వెల్లువచ్చినట్టుంది. సీత తన నూతనవస్త్రము కట్టుకు శివరావుకు, అత్తగార్కి నమస్కరించింది. "ప్రొద్దున్నుంచి ఒక సినిమా చూపించేవు సీతా! ఈవేళ నీవు" అన్నాడు శివరావు.

## జ్ఞానోపదేశము

శ్రీమతి గంటి కామేశ్వరమ్మ గారు

ఆలమందలు ఆటబయలున
మేతలను వే మేయుచుండగ
గోపబాలుఁడు కోర్కెమీఱఁగ
నట్టెఁగూర్చుండి.

ముదముమీఱఁగ మురళిచేఁగొని
ముద్దులొల్కఁగ మూతినునిచి
సరసమృదుసారస్యసంగీ
తములవాయించెన్.

మధురసంగీతమునువిని గో
పికలువేగమె పరుఁగులెత్తియు
వారిజాక్షుని వారలందరుఁ
జూచి యిట్లనిరి.

"వారిజాక్ష! నీవారమేయని స
ల్లలితముగఁ గృపజూపుమామము
విరహమునకోర్వంగఁజాలము
మదనగోపాలా!"

చేరరాఁజేడియలఁగనుఁగొని
రాధకాంతుఁడు రమణులన్‌గని
వలపుతొలఁగఁగ వారికిన్ మఱి
యిట్లుబోధించెన్.

"ఇంతులార! యిదేటివెఱ్ఱిక
వేఁగబొంకు మీవిభులచెంతకు
అత్తమామల యాజ్ఞలేవిడె
తగునె యేతెంచన్?

పరులుజూచినఁ బడనినిందల
పాలుచేతురు పాపమెరుగక
లోకులకుఁలోఁబడఁగవలయును
నిజము నారయఁగన్."

నీలవర్ణుని నీతిమాటల
ఇంపుగుదురగ నింతలున్‌విని
సారసాక్షుని సరసనిలిచిరి
నతుల నొనరించి.

"నందనందన! నీదునిర్మల
భావపూరితభవ్యగానము
విరహపతులగు వనితలన్‌మము
జ్ఞానులుగఁజేసెన్.

సృష్టిలయకార! యోదేవ! శ్రుతులుస్మృతులు
నీదులీలలఁబొగడంగ నేరకున్న
విచలమతులము మేమెంతవారమయ్యు
నిన్నుఁబొగడంగఁదలపెట్ట నీరజాక్ష!"

శ్రీమతి సామవేదము సీతారామమ్మగారు

చింపికంబళి పైనఁగప్పుకు
చిరుగుబట్టలఁగట్టి వణకుచు
వంకరగు కఱ్ఱొకటిఁబుచ్చుకు
వచ్చినాడండీ ముసలి వచ్చినాడండీ.

* * * *

భిక్షువు

ఎండ మలమలమాడ్చుచుండెను
రెండుఝాములవేళ బాబూ!
తిండితిని నాల్గాయె నేటికి
దండ మిడుచొక్కింతకబళం.

గృహస్థు

ఏదియుఁగానివేళ నిపుడేటికివచ్చితివిట్లు? భోజనం
బా? దయసేయుమింక పలుభంగులఁజెప్పకు వారియిండ్ల కా
మీదుగనేగరాదె? పదిమీరినభోజనముండునే? వృథా
నీదయనీయయుక్తులిట నేగుమువచ్చినత్రోవశీఘ్రమే.

భిక్షువు

మేడలును మిద్దెలునుగలిగిన
మేటిదొరలీరీతిఁబలికిన,
కూడుదొరకదు దండమయ్యా!
కోపపడకండో!

గృహస్థు

చెప్పినమాట నీమదికిఁజేటుగదోచెనె? మాగృహంబులో
నప్పుడెయెల్లరుండినట నన్నము లేదు నిజమ్ము నీకునై
యిప్పుడువండనేరమిఁక నెచ్చటికేనిఁజనంగమేలు నీ
విప్పగిదిన్వచింప ఫలమింతయులేదు వృథాప్రయాసముల్.

భిక్షువు

మేడలున్నా ఫలములేదు
మిద్దెలున్నా ఫలములేదు

కూడవచ్చే పుణ్యమునుఁగను
కూడఁబెట్టుము నీవు జీవా!

గృహస్థు

చాలుంజాలును కట్టిపెట్టుమికనీచాతుర్యముల్ వూరకే
యేలాయిట్లులబిట్టుగానరచెదా నీవేళఁబస్తుండినన్
పోలేదీకఠినంపుఁబ్రాణము యశంబో ద్రవ్యమోయున్నవా
కేలోచత్తురుశీఘ్రమనే మరియుదేమో మీకెదీర్ఘాయువుల్?

గృహిణి

చాలునులెంపు యూరకవిచారమొనర్పక వృద్ధు నిట్లుగా
నేలచివాట్లువెట్ట? మనకేమిటనున్నదిశాశ్వతమ్మ? పోఁ
గాలమువచ్చునంత కిటఁగాపురముండుటెకాదె? నెత్తిపై
నేలవమేనిఁబట్టుకటకేగెదమే? తలపోయుడాత్మలోన్.
అనివచియించితాఁదినక నన్నము నాతనికీయబోవ నా
ఘనమతివద్దటంచుఁ దనకాంతకునడ్డమురాగ నాపె నేఁ
డిననిపల్కి నీవుఁ దినితీరుమటంచతడాగ్రహమ్ముతో
ననుటయు, నిట్లుగానిరువురప్పుడొకింతవివాదమొందుటన్.

నాల్గురోజులనుండి తిండికి
నవయుచుండిన ముసలిప్రాణము
ఆలుమగలన్యోన్యతగవుల
నంతరించిన దెండదెబ్బకు.

* * * *

కాలమువచ్చి దంపతులకాలపుమృత్యువువాతనొందుటన్
కాలునివీటికేగి రథికంబగుత్తుత్తు దహింపనాతనున్
పోలుచునిల్లునిల్లునటశోధనచేసినపట్టెడన్న మే
మూల నలభ్యమాటఁ గనుమూసివిషణ్ణతనుండనంతటన్.

చింపికంబళ్ళిపై నఁగప్పుకు
చిరుగుబట్టలఁగట్టివణకుచు
వంకరగుకఱ్ఱొకటిబుచ్చుకు
వచ్చినట్లాయెన్ముదుసలి
వచ్చిచెయిజాపెన్.

# పరివర్తనము

శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు

మగఁడు నవనాగరికశిఖామణి. లలిత సనాతనధర్మావలంబిని.

"విగ్రహారాధన, రకరకముల దేవుళ్లు మనకున్నవి గాని దొరలకు, తురకలకు ఉన్నవా? ఒక్కడినే నమ్మినవాళ్ల మనస్సు చెదరదు కాని శివుడని, విష్ణువని, బ్రహ్మని, రాముడని, కృష్ణుడని, పైగా పదిఅవతారముల వేర్వేరు పేర్లని, ఇదిగాక లక్ష్మి, సరస్వతి, పార్వతి, కాళి, దేవి మొదలగు స్త్రీదైవతములు యీలా ఇన్ని దేవుళ్లను కొలిస్తే మనస్సు దేనిమీద నిలుస్తుంది? మీపూజలకు, నోములకు అర్థములేదు. కొబ్బరికాయకు ముక్కు చెవులుపెట్టి వరలక్ష్మి అని పూజ. పసుపుతో ముద్దచేసి గణపతి అని పూజ. చెట్టొకటి పాతి పోలకమ్మ అని పూజ. ఇలాంటి వెర్రివెర్రిచేతలచేతనే ఆఇంగ్లీషువాళ్ళు మనలనిచూచి మన పురాణములచరిత్రలు విని చేతకాని వారమని, మూర్ఖులమని, తలతోకలేని కథలు నమ్ముతామని, రావణాసురునికి పదితలలు, శతకంఠరావణునికి నూరుతలలు, కార్తవీర్యార్జునునకు, బాణాసురునకు వెయ్యేసి చేతులని అట్టిరూపము లుద్భవించుట ఆనాడు, ఈనాడు, ఏనాడుకూడ అసంభవమని, మీరు వట్టిపశువులని అనుట సంభవించినది" అని లలితభర్తయగు శ్రీధరరావన్నాడు. తిరిగి అన్నాడు: "పైగా జీవరాసులందరిలోను ఆత్మస్వరూపుడై దేవుడున్నాడని హిందూధర్మముకదా? మానవసేవచేస్తే దేశసేవఅగును. అట్టి దేశసేవచే జీవయాత్రగడిపితే ముక్తిరాదా? అట్టి జడపదార్థముల పూజించి, సంవత్సరము పొడుగున కాలము వ్యర్థముగా గడుపుతే ఏమిలాభము? వ్యర్థకష్టము. శరీరాయాసము. మడితడి అని, పండుగనాడు తెమలక ఆలస్యభోజనములు, గురుత్వము కలిగించు ఆహారములు, వీటిచే అనారోగ్యములు ఇంతేలాభము. మొన్నటిదాకా శ్రావణమాసమంతా మంగళవారములని, శుక్రవారములని, పౌర్ణమని, ఏకాదశని. స్నానములు, ఒంటిపూటతిండి, తడిబట్టలతో తంటాలుపడ్డావు. మళ్ళీ దసరా అని, దేవీనవరాత్రులని, తొమ్మిది రోజులు కలశారాధనచేసి దేవీపూజచేయాలని మొదలెట్టుచున్నావు. నీమూలాన్న నాకుకూడా వేళకు తిండిలేదు. ఏమీ యీబట్టతో ముట్టుకోవద్దంటావు. కాఫీ యిచ్చుటకైనా నీకు తీరికఉండదు. ఇల్లంతా గడబిడ."

ఆమాటలకు లలితకు మహాకోపమొచ్చింది. "పెళ్ళయినప్పటినుండి పండుగ, పూజ అంటే మీతో తంటాలు పడుచూ యిల్లాగే వేగుచున్నాను. మీమనసంత పరిపూర్ణజ్ఞానము నాకింకాకలుగలేదు. అయినా నాతంటాలు నేను పడుచున్నాను కాని నాతోకూడ మిమ్ముల నుపవాసముచేయుమనుటలేదు. కాఫీ మానమనుటలేదు. తడిబట్టలు, మడిబట్టలు కట్టుకోమనుటలేదు. మీపనంతాముగిసిన తర్వాతనే నాపూజలు నేను చేసుకుంటున్నాను. దొరలుచూచి తురకలుచూచి నవ్వుటకు వాళ్ళమతములోఉన్నవి వాళ్లు ఆచరిస్తారు. పైగా ఏరూపములేని నిర్మానుష్యప్రదేశమున ఆసర్వాంతర్యామియగు పరమాత్ముని కనుగొనుటకు మనకింత భక్తిజ్ఞానము లుదయించలేదు. మహామునులంతవారు తత్వజ్ఞానసంపాదనకై పలుకష్టములు పడుచుండగా తురకలు, దొరలు మసీదులలోను, చర్చీలలోను ప్రార్థనలు సల్పుచున్నారన్నంతమాత్రమున వారి మనస్సు భగవంతునిలోనే లీనమైయున్నవా? చిత్తం శివుడుమీద, భక్తి చెప్పులమీద అన్నట్లు నమాజు చేయాలని, ప్రార్థనచేయాలని వాళ్ళు చేస్తారుకాని భక్తిభావమురాదు. మనకింకా యీకర్మలతో కొంత మూఢభక్తిక్రింద భగవత్సంబంధమైన పనులకై తంటాలుపడిన మనస్సితరవిషయమై చింతలబడదు. పూజలచే భక్తిన్ని, మడి అనుటతో ఆరోగ్యమున్ను, నోములతో స్త్రీలబద్ధకములున్ను, పురాణపఠనములతోను భజనకాలక్షేపములతోటిన్ని శీలమున్ను బాగుపడును. ఈపండుగలగురించి ముఖ్యచరిత్రములు సనాతన

ముగా ఉన్నవి. క్రమక్రమముగా మీబోటివారిచే విసర్జించబడగా మిగతకొందరిచే విగ్రహారాధనగాను, పండుగలయుత్సవములక్రిందను స్మృతిచిహ్నములుగా నిలచియున్నవి. అట్టిదే యీదసరాపండుగ. దీనికి చాలాకారణములున్నవి. మీకింగ్లీషుగ్రంథపఠనమేకాని మన మతగ్రంథములు కంటకసమానములు. మన రామునిచరిత్రకంటె మీకు ఏసుక్రీస్తుచరిత్ర యెక్కువ తెలుసును. అట్లాంటప్పుడు నేనేమి చెప్పగలను?" అంది.

"పోనీ, నీకు తెలుసునుకదా! ఈ దసరాపండుగను గురించి నాకు తెలియచెప్పవూ. ఇదిగో చెప్పటకు మరచిపోయాను. కాకినాడ మీనాన్నగారి దగ్గిరనుండి మనల నిద్దరిని రమ్మని ఉత్తరం వచ్చింది. మీవాళ్లింట్లో నవరాత్రులు చేస్తారట. కలకత్తాలో బెంగాలీవాళ్లను చూచి మొదలుపెట్టేరు కాబోలును. త్వరగా పెట్టె బేడ సర్దుకో. కాకినాడలో గానసభలు జరుగుతాయి. పూజలు నీవు చూద్దువుగాని. ఉత్సవాలు, గానసభలు నేను చూస్తాను. ఏటేట గానకళవృద్ధిచేసే గాయకోత్సాహకరంబగు గానసభలు, శిల్పకళ వృద్ధిఅయే ఏనుగులు విచిత్రాలంకారశోభితంబుగ విగ్రహములుకట్టి దశమిదినంబునసల్పు ఊరేగింపుటుత్సవములు మనుజుల ప్రపంచకజ్ఞానాభివృద్ధికరములు. అవి తప్పక చూచి ఆనందించి ప్రోత్సహించవలసిన కళాభివృద్ధికరములగు ఏర్పాటులు. ఈరాత్రియే ప్రయాణము." అన్నాడు శ్రీధరరావు.

* * * * *

లలిత పుట్టింటికి ప్రయాణమన్న సంతోషమున త్వరగా వంటకావించి మోటారుకు సర్దుకొని సిద్ధముగానుండెను. పదిగంటలగుసరి కిరువురు భోజనములు కావించి, పదిరోజుల వఱకు తిరిగిరారు గనుక ఇల్లంతా సర్దుకొని, వీధిగుమ్మముకు తాళమువేసి బస్సు యెక్కిరి. అమలాపురంలో శ్రీధరునకు తాలూకాకచేరిలో హెడ్డుగుమాస్తాపని. స్కూలుఫైనలు చదివేడు. సంపూర్ణపాశ్చాత్త్యవ్యామోహశిక్షితుడైనాడు. స్నేహోపరణముచేత కాకినాడపట్టణపుపిల్లఆయినా లలిత మతపుపట్టుదలలు కలిగి ఆచారవ్యవహారములున్న కుటుంబములోని బిడ్డ. ఏగూటిచిలుక కాపలుకులుకదా? తండ్రివలన చిన్నతనమునుండి పురాణచరిత్రలు విని యున్నది. జాతీయవిద్యలందు నిపుణమతి. ఉభయభాషాప్రవీణురాలు. అట్టిభార్యకు నాగరికాగ్రేసరుడగు భర్తకు నడతలలో కలత లనేకములు.

వానలు వెలిసినవి. వరిచేలు బలిసినవి. బురదనీళ్లు కలకలుదేరి నిర్మలసలిలములైనవి. మబ్బులేని యెండలు. పుష్పఫలశోభితంబులగు వనములు. మేఘగర్జనములు లేక నిర్మలముగానుండునాకసము. ఆందలి స్వచ్ఛసంపూర్ణకాంతుల వెదచల్లుచంద్రోదయము. శరత్కాలసూచన లగపడుచున్నవి. శరత్కాలసంపూర్ణచంద్రబింబమును వర్ణించు కవులకలమునకింపగు ఋతువారంభమాయెను.

ఇట్టి ప్రకృతిశక్తివిలాసము నవలోకించుచు, దారిపొడుగున నగపడు పచ్చనిపచ్చికబయళ్లు కానందించుచు, గ్రామకాంతలు ఇండ్లకు గోడలకు నున్న పుపూతలు మట్టిపూతలు పసుపుకుంకుమలు ముగ్గులుపెట్టు పనులకులోనై ఆసులో కండిలాతిరుగుచుండుట కాశ్చర్యపడుచు సాయంకాలమునకు కాకినాడ చేరుకొనిరి.

కాకినాడలో నరసింహంగారియిల్లు గాంధినగరములో ఉన్నది. నవరాత్రులు చేరువకొచ్చుటచే వారి యిల్లు మందిరములతోడను, చిత్రవిచిత్రాదికపటములతోను, పచ్చని పందిరులతోడను, గడపల హారిద్రా కుంకుమలతోడను, చూతపత్రతోరణములతోడను, బంధుపరివారగణములతోడను కలకలలాడుచుండెను.

కూతురు, అల్లుడు వచ్చేరని తెలిసి సుందరమ్మగారు సంతోషపడుచు, మగనికి కొడుకులకు చెప్పి, ఎదురొచ్చి కాళ్లు కడుగుకొన నీళ్లిచ్చి, అల్లునిక్షేమోదంతమడిగి, పెట్టెలవీ తమపడకగదిలో పెట్టించెను. అల్లుని మర్యాదచేసి మామగారు చావడిలో పడకకుర్చీలో నాసీనుంజేసిరి. బంధుస్నేహబృందములో

రాత్రిభోజనములైన తర్వాత ఇష్టాగోష్ఠిలో, దసరాసందర్భముల ప్రస్తావనవచ్చి అల్లుడుమామల కీక్రింది సంభాషణ జరిగెను.

శ్రీధరరావు:— ఈ యుత్సవసంబంధవిషయముల నించుక చెప్పి నాసంశయముల దీర్పవేడుచున్నాను.

నరసింహంగారు:— నాయనా! ఇది అనాదిసిద్ధాచారముగా వచ్చుచున్నది. ఈ శక్తిపూజ బహుశః శాక్తేయులమతకాలమునుండి వచ్చియుండును. పూర్వపురాజులు వర్షఋతువుగడచి, తగినవాతావరణ స్థితిగల నీఆశ్వయుజమ్మాసారంభమున బ్రుంప్పపట్టిన కత్తికటారుల పైకిదీసి, సేనను విల్లుసాముల నేర్పరులుగాదిద్ది కోటకంతకును కులదేవతగా నుండు ఇష్టదైవతమగు దేవినుపాసించి, పూజాదికములచే దేవీప్రీతికరముగ నుత్సవాదులొనరించి, భేరీఢంకాదివాద్యములు భోరుకొల్ప, చతురంగబలయుతులై కరితురగాదిరూఢులై విజయాభిలాషులై దశమీదినంబున దండయాత్ర వెడలెడివారట. విజయచిహ్నదినంబున నే విజయదశమియనియు, దేవినుపాసకంబగుట దేవీపూజలనియు, పదిరాత్రులుత్సవంబగుట దసరాపండుగలనియు, శివప్రీతికరంబగుట శివాళసంబరములు, పాండవులు తమఅస్త్రశస్త్రవిసర్జనముసేయ శమీవృక్షంబుపూజించి అందు తమ ఆయుధంబులు దాచు టేరోజున నేగాన శమీపూజలు మొదలుగాగల అనేక రీతియుత్సవము లీదశదినముల జరుగును. దశదినము లాచరింపనివారు మూలపూజ మొదలుగాగల నాల్గు దినములైన చేయకమానరు. మృష్టాన్నభోజనములు, నూతనాంబరధారణములు, జనులవేడుకవెల్లువల పండుగయిది. అనాదిసిద్ధాచారము లిప్పటి నాగరికాగ్రగణ్యులచే మొదలంట నాశనమొనరింపబడినవి. ఆచిహ్నములే యిప్పటి బడిపంతుళ్లు పిల్లలచే గిలకలుపట్టించుట. సేనానాయకులు విల్లునమ్ములపాటనముచే తమ సేనను తరిబీతుచేయుసందర్భము యాచనాకార్యముక్రింద దిగినది. శౌర్యకార్యములు తమాషాయుత్సవముల క్రిందను; గజతురగపదాతిచతురంగబలములు గడ్డిఏనుగులు, కర్రబొమ్మలు వాహనంబులుగాచేసి యూరేగింపుటుత్సవము దండయాత్రచిహ్నముక్రిందను నిలచియున్నది. దాని పూర్వోత్తరము లెరిగిన మన కీనవరాత్రు లవశ్యాచరణీయము.

అల్లు డంతయు వినెను. సంశయవిచ్ఛేదితహృదయుడై శ్రీధరుడంతయు గ్రహించి, తన నాగరికాభిప్రాయముల నానాడే విసర్జించి, మామగారు మొదలెట్టిన పూజలందుపాలుకొని తనభార్య ఆశ్చర్యపడునటుల యుపవాసపూజాక్రియ లొనరించుచుండెను. శ్రీధరుని క్రొత్తజన్మకు బావమరదులు, అత్తమామలు, ముఖ్యముగా లలిత వింతపడి ఆనందించిరి.

ఒకప్రక్క దేవీభాగవతము, ఒకచోట హరికథ, ఒకమూల పురాణశ్రవణములతో ఉదయాస్తమయములు లలితాసహస్రనామములతో, వేదఘోషతో, దశదినంబు లత్యంతమోదంబున బ్రహ్మాండముగా దసరాపండుగ నరశింహంగారియింట నిర్వర్తింపబడెను. ఇంటింట పూజలే. ఊరంత వేడుకలే. దశమినాడు ప్రజలెల్ల నూతనవస్త్రాలంకారులై రాత్రిజరుగు ఊరేగింపువేడుకచూచునిమిత్తము వేచియుండిరి. ఇట్లుగా వారియింట వేడుకలు ముగిసెను.

ఇంక సెలవులేదని శ్రీధరుడు లలితను తీసికొని అత్తవారొసగిన కానుకల గ్రహించి, నూతనాంశములచే మేల్కొల్పబడిన ఆనందహృదయముతో సతీద్వితీయుడై ఏకాదశినాటిరాత్రికి అమలాపురము చేరిరి. లలిత కింకను తల్లిచెంతనుండెడి అభిలాషతీరలేదు. కాని భర్తయందు అనురాగిణియగుటచే పతినన్వేషించెను.

ఇట్లుగా నీదసరాపండుగ ఆసేతుహిమాచలపర్యంతో మింటింట శక్త్యానుసారము భక్తిప్రదముగా నేటికిని సాగుచున్నది. ఇక నెప్పుడును లలితనోములకు శ్రీధరుడాటంకము చెప్పడు.

# సరస్వతీపూజ

శ్రీమతి శ్రీ రాజహంస గారు

చిరుతమేఘముచేత జీవితేశ్వరికొక్క కబురుపంపించినకవియొకండు
ముద్దులోనొకకాంతమోక్షమార్గముచూపి నాటకంబల్లినమేటియొకడు
పోయినస్వర్గమ్ముపొలుపొందచిత్రింప నంధుడయ్యునుజగద్బంధువొకడు
నింపుజవ్వనమ్మున నిషధభూపతిప్రేమ తెనుగునవ్రాయించుధీరుడొకడు

దేవసములోట భారతీదేవిచెంత
సర్ధసింహాసనమ్ముపై నధివసించి
శ్రావ్యమోహనమధురప్రశాంతమైన
గీతికావళిపాడుచు కీర్తిగనిరి.

'భాగవతపురాణమ్ము నాప్రతిభ లేక
నాంధ్రలోకము కబ్బెనటంచు'పొంగి
పోతనార్యుండు శ్రీహరిగీతికలను
వల్లెవేయుచు భారతివద్దకరిగె.

'నాకవితానుగుంభనమునన్ నడయాడనిలోకమేది సు
శ్లోకులు పూర్వపుణ్యుల విశుద్ధచరిత్రములేనువ్రాయ, దే
వీ! కరుణింపు నన్ను పృథివీస్థలి తిక్కనయం'డటంచు; శో
భాకృతులొప్పునా తెనుగుభారత మామెకొసంగవేడ్కతోన్.

అంతటమందహాసమనయమ్మును చూపెడుమోవితోడ భూ
కాంతుడు పెద్దనార్య నిజకావ్యముచేతధరింప, నిద్దరొ
క్కంతయుబేధమున్ గనక యీశ్వరిపూజకుసిద్ధులై సుభ
స్వాంతములొప్పనాతరుణిపాదము చెంతవసించిరయ్యెడన్.

పిదప మిగిలిన కవులు త్వన్మధురమైన
కావ్యకుసుమాలశ్రీదేవికనియొసంగి
నిలచిరయ్యెడ తమతమనెలవులందు
పూజప్రారంభమౌనని పొంగిపొంగి.

"ఎవరది పూజవేళ నిటులేడ్తురునాగదిచెంత?"నంచు న
ద్దివిజలతాంగి భారతి పదే కవివర్యులప్రశ్నచేయ "ఆ
భువి నొకకృష్ణశాస్త్రికవిముఖ్యుని తేనెయొలుంగుయేడ్పులే
దివిజగృహాంతరాల నిట దేవి! వినంబడె"నంచుపల్కుటన్.



శ్రీమతి సరళాదేవిగారు

ఒక్కనిట్టూర్పుతోడ మహోగ్రమైన
యశ్రుబిందువుజార్చి యనంతరమ్ము
పూజగద్దియనెక్కి ప్రమోదమొప్ప
వేదవిధితోడ పూజగావింపదొడగి.

మానవులందరున్ సలుపుమాదిరి పూజయొనర్చువేళ స
మ్మాననిని కేమిలోటు శుకమాని పురోహితుడై నిలింపసం
ధానితపుష్పమాల్యమధుదర్పపరీమళముల్ సెలంగు నా
స్థానములోన బ్రహ్మ హరి శర్వులు కూడినతోడనే స్తుతి
ధ్యానములొప్పగాసలిపె భారతిపూజ నఖండశోభతోన్.

పూజముగిసినతోడ నపూర్వవుబోణి
సరసమారీతి కనుసు ప్రసాదమిచ్చి
కవులనంపించి మరియొకగదికిపోయె
నలలితంబైన "గృహలక్ష్మి" చదువుకొనకు.

## ఆహ్వానము

శ్రీమతి పి. సీతారామమ్మ గారు

సమయమియ్యదె లెండు రండో
సకియలారా! జాలమేలను
శాంతిసైన్యము జేరి శాశ్వత
సద్యశమ్మును గాంచగా.
పారతంత్ర్యపుదాస్యశృంఖల
బారిబడి కనుబడలుచుండిన
భారతాంబ స్వతంత్రసిద్ధిని
కోరి పూనికపోరగన్.
స్వార్థపశుబలసారరక్షిత
స్వార్థమర్గమదుర్గముంగొన
శాంతిసాహసహాసశరముల
సరగసంధింపన్.
వినుటలేదో విజయదుందుభి
కనుటలేదో క్రాలుధ్వజమును
మనమహాత్ముల పనుపుతలనిడి
యనికి మునుకొనిపోవన్.

వీరులకు వీరాధిదేవత
పూరుషాళికి మార్గదర్శిని
వీరరుద్రమకీర్తిగీతల
సారమొక్కటిగ్రోలన్.
సంగరమున స్వరాజ్యలక్ష్మికి
పొంగుచును మెయిబలినొసంగిన
యంగనామణి ఝాన్సిలక్ష్మికి
మంగళమ్ములపాడన్.
ఆంధ్రశూరుల శౌర్యపటిమకు
ఆంధ్రమంత్రుల త్యాగబుద్ధికి
ఆకరంబగు వీరమాతల
సాంద్రతేజంబుండినన్.
చచ్చినను స్వారాజ్యమబ్బును
చావకున్న స్వరాజ్యమబ్బును
చచ్చిబ్రతుకుటో బ్రతికిచచ్చుటో
నచ్చినదిచేపట్టన్.

# ప్రేమ

శ్రీమతి యు. సత్యబాలసుశీలాదేవిగారు

లేమావిగున్నమీద కోయిల కుహూకుహూధ్వనితో పర్వతపుచరియలు ప్రతిధ్వనిస్తున్నవి. అపక్షీ గయ్యాళితనం తిలకిస్తూ ఆమె అక్కడేకూర్చున్నది. ఎంతసేపటినుండి నిలుచున్నాడో అతడక్కడ? పికధ్వనికి మారుపలికేనెపంతో తెలీజేసుకున్నాడు. కరుణాపూరితార్ద్రదృష్టితో ఆమె తిరిగిచూసింది. అతడామె హస్తాబ్జము గ్రహించి నిశ్శబ్దంగా ప్రక్కనకూర్చున్నాడు.

"ఏల నీకీహృదయవేదన?"

కనులతోనే ప్రశ్నించిందామె. ఆనిర్మలహృదయంలో కలతలేదు- ఆనిశ్చల దృష్టిలో వెలితిలేదు.

"యువతీ! నీప్రేమభిక్షకొరకీయాచకుడు వ్యథితహృదయంతో కలవరపోతున్నాడు. ఏల నీకు నిర్దయ.?"

అతనికంఠంరుద్ధమైంది-చూపులు జాలివహించినవి. ఆమెకనుల్లో ఆలోచన ప్రవహించింది-అగులాబీపెదవులు చలించిపోయినవి. "ఏటికీతొందర?" హృదయవాణి ఆమెను ప్రశ్నించింది. ఏదో ఒకానొక అనిర్వాచ్యప్రవాహ మాఅమాయక హృదయాన్ని ఊపిరాడకుండాముంచేసింది-ప్రక్కకుతిరిగి, కలస్వనంతో గంభీరంగా ప్రవహిస్తోన్న సేలయేటిని ఆత్రంతో చూస్తున్నది. మందగమనంలో విసుగులోచినట్టుగా గాలితెరవిసురుగావిసిరింది.ఆమె చీరచెరగు భుజమూలంనుండి తొలగింది.

"ఆగాయపుమచ్చఅదే!" అతని కనులముందు చీకటితెర పడిపోయింది. అహృదయమొక్కనిష్వరపాటుతో మారిపోయింది.ఆగాలితెరలో అతనికో ప్రశ్న- "మోహమెంత గ్రుడ్డిది?". "సోదరీ! సుజా?"...మరిమాటరాలేదు. తేలిపోయిన చూపుల్తో దీనంగాసుజాతను చూస్తున్నాడు.

సుజాత నివ్వెరపోయింది. మార్గమధ్యమున చోరగ్రస్తులై పదేళ్లనాడు విడిపోయిన ఆసంగతి ఇరువురిమధ్య మెరుపువలెకనబడిపోయింది-"సుధీ! దాదా!" సుజాతబాహువల్లరి సుధీరుని కంఠాన్ని పెనవేసుకుంది.

ప్రకృతి ప్రేమతరంగితమైపోయింది! మావిపొద యాశీర్వదించి కుసుమాక్షతలు జల్లింది! చెట్టుకొమ్మల్లోంచి చంద్రిక కిలకిలానవ్వింది. అనిశ్శబ్దతను చీల్చుకుంటూ ప్రవహిస్తోన్న యేటిరొదలో ప్రకృతిమాత పవిత్రప్రేమగానం చేసింది.జాజిపొదలమీదుగావచ్చిన గంధవహు డాసోదరీసోదరులకు శుభాసీస్సుల నొసగి లాలించేడు.

# దసరా

శ్రీమతి అయ్యదేవర బాలాత్రిపురసుందరమ్మగారు

"పుణ్యదినమంచు సంక్రాంతిభోగియొకటి
ఆటలాడుటకును వినాయకునిచవితి
మందుకాల్పులు కార్తీకమాసమందు
ఆటవిడుపుదినములన్న హర్షమేల?
మనకుసెలవులు మిత్రమా! మఱలనిపుడు.
ఆలయముకేగ రేపెగా అయ్యవారు
ఒక్కటెంకాయ చేబట్టి హాయలుమీర
కొత్తదుస్తులనుధరించి కోర్కెమీర
రామునిల్లంబు కేల్బూని రంగుమీర
పాఠశాలకురమ్మంచు మనకుఁజెప్పె
త్వరగబోదము"రండంచు త్వరితగతిని
కుప్పిగంతులఁబోయెడి కుఱ్ఱలార!
చిఱుతలంగొట్టుచునుబోవు చిన్నలార!
పదములనుపాడుచునుబోవు బాలులార!
ఊడిపడెనేమి? దసరామహోత్సవంబు.
పంగనామముదిద్దియు పాగజుట్టి
కొత్తకాన్వాసుచొక్కలాంగ్కోటుదొడఁగి
తెల్లపురుగంచుకండువా వల్లెవేసి
మట్టలాగులఁదొడగిన బొట్టివాండ్ర
చిఱ్ఱబొచ్చులుఁబ్రేలాడు చిట్టివాండ్ర
జడలకోలాటముల వేయు గడుసువాండ్ర
హాయలుమీరగబాడెడి వయసువాండ్ర
శిష్యులనుశిష్యరాండ్రను జేరదీసి
భాను డుదయించినంత సాపాటుజేసి
కూతలిడుచుండుపిల్లల కోడిరీతి
బడిని సాక్షాత్కరించెను పంతులయ్య.
పోము లోభివారిండ్లకు బోమటంచు
అయ్యవారికి నూటపదార్లటంచు
బాలులకుచాలు పప్పుబెల్లాలటంచు
బాలకులదీవెనలుబ్రహ్మపలుకులంచు
జయవిజైభవా శ్రీదిగ్విజైభవంచు
పంతులటుబాలకులతో మీపంచజేర
తనయులనుజూచి యుప్పొంగుతల్లులార!
తన్మయత్వంబుజెందెడి తండ్రులార!
బాలుపల్కులువిను మేనమామలార!
సమయమిదె లెండు పంతుల సత్కరింప.
ధరపిశాచములన్గొట్టు ధన్యులార!
వీరబలులిచ్చుబహుమంత్రవేత్తలార!
కీర్తివ్యాపింపఁజేయుశాక్తేయులార!
కానుపించెను మూలనక్షత్రమదిగొ
కలశముల స్థాపనముసేయు కదలిరండు
కోపగించుమహాశక్తి కోర్కెలిచ్చు
దుర్గపొంగళ్లుపొంగింప తోడువడను
నాదములతృప్తిపరుపంగ మోదపడను
శక్తిపూజలుసేయంగ సాగిరండు.
అసురసామ్రాజ్యమెల్లెడ నావరింప
వీరమహిషాసురునిజంప వేగిరింప
శివునిచిరునవ్వుమోమున జెంగలింప
పార్వతీదేవి శక్తిగా మారిపోయె.
రుధిరపానంబుగ్రోలు శార్దూలమెక్కి
కోపమునరాక్షసేంద్రుని కురులుబట్టి
కుత్తుకనుబట్టి కత్తితో గోయుచుండె.
ఆదిశక్తియటంచు పై కెగురుచుండు
శక్తివలెవేషములువేయు సరసులార!
మాలడప్పులమోతలు మాఱుమ్రోగ
తందనకనాడుపులివేషధారులార!
యిచ్చిరా? మీకుబహుమతుల్ ముచ్చటగను.
బువ్వబెట్టుచు నీమాత బుజ్జగింప

అదిగో పులి అల్లదే పులి అదె పులి పులి
యంచు భయపెట్టు అల్లరి నాపుమోయి
అన్నమును దినకుంటివా? హడలగొట్ట
బాలకా! నీకు భయమేల మకురదేల!
భూతకులనాథుడౌను మా పూర్వరాజు
పూతచరితుడు వీరుడు ప్రేతరాజు
వంశబిడ్డలమంచు రవ్వంతయైన
జ్ఞప్తియుండెన మీకు? సుజ్ఞానులార!
నాయకులమంచు చెప్పెడి బోయలార!
రక్తబలులివ్వడీ ముత్తరాజులార!
నిలిపిరా? మీరు భేతాళు నిలిపినార?
అత్తగారన్న నీకింత హడలదేల?

విజయ పూజలొనర్పంగ విజయదశమి
పండుగొకటొచ్చె నేడు నా పాలికంచు
విసుగు జెందక మధ్యాహ్న వేళయందు
గారెలను బూరెలను వండి కాంతుతోడ
చెక్కుటద్దాలముద్దిడి చిట్టితోడ
అరగింపుము పాయస మారగింపు
క్రొత్తకోడలా! పార్వతి కోర్కెలిచ్చు.
జనులు గుమిగూడుచున్నారు సంతసమున
తాళములు మ్రోగుచున్నవి వేళయయ్యె
పరుగులిడుచుండ్రి అల్లదే పారువేట
పోవుదము మిత్రమా! శమీపూజ నేడు.

# సహజబాధానుభవము ప్రేమికల పాటు

శ్రీమతి తల్లాప్రగడ విశ్వసుందరమ్మగారు

లేతకాంతుల వెలుగొందు లేగులాబి
మించు రక్తిమగాంచి తామించు ప్రేమ
కౌగలింతలగనుటకు గవిసె లతిక
చిగురుటాకుల జిగిమించు చెలువుతోడ
మిసమిసల జిమ్ము రెమ్మల మిసిమితోడ
దినదినమ్మును నెదిగెడు తీవెగముల
నల్లిబిల్లిగ నలమిన ననలతోడ
తళుక్కు బెళుక్కుల జలుక్కు నందంబుతోడ.
లేగులాబియు లతికానురాగమొలయ
అక్కువ గదించి ముద్దాడ నాసతోడ
చిగురుచేతులసాచె మోహంబుతోడ.
దినదినమ్మును కోర్కెలు క్రేళ్లుదాట
చిగురుగొమ్మలనూగించి బిల్చుచుండ
రక్తిమను గాంచి రాగంబుగనిన లతిక
కాంతునిన్ తమితోడుత కౌగలింప.
ప్రేమగనిన లతాంగియన్ నెనరులేక
అలరు మృదులంపు చెల్వయన్ కరుణలేక
తోలుతదరి జేర్చి ముద్దాడి దయతొరంగి
కంటకంబులు చే తను వెల్లగీరె.
అగడుబరచిన మృదులమానసట్టితీవె
సహజసుకుమారపుంజంబు లతిక మిన్న
ఏమిసేయంగలేక నొగులుచుండె
బంధములగట్టి ప్రేమమిన్నందుచుండ.
ప్రకృతిలో జరుగు భర్తల చేతలివియె
సహజబాధానుభవము ప్రేమికల పాలు
ప్రేమకొరకై జీవించి ప్రేమకొరకె
కష్టములె సుఖములని మానసమున నెంచి
బ్రతుకు సుకుమారలే పుణ్యవతులు భువిని.

౧. పదము

# తొక్కు పల్కులు

శ్రీమతి యన్. వి. సరళాదేవిగారు

ఎలుక ఎలుక—
ఏమి ఎలుక?
మీసమెలుక—
ఏమిమీసము?
బారుమీసము—
ఏమి బారు?
ఇంటిబారు—
ఏమిఇల్లు?
పెంకుటిల్లు—
ఏమిపెంకు?
వరపెంకు—
ఏమివర?
కత్తివర—
ఏమికత్తి?
సానకత్తి—
ఏమిసాన?
రాతిసాన—
ఏమిరాయి?
రంగురాయి—
ఏమిరంగు?
తోపురంగు—
ఏమితోపు?
మామిడితోపు—

ఏమిమామిడి?
ముంతమామిడి—
ఏమిముంత?
కల్లుముంత—
ఏమికల్లు?
ఈతకల్లు—
ఏమిఈత?
చిట్టిఈత—
ఏమిచిట్టి?
లక్కచిట్టి—
ఏమిలక్క?
పచ్చలక్క—
ఏమిపచ్చ?—
ఆకుపచ్చ—
ఏమిఆకు?
బండియాకు—
ఏమిబండి?
మట్టిబండి—
ఏమిమన్ను?
బంకమన్ను—
ఏమిబంక?
తుమ్మబంక—

ఏమితుమ్మ?
సీమతుమ్మ—
ఏమిసీమ?
రాయలసీమ—
ఏమిరాయలు?
కృష్ణరాయలు—
ఏమికృష్ణ?
నీటికృష్ణ—
ఏమినీరు?
వాననీరు—
ఏమివాన?
గాలివాన—
ఏమిగాలి?
చల్లగాలి—
ఏమిచల్ల?
గోత్రెచల్ల—
ఏమిగోత్రె?
కొమ్ముగోత్రె—
ఏమికొమ్ము?
వంకకొమ్ము—
ఏమివంక?
చంద్రవంక—

## ౨

శ్రీమతి మొగసాటి అప్పలనరసమ్మగారు

పూసమ్మపూస—
ఏంపూస?
కారప్పూస—
ఏంకారం?
మిరపకారం—
ఏంమిరప?
కొండమిరప—
ఏంకొండ?
బెల్లంకొండ—
ఏంబెల్లం?
పటికబెల్లం—
ఏంపటిక?

పాలపటిక—
ఏంపాలు?
మేకపాలు—
ఏంమేక?
కంచెమేక—
ఏంకంచె?
ముళ్లకంచె—
ఏంముళ్లు?
ముచ్చటముళ్లు—
ఏంముచ్చట?
పెళ్లిముచ్చట—
ఏంపెళ్లి?

పిల్లపెళ్లి—
ఏంపిల్ల?
చిలిప్పిల్ల—
ఏంచిలిపి?
చెయ్యిచిలిపి—
ఏంచెయ్యి?
కుడిచెయ్యి—
ఏంకుడి?
రాకుడి—
ఏంరాకు?
పరాకు—

౩. పాటలు

## అవ్వపాట

శ్రీమతి కొప్పర్తి పీరాబాయిగారు

వంకరకాళ్ల బయ్యన్న పెళ్లాంబియ్యమమ్మింది.
చెట్టుమీదచెవులపిల్లి చెపుతాసన్నది.
గట్టుమీదగంగారమ్మ గంతులేసింది.
మూలనున్నముసిలిఅవ్వ మూతితిప్పింది.
మూలనున్న పిల్లికూన పాలపుట్టికెక్కడం,
కావలున్న ముసిలిఅవ్వ కట్టెతీసికొట్టడం,
పిల్లిపారిపోవడం, పాలకుండ పగలడం,
తాతగారు తన్నడం, అవ్వగారు ఏడవడం.

## మామీద చాలదయయుంచవలెను

ఏపూరయామీది? ఎందుండివస్తిరి?
కూర్చుండవోటీయు కొంచమనగ
దాహంబులై తేను ఇప్పించగాని
దొడ్డగేదెలు రెండు పట్టిపోయె.
స్నానంబులై తేను చేయించగలగాని
చేదయున్నదిగాని త్రాడులేదు.
గంధంబులై తేను తీయించగలగాని
చెక్కఉన్నదిగాని సానలేదు.
భోజనంబై తేను బెట్టించగలగాని
మాయింటమగవారు మంకువారు.
అయ్యో! ముందూరు మీరువెడలి
మాపేరుజెప్పి భోజనముజేసి
మామీదచాల దయయుంచవలెను.

## వినుకొండసీమ

అహో! విచిత్రం వినుకొండసీమ
ఇతఃపరం కొట్టలుసీల్లులేవు.
ఆర్కానుసజ్జ మరిజొన్నబువ్వ
పిల్లాళ్లకైన వరిబువ్వలేదు.

## చందమామపాట

శ్రీమతి ఇలిచేటి వేంకటసీతామహాలక్ష్మీబాలత్రిపురసుందరీగారు.

చందమామ చీరగట్టి
సన్నబియ్యం ఒళ్లోబోసి
అమ్మా! నేను చిన్నదాన్ని
అల్లుడొస్తే పంపాబోకు
మామవస్తే మళ్లీరమ్మను.
చాకింటిమడతాలన్నీ
చాకలివాడు తేనేలేదు.
చద్దికట్ట కూడులేదు.
సాగనంప పొద్దులేదు.
ఇరుగుపొరుగు అక్కల్లార!
చుట్టుపట్ట సుదతుల్లార!
చూడవచ్చే వణతుల్లార!
తుసుక్కున తుమ్మండి
ఒకటే తుమ్ము, అచ్ఛి!

## పితృభక్తి

శ్రీమతి దరిశి సుబ్బలక్ష్మమ్మగారు.

రామారామా బడికెందుకురా?
చదువుకుండేటందుకురా.
చదువుకుండే దెందుకురా?
జ్ఞానముగలిగే టందుకురా.
జ్ఞానముగలిగే దెందుకురా?
సంపాదించేటందుకురా.
సంపాదించే దెందుకురా?
పెండ్లీ అయ్యేటందుకురా.
పెండ్లీ అయ్యే దెందుకురా?
బిడ్డల గనేటందుకురా.
బిడ్డల గనే దెందుకురా?
పెంచూకుండే టందుకురా.
పెంచూకుండే దెందుకురా?
ముప్పునసాకే టందుకురా.
సాకినలాభ మేమిరా?
మోక్షముపొందుటె లాభమురా.
సాకనివాడు ఎందుకురా?
గొడ్డెలుగాచే టందుకురా.

## నాకుపట్టంచు

ఒక్కాఓచెలియా
రెండని రేగుళ్లు
మువ్వల ముచ్చిలియ
నల్లనిగులివింద
అయిదని చిటిగోలును
ఆరుందవ్వాళ్లి
ఏడని భేటీలు
ఎనిమిదిమనమంద
తొమ్మిది తోకుచ్చు
పదికిపట్టెడ
పరమట గుడిచిలుక
కండె రెండామె
కాక్కాకరకంచు
పిచికకు బీరంచు
అమ్మకు బొమ్మంచు
నాకు పట్టంచు.

# ఆటపాటలు

శ్రీమతి పరమాత్ముని అనసూయాదేవిగారు

గుమగుమగుంజం గుండేరాగం
పాములుపట్నం పడిగేరాగం
చిన్న అన్నగుఱ్ఱం చిందులుతొక్కె
పెద్దన్నగుఱ్ఱం పెండ్లికిపోయె

చిట్టీతపండెరుపు చిలక ముక్కెరుపు
చింతల్లచిగురెరుపు జీడిపండెరుపు

సీలంసీలంబసరం లే బెసంలే
యారంద్రూయారంద్రూ
గండందాగండందా
గండసుమాతు సుళ్ల లేసుళ్లంలే

ఇల్లిబామెణితి
ఇల్లికూడెణితి

చిప్పిచిప్పిగోళ్లు
శింగరాజుగోళ్లు
మండప్పగోళ్లు

వొప్పులకుప్ప
వొయ్యారిభామ
పీలాకుచ్చు
వాలుమొగ్గ
విస్తరంట

బావాబావాపన్నీరు
బావనుపట్టుకతన్నేరు

౧
నీగుఱ్ఱం నీళ్లకుపోయె
నాగుఱ్ఱం పాలకుపోయె
కత్తా? కఱ్ఱా? వేన్నీళ్లా? చన్నీళ్లా?

౨
దానిమ్మపండెరుపు తాంబూలమెరుపు
అబ్బాయిమెరుపు తనవారిలోకి.

౩
హతరుమాతు కరవంలేకరవంలే
దేవునమనిగి వోగోనాంవోగోనాం
తూగనితోట్ల తూగానాం
తూగానాం-తుతుతు.

౪
మాతాడెణితి
ముద్దుకోడెణితి.

౫
మాతాతగోళ్లు
ముచ్చటైనగోళ్లు
ముత్యాలగోళ్లు.

౬
పీసపుల్ల
సన్నబియ్యం
చాయపప్పు
గూట్లోరూపాయి
నీమొగుడుసీపాయి.

౭
గోడఅవతలకు యీడ్చేరు
గుద్దులబెల్లంపెట్టేరు.

## లక్ష్మీదేవిసారె

అత్తమామ పట్ల
ఒద్దికకలిగి ఉంటె
దీపావళీ పండుగనాటికి
నాతీ! నిన్నుతోడుకవత్తు
చీనిచీనాంబరాలిత్తు
కాటుకభరిణెలిత్తు
కలకంచుచీరెలిత్తు
మాకొమ్మ! లక్ష్మీదేవీ!
పోయిరావమ్మా!
పోయిరా మాయమ్మ!
పోయిరావమ్మా!
పోయినీఅత్తింట
బుద్ధిగలిగుండు.
ఎవ్వరేమన్నను
ఎదురాడబోకు.
మామగారేమన్న
మారాడబోకు.
అత్తగారేమన్న
అలిగుండబోకు.
మాయమ్మ! లక్ష్మీదేవీ!
పోయిరావమ్మ
ధరణీదేవి అదరేనమ్మ
భూమిదేవి బెదరేనమ్మ
మాయమ్మ! లక్ష్మీదేవి
పోయిరావమ్మా!
పలుమారు పన్నెత్తి
నవ్వబోకమ్మ!
నవ్వినచిరునవ్వ
నవ్వమాయమ్మ!
పతి వామభాగమున
పడతి! శయనింపు.
వాలులేకను
పూలుముడవకే తల్లి!
మాయమ్మ! లక్ష్మీదేవీ
పోయిరావమ్మ!
పట్టపేనుగునిచ్చెదగాని
ఝారీచెంబులు యిచ్చెదగాని
మాయమ్మలక్ష్మీదేవీ!
పోయిరావమ్మా!
ముత్యాలహారాలిత్తు
రత్నాలహారాలిత్తు
జన్నీఆవులు అరణాలిత్తు
మాయమ్మ! లక్ష్మీదేవీ!
పోయిరావమ్మా!
పోయిరామాయమ్మ!
పోయిరావమ్మా!
మాయమ్మ! లక్ష్మీదేవీ!
మళ్లీరావమ్మా!

## దాగుడుమూత పాట

శ్రీమతి కొండాలి వేంకటసుబ్బమ్మగారు

దాగుడుమూత దండాకోర్
పిల్లీవచ్చె పల్లేరుగాయ్
ఎక్కడదొంగలక్కడనే
గంగానమ్మ గప్‌చిప్.

## వదిన వేవిళ్ల పాట

వదినా!వదినా! వేవిళ్లా?
నీతో ఎవరూ చెప్పేరు?
నాతోమాఅన్న చెప్పేను.
అంతాపుణ్యంపుచ్చిందా?
అనంతుడినోము నోచేనా?
బావినీళ్లకుపోయేనా?
బాలింతకట్టు కట్టేనా?
మీఅన్నయ్యగారుకట్టినమేడలో
గజ్జెలపాపణ్ణిఎత్తుకొని
ఘల్లుఘల్లుతిరిగేనా?

## నీ మొగుడు పేరేమి?

శ్రీమతి యింగుళి గనుభద్రమ్మగారు

అరటిపండరిటిపండుఅమ్మన్న బొజ్జ
పేరుపేరురామన్న పెండలంబొజ్జ
అత్తవారింటికి చల్లకిపోతె
కూడుతిన్నాచోటకుంకమ్మురాలె,
మారుతిన్నాచోట మల్లెల్లురాలె.

మల్లెలకు మాతాతకోటకట్టించె
కోటలోయున్నాది కొమ్మరటిమొగ్గ
కోయించిరారోయి కోడవళ్లులేవు
నూర్పించిరారోయి నూరీళ్లులేవు
చంద్రక్కా! చంద్రక్కా! నీమొగుడుపేరేమి?

## బువ్వముపాట

చిట్టి చిట్టి మిరియాలు
చెట్లకిందపోసి
పుట్టామన్నూ తెచ్చి
బొమ్మారిల్లుకట్టి
బొమ్మారింట్లో పిల్లాతల్లికినెయ్యిలేదు
నాతలకూ నూనెలేదు.
అల్లావారింటికి చల్లకుపోతె
అల్లవారికుక్కా భౌమన్నాది
నాకాళ్లాగజ్జెలు ఘల్లుమన్నాయి.

## నెలపొడుపు నూలుపోగుపాట

నెలనెలకు బాలుడవై
నెలకోమాటురావడమై
మా అమ్మకు తమ్ముడవై
నాకు మేనమామవై
పాతవస్త్రంపుచ్చుకొని
కొత్తవస్త్రం ఇయ్యి.

## పాతపాటలు

శ్రీమతి కొసరాజు సీతారామమ్మగారు

౧

కోడలా! కోడలా! కొడుకుపెళ్లామా!
పచ్చిపాలామీద మీగడేదమ్మా?
అత్తరో! ఓఅత్త! ఆరళ్ల అత్తా!
వేడిపాలామీద వెన్న యేదమ్మా?

౨

వానలేక వరిమొక్క వాడుదేలింది
నీళ్లులేక నిమ్మ నిలువుకెండింది
వానొచ్చికురిసింది వరిచేలమీదా
లక్ష్మొచ్చివరిగింది రాసులామీదా.

౩

ఇల్లాలవై యుండ యిల్లుఉండంగ
వగలాడి! నీకేల వట్టిదుఃఖంబు?

౪

వాసనాలేనిపువ్వు పూసేమిఫలము?
వద్దపురుషుడులేని వగలేమివగలు?
కాయగూరాలన్ని కాసేమిఫలము?
కాముకులేనీవంట వండేమిఫలము?

## జోలపాట

అబ్బాయిమామలు ఎటువంటివారు?
అంచుపంచెలవారు, అంగీలవారు
నిలువుటంగీలవారు, నియోగివారు.

## వీరభద్రుడు

చిన్న చెంబుతోటి
శీకాయఉదకము
అల్లమ్మబెల్లమ్మ

## దసరాపాట

మాటాడితప్పవో మన్మథాకార!
సాటెవ్వరునీకు సద్గుణాధార
సరసంపునీగుణము జాజిపూతోట
పరమైననీమాట వరహాలమూట
సరిలేనియీధాత్రిజనములకు నీవు
క్షీరవారికి చంద్రుబోలెదవు
మురుగులును ముల్లతాడు మేలుగాబెట్టి
చంద్రహారముదాల్చి చౌకట్లుగాంచి
అంగీలమీద జోడంగీలుదొడగి
అందమగుమొలదట్టి బిట్టుబిగియించి

శ్రీమతి వై. కమలాదేవిగారు

అబ్బాయితండ్రులు యెటువంటివారు?
ఊరకుక్కలతోజేరి ఊరేగువారు,
గుడ్డిగుఱ్ఱములెక్కి గోడెక్కువారు.

శ్రీమతి శ్రీరాం నాగభూషణంగారు

అరటిపండ్లుతేనెతోమాగిన
తియ్యమామిడిపండ్లు
బాగాయెమనవీరభద్రునకునూ.

శ్రీమతి యరపోతు కనకరత్నమ్మగారు

సరిగంచుతల్లపాగ శిరమునకుజుట్టి
ఘనతురంగమునెక్కి కత్తిచేబట్టి
దుమికించిశత్రులను దునుమాడగలవు
మదపుటేనుగునైన మరలింపగలవు
కొదమసింగమునైన గొట్టితేగలవు
అడవిబెబ్బులినైన నదలించగలవు
పదునైననీకత్తి కెదురులేదయ్య.
మీకీర్తివర్ణింప మేముబాలురము
ఎరిగినంతకుమీకు నెఱిగించినాము
బహుమానములనిచ్చి పంపదగుమమ్ము.

## గౌరమ్మపాట

ఒక్కొక్క అక్షంతలూ
గౌరమ్మా!
ఒక్కమల్లెసాలూ
గౌరమ్మా!
చిన్నిచిటివత్తులూ
గౌరమ్మా!
సన్నదీపాలునూ
గౌరమ్మా!
నీలాటిజలధివద్ద
గౌరమ్మా!
నీనోము నీకుజెల్లె
గౌరమ్మా!
నానోము ఫలంజెప్పు
గౌరమ్మా!
తబుకుతో తబుకెడు
గౌరమ్మా!
ముత్యాలు పట్టుకో
గౌరమ్మా!
వదినపెండ్లాడవే
గౌరమ్మా!
బాలునీపెండ్లాడవే
గౌరమ్మా!

3. కథలు

## చిలుక, కాకికథ

శ్రీమతి దరిశి అన్నపూర్ణమ్మగారు

అడవిలో ఒకరాగిచెట్టుండేది. ఆకుకనబడకుండా రాగిపండ్లుండేవి. గుంపులుగుంపులుగా చిలుకలు కాకులువచ్చి రాగిపండ్లుతినేవి. అందులో ఒకకాకి, ఒకచిలుక పండ్లకొఱకు తగువువేసెను. చిలుక కాకిని జూచి "కాకి కన్నులొట్టపోని" అన్నది. కాకికన్నులొట్టపోయింది. కాకికి కోపంవచ్చింది. "చిలుకమూతి సొట్టపోని" అన్నది కాకి. చిలుకమూతి సొట్టపోయింది. రాజుగారి ఏనుగ రాగిఆకులు తినడానికివెళ్లి "కాకీ! నీకన్నులొట్టపోయిందే" మన్నది. "నేనేమని చెప్పేది? కాకికన్నులొట్టపోయింది, చిలుకమూతి సొట్టపోయింది, ఏనుగతొండం వెనుకకుపోనీ" అన్నదికాకి. ఆలాగే ఏనుగతొండం వెనక్కుపోయింది. ఏనుగ ఏటికివెళ్లి తోకకు అతుక్కునిపోయిన తొండంతో నీరుత్రాగింది. ఏరు ఏనుగతో "తొండంవెనకుపోయిందే" మన్నది. ఏనుగ "నేనేమని చెప్పేది, కాకికన్ను లొట్టపోయింది, చిలుకమూతి సొట్టపోయింది, ఏనుగతొండం వెనక్కుపోయింది; ఏటిలో నీరెండిపోనీ" అన్నది. ఏటిలో నీరెండిపోయింది. అత్తా, కోడలు మడినీరు తెచ్చుటకు ఏటికివెళ్లిరి. నీరులేనందున "ఏరా! ఏరా! నీరెందుకులేదన్నారు". ఏరు "నేనేమని చెప్పేది, కాకి కన్నులొట్ట పోయింది, చిలుకమూతి సొట్టపోయింది, ఏనుగతొండం వెనక్కుపోయింది, ఏటిలోనీరెండిపోయింది, అత్తా కోడల తలలకు బిందెలంటుకుపోనీ" అన్నది. దానిమాటప్రకారమే బిందెలంటుకొనిపోయినవి. ఇద్దరు యింటికివెళ్లేసరికి మామగారు జపముచేయడానికి జపమాలతో కూర్చొన్నారు. మామగారు కోడలను జూచి "నీళ్లెందుకు లేవే" దన్నారు. "నేనేమని చెప్పేది, కాకికన్ను లొట్టపోయింది, చిలుకమూతి సొట్టపోయింది,; ఏనుగతొండం వెనక్కుపోయింది, ఏటిలో నీరెండిపోయింది, అత్తా కోడల తలలకు బిందెలంటుకొన్నవి, మామగారిచేతికి జపమాలంటుకొపోనీ" యని కోడలనేసరికి జపమాల శెట్టిగారిచేతికి అంటుకొనిపోయింది. శెట్టి జపమాలతోగూడ కోర్టుకువెళ్లెను. జడ్జీ శెట్టినిజూచి "కోర్టుకు జపమాల తెచ్చినావెందుకు?" అన్నాడు. శెట్టి "నేనేమనిచెప్పేది, కాకికన్ను లొట్టపోయింది, చిలుకమూతి సొట్టపోయింది, ఏనుగతొండం వెనక్కుపోయింది, ఏటిలో నీరెండిపోయింది, అత్తా కోడలకు బిందెలంటుకొన్నవి, శెట్టిచేతికి జపమాలంటుకొన్నది, జడ్జీగారికి, వకీళ్లకు కుర్చీలంటుకొపోనీ" అన్నాడు. అందరికి కుర్చీలంటుకొన్నవి. కుర్చీలు ఏలాగువదిలించడం తెలియక అందరుచేరి గట్టిగ బొబ్బలు పెట్టేరు. బొబ్బలువిని ఊళ్లోవాండ్లంతా భయపడి కోర్టుచుట్టుగుమిగూడిరి. వారిలో ఒకగోసాయి జడ్జీనిజూచి జరిగినకథ చెప్పమన్నాడు. జడ్జీ "నేనేమనిచెప్పేది, కాకికన్ను లొట్టపోయింది, చిలుకమూతి సొట్టపోయింది, ఏనుగతొండం వెనక్కుపోయింది, ఏటిలో నీరెండిపోయింది, అత్తాకోడలకు బిందెలంటుకొన్నవి, శెట్టిగారిచేతికి జపమాలంటుకొన్నది, జడ్జీకి వకీళ్లకు కుర్చీలంటుకొన్నవి, గోసాయినోటిలో గంజాఅని చెప్పబోవుచుండగ హాచ్మని తుమ్మెను. తుమ్ముతో శాపం తిరిగిపోయింది. జడ్జీకి, వకీళ్లకు అంటుకొన్న కుర్చీలు ఊడిపోయెను, శెట్టిగారి జపమాలవిడిపోయింది, అత్తాకోడల తలలకు అంటుకొన్న బిందెలు సడలెను, ఏరు క్రొత్తనీటితో నిండిపోయింది, ఏనుగతొండం యథాప్రకారం వచ్చింది, కాని చిలుకమూతి సొట్ట, కాకికన్ను లొట్ట శాశ్వతంగాఉన్నవి.

## ఇత్తడిఅత్తగారు

శ్రీమతి కొప్పర్తి సీతాబాయిగారు

అనగనగా ఒకబ్రాహ్మడి కిద్దరుకొడుకులు. ఇద్దరికీ పెళ్లిళ్లయి కోడళ్లువచ్చేరు. అత్తగారికి చిన్నకోడలంటే చాలాయిష్టం, పెద్దకోడల్ని సాధించిపోయడం. కొన్నాళ్లకి

మామ పరలోకానికి వెళ్లేడు. అన్నదమ్ములు పంచుకున్నారు. ఎల్లాగంటే అత్తగారు ఒక భాగం, ధనమంతాఒకభాగం. చిన్నకోడలు అత్తగార్ని తీసికుంది. ధనమంతా పెద్దకోడలికి వెళ్లింది. చిన్నకోడలు పొద్దున్నే లేచి "అత్తా! మొహంకడుక్కో. అత్తా! మడికట్టుకో" అని అస్తమానూ అత్తగారికి ఉపచారాలు చేస్తుండేది. ఇదంతాచూస్తే పెద్దకోడలికి అత్తగారు కావాలని మనసుఅయింది. డబ్బుందికనక ఒకఇత్తడిబొమ్మని చేయించి దాన్ని అత్తగారు అనిభావించుకుని అన్నివుపచారాలు చేస్తుండేది. ఏపనీ వేళకుచెయ్యకుండాఉంటే పెనిమిటిప్రాణంవిసికి ఇంట్లోంచిలేచిపొమ్మన్నాడు. పాపం ఆవిడ ఆఇత్తడిబొమ్మను కూడా తీసికుని పోయింది. అలావెళ్లేటప్పటికి ఒక అరణ్యందగ్గర చీకటిపడిపోయింది. క్రిందపడుకుంటే ఏవన్నా చంపేస్తాయని ఒకమర్రిచెట్టెక్కి అత్తగార్ని వళ్లోపెట్టుకుని పడుకుంది. ఆరాత్రిదొంగలు రాజుగారింట్లో కన్నంవేసి ఆచెట్టుక్రింద పంచుకుంటున్నారు ధనమంతా. పైననిద్రపోతూన్న కోడలివళ్లోనించి ఇత్తడిఅత్తగారు జారి గలగలమంటూ వాళ్లదగ్గరపడింది. పడీపడ్డంతో దొంగలంతాభయపడి "బాబో! శక్తి"అంటూ నలుగురు నాలుగుదిక్కులకి పరుగెత్తేరు. ఈఅల్లరితోటి కోడలికి మెలుకువవచ్చి దగ్గర అత్తగారులేకపోవటంచేత క్రిందకిదిగి చూసింది. అక్కడమిరుమిట్లుగొలుపుతో బోలెడంతధనం, అత్తగారు కనబడ్డారు. ఇదంతా ఇత్తడఅత్తగారి మహాత్యమేనని ఆడబ్బుని, అత్తగారిని తీసికుని తెల్లారేటప్పటికి ఇంటికివెళ్లి తలుపుతీయమంది. 'ఛీ.నాయింటికిరావద్దు"అన్నాడుపెనిమిటి. "అల్లాకాదు.డబ్బు పట్టుకొచ్చా"నని చెప్పి లోపలికెళ్లి డబ్బువచ్చిన విధమంతాచెప్పి డబ్బుకొల్చుకోడానికి తోడికోడల్ని కుంచంఅడిగింది. ఆవిడ గడుసుది గనక కుంచానికి కాస్త చింతపండు పెట్టిఇచ్చింది. పెద్దకోడలు కొలుచుకుని కుంచం దులపడంమరిచిపోయి ఇచ్చేసింది. కుంచానికి ఒకవరహా అంటుకుంది. అది చిన్నకోడలు చూచి "అక్కా! ఈడబ్బు ఏలావచ్చింది?"అని అడిగింది. పెద్దకోడలు జరిగిందంతా చెప్పింది. "నీవు ఇత్తడఅత్తగార్ని తీసికెడితే నేనునిజమత్తగార్ని తీసికెడతా"నని చెప్పి వెయ్యిగజ్జలు తెప్పించి అత్తగారికికట్టి సాయంకాలానికి ఆచెట్టుదగ్గరకివెళ్లి చెట్టుమీదకూర్చుంది నిద్రపోకుండా. అప్పుడుకూడా దొంగలు ధనందోచుకుని పంచుకుంటుంటే అత్తగార్ని కిందకివిడిచింది. ఆదొంగలు "ఇదేమిటి? మొన్న ఈలాగేఅయింది. ఈవేళా ఇలాగేవుంది" అని చెట్టెక్కి చూశారు. వణుకుతూ చిన్నకోడలు కనిపించింది. ఆవిణ్ని మెత్తగా తన్నిపంపేరు. పాపం అత్తగారు ముసల్దికనక క్రిందపడగానే ఠమ్మనిచచ్చింది. ఏడుస్తూ చచ్చినఅత్తగార్ని బుజాన్నవేసికుని ఇంటికెడితే మొగుడు కేకలేశాడు. అత్తపోయింది, డబ్బులేదు అని చాలావిచారించింది.

## అరడబ్బు

శ్రీమతి ధవళ రాజేశ్వరమ్మగారు

అనగా అనగా ఒకఊళ్లో ఒక బ్రాహ్మణుడుండేవాడు. వాడిపేరు "అరడబ్బు". వాడికి తినడానికి తిండిలేకపోయినా మంచినేర్పుతో డబ్బుసంపాదించే చాకచక్యముకలదు. ఇల్లా ఉండగా ఒకనాడు వాడు

వాళ్ల ఊరికి సుమారు ఆరుమైళ్లదూరములో ఉన్న సంతకు వెళదామనుకొన్నాడు. ప్రొద్దున్నే బయలుదేరి వెళుతూంటే దారిలో ఒకచిన్న గ్రామం తగిలింది. వీడికి ఆకలి దాహము వేస్తున్నాయి. అయితే ఏంచేస్తాడు? చేతిలోకానీలేదు. అలావెళుతూంటే ఒకముసలిఅవ్వ ఒకయింట్లో గుమ్మముకడిగి ముగ్గుపెడుతూంది. దానిని చూచేడు మనబ్రాహ్మడు. "దీనికిటోపీవెయ్యాలిరా!" అనుకొని దగ్గరకువెళ్లి, "అవ్వా! బాగాఉన్నావా?" అని పలుకరించేడు. "ఎవరు నాయనా?" అంది అవ్వపాపం. "నాపేరు అరడబ్బంటారు. నేను చాలదూరం నుంచివస్తున్నాను. సంతకుపోవాలి. ఆకలివేస్తోంది, దయఉంచికొంచెము చద్దన్నము పెడుదూ," అని అవ్వని మంచిమాటలాడేడు. పాపం అవ్వఆశపడింది. వీడరడబ్బిస్తాడు కాబోలు తనకొడుక్కి తెలియకుండా దాచుకుందామనుకొని "రా నాయనా!" అని కొత్తఆవకాయముక్కవకటివేసి యింతచద్దన్నము పెట్టింది. బ్రాహ్మడు కులాసాగాతిన్నాడు. పంచ కట్టుకొంటూన్న బ్రాహ్మణ్ణిచూచి, "నాయనా! ఏటికిపోయినీళ్లు తెచ్చుకొంటాను. అరడబ్బిస్తావా?" అంది పాపం అవ్వ. "అరడబ్బేమిటి? నీవెవ్వరు? నీకెందుకివ్వాలి?" అన్నాడరడబ్బుగాడు. "అయ్యో! అయ్యో! ఇదేమన్యాయం. తిండితినేసి డబ్బివ్వవట్రా? నాకొంపతీసేవు" అని కేకలేస్తూంది దిక్కుమాలినఅవ్వ. వీడు కేకలకులక్ష్యపెడతాడూ? "అరుచుకోముండా! నీకుదేముడంతే రాశాడు" అని పెడమొఖముపెట్టి తనుబట్టలుకట్టుకొంటున్నాడు అరడబ్బుగాడు. ఇంతలో చేతిలోకర్రా, నెత్తిమీదటోపీ, సూటు, బూట్సు వేసుకొని ఒకయువకుడు సుమారు 25 ఏళ్ల వయస్సుగలవాడు ఆయింట్లోకి వచ్చేడు. "నాయనా! చూసేవురా వీడు ఏంచేస్తున్నాడో, నాకరడబ్బిస్తానని చెప్పి మనయింట్లో భోజనము చేసి డబ్బివ్వకుండాపోతున్నాడు" అని అవ్వ కొడుకుతో చెప్పి ఏడ్చుకుంది. అరడబ్బుగాడికి గుండెలో రాయిపడింది. "వచ్చేమురాదేముడా, యిదేమిటీగోల, నేపోయిదాకానైనఉన్నాడుకాడీముండాకొడుకు, ఈశకటం నన్నేదో అల్లరపెట్టేలాగగుపడుతున్నాడు. కానీ, నాబుద్ధి ఉపయోగించి వీడినిబుట్టలో వెయ్యకపోతానా?" అనుకొన్నాడు. "ఏమోయి, సొమ్మిచ్చేస్తావా? పోలీసుకు వప్పచెప్పాలానిన్ను" అన్నాడు అవ్వకొడుకు సుందర్రావు. "నేను మీఅమ్మకిబాకీలేను. సొమ్మిస్తాననలేదు. నన్నుపోలీసుకప్పచెప్పినా యిదేజవాబు వారికికూడా" అన్నాడు అరడబ్బుగాడు. "ఇలారా! పోలీసువాళ్లకి నిన్నప్పచెప్తాను." అన్నాడు సుందర్రావు. సుందర్రావు మున్సబుకచేరీలో గుమస్తా. పాపం అరవైరూపాయిలిచ్చినా ఏవో ఫండులట, మొత్తంమీద కొట్టిగావీడికి ఏభైరూపాయిలు నెల అయ్యేసరికి ముడతాయి. పెద్దకుటుంబము అవడముచేత సుందర్రావుకు అప్పులు లావు. ఆరోజునే జీతంఅందుకొని అప్పులన్నీతీర్చుకొని ముప్పైరూపాయిల చిల్లర జేబులోవేసుకొని ఇంటికివచ్చేడు. అయితే అరడబ్బున్నాడుగదా "నేనిలా ఈబట్టలతో పోలీసువాళ్లదగ్గరకురాను. నీబట్టలునాకిస్తే నేనవివేసుకొనివస్తాను. అందాకా నాగోచిపాతలు నీవుకట్టుకో" అని. సత్తికాలపు సుందర్రావు, అరడబ్బువస్తుందనే సంతోషముతో తనబట్టలన్నీ రూపాయిలతో కూడా వీడికిచ్చి, వాడివేషం వీడువేసుకొని "పద నీపనిచెప్తాను" అన్నాడు. "సరే!" అని వాడిసూటు వగయిరాలన్నీ వీడు ధరించి గబగబా వాడికన్నముందుగా పోలీసుసబిన్స్పెక్టరు గారిదగ్గరకు వెళ్లి, "గుడ్ మార్నింగ్ సార్" అన్నాడు అరడబ్బుగాడు. ఇన్స్పెక్టరు ఎవరో పెద్దమనిషియనుకొని, కుర్చీయొకటిచ్చి "దయచెయ్యండి" అన్నాడు. పాపం, సుందర్రావురాకముందే వీడు సబిన్స్పెక్టరుతో ఏవోలేనిపోనివిచెప్పి, వాడిని మెల్లగా అవతలకు పంపించే ఏర్పాటుచేశాడు. సుందర్రావు రావడంతోటే "ఏమోయి, నీవిలాపెద్దమనుష్యులదగ్గర అబద్ధమాడుట బాగులేదు. ఇటుపైని యిలాచేసేవంటే చీటింగ్ క్రింద నిన్నుకొట్లోవేయిస్తా" నన్నాడు సబ్‌యిన్స్పెక్టరు సుందర్రావునిచూచి. "అదికాదు బాబు! నామాటవినండి" అన్నాడు పాపం సుందర్రావు. "నాన్సెన్సు! ఫో యిక్కడమాట్లాడకు. ఓయి, 223, వీడిని అవతలకు పంపించేయి" అన్నాడు సబిన్స్పెక్టరు.

"పదరా అవతలకీ" అన్నాడు 223 నెంబరు కానిష్టేబు. "బాగా చేశాడు లంజాకొడుకు, నాకేబులో సొమ్ము కూడాపోయిందిరా దేముడా"అని మనసులో అనుకొని వీడినితందామని త్రోవకాచి కూర్చున్నాడు సుందరరావు. "అయ్యా! సెలవుతీసుకొంటా"అని సబిన్స్పెక్టరుగారితో చెప్పి అచ్చట బంట్రోతులకు రెండు రూపాయిలిచ్చి అడ్డుత్రోవపట్టాడు మన బ్రాహ్మడు. పాపం, సుందరరావు, పన్నెండుగంటలదాక తిండి లేక వీడికోసం కాచికూర్చొని ఆఖరకు "అలో లక్ష్మణా"అని ఏడుస్తూ యింటికిపోయేడు. కథ కంచి కెళ్లింది. మనం ఇంటికొచ్చేం.

## నూనెగుడ్డలవాడు

శ్రీమతి బసవరాజు వేంకటరాజ్యలక్ష్మమ్మగారు

రామారావుగారు భీమవరంలో కొత్తగా ఇల్లుకట్టుకుని గృహప్రవేశమైనారు. ఆయన డిప్టీకలెక్టరుఉద్యోగంచేసి నాలుగువందలరూపాయలు పింఛను తీసుకుంటున్నారు. సిరీసంపదా అన్నివిధములా బాగానేవున్నవి. పింఛను తీసుకున్నాముగదా అని ఒకవూరిలోనే వుండవచ్చునని సొంతయిల్లు కట్టుకున్నారు. ఏమిటో యిల్లుకట్టినప్పటినుంచీ ఆయనకు కొంచెము సుస్తీగానేయున్నది వంట్లో. కాని అల్లాగే తిరుగుతున్నాడు. రోజురోజుకీ మనిషి శుష్కించి పోతున్నాడు. ఇంతలోకే దేవీనవరాత్రములు వచ్చినవి. పార్వతినిపూజిస్తే ఆయన ఆరోగ్యము బాగుపడునని భార్యాభర్తలిద్దరూ కలశంపెట్టి తొమ్మిదిరోజులూ భక్తితో పార్వతిని పూజించేరు. తమ ఆరోగ్యము కాపాడమని దేవికి భక్తితో నమస్కరించేరు. కాని రోజురోజుకూ మంచంమీదనుంచే లేవలేకపోతున్నారు. చివరకు ఒకరోజు రామారావుగారింట్లో అంతా ఆయనఆరోగ్యంవిషయమై ఆశలువదలుకొని విచారంగావున్నారు. ఆసమయానికి ఒకనూనెగుడ్డలవాడు ముష్టికివచ్చి "అంబాపలుకు, జగదంబాపలుకు, శాంభవీ పలుకు! ఈఇంట్లో ఒకకష్టం వచ్చింది. రేపటితో యీయింటియజమానికి ఆయుర్దాయం సరి"అన్నాడు. అందరూ "వీడిమాటలకేమిటి? వీడికి ముష్టిపెట్టలేదని ఇల్లాగేచెపుతాడు. పోపొ"మ్మన్నారు. రామారావుగారిభార్యమాత్రం అలాఒప్పుకోక ఆనూనెగుడ్డలవాడిని "నీచేతనైతే ఏదైనాచేస్తావా?"అని అడిగింది. "నేనుచెప్పినట్టుచేస్తే బాగవుతుం"దన్నాడు వాడు. "ఈక్షణమే మీసింహద్వారము పడగొట్ట"మన్నాడు. అందరూ వీడికేమైన పిచ్చా అనుకున్నారు. కాని రామారావుగారిభార్యమాత్రం ఏవిధముచేతనైనా తనభర్తబాగుంటే చాలని సింహద్వారం పడగొట్టమంది. అందరూవద్దన్నారు. అందు కానూనెగుడ్డలవాడు "అమ్మా! మీసింహద్వారం ఎత్తేకముందు వడ్రంగివరువాజాచేసి సీలలుబిగించకుండా వెళ్లేడు. ఒకతాచు అందులో ప్రవేసించింది. అది వడ్రంగిచూడకుండా సీలలుబిగించేడు. పాము ఆరోజుమొదలు గాలీ ఆహారములేక లోపలశుష్కిస్తూంది. అందుకని యజమాని కాపాపము కొట్టి యిలాఅయినారు. దానికి రేపటితోసరి. ఈయనకీ రేపటితోసరి ఆయుర్దాయం. ఈసింహద్వారం పడగొట్టి సీలలుఊడదీయిస్తే పాము బయటికివస్తుంది. అప్పటినుంచీ యజమానికి ఆరోగ్యం బాగవుతుం"దన్నాడు. ఆమాటలు నిజమేమిటో అందరూచూడాలను

కున్నారు. "ఇందులో పాములేకపోతే నీబుర్ర రామకీర్తనమే" అన్నారు వాడిని. సరేనన్నాడు నూనెగుడ్డలవాడు. వెంటనే వడ్రంగినిపిలిపించి దర్వాజాపడగొట్టించి సీలలు ఊడదీయించేరు. అందులోనుంచి తెల్లనిత్రాచు శల్యావశిష్టమై కొనఊపిరితో పైకివచ్చింది. అప్పు డానూనె గుడ్డలవాడు పళ్లెంలో పాలుపోయించి పాముచేతత్రాగించేడు. పాముకడుపునిండాత్రాగి ప్రాణాలుచేరుకున్న తర్వాత బుసకొట్టుకుంటూ పోయింది. అప్పటినుంచీ రామారావుగారికి రోగం తిరుగుముఖమైంది. రోజురోజుకూ ఆరోగ్యవంతులైనారు. ఆనూనెగుడ్డలవాడి మేలు మరిచిపోక వాడిని అప్పుడప్పుడుపిలిచి ఏమయినా యిస్తూండేవారు.

# గణించువారొకరు, గుణించువారింకొకరు

శ్రీమతి సత్యవతీకన్యగారు

ఒక గ్రామములో ఇరువురు బ్రాహ్మణదంపతులుండిరి. వారిద్దరును పొట్టకు, బట్టకు విశేషద్రవ్యము వెచ్చింపగూడదను నియమముగలవారై కడుపునిండ తిండిదినక, శుభ్రమైనబట్టగట్టక వేలకొలది ద్రవ్యమార్జించి తమ యింటిలోనున్న ఒక పెద్దరాతికి కన్నమొనరించి అందులో నాద్రవ్యమంతయు బడవైచి ఆరాతిపై రాత్రింబవళ్లు ఒకరువిడిచి యొకరు పండుకొనుచు అతిజాగరూకతతో మెలంగుచుండెడివారు. వారట్లుకాపాడుచుండుట ఇంకొక బ్రాహ్మణుడెరింగి ఆరాతిలో ధనముండవచ్చునని యుద్దేశించి ఒకనాటిరాత్రి గూఢముగా వారియింటబ్రవేశించి ఒకమూలదాగియుండెను. అంత నాదంపతు లెప్పటివలె నారాతిపైబండుకొని నిదుర బోవసాగిరి. మూలనున్న బ్రాహ్మణుండదియంతయు గనిపెట్టుచు సమయమాలోచించుచుండెను. కొంతవడి కాదంపతులిరువురు నిదురమత్తుచే రాతిపైనుండి కొంచెమొత్తిగిల్లినందున బ్రాహ్మణుండదియే తగినసమయమని యెంచి తానారాతిపై మెల్లగాపండుకొని రాతిమధ్యమున అమర్పబడియున్న మూతనుతీసి అందులోచేయి బెట్టి గుప్పెడురూపాయలు పైకితీయుచుండగా ధనలక్ష్మి ప్రత్యక్షమై వానిచెంపపై నొకదెబ్బకొట్టి ఆరూపాయలు లాగుకొని అందుబడవేసెను. అంతబ్రాహ్మణు డాధనలక్ష్మికాళ్లపైబడి అమ్మా! నేను మిక్కిలిబీద వాడను. రెండుగుప్పెళ్ల ధనమిచ్చినచో నాపిల్లలు, నేనును సుఖముగా బ్రతికెదమని వేడుకొన ధనలక్ష్మి యిట్లనియె: ఓవెఱ్ఱివాడా! ఈధనము వీరిదికాదు. దీనియజమాని పిఠాపురమను గ్రామమున ఒకయుద్యోగివద్ద బట్టలనుతుకుచాకలివాడు. నీవాతనియొద్దకేగి నన్నుప్రార్థించినరీతి వానిని ప్రార్థించి వానిచే వ్రాలుగల ఒకచీటిని దెచ్చినచో నీవుకోరినధనము బడయగలవని చెప్పిన బ్రాహ్మణుండామాటల కాశ్చర్యమొంది అమ్మా! నీవు ధనలక్ష్మివైయుండుదువని నేదలంచుచున్నాను. కాని నీవాక్యములు నాకు మహాద్భుతములుగానున్నవి. అట్ల కష్టములుబడి వీరు సంపాదించిన ద్రవ్యమునకు ఎక్కడనోయున్న రజకుడు యజమానియని నీవిప్పుడు చెప్పిన వాక్యములు సమంజసములుగా దోచుటలేదనివచింప ధనలక్ష్మి ఓబ్రాహ్మణుడా! నేనుచెప్పినదానిలో అబద్ధమేమియులేదు. వీరు సంపాదించిన ధనమంతయు ఆచాకలివానిదగుటచేతనే వీరిందులో నొక్కపైసయైన ఖర్చుపెట్టుటకు శక్తిగనజాలకున్నారు. ఇది లోకస్వభావమే. ఇందులో వింతయెంతమాత్రమునులేదు. నీదీనస్థితి జూడ నాకుమిక్కిలి జాలికలుగుచున్నది. కాని నేనాయదృష్టవంతుని ధనమునీకీయజాలను. కావున నీవాతని యనుజ్ఞవడసిరమ్మని చెప్పుటయు నాతడటనుండి వెంటనే వెడలిపోయి పిఠాపురమునకేగి అచ్చటనొక యుద్యోగియొద్ద నౌకరిచేయు వెంకటేశునిగాంచి యాతని వెనువెంట దిరుగుచుండెను. వెంకటేశు డతని చర్యయంతయు జూచి ఈబ్రాహ్మణుండెవడో నన్నాశ్రయించి తిరుగుచున్నవాడు, వీనివృత్తాంతంబడిగి

తెలుసుకొనవలయునని మనసునందూహించి ఓ బ్రాహ్మణోత్తమా! నీవెవ్వరవు? నావెంటనిట్లుదిరుగుచుండుటకు గారణంబేమి? నావలన నీకేమిపనికావలయునో ఎఱిగించినచో వెంటనే నెరవేర్పగలననివచింప బ్రాహ్మణుండిట్లనియె: నాయనా! నీవుమిక్కిలి అదృష్టవంతుడవు. నీసుగుణములు చూచి భాగ్యదేవత నిన్నువరించినది. నీకు మాయూరగల ద్రవ్యరాశిలో నాకు రెండుగుప్పెళ్ల ధనమిప్పింపగలవని పుట్టెడాసతోనే నిచ్చటికరుదెంచితినని వచింప వెంకటేశు బ్రాహ్మణునిమాటలకెంతయు ఆశ్చర్యమొంది అయ్యా! మీవాక్యములత్యద్భుతములుగానున్నవి. నాకేమి! మీయూరధనంబుండుటేమి! నేనదిమీకిప్పించుటేమి? నన్ను ఎగతాళిచేయుట మీవంటివారికి తగునా? అనిపలుక బ్రాహ్మణుండు నేనెంతమాత్రమెగతాళి సేయుటలేదు. నిజముగా నీధనంబచ్చటనున్నది. కావున "రెండుపిడికెళ్లధన మీబ్రాహ్మణున కీయవలయు"నని నీచేవ్రాలుతో ఒకచీటి వ్రాసియిచ్చినచో నేనాధనమును తప్పకపొందగలను. ఎట్లయిన నాకీయుపకారము చేయకున్న నిన్నువిడిచి పోజాలనని నిర్బంధింపమొదలుపెట్ట, వెంకటేశు తన్నాబ్రాహ్మణుడెట్లయిన వదలిపోయిన చాలుననియెంచి అతడుకోరినప్రకారము ఒకకాగితముపై వ్రాసియిచ్చెను. బ్రాహ్మణుడాకాగితము బుచ్చుకొని అత్యంత సంతోషమున తన గ్రామమునకేగి వెనుకటివలె నాటిరాత్రి బ్రాహ్మణదంపతులయింటికేగి ఒకమూలదాగియుండి కొంతపడికి సమయముగనిపెట్టి తాదెచ్చినకాగిత మారాతిలోబడవేసి రెండుపిడికెళ్ల ధనముదీసి బొడ్డుకొంగున గట్టుకొని అంతటితో సంతుష్టిపొందక మఱిరెండు పిడికెళ్ల రూపాయలు తీయుచుండ వెనుకటివలె మఱల ధనలక్ష్మి ప్రత్యక్షమై అతనివీఁడపై రెండుదెబ్బలుకొట్టి నీకురెండుగుప్పెళ్లధనమునకు మాత్రమే హక్కుకలదు. అంతకన్న ఒక్కపైసయైన నీవుముట్టుకొనుటకు వీలులేదు. కావున నీవిక నిటనుండి వెడలిపొమ్మని బైటికి గెంటివేసి తానదృశ్యమయ్యెను. బ్రాహ్మణున కారెండుగుప్పెళ్ల ధనమనుభవించుయోగముండుటచేత గాబోలును ఆదంపతులిరువురు ఈరెండురాత్రులయందును ఒడలెఱుంగకుండ నిదురబోయిరి. ఇట్లుజరిగిన కొన్నిసంవత్సరముల కాదంపతులిరువురు కాలధర్మము నొందుటచే వారియిల్లు శిథిలమయిపోవుటయు, అటుపిమ్మట కొన్నాళ్లకు పిఠాపురమునగల ఉద్యోగి ఈగ్రామమునకువచ్చి కాపురముండుటయు తటస్థించుటచే నాతనివెంట వెంకటేశుకూడ వచ్చియుండి తనయజమానుని బట్టలుదుకుటకై ఒకరాతిబండ సంపాదింపవలయునని గ్రామమందంతటను దిరుగుచు ఈబ్రాహ్మణుల స్థలములోనున్న రాతినిగనుగొని దానిని గొనితెచ్చి దానిపై బట్టలుదుకుచుండ ఆరాతిమధ్యమున అమర్పబడియున్న మూతక్రమముగ గొన్నాళ్లకు విడిపోవుటచే వాత డందుచేయిపెట్టిచూడ తనచేవ్రాలుతోనున్న కాగితమతనికి దొరకెను. అత డదివిప్పి చదువుకొని వెనుకటి వృత్తాంతమంతయు జ్ఞప్తికిదెచ్చుకొని తొల్లి బ్రాహ్మణుడు తన ధనమీగ్రామముననున్నదని చెప్పిన మాట వాస్తవమేయనితలచి ఆద్రవ్యమంతయు దీసుకొని అంతటినుండి నాకరీవృత్తిమాని ఆధనంబంతయు స్వేచ్ఛగా అనుభవింపసాగెను. ఆహా! గణించువారొకరు, గుణించువారింకొకరనుమాట వాస్తవముగదా.

## లోభి: కొబ్బరికాయ

శ్రీమతి కూచిభొట్ల గంగమ్మ గారు

అనగనగా ఒకవూళ్లో ఒకలోభివుండేవాడు. వాడు ఎంతడబ్బు సంపాదించినా ఒక్క కాసైనా ఖర్చుపెట్టేవాడుగాదు. ఒకరోజున కార్తికసోమవారంనాడు పెళ్లాము దగ్గిరకువచ్చి "ఏమండీ! యింతడబ్బువుంది. కట్టుకుపోతారా? దానధర్మములు చేసుకోవాలిగాని, ఈవేళ అయిన ఒకకొబ్బరికాయ దేవుడికికొట్టండి"అని ఎన్నోసార్లు ప్రాధేయపడిచెప్పింది. పెళ్లాము పోరుపడలేక సరే అని బజారుకు బయలుదేరేడు. కొబ్బరికాయలకొట్టుదగ్గరకువెళ్లి

"కాయెంత" అని అడిగేడు. "అణా" అన్నాడు కొట్టువాడు. "ఇంకాతక్కువకు ఎక్కడదొరుకుతాయి?" అని అడిగాడు కొట్టువాడిని. తోటలోకివెల్లితే దొరుకుతాయనిచెప్పేడు కొట్టువాడు. సరేఅని తోటకువెళ్లేడు లోభి. తోటమాలి ఈయననుచూడగానే ఎంతో అలసివచ్చేడని ఒకకొబ్బరిచెట్టు చూపించి దానికాయను వూరికేకోసుకోమని చెప్పేడు. వచ్చినలాభమునకు చాలాసంతోషించేడు లోభి. ఆచెట్టు వంకరగా ప్రక్కనేపారుచున్న కాలువలోనికి వ్రాలి వుంది. ఆచెట్టెక్కి కాయకొయ్యబోయాడు. ఇంతట్లో కాలుజారింది. గభాలున మట్టను పట్టుకుని వెల్లాడుచున్నాడు. ఇంతట్లో ఒకమావటివాడు ఏనుగును నీళ్లకుతీసుకుని అక్కడికే వచ్చేడు. అప్పుడు లోభి "ఓమావటీ! నీకు రెండువేలవరహాలుయిస్తాను. నన్నురక్షించవలయును" అన్నాడు. సరే మంచిదేగదా అని ఏనుగుని నీళ్లలోనికిదింపి మావటివాడు ఏనుగు మీద నిలుచుని లోభికాళ్లుపట్టుకున్నాడు. ఇంతట్లో ఏనుగుబెదరి మావటివాని కాళ్లక్రింద నుంచి లేచిపోయినది. అప్పుడు మావటివాడు "ఓలోభీ! నీకే నేను నాఏనుగునిఅమ్మి నాలుగువేలవరహాలిస్తాను. మట్ట గట్టిగాపట్టుకో" అన్నాడు. అప్పుడే ఒకగుఱ్ఱపువాడు అక్కడికివచ్చేడు. అప్పుడు మావటివాడు "ఓస్నేహితుడా? నీకు నేను నాలుగువేలవరహాలుయిస్తాను. నన్ను రక్షించవలసినది" అనెను. గుఱ్ఱపువాడు గుఱ్ఱమును నీటిలోదింపి దానిపై ఎక్కేడు. మావటివానికాళ్లుపట్టుకునేసరికి గుఱ్ఱముబెదిరి పారిపోయింది. ఇంకేముంది? అప్పుడు గుఱ్ఱపువాడు మావటివానితో "ఓమోయి! నేను నాగుఱ్ఱమునమ్మి నీకు నేను రెండువేలవరహాలనిస్తాను. గట్టిగపట్టుకో" అనెను. అంత మావటివాడు లోభితో "ఏమోయి! నీకు మొత్తము గుఱ్ఱపువాడిది నాదికలిపియిస్తాను. మట్టగట్టిగా పట్టుకో" అన్నాడు. తరువాత లోభి తనకెంత డబ్బు రానున్నదని చాలాసంతోషించేడు. అంతే ఆరువేలవరహాలు "యిన్ని" అవుతాయని సంతోషముపట్టలేక రెండుచేతులు విడిచిపెట్టేడు. ముగ్గురు ఏటిలోపడిచచ్చేరు. కథకంచికి వెళ్లింది. మనం యిక్కడేవున్నాము.

## ప్రాణభీతి

శ్రీమతి గాడిదమడుగు శారదాంబగారు

అనగా అనగా ఒక ఊళ్లో ఒకబీదబ్రాహ్మణుడు. ఆబ్రాహ్మణునికి సంతానము ఆరడజనుకు జాస్తిగా ఉండడంచేత కుటుంబసంరక్షణార్థం చాలా కష్టపడేవాడు. బీదవాడైనప్పటికి ఏదినం సంపాదన ఆదినానికే కాని ఎక్కువ సంపాదించి తన తదనంతరం కొమాళ్లకుపెట్టి పోదామనేవాడుకాడు ఆబ్రాహ్మణుడు. ఒక రోజుప్రొద్దున్నే వంటచెరుకుల కోసరం చేరువనుండు అడవికి భార్యాసమేతుడై బ్రాహ్మణుడు వెళ్లుచుండగా అకస్మాత్తుగా ఒకచెట్టుక్రింద ధనరాశికనపడింది వాళ్లిద్దరికి. బ్రాహ్మణునిగుండెలు హడలిపోయాయి. "అయ్యో! ఇక్కడ ప్రాణభీతివుందే! ఇక్కడ ఉండడం మోసం" అని భీతిచెందినవానిమాదిరి భార్యను లాగుతూ పరుగెత్తేడు బ్రాహ్మణుడు వెనక్కుఅయినా తిరిగిచూడకుండా. వాళ్లిద్దరికి యిద్దరు రాజకుమారులు ఎదురయ్యేరు. ఎదురుకావడంతోటే "అక్కడ ప్రాణభీతివుంది. జాగ్రత్త!" అని బ్రాహ్మణుడు హెచ్చరించేడు ఆరాజనందనులను. ప్రాణభీతి అనగా ఏలాంటిదో చూదామని ఆబ్రాహ్మణుని

వెంటీడుకొనిపోయ్యారు ఆవృక్షం సమీపానికి. బ్రాహ్మణుడు గడగడవణుకుతూ "అదిగోనయ్యా, ప్రాణభీతి" అని ధనమువైపుచూపి పరుగెత్తేడు. అంతట రాజకుమారులు బ్రాహ్మణుడు వెర్రివాడనుకున్నారు. ఇద్దరిమనస్సుల్లోను ఊహలు జనించడం మొదలైంది. రెండవవానిని మోసగించి ధనమంతయూ తానే అపహరించాలని బుద్ధిపుట్టింది యిద్దరికీకూడాను. పెద్దవాడు చిన్నవానినిచూచి "ఓయి! ఇప్పటికే చాలాకాలమైనది. మనయిద్దరికి భోజనం యిక్కడికే తెమ్ము. భోజనం కుడిచినతర్వాత ఇంటికి ధనసమేతులమై వెళ్లవచ్చు"నని చిన్నవానిన్ని పంపివేసెను. పంపేసి యిలా ఆలోచించేడు: "తమ్ముడు అన్నం క్రిందపెట్టుసమయములో ఇదే కరవాలంతో వానిశిరస్సును ఖండించేస్తా. ఈధనమంతయూ నాకేదక్కును కదా!" చిన్నవాడు గృహాభిముఖుడై "నేను ఇంట్లోనే భుజించి పెద్దవానికి విషమిళితమైన అన్నం తీసుకపోతాను. పెద్దవాడు చచ్చును. ధనమంతయూ నాదే" ననుకొంటూ ఆలాగే తెచ్చేడు అన్నాన్ని. తమ్ముడు తలవంచడంతోటే తనకరవాలంతో తమ్ముని శిరస్సుఖండించేడు అన్న. "తమ్ముడుచచ్చేడు, ధనమంతయునాదే" ననుసంతోషంతో పర్వదినంలాగ భుజించివాడు తమ్ముడు తెచ్చినదానిని. విషం తలకెక్కింది. తానుకూడా నీల్గేడు. ధనమన్న ప్రాణభీతి సుమా!

## నువ్వా దొంగవే

శ్రీమతి ఆదుర్తి సత్యాబాయి గారు

(శిబిరంలో సోఫామీద అలగ్జాండరుచక్రవర్తి, ఎదురుగా కాళ్ళకి చేతులకి సంకెళ్ళతో ఒకముష్కరుడూ, వానికిచెరో ప్రక్కా బోరలు విరుచుకుని ఇద్దరుసైనికులూ నిలువబడిఉంటారు.)

అలగ్జాండరు:—(సైనికునిచూస్తూ) వీడేనా తారాసియన్ దొంగ? ఇన్నాళ్ళబట్టీ మన పల్లెల్ని దోచుకు తిరుగుతున్నాడు?

ముష్కరుడు:—అవును. నేనే తారాసియన్‌ను. వీరయోధుడను.

అల:—(చిరునవ్వుతో) వీరయోధుడవా? బందిపోటుదొంగవు. నరహంతకుడివి. దేశానికి విపత్పురుగువి. నీధైర్యాన్ని నేను ప్రశంసిస్తానుగాని నువ్వుచేసిఉన్నపనికిమాత్రం తగినశిక్ష విధిస్తేగాని నేను శాంతిపడలేను.

ముష్క:—అలగ్జాండరుచక్రవర్తికికూడా కోపంవచ్చే పనుల్ని నేనేమిచేశాను?

అల:—ఏమీఎరగనట్లు మాట్లాడుతావేమిటి? నాఆజ్ఞలను అతిక్రమించి నువ్వు నడవడంలేదూ? నాదేశశాంతికి నీవు భంగంకలిగించలేదూ? నీతోడి ప్రజల ధనధాన్యాలపహరించి వాళ్ళని క్షోభపెట్టలేదూ?

ముష్క:—అలగ్జాండరుచక్రవర్తీ! ఇప్పుడు నేను నీఅధీనంలోఉన్నఖైదీని. నీవేమన్నా నేను పడవలసిందే. నీవేశిక్షవిధించినా అనుభవించవలసిందే. కాని నాఆత్మమీద మాత్రం నువ్వు అధికారం చెలాయించలేవు. అందేత నీకు జవాబిచ్చేటప్పుడుకూడా సర్వస్వతంత్రుడిలాగే మాట్లాడుతాను.

అల:—అలాగేమాట్లాడు. నేను సంభాషిస్తూఉన్నప్పుడు నాఅధికారబలంచేత ఎదుటివాడినోరుకట్టడం నామతంకాదు.

ముమ్మ:—కృతజ్ఞుడిని. నీఉదారస్వభావాన్కి వందనాలు. అయితే నీప్రశ్నకి జవాబుగా మరో ప్రశ్న వెయ్యవలసివచ్చింది. నీజీవితాన్ని ఏవిధంగాగడుపుతున్నావు?

అల:—మహావీరుడిలాగ. నాకీర్తికాంతనడుగు. అదేచెబుతుంది. యోధాగ్రేసరులకల్లా నేను తలమానికాన్ని. రాజాధిరాజులందరికీ నేను సార్వభౌముడిని. దిగ్విజయకాలంలో జయలక్ష్మికి నన్నుమించినవరుడు దొరకడు.

ముమ్మ:—అలాగా! కీర్తికాంత నాగురించి మాత్రం చెప్పదూ? ఉక్కుతునకల్లాంటి నాగుంపులాంటిగుంపుకాని, అటువంటిగుంపుకి నావంటి ధైర్యసాహసాలుకలిగిన నాయకుడుగాని మరెక్కడేనాఉన్నారా? ప్రపంచములో ఎక్కడేనా ఎప్పుడేనా-ఎందుకూ-నాగొప్ప నేను చెప్పుకోడం నాకురోత. నీమట్టుకు నీకు తెలియదాఏమిటి? నన్నుపట్టుకోడాన్కి నీవాళ్ళన్ని చెరువులనీళ్ళుతాగిరో?

అల:—అయినప్పటికీ నువ్వుదొంగవే. కులహీనుడవీ, గౌరవశూన్యుడవీ అయిన పచ్చిదొంగవు.

ముమ్మ:—అలాగైతే దిగ్విజయిలక్ష్మివరుడెవరు? నీవుకూడా ప్రపంచమంతటా మహారాక్షసుడిలాగ సంచరింపలేదూ? సౌభాగ్యవంతాలైనపచ్చటిపొలాల్ని, సుందరములైన మహానగరాల్నీ నాశనంచేయలేదూ?శాంతినీ పరిశ్రమల్నీ భంగిపుచ్చలేదూ?న్యాయంలేకుండా-ధర్మం ఆలోచింపకుండా-దోచుకుని, చంపి-చీకాకుపెట్టేసి—ఇవన్నీ ఎందుకు? దేశాల్ని జయిద్దామన్న అంతులేనిఆశని సంతోషపెట్టడానికేకదూ? ఓవందమంది అనుచరులతో ఓపరగణాకి నేనేమిటిచేశానో లక్షలాదిసైనికులతో మహాసామ్రాజ్యాలకి నువ్వూ అదేచేశావు. నేను ఒక్కొక్కమనిషిని దోచుకుంటె నువ్వు మహారాజుల్ని, చక్రవర్తుల్నీ దోచుకున్నావు. నేను ఓవోరెండుమూడుపల్లెల్ని తగలెడితే నువ్వు మహాసామ్రాజ్యాలనే నాశనంచేశావు. మనిద్దరికీ భేదం ఏమిటుంది? నేనోబీదవాడికిపుట్టేను-నువ్వోక మహారాజుకుపుట్టేవు. అంచేత నువ్వు రాజ్యాలకి రాజ్యాలేదోచుకుని మహాదొంగ వవగలిగేవు.

అల:—కాని రాజునైనేను తీసికొంటే రాజులాగేతిరిగియిచ్చేను. రాజ్యాలని జయిస్తే మహాసామ్రాజ్యాల్ని స్థాపించేను. చిత్రకళల్ని-వాణిజ్యాన్ని-వేదాంతవిద్యనూకూడా మంచి అభివృద్ధిలోకి తీసుకొస్తున్నాను.

ముమ్మ:—నేనుకూడా గొప్పవాళ్ళదగ్గిరనుండి సంగ్రహించింది బీదవాళ్ళకుచితంగా ఇస్తున్నాను. ముమ్మరులున్న నాసంఘంలో కట్టుబాటు, విధేయత నెలకొల్పేను. చేజిక్కినంతవరకూ అనాథుల్ని రక్షిస్తున్నాను. నువ్వుచెప్పిన ఆవేదాంతంగురించి నాకేమీ తెలియదుగాని యీప్రపంచాన్కి మనంచేసినద్రోహం నువ్వుకాని నేనుకాని ఎన్నడూ ఏవిధంగానైనా కప్పిపుచ్చుకోలేమని నాకు నిశ్చయంగా తెలుసును.

అల:—(సైనికులతో) సంకెళ్ళనువిప్పి ఆతడిని ఆదరించండి. ఒక్కక్షణం నన్ను ఒంటరిగా వదిలిపెట్టండి.

—సైనికులూ ముష్కరుడు నిష్క్రమింతురు.

(తనలో) ఏమిటిదీ? నేనూ, ఈదొంగా ఒక్కలాంటివాళ్ళమేనా? అలగ్జాండరుకూడా దొంగే? అవునుకాబోలు.

## దురాశ దుఃఖానికి చేటు

శ్రీమతి జి. గోపీబాయిగారు

అనగాఅనగా ఒకవూరు. అవూళ్లో నలుగురుదొంగలు ఉండేవారు. ఆనలుగురుచేరి ఒకషావుకారు ఇంట్లో కన్నంవేశారు. ఆధనముతీసుకొని వెళ్లుతూఉండగా దారిలో ఒక డన్నాడు ఆధనము నలుగురుపంచుకుందామని. ఆమాటకు అందరు సరేనంటేసరేనన్నారు. వాళ్లు అప్పుడు ఒకపాడుదేవాలయము దగ్గరకివచ్చి కూర్చున్నారు. అప్పుడు ఒకడు ఒరే అన్నా మనకునిన్న ఏదేవుడిదయవల్లనో చాలాధనము దొరికింది. ఇప్పుడు కొన్నిరూపాయిలు తీసుకొని బజారుకివెళ్లి మంచిమంచి తినువస్తువులు తెచ్చుకొని కడుపునిండాతిని నీళ్లుద్రాగి అప్పుడు ధనముపంచుకుందాం అని అన్నాడు. ఈమాటకి అందరు వప్పుకొని కొంతడబ్బు ఇచ్చి ఇద్దరిని బజారుకిపంపించేరు. అప్పుడు ఆఇద్దరిలో ఒకడు ఒరేఅన్నా ఇన్నాళ్లనుంచి కష్టపడి డబ్బుసంపాదించేను. ఒకకానియైనను నాదగ్గరలేదు. ముసలివాణ్ణయాను. చచ్చినా ఊడ్చటానికి డబ్బులేదు. కనుక ఇప్పుడైనా మనము జాగ్రత్తపడాలే అని నాకుతోస్తుంది. అని అన్నాడు. అప్పుడు రెండవవాడు నాకుఅల్లాగెతోస్తుంది. నీవె ఆడబ్బుఅంతా మనకు వచ్చేటట్టు ఉపాయంచెప్పాలెఅన్నాడు. దానికి మొదటివాడు నాకు మంచిఉపాయంతోస్తోంది. అదిఏమంటే ఈతినేవస్తువుల్లోవిషంవేసి వాళ్లకిఇచ్చినట్టయితే వాళ్లుఎరగకతిని చచ్చిపోతారు. తరవాత ఆధనంమనము ఇద్దరంపంచుకుందాం అనిఅన్నాడు. దానికి వాడు వప్పుకొన్నాడు. ఇద్దరుచేరి బజారుకువెళ్ళి బర్ఫీ, జిలేబీ, మిఠాయి మొదలైనవికొని వానిలో విషంకలిపి తీసుకువెళ్లేరు గుడిదగ్గరకి. అప్పుడువారు అన్నలారా వచ్చేరా? మీకోసం మేమిద్దరము కాచుకొనిఉన్నాము. చప్పున కాళ్లుచేతులుకడుక్కొని వద్దామురాండి చాలాఆకలి అవుతున్నది. అని అన్నారు. దానికి వారు సంతోషపడి నలుగురుదొంగలు భావివద్దకెళ్లేరు. అప్పుడు మిఠాయితెచ్చిన ఇద్దరుదొంగలు నీళ్ళు చేతూఉండగా వెనకాలనించి ఆఇద్దరిని భావిలోకి తోశేసి బాగాకడుపునిండా నీళ్ళుతాగండి. తాగండినీళ్ళు అని మిగిలినఇద్దరు కేకలువేశారు. అపుడువాళ్ళిద్దరు చచ్చిపోయారు. వారు సంతోషముతో గంతులువేస్తూ పరుగునవెళ్లి అంతా మిఠాయి జిలేబి కడుపునిండాతినేశారు. లేచేటప్పటికి కళ్ళు గిర్రునతిరిగి కిందపడిపోయారు మళ్ళాలేవకుండాను. పాపం. కథ కంచికి మన మింటికి.

# కర్నల్ బోలాంగ్ గారి వాహనము

శ్రీమతి హవాయి కావేరి బాయి గారు

భోజనము జరిగినపిమ్మట అడవిజంతువులను గూర్చిన సంభాషణ ప్రారంభమయ్యెను.

"ఒక రాత్రిపూటలో నాహారార్థమై ముప్పది, నలుబది మైళ్లుకూడ వ్యాఘ్రములు సాగింపగల"వని మాలో నొకరు చెప్పితిమి.

"ముప్పది, నలుబది మైళ్ళు సునాయాసముగా నే పెద్దపులి ప్రయాణము చేయును. ఆరుగంటలకాలమునకు లోపుగానే డెబ్బది మైళ్లకు హెచ్చుగా ఒక బెబ్బులి వెళ్ళుట నే నెఱుగుదు"నని కర్నల్ బోలాంగ్ గారనిరి.

"అయితే, పులివెనుక మీరుకూడను వెళ్లియుంటిరా, యేమి?" యని మా సీనియర్ క్యాప్టెన్ (Senior Captain) ప్రశ్నించిరి.

"వెనుక వెళ్లితినా? శార్దూలముతోనే పయనము చేసితిని. చెప్పెదవినుడు." ఇట్లు కర్నల్ బోలాంగ్ గారుత్తరమిచ్చిరి.

"ఇది సంభవించినప్పుడు నేనింకను కుఱ్ఱవాడనే. హిందూదేశ మదియే రావడము. బొంబాయిలో దిగి నేను చేరవలసినదండుయుండిన X అనుయూరికి పోవుచుంటిని. అచ్చటచ్చట, విశ్రాంతినిమిత్తము, మజిలీలు చేయుటలో Z అనుచోట మిక్కిలి యాలస్యము చేసితిని. అందుచేత నచ్చటినుండి సాధారణమైన మార్గమున ప్రయాణము చేసినయెడల నేను చేరవలసినవేళకు నాగమ్యస్థాన మందుకోనని తెలిసి యడవిలో పడిపోవు యడ్డదారిలో పోదమని నిశ్చయించితిని.

నాసామానుల నదివరకే సాగనంపియుంటిని. ఇప్పుడు గుఱ్ఱమునెక్కి యడవిజొచ్చి చార్టులు కంపాసుల (Chart and Compass) సహాయమువలన నరుగుచుంటిని. ఒకపాతిక మైళ్ళు వెళ్ళునరికి చీకట్లు క్రమ్మెను. ఏదైన నొక చిన్నగ్రామము కనబడినచో నచ్చట విశ్రమింతుననుకొనుచుండగా హఠాత్తుగా వాయువుమీద సవారీచేసినవాడనై దగ్గరనున్న పొదలలో పిల్లిమొగ్గవేసి పడిపోతిని. నాతురగముమీద నొక ముప్పన్నె మెకమురికి దానిని క్రిందపడద్రోసి భక్షించుచుండెను.

నాకు గాయములెట్టులెప్పనో యెఱుగను. అయినను పెద్దపులివారు విందారగించి స్వగృహమున కేగునరకు కదలక మెదలక పడియుండవలెనని నిశ్చయించితిని.

విందుముగిసెను. తనపాదములను నాసికాకేసరములమీద దుడుచుకొని రొమ్ములువిరచి పెద్దపులి యావులించెను. ఇక నీక్రూరమృగము వెడలిపోవునని తలంచితిని. అబ్బో! యది వెఱ్ఱిదికాదు. అది నావాహనమును భక్షించుచుండిన సమయమంతయు నామీద నొకకంటిదృష్టి నిలిపియుండెను. ఇప్పుడు నావైపునకు యడుగులు వేయుచుండెను. సరే, ముందునాగుఱ్ఱము. తరువాత నేనుకదా యనుకొంటిని.

అయితే ఆపె (అది యాడుపులియని గ్రహించితిని) యుద్దేశము వేరుగానుండెను. నాయంగీని తనదంతములతో కఱచుకొనియెత్తి నన్ను వీపుమీదవేసుకొని బయలుదేరెను. గంటకు నాలుగు మైళ్లచొప్పున ప్రాకుచు వెళ్లుచుంటిమనుకొందురా? అతిశీఘ్రముగా దౌడుతీయుచుంటిమి. అడ్డమువచ్చినవానిమీదనుండి దుమికి వెళ్ళుచుంటిమి. గ్రామములుండినచో ప్రక్కకుతిరిగి వెళ్లుచుంటిమి.

అంధకారమందు క్రూరమృగముమీద స్వారిచేయుట భీతికరమైనను ముఖమల్ పాన్పులువేసి(Springs) కలిగిన మంచముమీద పరుండి ప్రయాణముచేసినట్లే, శార్దూలము వీపుమీద ప్రయాణము చేయుచుంటిని.

కొంతకాలమునకు, చంద్రోదయమగుటచేత, చుట్టుప్రక్కలనున్న వస్తువులు గోచరములయ్యెను. రెండుపర్యాయములు దాహముతీర్చుకొనుటకు నిలిచితిమి. మొదటిసారి యొకచిన్నచెరువులో నావాహనము పానము చేయుచుండగా నొకతుపాకిగుండు యామెకర్ణములనంటిపెళ్లెను. మిక్కిలి యద్భుతముగా నాపె ప్రాణముదక్కెను. ప్రచండమైన యాగ్రహముతో గర్జించుచు వచ్చుటనుండిన యొకవృక్షముదిక్కు యురికెను. ఆవృక్షముమీదనే యీవ్యాఘ్రమును నంతమొనరింపవలెనని వచ్చిన వేటకాడు కూర్చుండియుండెను.

ఇక నేను తప్పించుకొందునని యుల్లాసమొందితిని. అకటా! తత్క్షణమే శార్దూలము మరల దౌడు మొదలుపెట్టెను. రెండవసారి యొకచిన్నయేటిలో పులినీరుత్రాగుచుండగా నాఫ్లాస్కును (Flask) దీసి దానిమూతయందు కొంచెము బ్రాంది నీటిలోకలిపి పుచ్చుకొనగలిగితిని. మరువాడు X చేరువరకు నిదియే నాకాధారమయ్యెను.

మేమెంతవడిగా పోవుచుంటిమో చెప్పజాల. ఒకప్పుడు తుపానుగాలియొక్కయెదురువడితో వెళ్లుచుంటిమి. చతుష్పాదజంతువులలో నేదియైన వింతవేగముగాపోవునని నాకు తెలిసియుండలేదు.

ఒకానొకచోట మామార్గమున నొకపెద్దకొండవలె నొక మదపుటేనుగు నిలువబడియుండెను. వెన్నెల దానిమీదపడగా నెట్లువర్ణింతు దంతియొక్క ప్రభావము? ఆహా! నేనే నాపాదములమీదనిలువబడి యొక తుపాకి హస్తమునపొందినవాడనైయుండినచో పర్వతమువలె నిలచియుండుదంతి నేలమీద సాష్టాంగదండములు నాకిడునుకదా యనుకొంటిని.

మాయిరువురి వాసనతగిలినవెంటనే మేము చేరబోవుచున్న పొదలమీదికి గజమువచ్చుచుండెను. తొండమును తోకను పైకెత్తెను. మహాకోపముతో నరచుచు ఖడ్గములవలె తీవ్రముగానుండు దంతములతో భయంకరరూపముదాల్చెను.

మేమైతేనో చక్కగా స్టీం (Steam) ఎక్కించితిమి. మెఱుపుతీగను మించినది మావేగము. కారుదున్నల మందయొకటి గురకలుపెట్టుచు నిద్రించుచుండెను. ఆగురకలకు కొమ్మలమీద యాకులుకదలుచుండెను. ఈయడవిదున్నల మధ్యనుండి వెళ్లునప్పుడుమట్టుకు మావేగము కొంచెముతగ్గెను.

మరొకచోట నొకచిఱుతె యొక లేడిపిల్లను తినుచుండెను. మమ్మునుజూచి గుర్రుమనుచు పాఱిపోవుటకు ప్రయత్నించెనుగాని దానియాహారమును మేములక్ష్యపెట్టక దానిమీదనుండి దుమికివెళ్లితిమి.

మరొకస్థలమున నావాహనము కొబ్బరిచెట్టు శిఖరమంతయెత్తుపై దురికెను. దీనికి కారణము నాకు తెలియదు. అచ్చటచ్చట మ్రానులకుచుట్టుకొని గొప్పసర్పములు కనబడెను. ఏదైన నొక పెద్దయురగము మామార్గముననుండెను గాబోలు.

మరికొంతదవ్వున నొకవానరసేనకనబడెను. మమ్ములనుచూచి నలుదిక్కులకు చెదరి చెట్లలో దాగెను. శ్వేతశిరోజములు దాడియుకలిగియున్న నొక్కవృద్ధమర్కటము వెనుక నీకోతులదండు సిపాయిలవలె నలుగు రేసిగలలైను (Lines) లలో మార్చింగు (marching) చేయుచుండెను. మావలన కార్యముచెడగా నవితిట్టుచు, పళ్లనుజూపుచు, మరియు నలిపిన ఇతరకృత్యములను మీరుచూచియుండినచో కడుపుబ్బ నవ్వియుందురు.

రాత్రి దాదాపు రెండవమిదిగంటలుకొట్టినపిదప మేము బయలుదేరియుంటిమి. సుమారు రెండుగంటలు కేయువరకుకూడ మేము వెళ్ళుచుంటిమి. చివరకు వృక్షవిహీనమై రాతిబండలుగల తావుచేరితిమి. ఒక పెద్ద బిలమునుదాటి దానిగుహలోనికి తీసుకపోయి నావాహనము నన్ను క్రిందకుదించెను.

లోనికి వెన్నెల వచ్చుచుండగా నాగుండె ఝల్లుమనెను. నెత్తుటిచే తడసిన యినుకపైన రెండు పులికూనలు పరుండియుండెను. గుహయందంతటను దుమ్ములుండెను. ద్వారమునొద్ద దట్టముగా మృదువైన

యాకలుపడియుండెను. ఏదో నొకమయూరమునుబట్టి పొట్టపిగులునట్లు దిని మాతృప్రవేశము కూడ గమనింపలేనంతటి గాఢనిద్రలో నాకూనలుండెను. పసిబిడ్డలకు మృదువైన మాంసముకావలెనని తల్లి నన్ను తాభక్షింపక పిల్లలకొరకు తెచ్చెను.

సరే గుహచేరిన పిమ్మట నన్ను క్రిందవైచి వ్యాఘ్రము ద్వారమున కడ్డముగాపరుండెను. నేను తప్పించుకొనుటెట్లు? నేను ప్రాణములతో నున్నాను అను సంగతి గ్రహించినచో నన్ను పులి వెంటనే కైలాసమునకు బంపును.

కొంతకాలమునకు మెల్లగా తెల్లవారుచుండెను. ఆజంతువులను గుహయందలి యెముకలు జూడ నాహృదయము చిందరవందరయ్యెను. పైగా మానవయంగములలోని దుమ్ముల నేకములుండెను. కొన్ని గంటలలో నాశరీరము శార్దూలములకు భోజనమగునని తలచితిని.

వెలుతురు తీవ్రముగా ముదురుచుండెను. ఇంతలో నురుములను మించుగర్జనయొకటి వినవచ్చెను. దాని ప్రతిధ్వని మైలుదూరము వెళ్లెను. ఆహా! ఈవ్యాఘ్రకుటుంబమునకు యజమానుడగు మగపులియొక్క రాకడయిదియని గ్రహించితిని. గర్జనము అంతకంతకు బిగ్గరగావినుచు సమీపించుచుండెను. తుదకు వెలుపల రాలియున్న యెండుటాకులమీద నడుగులచప్పుడు విశదమయ్యెను. నాకు మృత్యువు సమీపములో నేయున్నదనుకొంటిని.

అయితే, దైవము మరియొకవిధముగా నేర్పాటు చేసియుండెను. గృహస్థురాలు పురుషుని యాగమనము జూచి తొందరగాలేచి నాశరీరముపై వంతెనవలె తన శరీరమునుంచెను. తోకతో నిసుకమీద దెబ్బలువేయుచు గుర్రుమని మగనితో కలబడుటకు సిద్ధపడెను.

ఇప్పటికి పట్టపగలువలె వెలుతురాయెను. మగశార్దూలముయొక్క భీకరరూపము నాకు కనబడెను. చింతనిప్పులవంటి కండ్లతో, కోరలుపైకిచూపుచు, కోపముతోను, యాతురతతోను గుహలో ప్రవేశింపజొచ్చెను.

ఆహా! మాతృవాత్సల్యము! పసిబిడ్డలకై సంపాదించిన రుచ్యమగుపదార్థమును, వేటాడుటకు బద్ధకించి సోమరిపోతుగా తిరుగుచుండు పెనిమిటికి తల్లియిచ్చునా? ఒకక్షణములో మగనిమీదికి బాణమువలె ఛార్యపడెను. వెనుకటి కాళ్ళమీద నిలువుగా నిలుచబడి వారిరువురును ఘోరయుద్ధము చేసిరి. దెబ్బలుకొట్టుకొనుట, గోళ్ళతో రక్కుకొనుట, నొకరినొకరు క్రిందపడద్రోయుటకు చూచుట, నింకననేకవిధములుగా భయంకరమగు పోరుసలిపిరి. అది యెట్లుముగియునో, యెవరికి జయముకలుగునో చూచుట కత్యంతయుత్సాహకరముగానుండెను. అయినను యేపక్షమువారు గెల్చినగాని, నాకుమరణముతప్పదు గావున విదియే మంచివేళయని చల్లగాతప్పించుకపోతిని.

మిక్కిలి భయముతో నొకగంటసేపు తిరుగగా నొక బయలుకనబడెను. అచ్చట కొందరు పచ్చిక తీయుచుండిరి. నేను ప్రశ్నింపగా వారు నేను జేరవలసినదండునకు చెందిన గడ్డితీయువారని తెలిసికొంటి. కంటూన్మెంట్ (Cantonment) మిక్కిలి సమీపముగా నున్నదనిచెప్పి, మరింత దగ్గరగానుండు యడ్డదారిని వారు నాకు చూపిరి.

నేను వెళ్ళుచుంటిని. నాపటాలమునకు చెందిన ఆఫీసరులు (Officers) పరేడు (Parade) నుండి తిరిగివచ్చుచుండిరి. వారిని కలిసికొని నేనెవరనో చెప్పుకొంటిని.

"నీ గుర్రమెక్కడ?" యని యడ్జుటండు (adjutant) గారడిగిరి.

"నేను తీసుకరాలే"దని జవాబు చెప్పితిని.

"అడ్జుటంటుగారికి నీవు వ్రాసిన జాబులో నీవు Z నుండి నిన్నటిదినమున బయలుదేరుదునని తెలిపియుంటివికదా? అయితే, బోలాంగ్! నీవతిత్వరితముగా వచ్చినట్లు కనబడుచున్నదే?" యని తారుమారులుగా చిరిగిన వాదుస్తులనుచూచుచు కర్నల్ గారడిగిరి.

"అయ్యా! నిన్నటిదినమే నేను Z విడచివచ్చినాను" అంటిని.

"ఎట్లు ప్రయాణముచేసితివి?" అనిరి.

"మొదటి పాతిక మైళ్ళు గుఱ్ఱముమీద."

"అటుతరువాత, పల్లకీమీద కాబోలు?" అనిరి.

"అబ్బే, లేదండి" యని యుత్తరమిచ్చితిని.

"నాటుబండిమీదనా?" యని ప్రశ్నించిరి.

"అదికూడ కాదు" అని చెప్పితిని.

"మరెట్లు వచ్చితివి, చెప్పవయ్యా?" యని యడిగిరి.

ప్రపంచమున నెట్టి శూరుడైనను తలబెట్టజాలని పరాక్రమకృత్యము, నేనొనర్చియుండినను మిక్కిలి దైన్యతనవహించి, భయభక్తులతో నిట్లంటిని.

"మిగిలిన డెబ్బదిమైళ్లు సుమారు, పెద్దపులిమీదవస్తిని."

"పులిమీదనా? పులిమీదనే!" యని యందరు నొక్కమారుగా నరచి గట్టిగా నవ్వసాగిరి. జరిగిన విషయములు విశదముగా చెప్పినను వారు నమ్మకపోయిరి." —అనువాదము.

## దైవమా! యాడుపుట్టుక దేలనో?

శ్రీమతి ఎ. హేమలతగారు

ఆనందరాశినై అందంపుబొమ్మనై
పంజరపుచిలుకేగదా
దైవమా! యాడుపుట్టుకదేలనో?
వివిధవిద్యారతి వెలసియుండినగాని
పురుషసేవకురాలెగా
దైవమా! యాడుపుట్టుకదేలనో?

రాజ్యాంగతంత్రాళి రాణించుమణియయ్యు
మూలకృంగగ నయ్యెగా
దైవమా! యాడుపుట్టుకదేలనో?
కాళీస్వరూపినై కలకలంబులనొప్పి
కాళ్లులేనిదయ్యెగా
దైవమా! యాడుపుట్టుకదేలనో?

## సత్యము

శ్రీమతి చర్ల సుశీలగారు

సత్యరతుఁడు హరిశ్చంద్రునకెంతయు నిర్మలకీర్తినినిలిపినావు
పితృసత్యవాగ్రక్షఁబెంపొందురాముని నవతారముగఁజేసియలరినావు
పలికినట్లుగఁజేసిబాధలందినపాండవులకు జయంబుపెంపునిడినావు
అఘాన్న పడవిలో నావును వ్యాఘ్రముముఖంబునఁబడకుండగాచినావు
స్వచ్ఛమౌ నీస్వరూపంబునరయు కజ్జ
లాడితప్పుచు ధనములనందుచుంద్రు
విజ్ఞులగువారలెప్పుడువిశ్వసించి
శాశ్వతానందకీర్తులుసతముగొంద్రు.

## రాఘవా!

శ్రీమతి కడియాల సుభద్రా కామేశ్వరరావుగారు

సత్కళలీనురత్నములు సాగరగర్భమునందుబోలె, నా
హృత్కమలంబునందిమిడి యెన్నొప్రశస్తపుటూహలుండె; నీ
సత్క్రియలొప్పుచొప్పుగని, సన్నుతిసేయగనూహచేసినన్,
సత్కవిపాలుగాకయవి, సాధ్యమెనాకటుసేత; రాఘవా!
వాలినిగూలనేసితివి వజ్రసుతుండనియైననెంచకే
సాలముపొంతడాగి, యినజాతు భయావహు నేలువంక; నా
భీలరణావనిన్, రిపులభీకరవృత్తి నిజేల్చి, చెండినన్
మేలగుగాక; ధర్మవౌకో? నీచునిపోలికగొంతుగోయుటల్!
కనుగొననొక్కపోల్కగద, కాపురుషుండును, సజ్జనుండు నీ
మనమున; మేలుగీళ్లనిసుమంతయునెంచకపోవు; చెల్లునే
ఇనసుతుగావబూనిమదినింపువహింపుచు, దత్సహోదరున్
గోసములప్రోవుగూల్చితివి, కోతులనాయకు, నింద్రసూతినిన్.
అతడధర్మచిత్తుడనియందము, సోదరుగష్టపెట్టుటన్;
జేతములొప్పనే, విన, దినేశునిపుత్రుని దుర్నయంబులన్
భ్రాతయటంచునెంచకయె, భ్రాంతినిమోసమొనర్పజెల్లునే,
భ్రాతలుతుల్యులిర్వురును వారకగూల్చితివందునొక్కనిన్.
ఇనసుతుకంటెగూర్చుసఖుడింద్రతనూభవుడౌనునీకు; నీ
మనముననేమియెంచితివొ! మాన్యుడుగాడొకో! యింద్రుపట్టి, నీ
జనకజదెచ్చియీయడొకో? సమ్మతి నాతనిమైత్రి సల్పినన్?
యినకులవర్ధనుండవగుటెగద కారణమెన్నియెంచినన్.
వాలి కృతాపరాధి; సరి; వైరిసహోదరుజేరదీసి, పా
పాలనుమూటగట్టితి వపారసుఖంబుననున్నదైత్యభూ
పాలకు, బుత్రమిత్రపరివారముతోడను, రూపుమాపి, నీ
యాలికినై; తలంపనిదియా నిజధర్మమునీకు? రాఘవా!
ఎంతయుదుఃఖభారమునసేడ్చెడి తారమనంబులోన, ద
త్కాంతునిబాసియుంట;నట గాంతునిబాసినరాణివాసమ

త్యంతవిచారవీచికల నట్టిటుబొర్లుచునుండ లంకలో
గాంతకునై పెనంగితివి కష్టుడవీవుతలంప, రాఘవా!
చిలుకయుగోరువంకగతి జెన్నలరారుచునుందురన్న, నా
చెలువముగూడ లేదుగద! సీతకునీకును; జూడజిత్రమా
కలిమిగలాడవంచు, దసకన్యకనిచ్చె, నెరుంగలేకనీ
పొలతులచెయ్యులన్ మిథిలభూపతి; వెర్రియె, కాకయుండినన్?
కోసలరాజనందనకుగూర్చెడి ముద్దులకాడవౌచు, వి
శ్వాసముతోడనిన్గొలువ వచ్చినలోకముగన్నతల్లి, సీ
తాసతి దండకాటవిని దాపము నొందగజేసి; నమ్మికన్
మోసమొనర్చినావుగద! మోసపులేడిని బట్టుచొప్పునన్.
ఒప్పులకుప్ప, మాజనని యుర్విజ, పూతచరిత్ర, సాధ్వికిన్
తప్పొకడేలగల్గు, విశదంబదినీకునునైన, నిర్దయన్
నిప్పులకప్పగించితివి, నింద్యకథాసవిశేషివౌచు, నీ
మెప్పులకేమి, భూజనులమీదికిద్రోసి తప్పు, రాఘవా!
పావనియాట దాబ్రతికె వహ్నినిమ్రగ్గక, నంతిబోక,నా
పావనిబూర్ణగర్భవతి, బాములనొందగ, ఘోరకాననంబు
బోవిడనాడి, ధర్మమును, భూజననిందలగాచుకొంటివే,
వావిరి మందభాగ్యులగువారికి సౌఖ్యము లెట్లుకల్గునో?
ఇంతగనిందజేసితని యెంచగబోకుము నీమనంబునన్
జింతలవంతలన్నివికి చిక్కులపాలగుచుంటగాక; వ
శ్రాంతమునీదుభక్తజనరక్షణదక్షతనేనెరింగి, శ్రీ
కాంతుడ! నిన్నుదూరుదునె? కంజదళాక్ష! హరీ! రఘూత్తమా!
దాసులతప్పులన్నిటిని దండముతోసరిజేయుదువు, నే
జేసెదనయ్యదండమును చిత్తమునీకయియప్పగించి, యో
భాసురకీర్తిసాంద్ర! రఘువంశపయోదధిపూర్ణచంద్ర! నా
దోసపుదీవగుంపులను ద్రెంపుము పూని దయాలవిత్రమున్.

—నిందాస్తుతి

# గంగాదేవి: మధురావిజయము

శ్రీమతి నాగలింగమ్ సరళాదేవిగారు

సంస్కృతసారస్వతమును బరిశీలించిచూడగా పురుషులవలె మనోహరమగు కవితనుగూర్ప సమర్థలయి పాండిత్యమునందును వన్నెకెక్కిన వనితామణులును అచటచట కాన్పించుచున్నారు. వేదకాలమున గార్గియును, ప్రాతిథేయియును, మఱికొందరు కవయిత్రులును వేదసంబంధములగు ఋక్కులనుగూర్చి విస్తులమగు ప్రశస్తినార్జించిరి. తరువాతికాలమునగూడ రాజశేఖరునిధర్మపత్ని అవంతిసుందరిమున్నగువారు అపమానకవితాభిశోభితలయి గణనకెక్కిరి. అట్టులనే ఈగంగాదేవియు కవయిత్రీమణులలో నెన్నదగిన ప్రఖ్యానముకలది. ఈగంగాదేవి యొకసామాన్యపండితుని భార్యకాదు. ప్రాజ్యసామ్రాజ్యపరిపాలకుడై యెనలేనికీర్తిని జేపట్టిన వీరకంపరాయనిపట్టమహిషి యీమె. ఆవీరకంపరాయడు నిర్వక్రపరాక్రమాభిశోభితుడు. ఆతని రాజధాని కాంచీపట్టణము. దక్షిణాపథమున చాలభాగము ఆతనియేలుబడిక్రింద సుపరిపాలనమును బడసెను. ఆతడు 1367 ప్రాంతములయందుండి తనయొక్క పరిపాలనమును సాగించియుండెనని చారిత్రకప్రవరులు నిర్ధారణచేసియున్నారు. రాజవంశసంజాతలగు కవయిత్రులలో నీమెతో పోల్పతగినవారు రాజశేఖరకవిభార్య అవంతిసుందరీదేవియు; అత్యద్భుతకవితావినోదియు, రసికప్రభువును అగుభోజుని పట్టమహిషి లీలావతీదేవియును. కృష్ణదేవరాయల పుత్రియును సంస్కృతకవయిత్రియని ప్రవాదముకలదు. అపారసౌఖ్యముల నోలలాడుచున్నను, మహాసామ్రాజ్యమున పట్టమహిషీత్వమును అనుభవించుచున్నను, ఇంతటి దీక్షతో సారస్వతవ్యవసాయము నొనర్చి, ఈరీతివైదుషిని గూర్చుకొని, మనోహరకావ్యరత్నమును కవీశ్వరులు మెచ్చగా, సహృదయులు అబ్బురంబడగా విరచించుట మిగులశ్లాఘనీయమగు విషయము. పుస్తకమంతయు ఈయమ పాతివ్రత్యవాసనల గుబాళ్కొనుచున్నది. తనపతి పరాక్రమవృత్తము నితివృత్తముగా స్వీకరించి ఈయమ పతివ్రతాత్వమును సాధించుకొన్నది. తన పతియొక్క భుజపరాక్రమమును వర్ణింప దొరకొన్న ఈపతివ్రతాలలామ నిజముగా చరితార్థురాలు. పతిమయజీవితలలో నెన్నదగినధన్య. అటుపై నీయమ కావ్యమునుగూర్చి యించుక వివరింతము.

మధురావిజయము ఒక శ్రవ్యకావ్యము. సాధారణముగా కావ్యములన్నియును పౌరాణికకథావిలసితములు. ఇందలి ఇతివృత్తము పౌరాణికమా? కాదు—కల్పితమా? అంతకుమునుపేకాదు. అయ్యది చారిత్రకము. ఇట్టిచారిత్రకకావ్యములు గీర్వాణవాఙ్మయమున నెన్నదగినన్ని లేవు. ఇందలి యితివృత్తము పరాక్రమధనుడగు తన పతి యొనర్చిన యొకానొకదండయాత్రను గూర్చినదియేకదా. మనము కావ్యములను ఖ్యాతములు, కల్పితములు, ఉభయములు అని మూడువిధములుగా విభజించుకొనవచ్చును. ఈమధురావిజయముకూడ ఖ్యాతములలోనే చేరనగును. ఈకావ్యము నందాలంకారికసమయములన్నియును పాటింపబడినవి. "ఆశీ, ర్నమస్క్రియా, వస్తునిర్దేశోవాపితన్ముఖం" అనునాలంకారికసూక్తిని అనుసరించుచు, గ్రంథాదియందు ఈయమ ఆశీర్వాదరూపకమగు మంగళమును బ్రతిపాదించుచున్నది. అభీష్టదైవమగు వినాయకుని పారములేనిదయచే తననిర్విఘ్నకవితాప్రచారమును కోరుకొనుచున్నది. చంద్రకశేఖరునియందే యీయమకు భక్తిమెండని గ్రంథాదిశ్లోకములు చెప్పుచున్నవి. అచటచట నౌపమ్యమును గూర్చునపుడుకూడ పరశివప్రస్తావమునే యీమె యొనర్చుచున్నది. 'త్రిలోచనమివాపరమ్' 'శంకరి స్యైవపార్వతీ' 'దేవీమహాసేనమివేందుమౌళేః' అనునవి యీవిషయమున నుదాహరణములు. తన సారస్వతక్షేత్రమున ప్రథమవ్యవసాయమగు నీగ్రంథమున ముందుగా

నక్షరస్వరూపయగు శారదను బూజించి తరువాత మార్గదర్శకులగుకవివరుల కవితాలాస్యమాధుర్యమును స్మరించుచు తన భక్తిభావమును బ్రదర్శించుచున్నది. ఈయమచే స్మరింపబడిన కవులు కొంద రీయమకు సమకాలికులుగా కానుపించుచున్నారు. ఈయమకు విశ్వనాథుడు గురువైయుండవచ్చును. క్రియాశక్తిగురువు మతసంప్రదాయప్రవర్తకుడగు నాచార్యవర్యుడయియుండనోపును. అతడు శైవమతప్రవర్తకుడు. అందువలన నేకాబోలు ముందుగా నాతని స్తుతించుచున్నది. ఈయమచే బ్రస్తుతుడగు నగస్త్యుడు ప్రతాపరుద్రాస్థానాలంకారభూతుడు విద్యానాథబిరుదధారి క్ష్మీశానుడుకావచ్చును. గంగాధరుడు భారతనాటకకర్త. తిక్కయకవి యెవడో తెలియవచ్చుటలేదు. తక్కిన బాణభారవ్యాదులు సుప్రసిద్ధులు. కవీశ్వరులలో నీయమకు కాళిదాసునియందే నితాంతభక్తి. కేవలము భక్తి మాత్రమేకాదు. అతని కవితామార్గానుసరమున నపారరక్తియును.

కవివర్ణనము నొనర్చిన తరువాత కవితాస్వరూపనిరూపణమునకు బ్రయత్నించినదీమె. ఇంత సంగ్రహముగా కాదుగాని—నీలకంఠదీక్షితులవారిట్టిమార్గమునే తమకావ్యములయందవలంబించినవారు. శివలీలార్ణవము, గంగావతరణము నిటతార్కాణములుగానున్నవి. "ప్రబంధమునందు దోషములుండరాదు. గుణములుండవలెను. కావ్యమునందు స్వతంత్రతమాత్రమే ప్రశంసింపతగును. ఆగుణమున్న కావ్యము ప్రకాశించును. రసభావమహితమై, శ్రవ్యమంజులపదశోభితమై, రమణీయార్థసంకలితమై యొప్పుకవిత దుర్లభము. ఏదేనొకలోటు వాటిల్లక యొకరికవితయునుండుటలేదు. సర్వగుణసమలంకృతములగు కావ్యములుకాని, అన్నిమార్గముల సహృదయుముల మెప్పింపగల కవులుగాని అరుదు. కావ్య మనల్పకీర్తికల్పన మొనర్చును. మహితమగుదుష్కృతజాతమును బోకార్చును. ఆనందమగు నానందమును జనింపచేయును." మొదలగునవి కవితావిషయమునుగూర్చిన ఈమె యాశయములు. ఆలంకారికులుగూడ నట్టులనే 'పరనిర్వృతిదేవ ముఖ్యంఫలమ్' అనిచెప్పియున్నారుగదా.

తరువాత నిట్లు కథాప్రారంభ మొనర్చుచున్నది. తుంగభద్రాతీరస్థమగు విజయాభిధాననగరము మిగుల వర్ణింపబడినది. ఆరాజధాని సమస్తవస్తుసంపూర్ణ, నిర్మలసరఃపరిపూరిత, రమణీయసౌధసముత్తుంగ, మదగజసంశోభితయునయి 'దక్షిణాశాసరోజాక్షీఫాలలీలాలలాటికం' బోలి ప్రకాశించుచున్నది. అక్కడిస్త్రీలు అతిసుందరులు. మందునకయిన నచట చెడ్డగుణముకానుపింపదు. 'వక్రత స్త్రీల ముంగురులయందు' అని యీరీతిగా వర్ణించుచు తనవర్ణనాప్రాగల్భ్యమును జూపుచున్నది. దానికి శాఖానగరము పంప. అందు మహేశ్వరుడు విరూపాక్షుడు.

తరువాత కావ్యనాయకుడు గుణవంతుడుకానోపును అనుసంప్రదాయము ననుసరించుచు, నాయకుడగు బుక్కరాయని వివిధగుణాలంకృతుని జేయుచున్నది. అతనికిగల పరాక్రమము, అతనికిగల వైదుష్యము, అతనికిగలకీర్తి మిక్కిలిగా వర్ణితములయినవి. అట్టివారి మనోహరములగు చరిత్రములు కదా నీత్యుపదేశ మొనర్చుచు పఠనీయములయి యొప్పుచుండెను? ఆరాజేంద్రుని పట్టమహిషి దేవాయి. అసమానలావణ్యగణ్యయామె. పతిమయజీవిత యాయువతి. తరువాత కొంతకాలమున కాయమకు గర్భముకలిగెను. అప్పటియామె కాంక్షితములు వీరకుమారప్రసవమును సూచించుచుండెను. ఒకనాడు దేవాయి సుకుమారుని కుమారుని గనెను. అప్పుడు పుష్పవృష్టికురిసెను. మారుతము చల్లగా, మెల్లగావీచెను. ఆనందమున బుక్కరాయ లరిష్టమున రమాకుమారసదృశుని నిజకుమారునిగాంచి ఆనందపరసీమల నందుకొనెను. కంపనామము ఆకుమారున కొనర్పబడెను. శాత్రవకంఠవిలుంఠనసూచకమగు నానామమే అతనియొక్క పరాక్రమమును చెప్పెను. క్రమశః అతడువర్ధిల్లి సమస్తగుణములయందును, విద్యలయందును వన్నెకెక్కెను. అని యీవిధముగా ప్రారం

ఖించి తదనంతరము కథావిధానమును సాగించుకొన్నది. విస్తరభీతిచేత కథాశరీరమంతయు నిందు ప్రదర్శింప బడలేదుగాని, ఇక్లే కావ్యమునందంతటను ఇతివృత్తము సముచితముగను, మనోహరముగను పరిపోషితమైనది.

ఈయమ కాళిదాసునియొక్క కవితానుసరణమునమిక్కిలి మక్కువ చూపుచున్నది. శబ్దముచేతను, అర్థముచేతను రఘువంశకావ్యము ఈమెచేతననుసరింపబడినది. అందుకు తార్కాణములు అనేకములు. కావుననే

దాసతాంకాళిదాసస్య కవయోయేనబిభ్రతి
ఇదానీమపితస్యార్థానుపజీవ న్త్యమీయతః.

అను నీయమసూక్తి అన్వర్థమేయగుచున్నది. రఘువంశమునందలి

"శరీరసాదాదసమగ్రభూషణా!"
అనుదౌహృదయవర్ణనము ఇందలి
"ముఖేనతస్వీ శరపాండరేణ"
అనుశ్లోకమును పోలుచున్నది. అట్లే

"ససేనాంమహతీంకర్షన్"
అను రఘుప్రస్థానవర్ణనముఇందలి
"సనయన్ మహతీంసేనాం"
అనుదానికి మూలభూతము.

ఇట్లే చాలతావుల సాదృశ్యము కాన్పించుచున్నది.

ఈయమకవిత అతిమధురమైనది. దీర్ఘసమాసాడంబరములేదు. వికటపదకఠోరత కానుపింపదు. పదగుంభనము కాళిదాసుని అడుగుజాడలనే గమించినది. మనోహరములగు భావములు. రసము సహృదయుల తనుపార్పజాలినది. అచ్చటచ్చటను అర్థపర్వద్రప్రయోగ మాచరించియును, రసభావవ్యంగ్యముల నొవర్చియును, ఈయమమనోహరార్థవిశేషముల కూర్చుచుండును. ఈయమకూర్పు చేర్పువారి శిరీషసుమపేశలతల విప్పారించును. అలంకారములలో ఉపమయందే ఈయమకు ప్రీతిమెండు. అచ్చటచ్చటను చక్కని యుత్ప్రేక్షలను గూడ ప్రయోగించుచుండును. కాళిదాసుని కవితవలె గుణమహితయు, ప్రగల్భయు కాకున్నను ఈయమకవిత స్పృహణీయతను, తదనుసరణముచే మాధుర్యమును వెలుపరింపజేయుచున్నది. చెల్లకవిత్వము ఆంధ్రసారస్వతమున నెట్లు భావప్రకటనమునకును, రమణీయతకును పేరువడినదో గీర్వాణప్రపంచమున నట్లేనడచిన ఈయమకవితయు నానందమును గూర్పజాలియున్నది. ఏకాలమునవైనను—ఎవరు విరచించినను—మధురకవితలు నిత్యవిభాసినులై వన్నెకెక్కునుగదా. రమ్యకవితావనితను స్వీయసఖిగానాచరించుకొన్న గంగాదేవి నిజముగాధన్య; స్త్రీజనమూర్ధన్య.

## విరహగీతి

శ్రీమతి కోనరాజు అమ్మాయమ్మగారు

నాథుడీదెవచ్చెననుచు నే నిద్రలేచి
కనులుతెరచితి నాథుండుకానరాడు.
నింగిపై వెల్గుచుండె నానిశకరుండు
ప్రణయవిరహాగ్నిబాధ నే సైపలేక
హృదయదుఃఖాగ్నిచే నాకుఉబుసుపోక
తోటలో వేదిపై చేరి దుఃఖవశత
బిక్కపోయినమోముతో దిక్కులెల్ల
కలయచూచితి నాథుండుకానరాడు.

ప్రళయకాలాగ్ని దేహాన ప్రజ్వరిల్లి
భస్మమొనరించునో యనుభీతితోచె.
శీతచంద్రికలను చిల్కుహిమకరుండు
చెంగుచెంగున మబ్బులచాటుదాగె.
మందగతితోడ వీతెంచుమారుతుండు
మాటిమాటికి నాతోడమేలమాడె.
నాథ!నానాథ! మన్మనోనాథ! నీకు
మేలమేటికి నాతోడ వేగరమ్ము.

# దసరా చేసిన పని

శ్రీమతి వి. జ్ఞానాంబగారు

౧

"ఏమిటో ఆలోచిస్తున్నారే?" అంది సీతమ్మ పడకకుర్చీలో పండుకొని ఇంటికప్పు వైపు ఏకదృష్టితో చూస్తూవున్న భర్తతో.

"ఆలోచనా లేదు. గీలోచనా లేదు. బతికినంతకాలంవుంది ఈబాధ. ఒక్కనాటిది గనుకనా?" అన్నారు పంతులు విసుక్కుంటూ.

"ఎందుకండీ? అంతబాధా, అంతవిసుగూనూ?"

"నాబాధ నీకెలా తెలుస్తుందీ? తెచ్చిపెడితే తినికూర్చుంటావు."

"పాపం: మీరు నన్ను కూర్చోబెట్టి సాకుతున్నారుగాబోలు. పొద్దస్తమానం రెక్కలు విరిగేటట్టు పనిచెయ్యడంలేదూ?"

"మహాచేశావు. అవిలేవనీ ఇవిలేవనీ వేపుకొనితినకుంటే అంతేచాలు."

"రామ. రామ. నేనెప్పుడయినా మిమ్మల్ని అవితెమ్మనీ ఇవితెమ్మనీ బాధించేనా? మీరే లేనిపోని దుబారాఖర్చులుపెట్టి డబ్బులేక దిగులుపడుతుంటారు."

"అవును. నాకుకాకపోతే మరెవ్వరికి ఉంటుందీదిగులు? మెడమీదికాడిలాగ దసరా పండుగ సమీపిస్తోంది. కుఱ్ఱవాళ్లకు గుడ్డాగుడుసూకావాలి. చేతిలోదమ్మిడీలేదు. అప్పుపుట్టే కాలమూకాదు. ఏంచెయ్యాలి?"

"ఏంచేస్తారు? గుడ్డలులేకపోతే మనకుఱ్ఱవాళ్లను ఎవరూ వెళ్లగొట్టరు లెండి."

"బహునెమ్మదిగా చెబుతున్నావు. నీకేం? మహారాణీలాగ ఇంట్లో కూర్చుంటావు. నలుగురిలో తిరిగేవాడిని. ఫలానాఆయన కుఱ్ఱవాళ్లు పండుగపూట పాతచొక్కాలతో వీధుల వెంబడి తిరుగుతున్నారంటే ఆఅవమానం ఎవ్వరికీ? నాకేకాదూ?"

"అయితే నన్నేంచెయ్యమంటారు?"

"నీవేంచేస్తావు? ఇది నాస్వయంకృతాపరాధం. వచ్చినజీతంఅంతా దుబారాచెయ్యడం వల్ల నిండుపండుగపూట కుఱ్ఱవాళ్లకు పాతచొక్కాలు తొడిగించవలసిన దరిద్రం పట్టింది." అని వేడినిట్టూర్పొకటి విడిచేడుపంతులు. భర్త అవస్థచూసి సీతమ్మకు జాలివేసింది.

"అలాఅయితే మీరింతటినుంచీ దుబారాఖర్చులు మానుకుంటారన్నమాట."

"నీతోడు. మానుకోకపోతే ఇంకామర్యాదదక్కుతుందీ? మనపక్కఇంటి పాపయ్య వంటి దరిద్రుడుకూడా పదిమందినీ ఆశ్రయించి పంచాంగంచెప్పి పదిడబ్బులు సంపాదించుకొని పండుగనాటికని కుఱ్ఱవాళ్లకు కొత్తచొక్కాలు కుట్టిస్తున్నాడు. అన్నీవుండి అష్టదరిద్రం

అన్నట్లు నేను కచ్చేరీలో గుమాస్తాపని వెలిగిస్తూవుండికూడా పిల్లవాండ్లను దరిద్రదామోదరులను చేయవలసివచ్చింది. సీతా! ఎంతనిర్భాగ్యపుబ్రతుకు నాది?"

పంతులుముఖంలో పశ్చాత్తాపమూ, సీతమ్మముఖంలో సంతృప్తీ ఒకేసారి కనబడ్డాయి. ఆమె కొంతసేపు ఆలోచించి "మీరు పండుగదిగులు పెట్టుకొని గాభరాపడవద్దు. దేవుడు మనకు తప్పక మేలుచేస్తాడు" అంది. ఆమె ముఖంలో ఉత్సాహం తాండవమాడింది.

౨

రామంపంతులు తాలూకాకచ్చేరీలో అబ్కారీశాఖకు గుమాస్తా. నెలకు ముప్పైఅయిదురూపాయలు వేతనం. వచ్చినజీతం ముడుపుగట్టిదాచిపెట్టే అలవాటు అతనికిలేదు. ఏనెలజీతం ఆనెలకు పాటాఖర్చు. తహసీల్‌దారు పాటకచ్చేరీ చేయించినా, డిప్టీకలెక్టరు భోగంఆట ఆడించినా మొదటి ఆహ్వానం పంతులుగారికే. చందాపట్టీలో మొదటిపేరుగూడా పంతులుగారిదే. దుకాణంలో కోటుగుడ్డగాని, క్రొత్తరకంసిల్కుగుడ్డగాని కనబడిందంటే అది మరుసటిదినం పంతులుగారి దేహంమీద తళతళలాడవలసినదే. పంతులు వెళ్లకుంటే క్లబ్బులో పేకాటజరుగదు. సీమసరుకుదుకాణాలకు అసలే గిరాకీ ఉండదు. ఇలా దుబారాఖర్చులు చెయ్యడంవల్ల పంతులుఇంట్లో ఒక్కొకప్పుడు భోజనసామగ్రులు తక్కువపడేవి. బడిజీతాలు ఇవ్వకపోవడంవల్ల కుఱ్ఱవాళ్ల చదువుగూడా సక్రమంగా సాగేదికాదు. అయినా సీతమ్మ మంచిపొదుపుగలమనిషి. కాబట్టి ఇంటిగుట్టు పైకికనబడకుండా సంసారం సర్దుకొనివచ్చింది. ఆమెకు భర్తమీద అంతులేనిప్రేమ. అత డెన్నిదుబారాఖర్చులుచేసినా ఆమె పల్లెత్తుమాట కూడా అనేదికాదు. మగవాడు స్వతంత్రుడు. అతనికి లేనిసంసారం ఆడదానికి ఎక్కడిది? ఎప్పటికయినా తనతప్పుతానే తెలుసుకొని పశ్చాత్తాపపడతాడు మగవాడు. ఇది ఆమె అభిప్రాయం. దసరాపండుగమూలాన ఆమె అభిప్రాయం సిద్ధించింది. పండుగ ఇంక రెండు దినములుంది అనగా పంతులుఅవస్థ వర్ణనాతీతమయిపోయింది. కుఱ్ఱవాళ్లు బడికిపోవడం మానేశారు.

"నాన్నా! నాకు కొత్తచొక్కా కుట్టించవూ?" అని ఒకరూ,

"క్రొత్తలాగుకుట్టించవూ?" అనిఒకరూ,

"నాకు జరీటోపికొనిపెట్టు. నాన్నా!" అని ఒకరూ,

"నాన్నా! ఈదఫా మాఅయ్యవారికి రెండురూపాయలు సంభావనఇవ్వాలి. నాకు పద్యాలు బాగానేర్పేరు" అని ఒకరూ గోలచేయడం మొదలెట్టారు.

పంతులుఏంచేస్తాడు? వాళ్లను సముదాయించలేక కళ్లనీళ్లుపెట్టుకున్నాడు. ఇకమీద విదేశపుసరుకులకు డబ్బు తగలెయ్యకూడదని పెళ్లాంమీదా, పిల్లలమీదా చాలాసార్లు ఒట్టు

పెట్టుకున్నాడు. అంతలో "దేవుడు మనకు తప్పక మేలుచేస్తాడు"అని పెళ్లాంచెప్పినమాటలు జ్ఞప్తికిదెచ్చుకొని కాస్త కుదుటబడ్డాడు.

3

దసరాపండుగవచ్చింది. కుఱ్ఱవాళ్లు కొత్తచొక్కాలూ, లాగులూతొడుక్కొని జరీ టోపీలుపెట్టుకొని రంగుకాగితాలుఅంటించిన విల్లనమ్ములు చేతబట్టుకొని మొదటిదినంగనుక దేవళాలమీదికి వెళ్లుతున్నారు. వాళ్లలో ఒకకుఱ్ఱవాడు

"కాంతం! నీవు తొడుక్కున్న ఖద్దరుచొక్కా చాలాబాగుందిరా."అన్నాడు.

"కోదండం! నీషరాయికూడా బాగానేఉంది. అయితే నాచొక్కావలె నయంగాలేదు."

ఇంతలో ఒకతురకపిల్లవాడు ఆకులూ, వక్కలూ, జాజికాయలూ, జాపత్రీ చేత బట్టుకొని పరుగెత్తుకుంటూవచ్చి కాంతంచేతి కిచ్చేడు.

"అరే! రసూల్! చాలాఆలస్యంచేశావు. ఇక వెళ్లుదాంపద."అన్నాడు కాంతం.

"కాంతం! మైఆతానై. హమారాబాప్ బడాఖరాబ్ అద్మీహై. హంకు నవేకప్డా దియానై."

వీథిఅరుగుమీద కూర్చొని వచ్చేపొయ్యేకుఱ్ఱవాళ్లను చూస్తూవున్న పంతులుకు తురకపిల్లవాడనిన మాటలు ఈటెపోటుల్లాగ మనసులోనాటినవి.

తనపిల్లలుకూడా తనను ఈలాగేదూషిస్తుంటారు. సందేహమేమి? పదకొండుగంట లయినవి. దేవళాలకువెళ్లిన కుఱ్ఱవాళ్లందరు తిరిగివస్తున్నారు. వాళ్లలో తన కుఱ్ఱవాళ్లుకూడా కలిసివస్తూవుంటారు. అందరిపిల్లవాండ్లు అందమయిన బట్టలు కట్టుకొని ఆనందపడేసమయంలో తన పిల్లవాండ్లు పాతబట్టలతో ఉండడం తానెలా చూస్తాడు? పాపం! పంతులు మనసు చివుక్కుమనింది. ఆఆఘాతానికి తట్టుకోలేక అతడు భోరున ఏడ్చేడు. ఆసవ్వువిని సీతమ్మ బయటికివచ్చి "అయ్యో! దేముడా! ఇదేమిటి? నిష్కారణంగా కంగారుపడుతున్నారు. దేవుడు మనకు మేలుచేస్తాడు."అని ఓదార్చడం మొదలెట్టింది. కాని పంతులుకు దుఃఖ మాగిందికాదు. ఇంతలో "జయా! విజయీభవ! దిగ్విజయీభవ" అంటూ విల్లునమ్ము లకుకట్టిన గజ్జలు గలగలలాడిస్తూ కుఱ్ఱవాళ్లు బిలబిలాఇంట్లో ప్రవేశించేరు. వాళ్లనుచూస్తూనే పంతులుకు ఆశ్చర్యంవేసింది. అంతేగాదు. అగాధమయిన ఆనందంలో తేలిపోయాడుకూడాను. కారణమేమిటంటే కుఱ్ఱవాళ్లందరు పాతచొక్కాలకు బదులు పరిశుభ్రమయిన ఖద్దరుబట్టలు తొడుక్కొనివున్నారు. పంతులు కళ్లవెంబడి అప్రయత్నంగా రెండుమూడుఆనందాశ్రువులు దిగజారినవి. ఆఆనందపారవశ్యంలో అతడు "ఈగుడ్డలు ఎక్కడివి? ఎవ్వరు కొనియిచ్చేరు?" అని అడగనుకూడాలేదు. అడగడంతో పనిఏమి? కుఱ్ఱవాళ్లు సంతోషపడితేచాలు. అతనికి కావలసినదంతే. మగని ఆనందముగ్ధత్వాన్నిచూసి సీతమ్మ చిరునవ్వునవ్వింది.

౪

మఱునటిదినం.

పుత్రవాళ్లు అప్పుడే భోంచేసి బడికివెళ్లేరు. సీతమ్మ దొడ్లో అంట్లుతోముతోంది. పంతులు గదిలో కూర్చొని కచ్చేరీకాగితాలు చూసుకుంటూవున్నాడు. వీథితలుపు చప్పుడయింది.

"ఎవరువారు?" అన్నాడు పంతులు కాగితాలు చూసుకొంటూనే.

"శేషమ్మను. నాయనా!" అంది ఒకవణుకుడుకంఠం.

"నీవా? అవ్వా! ఇదిగోవస్తూన్నా" అంటూ పంతులువెళ్లి తలుపుతీశేడు. డెబ్బయి ఏళ్లముసలామె లోపలికివచ్చింది.

"పంతులూ! సీతమ్మఏదీ?"

"లోపలవుంది. పిలవనా?

"ఊఁ"

"ఏంచేస్తున్నావు? ఇలారా. శేషమ్మఅవ్వ పిలుస్తోంది."

సీతమ్మవచ్చింది.

"ఎందుకు అవ్వా! పిల్చేవట?"

"అబ్బే ఏమీలేదు. శ్రావణపండుగనాడు నీకు మీపుట్టింటివాళ్లు కొనియిచ్చిన సిల్కుచీరెను గురించి మావియ్యపురాలికూతురిఎదుట ఈదినం దిట్టంగా వర్ణించేను. నీచీరెను చూసినపిమ్మట అదికూడా అటువంటిచీరెనే కొంటుందట. నీచీరెఇస్తే దానికి చూపించుకొని మళ్లీ తెస్తాను."

సీతమ్మ విరగబడినవ్వింది.

"ఎందుకే? అలానవ్వుతావు? చీరెఇవ్వవూ?" అందిముసలమ్మ.

"చీరెలేదు. ఏమీలేదు. శ్రావణపండుగకానుక దసరాదర్బారులో మాయమయింది."

"అంటే అర్థమేమిటి?" అన్నాడు పంతులు కొంతతెలిసీ కొంతతెలియకా.

"చెబుతావినండి. దసరాపండుగనాడు సిల్కుచీరెనుఅమ్మి అందువల్లవచ్చిన డబ్బుతో నాకురెండు ఖద్దరుచీరెలూ, కుఱ్ఱవాళ్లకు ఖద్దరుగుడ్డలూ కొన్నాను. మీరు ట్వీడుకోట్లూ సిల్కుషర్టులూ, దుబారాఖర్చులూ మానుకున్నప్పుడు నేనుమాత్రం సిల్కుచీరెలు కట్టడం మానుకోవద్దూ మరీ?"

"భేష్! దసరాచేసినపని చాలాబాగుంది." అన్నాడుపంతులు సంతోషంపట్టలేక.

ఈముచ్చటలు చూసి ముసలమ్మ ముసిముసినవ్వు నవ్వుకుంటూ వెళ్లిపోయింది.

# రాద్ధాంతము

శ్రీమతి మానాప్రగడ సీతాయమ్మగారు

"ఏమిటే! ఏమిటే! ఎప్పుడుచూసినాగాని రాతలేగాని, పనిఅనవుపాటనవు. ఇల్లాచేస్తుంటే కాపరాలు నడుస్తాయా?" అంది వెంకమ్మ వంటింట్లోనుంచి.

"సరి! సరి! ఇదిగో వస్తున్నాను. కోప్పడొద్దు" అంది సూర్యకాంతము గృహలక్ష్మికి వ్యాసమువ్రాస్తూ.

"సరి! ఎషుపోతుంది! మన మెషుపోతాం! అబ్బ నీతో పళ్లేక చస్తున్నానే? ఎదిగినదానవు యింట్లో పనిపాట్లు చేసుకోడంమానేశి ఎప్పుడుచూచినా వేసాలు రాస్తావు. కూటికొస్తాయా? గుడ్డకొస్తాయా? నువ్వు రాయడం ఆలాగే! వాళ్లు అచ్చేయడం ఆలాగే! బాగుందివేషం! ఇందుకే పెద్దాళ్లు 'ఆడదానికి చదువొచ్చినా, ముసలాడికి పిచ్చెత్తినా' ఆయింట్లోవుండలేమంచారు" అంది వెంకమ్మ మూతి ముడుచుకుంటూ.

"వస్తున్నానంటే యింతలో అంత చదువెందుకండీ?" అని సూర్యకాంతము వంటింటిలోనికివచ్చి:

"ఏమిటండీ!అంత రాచకార్యం? వస్తున్నానంటే వానామాట్లాడేరు.అదేదో చెప్పేసెయ్యండి?"అంది.

"అయితే కొట్టొచ్చినట్టు మాట్లాడుతావేం? కొట్టాలనివుందా యేమిటి?"

[ఇంతలో పూర్వ సువాసినియగు పొరిగింటి సుబ్బలక్ష్మమ్మగారు దయచేయించి]

"ఏమిటే! వెంకప్పా! చేస్తున్నావు?"

"ఏంచెయ్యడ మేమిటే! నానాబాధగా వుంది. ఈబాధ పళ్లేక చద్దామనుందిగాని ప్రాణంకాస్తా గుటుక్కుమందు" అంది వెంకమ్మ.

"అదేమిటే? వెంకప్పా! ఆలాఅంటావు! నీకేమిటే? కొడుకు సెలకు యూస్తైతెస్తూంటే హాయిగా కాలుమీద కాలేసుకుని, యేదోయింత 'రామా కృష్ణా' అంటూ కాలక్షేపం చెయ్యడానికి బదులు యీలాంటి అవాచ్యపు మాటలంటావేమిటే?"అంది సుబ్బలక్ష్మమ్మ.

"మాయింట్లో సంగతి నీకేంతెలుసే? తెలిస్తే ఆలాఅనవు!"

"నాకేంతెలియదే? తెలిస్తేఅడుగుతానా? ఏం? కొడుకా? కోడలా? తిరుగుబాటు? కుర్రాడు చాలా బుద్ధిమంతుడే! పిల్లకూడా బుద్ధయిందే." అంది సుబ్బలక్ష్మమ్మ.

"బుద్ధులెచ్చెప్పేదేమిటే! కావలసినంత. ఏదేనా నాకెందుకే? సుబ్బమ్మా! కాలం గడిచిపోయింది. రేపో నేడో అయివున్నాను. వాళ్లే యింకా నాలుక్కాలాలు బతికుండవలసినాళ్లు."

[సుబ్బలక్ష్మమ్మకు ఏమియు బోధపడలేదు. ఎదుట నిలువబడియున్న సూర్యకాంతమునుజూచి]

"ఏమిటే? సూర్యం! మీఅత్తగారిల్లా అంటారు?"

"నేను యింటిపనులు చెయ్యనట! ఏవేళా చదువుకుంటూ కూర్చుంటానట! ఆవిడేమో చెయ్యలేక చచ్చిపోతున్నాదట. అందుకు!"

"అలాగా! ఎలాగమ్మా ఆస్తమానం చదువుతూకూచుంటే? ముసలిముండాకూతురు పక్కా ర్తి చెయ్యగల్దా, చెప్పు? చదువుకున్నప్పుడు చదువుకోవాలి! పనిచేసుకున్నప్పుడు పనిచేసుకోవాలిగాని."

"సుబ్బత్తా! మీకూ పిచ్చేనా? ఆవిడలాగ అనాలనంటుందిగాని, నేను చెయ్యకపోతే ఆవిడే చేస్తూన్నాదా? నేను ఎప్పుడైనా చదువుకుంటే చూచి ఓర్చలేక యిన్నిమాట లొచ్చేయిగాని."

"ఓసీ! నీ అన్యాయం ఆరా! నే నోర్చలేనంటావా? చదువుకుని సముద్రములో పడుదూ! నాకేంకావాలి?" అంది వెంకమ్మ కళ్లవెంబడి అగ్నికణములురాలుస్తూ.

"చూసేరా? సుబ్బత్తా! ఆవిడవాచ్యపుమాటలు. నేనేమిటన్నాను? మీరు వింటూన్నారుకదా?" అంది దీనవదనముతో సూర్యకాంతము.

"చదపురుక్కి రెక్కలొచ్చినట్టు చదువుకుని నాలుగుమాటలు నేర్చుకున్నావు. నిన్నేమండం? మొగుణ్ని వల్లోవేసుకున్నావు. ఎలావస్తే అలా పేల్తావు (సుబ్బలక్ష్మమ్మతో) సుబ్బమ్మా! దీని నడకలు యేమీ బాగులేవే. దీని సబ్బులూ, వాసననూనెలూ, వంకపాపిళ్లూ, వాలుజళ్లూ, పైటలంగాలు, జాకట్లు, మొఖానికి పౌడర్లు, వీసులంట షిక్కార్లు చూస్తే సానాళ్లకొంపలో పుట్టినట్టుంది. ఎల్లాగో ఆపాడుబ్రహ్మ బ్రాహ్మడింట్లో పడేసేడు." అంది వెంకమ్మ.

[ఇంతలో వెంకమ్మకొడుకు ప్రవేశము:]

"అబ్బాయీ! కూచోవోయ్. ఏమిటలావున్నావు?" అంది సుబ్బలక్ష్మమ్మ.

"లేదండీ! టూ డేస్‌నుంచి కొంచెము ఫీవర్ వస్తున్నాది. అందుచే నీరసముగా ఉన్నది" అన్నాడు పద్మనాభరావు.

"అయితే బాబూ! ఆస్పత్రికి వెళ్లలేదూ"

"ఇప్పుడు హాస్పటల్నుంచే రావడము" అని ఎదుటజూచి "సుబ్బంపిన్నీ! వీళ్లు మళ్లా యుద్ధముచేసే రేమిటి? ఇల్లావున్నారు?" అని అడిగేడు.

"లేదు. నాయనా! ఏమిటో, పెద్ద ముండాకూతురు. పనిచెయ్యలేక సొణుగుతూంది"

"అయితే యెవరు చెయ్యమన్నారు? మేమే చేసుకొందుమే! హాయిగా కాలుమీద కాలువేసుకొని కూర్చొని యింత అనుభవించక లేనిపోని ఘోషలు దీని కెందుకు?" అన్నాడు పద్మనాభరావు.

"నే నంతమట్టుకు నోచుకోలేదు. ఇల్లాంటి కొడుకు, కోడలు వున్నప్పుడింకేమికావాలి?" అంది వెంకమ్మ కళ్లవెంబడి చుక్కలురాలుస్తూ.

"వూరుకో. వెంకప్పా! అన్నిటికీ తప్పులుపడచావు! అబ్బాయి యిప్పుడేం తప్పన్నాడు?" అంది సుబ్బలక్ష్మమ్మ.

"కాదండీ! పిన్నీ! దీనిసంగతి నాకు తెల్సును. మాపినాయనం ముత్తైదువవలె వుండడంమానేసి, తలదువ్వుకుని, తెల్లనిబట్టలు కట్టుకొని, కొంచెము సోకుగా మనిషి కంటబడితే ఓర్వలేదు. అది యెప్పుడైనా పుస్తకం చదువుకొని కూర్చుంటే దీనికొంప పోయినట్టే! ఈపెద్దవాళ్లకున్న పిచ్చే యిది". అన్నాడు పద్మనాభరావు ముఖము చిట్లించుకొనుచు.

"సుబ్బమ్మా! విన్నావా? మొగుడుకూడా మతితప్పేసి తనలో చేర్చుకొన్నాది. వాడిమాటలు వింటున్నావా? ఇంకెందుకు? ఆకాస్త అనుమానం తీరిపోయింది. నుయ్యో? గొయ్యో?" అంది వెంకమ్మ ఏడ్చుచూ.

## అంధకారము

శ్రీమతి పైడిమర్రి సీతాదేవిగారు

ఆశలే హద్దులై వెల్గు యవనికాదె?
అంతులేని దివ్యమహానాట్యంపుశాల!
సకలజీవారాసులు యిందు చతురులైన

నటులు; యీపాత్రధారణానంతరమున
యెచటికేగెదరో వీరు యెవ్వడెరుగు?

# బావ డ్రయివరు

శ్రీమతి పాకల రత్నమాలగారు

"విమలా! కదలకే. కదుల్తే జడవంకరవస్తుందమ్మా!" అన్నది రాధ.

"కదలనులేవే, అక్కయ్యా! ఇవ్వాళ మనింట్లో ఏమిటే?"

"ఇంకా తెలియదుటే నీకు. దేవీనవరాత్రులుకదూ, బొమ్మలు పెడతాము."

"ఎన్ని రోజ్జులుంచుతారే?"

"తొమ్మిదిరోజులు."

"మనం బొమ్మలు పెట్టుకుంటాముకదా, బావరాలేదేమి మరి?"

"పోనీ! అమ్మా! అలాంటి మాటలంటే నీకుతలదువ్వను."

"అననులేవే, అక్కయ్యా! జడపొడుగుగావేసి ఎఱ్ఱరిబ్బన్ పెట్టవుటే!"

"పెడతానులే"

"విమలా! విమలా! ఎక్కడికి వెళ్లేరమ్మా!"

"ఎందుకే? అమ్మా!"

"అక్కయ్యఏదీ? పిలు రాధనికూడా. పట్టుబట్టలు కట్టుకుందురుగాని మళ్లీ మీబావ వచ్చేవేళవుతోంది. త్వరగారాండి."

"అమ్మా! బావఎప్పుడొస్తాడే?"

"ఇప్పుడే."

"ఏమేనా తెస్తాడా?"

"ఆ. నీకు కాసులుపేరు తెస్తాట్ట."

"ఛీ. నాకెందుకు? అక్కయ్యకి."

"అక్కయ్యకు తెస్తే నువ్వుఏడుస్తావుకదూ?"

"నాన్న తెస్తే యేడుస్తా. బావ తెస్తే నాకెందుకూ?"

"సరే. రాండి త్వరగా. నాకుపనుంది."

"రాధా! నువ్వూ, విమలా వెళ్లి పేరంటానికి పిల్చిరాండమ్మా! నేనంతాసిద్ధంగా వుంచుతాను. అయిదుగంటలకి వచ్చేయండి."

"అల్లాగే వస్తాము."

"అమ్మా! కారుడ్రయివరింకారాలేదు. వెళ్లటంయెలాగ?"

"అయ్యో! ఇంకారాలేదే. త్వరగారమ్మనిచెప్పేనుకూడా. ఎందుకురాలేదో?"

"అమ్మా! బావ కారునడుపుతానంటున్నాడే. వెళ్లమా?"

"సరే వెళ్లండి."

"అక్కయ్యరానంటోంది."

"వెళ్లమ్మా రాధా! వెళ్లు. నీకేమిటిసిగ్గు చిన్నపిల్లవి? వెళ్లీ పిల్చిరాండి. మళ్లా చీకటిపడు తుంది ఆలశ్యంచేస్తే."

"అయిల్లెవరిదే? అక్కయ్యా!"

"కమలంవొదినదే. దిగు వెళ్లి పిల్చివద్దాం."

"ఏమేవ్, రాధా! బొమ్మలుపెట్టేవా?"

"అవును, వదినా! నువ్వు తప్పకుండా రావాలిసుమా."

"మీాఆయన వచ్చేరా?"

"......"

"అబ్బ! ఎంతసిగ్గే? నాతల్లీ! ఏమేవిమలా! మీాబావరాలే?"

"వచ్చేరు? ఇక వెడతామమ్మా! డ్రయివరు తొందరచేస్తున్నాడు."

"అప్పుడేనటేవెళ్లటం? కాస్సేపుకూర్చోండి. డ్రయివరుతో నేచెపుతానులే. మధ్య వాడి కెందుకుతొందర?" అంటూ కమలం వీధిలోనికివెళ్లి "కాస్సేపుకూచుని వస్తారులే. ఏమిటలా తొందరపెడుతావు?" అంటూ అతనిమొహంచూచి గబగబా ఇంట్లోకివచ్చింది. "ఏమేవిమలా! ఎంతపనిచేసావు? మీాబావే కారునడుపుతున్నాడని చెప్పేవుకావు. ఎంతపని జరిగింది?"

"ఏంవదినా! ఏంజేసావు?" అంది విమలనవ్వుతూ.

"బలేదానివిలే నువ్వు."

"సరే మేము వెళ్లివస్తాము."

"ఎన్నిగంటలకిరమ్మంటారు?"

"సాయింత్రం 6 గంటలకిరా."

## కొండవీడు

శ్రీమతి జి. యస్. కమలాకన్యగారు (సాహిత్యమండలి)

సమరరంగాన నీవైరిసంఘములను
చెండివైచినశౌర్య మఖండగతిని
బ్రజ్వలింపదె ఆంధ్రభూభాగమందు—
కాని-అరివర్గము జయింపగా నసాధ్య
మగుట దుష్టవిరోధి మాయలకుఁజిక్కి—
మడసిపోయెను పూజ్యసామ్రాజ్యపదవి—
పోయెగా నొక్కత్రుటిలోన భోగములును.
శత్రురాజభుజాశ్లేషజనితసౌఖ్య
లోలవైపోయె విజయలక్ష్మిలలామ!
పుష్పఫలశోభితంబగు భూరుహాంబు
ధారుణికిఁగూలుగతి విధిప్రేరణమున
తావకసమాశ్రితో త్తమతనయులెల్ల
సమసిపోయిరి సంగరక్ష్మాతలమున—
ఏలశోకించెదవునీవు? మృతినిగన్న
మనుజులెవరేని విలపింపమరలిరాగ
లారలె? త్వదీయపుత్రులు పీరులగుట
జేసి గతజీవులయ్యు నీచింతగాంచి
చటులరఘుంఝూప్రభంజనస్వనములందు
ననునయించుచునున్నా రహరహంబు—
ఇట్టియెడ నేలకల్గు నీకింతవగపు?

# "స్త్రీలచరిత్ర ఎవరునెరుగరు"

శ్రీమతి పేరి అన్నపూర్ణమ్మగారు

"స్త్రీయొక్క చరిత్ర ఎవరునుఎరుగరు" అనేమాట ఒక్క హిందీవాడుకభాషయొక్క గ్రంథములయందే కాదు. ఈలాగున మృతభాషయగు సంస్కృతమునందుకూడ చెప్పబడియున్నది. ఏలాగనగా "స్త్రీయశ్చరిత్రం పురుషస్యభాగ్యం-దేవోనజానాతికుతో మనుష్యః" అని చెప్పబడివున్నది. ఈచెప్పబడినటువంటి సామెతకు "స్త్రీలచరిత్ర ఎవరునుఎరుగరు" అనే ఈసాధారణమైన అర్థమేకాకుండా దీనిలోపల కళంకయుతమైనభావము కూడ ఇమిడివున్నది. అందుకొరకు చాలాదుఃఖముకలుగుచున్నది. ఏరమణి సంసారమునకు సారము, గృహస్థాశ్రమమునకు ముఖ్యాధారమునైయున్నదో ఆమెలేకుండా పురుషుడు పూర్తిశరీరకుడు కాజాలడు. ఎంత గొప్పపురుషుడైనప్పటికి స్త్రీని జీవితసహచారిణిగా చేసుకోక, పూర్ణత్వమును పొందజాలడు. కనుకనే మనలో స్త్రీ "అర్థాంగి" అని చెప్పబడుచున్నది. అట్టి రమణినిగురించి స్వార్థులు, అభిమానులునైన పురుషులు యీవాక్యమును ఏలాగునిర్మించిరో తెలియుటలేదు. స్త్రీయొక్క ప్రేమ, స్నేహము, భక్తి, శ్రద్ధ, దయ, మమత, మోహము మొదలైన గుణములయొక్క సమత్వము పురుషుల కెప్పటికిని ఉండదు. మరియు స్త్రీయొక్క మిగతాగుణములను ఉండనీయండి. ఒక్కప్రేమనే తీసుకొనండి. స్త్రీప్రేమమయియే కాక, ప్రేమయొక్క మూర్తి అని చెప్పవచ్చును.

ప్రేమయొక్క ప్రభావమున ఆమె ఏమిచేయజాలదు? ఆమె తనప్రియునకు దేనిని యివ్వజాలదు? ఆమె తన ప్రియునియొక్క దోషమును గుర్తించదు. ప్రేమ ఆమెప్రియునియొక్క సమస్తదోషములను దాచివేయుచున్నది. కనుకనే దంపతులలో ఏప్రకారముగా స్త్రీ తనపురుషునకు మనస్సు, మరియు ప్రాణము అర్పణచేసి ప్రేమించునో ఆప్రకారముగా పురుషుడు ఎప్పటికిని చేయజాలడు. స్త్రీయొక్క ప్రేమయే పురుషుని ప్రేమకలవానినిగా చేయుచున్నది. పురుషునియొక్క ప్రేమ తరుచుగా స్వార్థపరత్వమును, కామవాసనాయుక్తము నైనదిగా చూడబడును. కాని స్త్రీయొక్క ప్రేమ ఆమె సర్వస్వమునైవుండును. పురుషుని ప్రేమ అతని జీవనముయొక్క కొన్నిభాగములలోనుండి ఒక స్వతంత్రభావము మాత్రమైయుండును కావుననే "బైరను" అను నతడు యీప్రకారముగా చెప్పియున్నాడు.

**"Man's love is of man's life a thing apart, 'Tis woman's whole existence.**

కృష్ణప్రేమికలు కృష్ణవిరహమునందు ఏప్రకారముగా సమస్తప్రపంచమును కృష్ణమయముగా చూచిరో అదేప్రకారముగానే ప్రేమమయి అయిన నాయిక నాయకునియొక్క విరహమునందు వానియొక్క ధ్యానమునందే పిచ్చిది అయిపోవును. ఆమెకు మరి ఏమియు కంటికి కనుపడదు. కావుననే సత్యవంతునికొరకు సావిత్రి ఏత్యాగమునయితే సంకల్పించెనో అలాగున సావిత్రికొరకు సత్యవంతుడు ఎప్పటికిని చేయజాలడు. రామునియొక్క విరహమునందు సీత ఏవిధముగా జ్ఞానశూన్యురాలై పోయెనో! సీతాప్రియుడైన రాముడు సంఘముయొక్క హితముకొరకు, లేక కర్తవ్యపాలనకొరకు నిరపరాధినియైన సీతను యింటినుంచి అడవులకు కూడా పంపించివేసినప్పటికి సీత తనప్రియునిమీద కొంచెము కూడా కోపిష్ఠురాలుగాక కేవలం యీలాగున చెప్పుచున్నది: "సాహంతపః సూర్యనివిష్టదృష్టి-రూర్ధ్వం ప్రసూతేశ్చరితుం యతిష్యే- భూయోయథామే జననాంతరేపి- త్వమేవభర్తానచవిప్రయోగః" "మీరునిజముగా పొరపాటుచేసివున్నారు, కాని అయినప్పటికి జన్మాంతరమందుకూడా మిమ్మే పొందుటకు కఠినతపస్సుచేయుదును." ఇటువంటిమాట అటువంటి అవస్థయందు ఏపురుషుడుకూడా తన స్త్రీవిషయములో

చెప్పజాలడు. ఈవిధమయినటువంటి తన జీవితసహాయిని, సహచరి, అనన్యభక్త, సేవాపరాయణ అయిన స్త్రీనిగురించి "స్త్రీచరిత్ర ఎవరును ఎరుగరు" అను వాక్యమును చెప్పి పురుషజాతి తనయొక్క దుర్మార్గ పాషాణహృదయము యొక్కలక్షణము కనపర్చి గొప్ప అన్యాయము స్త్రీజాతికి చేసియున్నది. అందరు స్త్రీలు సీతా, సావిత్రులవంటివారని మేము చెప్పుటలేదు. ఏగ్రామమునందైనను ఒకానొక వితంతువు యొక్క నడతలో ఏమైనా తప్పువున్నను, లేక తాతతో సమానుడైనటువంటి ముసలిభర్తగల చంచలస్త్రీ తనయొక్క వృద్ధపతి చరణములయందు తన మనస్సును స్థిరముగావుంచుకొనలేక, ఇరుగుపొరుగు యితర యువకుని ఎవనినైనను తనే యింటిగుమ్మములోనుంచి చూచినను, లేక నీళ్లకొరకు నీళ్లరేవువద్దకుపోయినప్పుడు యిటు అటుచూచినను వూరియందలి జనులుకలిసి ఆమెయొక్కచర్య వ్యాపింపచేయుచున్నారు. మరియు శీఘ్రముగా నీతివాక్యమైన "స్త్రీచరిత్ర ఎవరును ఎరుగరు" అను సామెతను చెప్పుచున్నారు. మేము చెప్పునదేమనగా గ్రామమంతటిలోను ఎక్కడో ఒకటి, అర, ఇటువంటి ఘటనలు ఉదాహరణముగా కనబడినప్పటికి కూడా అంతమాత్రమువనే యీవాక్యము ఎప్పటికి వ్యవహరింపబడజాలదు. మన స్త్రీజాతివిషయములో ఇటువంటి కళంకయుక్తమైన మాటను, దానిని ప్రసిద్ధమైనదానినిగా చెయ్యవలెనని చేసి పురుషులు తమ యొక్క వేలకొలది అన్యాయములలో ఒకఅన్యాయమును ఎక్కువ అభివృద్ధిచేసివుండిరి అని చెప్పవలసి వుండును.

సంఘమునందు ఇటువంటి ఆచరణగల స్త్రీలువున్నట్లు ఒప్పుకున్నప్పటికికూడ ఈవిధమైన వాక్యమునకు వుపయోగము నిలువజాలదు. యమధర్మరాజుదగ్గిరనుంచి పిలుపువచ్చినటువంటి వృద్ధ, అశక్త, నరరాక్షసులు తమయొక్క డబ్బువల్లగాని, లేకయింకా యితరసాధనములబలమువలనగాని యొక అజ్ఞానురాలైన బాలికను వివాహమను "వురి"లో చిక్కించుకొని తెచ్చుకొనునప్పుడు, అతను తన నవవయస్కురాలగు భార్య యౌవనసహజమైన వేగమును సహించుకొనజాలనిమీద ఏమిచేయును అనికొంచము ఆలోచన ఆలోచించుచున్నాడా? లేక ఆలోచించుటకు ప్రయత్నమయిన చేయుచున్నాడా? దీనిలో తెలియని, తెలుసుకోజాలని సంగతి ఏమియులేదు. అతడు బాగుగా తెలిసివుండేకూడా అమాయకత్వము చేసినట్లయితే అది వానియిష్టము. ఈవిధముగానే ఒకానొక యువకుడు ఇంటివద్ద తనయొక్క పరమసుందరియైన భార్యను కొంచెముకూడా లక్ష్యపెట్టక, రాత్రంతియు వేశ్యలవీథులలో తిరుగుచుండి, మరియు ఇంటియొక్కగాని, ఇల్లాలియొక్కగాని జ్ఞాపకంతీసుకొననప్పుడు ఒకవేళ వానిభార్య యింద్రియనిగ్రహముకలదికాజాలకపోయినయెడల అతడు తన దుశ్చరిత్రతోపాటు తనభార్యయొక్క చరిత్రకొరకుకూడా దోషికాడా ఏమి? మన స్త్రీజాతియొక్క చరిత్ర యింత ఆదర్శమయినదని, ఆచరణ యింత పవిత్రమయినదని, మరియు ఆదర్శము యింతగొప్పదనియు చెప్ప నవసరములేదు. దానితో సమానత్వమును పురుషుడు ఎప్పటికిని పొందజాలడు. కనుకనే యీవాక్యమునకు స్త్రీజాతియొక్క చరిత్రమీద కళంకయుతమైన అర్థము ఒప్పుకోబడజాలదు. మరియు ఒకవేళ పురుషుడు యీ పైన చెప్పబడినవాక్యమును చెప్పదలచినట్లయితే తన కృత్యముయొక్కఫలము బహిరంగమయినమీద తన దోషమును దాచుటకు ఈసామెతయొక్క శరణముతీసుకొనుచున్నాడు అని చెప్పవలసివుండును.

నేడుకూడ మన సంసారము ఆమెమీదనే నిలబడియున్నది. ఆమెలేనిదే పురుషుడు ఏకర్మలకునుకూడా పనికిరాడు. ఒకవేళ పైసామెతకు "స్త్రీయేమిచేయునో దానిని పురుషుడు కొంచముకూడా తెలుసుకొనజాలడు" అని అర్థముతీసినయెడల దానికి కారణమేమియో తెలుసుకొనినమీదట చెప్పవలసి యుండును. ఏమనంటే యీవిషయమునందు తెలుసుకొనుట యొపత్తుమార్గము పురుషుడే అరికట్టివేసియున్నాడు. ఒకవేళ స్త్రీయొక్క అనేకహంశములలో కొన్నివిషయములు తెలియబడకపోయినప్పటికిని, ఇందుకొరకు



శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవిగారు



శ్రీమతి మొగసాటి అప్పలనరసమ్మగారు



శ్రీమతి ఆదుర్తి లక్ష్మీబాయమ్మగారు



శ్రీమతి వేంకటరత్నము కన్యగారు



శ్రీమతి ఏలూరిపాటి లక్ష్మీసరస్వతిగారు



శ్రీమతి చావలి అన్నపూర్ణమగారు

కూడా పురుషుడే దోషిగా తేలును. మరియు ఆశ్చర్యమేమనగా అలాఅయినప్పటికికూడ పురుషుడు తన దోషములయొక్క సమస్తభారమును ఒక్క సామెతనిర్మించి తప్పించివైచుకొనెను.

సంగతి ఇది. ఏమనగా ఈప్రపంచమునందు స్త్రీపురుషులు పరస్పరము ఒకరింకొకరి అర్ధాంగమైనప్పటికికూడ పురుషుడు ప్రతిపాలకుడు, స్త్రీ ప్రతిపాలితలయివున్నారు. అయినప్పటికి ఆమెయొక్క ప్రత్యేక సంగతిని బాగుగా తెలుసుకొనుటకు మార్గముగాని, ఉపాయముగాని వుండలేదు అన్నట్టుగా ఎంతకాలము నుండియో జరుగుచువచ్చుచున్నది. ప్రతిపాలకుని సమక్షమున ప్రతిపాలిత ఎన్నోసంగతులు దాచవలసి యుండును. మరియు ఎన్నోసంగతులు ఆచరించవలసియుండును. ఏజీవితస్వాధీనత జీవితవికాసమునకు ముఖ్యమార్గమైయున్నదో అది దానికి ప్రాప్తించుట యెక్కడ? కనుకనే, ఒకవేళ పూర్ణరూపములో స్త్రీచరిత్ర తెలుసుకొనజాలకపోయినట్లయితే దానికి కారణము స్త్రీయొక్క జాతిస్వభావము ఎంతమాత్రమునుకాదు. దానికి బదులు ఆమెమీద పూర్ణఅధికారప్రాప్తులైన పురుషులమీదనే దానికి కారణము నిలబడుచున్నది.

ప్రస్తుతసమయమునందేకాదు, కేవలం ప్రాచీనకాలమునుండి అనగా దేనిని మనుష్యజాతియొక్క ఆది కాలమని చెప్పుదురో అట్టిప్రాచీనకాలమునుండి స్త్రీజాతి పురుషజాతియొక్క సహవాసమునందు వుండుట తటస్థించుచున్నది. పురుషుడు ఎటువంటి స్థితిలో ఉన్నను అనగా ధర్మాత్ముడైనను, పవిత్రుడైనను, న్యాయవంతుడైనను, లేక స్వార్థపరుడైనను, స్వేచ్ఛాపరుడైనను, నిష్ఠురుడైనను స్త్రీ వానితో కూడానే జీవితము గడుపుట తటస్థించును. ఇటువంటి పురుషజాతియొక్క సమక్షమున తనమనస్సునందలి భావములను దాచి వుంచి నడచుటయే స్త్రీజాతికి తటస్థించును. మనుష్యుడైనను మరియే యితరజీవిఅయినను ఏఅవస్థయందు వుండుచున్నదో తదుపయోగానుగుణముగా ఆచరించును. అనగా ఆలాగుననే ప్రకృతిసంఘటన చేయబడును. దానియందు ఎవరికిని స్వాతంత్ర్యము జరుగదు.

ఎవరికైతే రెండవవారియొక్క ముఖము చూచుకునినడచుట తటస్థించునో, దానికి తన మనస్సుయొక్క వ్యథలు, హృదయమునయొక్క వేగము, మరియు సకలఅభిలాషలు దాచివుంచుటయే కలుగును. పరాధీనత అన్నిచెడుగులకు మూలమైయున్నది. ఒకవేళ ఈచెప్పబడిన సామెత కొద్దిగొప్పనిజమైనప్పటికిని దానికి కూడ కారణంచాలాకాలమునుండి స్త్రీజాతి పురుషజాతియొక్క ఆశ్రితలై ప్రవర్తించుటయే అయివున్నది. ఈసామెత ఎన్నిక్షణములునిలుచునో పురుషుడు స్త్రీకి స్వాతంత్ర్యమిచ్చివేసిచూడవలెను. ఒకవేళ ఈసామెత ఏఅంశమునందైన నిజమయినట్లయితే దానికికారణం నిజముగానే పురుషజాతిఅయివున్నది. స్త్రీకి పురుషునితో ఎట్టి ఎట్టి అవస్థలయందువుండుట తటస్థించుచున్నదో చూడుడు. ఎవరైనా యిరుగుపొరుగు ఆమె ఏదయినా అందమయిన చీరనుగాని, లేక ఏదయినా క్రొత్తనగనుగాని ధరించుకొనుటచూచినప్పుడు తన పాతవస్త్రమును, తన కొద్దినగలను చూచుకొని ఆమెకు మనస్సులో విచారముకలిగినట్లయితే దానిని తన మనస్సునందే దాచివుంచుకొనునుగాని ఆమె తనవిచారమును సాహసముగా నోటినుండి బయటికి తెలియబరుపజాలదు. మరియు హీనావస్థకారణమున తన భర్తదగ్గిర తీవ్రమైనవాక్యములతో ఒకటిరెండు మాటలుకూడా చెప్పజాలదు. స్త్రీకి సాధారణముగా ఇంటియందు ధరించుటకు రెండుజతల వస్త్రములేవున్నను; అవికూడ చినిగినవిగాను, మాసినవిగాను వున్నను వాటిని వుదయము ఆరవేసి సాయంత్రమును, సాయంత్రము ఆరవేసి వుదయమునను ధరించును. కఠినమైనచలివేసినప్పటికిని, లేక సహింపలేని ఎండకాచినప్పటికిని ఆమె తెల్లవారుజామున నేలేచి అందరు నిద్రపోయేవరకు పనిచేయుట తటస్థించును.

పనిలో ఆమెకు చలిగాని, ఎండగాని తెలియనే తెలియదు. మరియు ఆమెకు తనభర్తయొక్క మిక్కిలి విలువగలకోటు సూటులమీద కొంచముకూడా ఈర్ష్యకలుగదు. వీడుమిక్కిలి అతని ఆనందమే తనదిగా

భావించుకొనును. పురుషుడు రాత్రిబయటకు వెళ్లుటకొరకు గజము ఎనిమిదిరూపాయలు ఖరీదుగల సిల్కుగుడ్డను ప్రశస్తమైన కంపెనీలో తయారుచేయించుకొనును గాని తనభార్యకొరకు ఒకగజం మామూలుగుడ్డను తెచ్చుటకూడ ఆతనికి జ్ఞాపకమువుండదు.

భర్త నాటకములకంపెనీనుండి నాటకమైన తరువాత బయలుదేరి చాలారాత్రి అయినదనుకొని యింత రాత్రివేళ యింటికి ఎవరు వెళ్లగలరు ఈచేరువునవున్న స్నేహితుని యింటిలో పడుకుని వుదయమున యింటికి వెళ్లుదమని ఆలోచించి, యిటులనే స్నేహితునియింటిలో నిద్రపోవును. కాని భర్త ఇంటికిరానిమీద భార్య రాత్రంతా చాలావ్యాకులముపొంది నిద్రలేక, సంతోషములేక చాల విచారగ్రస్తురాలైవుండును. భర్త వుదయమున యింటికివచ్చినమీద ఒకవేళ ఆమెరాత్రి ఎక్కడవుండిరి అనిగాని అడిగినట్లయితే, అతను సరిగాజవాబు చెప్పుటకుబదులు-అనగా, నాటకము పూర్తిఅగుసరికి చాలా రాత్రిఅయినది అందుకని చేరువనేవున్న స్నేహితుని యింటిలో నిద్రపోతిని-అని చెప్పుటకుబదులు ఎక్కడవున్నానా? ముండయింట్లోవున్నాను అని బదులు చెప్పును. భర్త ఎక్కడవున్నప్పటికి పాపము భార్య ఏమిచెయ్యగలదు? కాని తన భర్తయొక్క చెడునడత చక్కబడుటకొరకు వుపాయము, పరిశ్రమ, విచారముకూడా ఆమెకే కలుగును. కాని తన చెడునడతనుగురించి భర్తకు కొంచముకూడా విచారముగాని, ఆలోచనగాని కలుగదు. ఏవిధముగానైన తనభర్తకు సద్బుద్ధికలుగు గాకయని ఆమె దేవిఎదుట నిరంతరము దీనురాలై ప్రార్థించుచూ దినములువెళ్లబుచ్చును. ఒకవేళ స్త్రీ ఒకటి రెండునిమిషములు తన ప్రాణస్నేహితురాలి ఇంటికిగాని, లేక ఇరుగుపొరుగు ఆమెదగ్గరకుగాని వెళ్లినట్లయితే యింటికి రాగానే భర్త కోపాగ్నియొక్క వేడి ఆఖరుడిగ్రీ చేరిపోవును. మరియు కులటా! ఎక్కడికి పోతివి? అనునటువంటి ప్రేమతోకూడినమాటలు ఆయననోటినుండి వెలువడును. ఈవిధముగానే తల్లివంక గాని, తండ్రివంకగాని ఏ బంధువునితోనయిన మాట్లాడినయెడల దుర్మార్గురాలా? ఎవరితో ఏమి మాట్లాడుచున్నావు అనిచెప్పి శీఘ్రముగా పీనల్ కోడ్ శిక్షనుయొక్క చర్య ఆరంభించును. ఇంతమాత్రమైన మర్మభేదపు మాటలతో ఆదీనురాలికి విడుదలదొరుకుటలేదు. మరింత అనుచితసందేహము భర్తకు కలుగుటవలన దానిని పోగొట్టుటకు ఆమె వందలకొలది వుపాయములు చెయ్యవలసివుండును. అలాగున ఆమె దానియందు జయము పొందినమీదనే ఆమెకు క్షేమం, లేనియడల ఆమె ఎల్లప్పుడు భర్తకు అనుమానాస్పదగానేవుండుట తటస్థించును. ఈవిషయములో ఈదీనురాలికి సిద్ధహస్తురాలవడమే కావలసియున్నది. ఈపనికొరకు ఆమె యేయే మార్గములు, ఎట్టెట్టి ఆలోచనలువున్నవో వాటి అన్నిటియందు ఆమె నిపుణురాలు కావలసివుండును.

పురుషుడు తాను వివాహమైనభార్య గుండెలమీద ఒకటి లేక పెక్కుమంది సవతులనుతెచ్చి పెట్టుటయేకాక, కేవలం ఆమెయెదుటనే స్పష్టముగా వ్యభిచరించుటకుకూడ సంకోచించడు. వెనుకతీయడు. అతడు తన ఆచరణసంబంధమైన దుర్బలత్వమును తన భార్యతో తనయొక్క ప్రజ్ఞాగర్వమును వెల్లడిపరచుటకుగాను చెప్పనుకూడ చెప్పును. ఇటువంటి వందలకొలది సంగతులయొక్కనిప్పును భార్య మనస్సులో దాచివుంచి పైకి తన యిష్టదైవమగు భర్తను సద్భావము, సద్భక్తి కనపర్చి సేవించుట తటస్థించును. అది కాక మరింత యీగుణములు హృదయమునందు అల్లిబిల్లిగా అల్లుకునికూడా ఆనందముగావుండును. ఆమె తన భర్తయొక్క దుశ్చేష్టలవలన హృదయములో ఎంత క్షోభపడుచున్నను భర్తయొక్క సుఖముకొరకు అవిఅన్నిలోపలనే సహించుకొని పైకి సంతోషముగా కనబడును. ఈవిధముగా ఆమె తన మనస్సులోని సంగతులను దాచుటయందు అభ్యాసముకలదిగా అయిపోవును. ఆమె మనస్సులోనిమాట పైకివచ్చుట కష్టమయిపోవుటయేకాక, పైకివచ్చుట అసంభవముగాకూడ నయేటంత అభ్యాసమయిపోవును. నిష్ఠురులు, స్వార్థులు,

స్వేచ్ఛాపరులు నయిన పురుషుల చేతులమీద ఆమెకు ఏమేమి సహించబడుచున్నవో తెలియజాలదు. ఆకలి యొక్కబాధ, అవమానము, యాతన, దండింపులు, తిట్లు, నిందారోపణ, చివరకు యింటినుండి వెడలగొట్టబడుట వరకు ఆమె సహింపవలసియుండును. అనేకదినములు అల్పాహారములోను, లేక ఆహారములేకుండాను వుండి భర్త మరియు బిడ్డలయొక్క సేవ చేయవలసివచ్చును. పురుషునియొక్క రోగమునందు ఆమె పక్కవద్ద కూర్చునికూర్చుని దాది, మరియు చికిత్సకురాలియొక్క కార్యములు ఆమె తన శరీరస్వాస్థ్యము, ఆరోగ్యము, మంచిచెడ్డలు సమస్తముమరిచి రోగిమోస్తరుగా నయిపోవుచు నెరవేర్చును. కోపిష్టుడు, కేవలం నిర్దయుడు నయిన భర్తచేత కొట్టబడినప్పటికి ఆమె వానికి వ్యతిరేకముగా యొకమాటకూడ మాట్లాడదు. మీదు మిక్కిలి సమస్తబాధలు సహించుకుంటూకూడ ఆమె వాని ప్రేమభిక్షకురాలైవుండును. ఏముఖమునుండి ఆమెనుగురించి లెక్కలేని అనరానిమాటలు వెలువడునో ఆముఖముమీదనే చిరునవ్వు చూచుటకు ఆమె ఆశతోవుండును. ఇవిఅన్ని ఆమె మానముతో సహించుకొనునుగాని ఎవరిదగ్గిర తన మనస్సులోని మర్మవ్యధచెప్పుటకు ఆమెకు సాహసంవుండదు. ఎందుచేతననగా అలాచెప్పినయెడల తనభర్త చెవులలోయెక్కడయినా ఈమాటలు పడినట్లయితే మరింత ఎక్కువగా అవమానింపబడుట, తిరస్కరింపబడుట తటస్థించును. దుఃఖహృదయులయొక్క విచారము దుఃఖహృదయులకేగాని తెలియదు. పిరికిమనస్సుయొక్కసంగతి అట్టి పిరికిమనస్సులేగాని మరియెవరు వినరు. ఎరుగుటఅయితే ఆపరమాత్మ ఎరుగును, గాని వినడమయితే అతనుకూడ వినుటలేదు. బహుశః అతను స్త్రీజాతిని పురుషజాతియొక్క చేతులయందు సర్వస్వము సహించుకొనుటకును, మరియు పైనుండి యీ “స్త్రీలచరిత్ర ఎవరును ఎరుగరు” అనునది వినుటకొరకును ఏర్పరచివున్నాడుకాబోలు. ఒకవేళ మనస్సుయొక్కవేదన సహింపలేనిదై లేచినయెడల సమీపమందలి నదిగాని, లేక ఏదయినా జలాశయమునందలి తరంగములందు తన నేత్రతరంగములను బాగుగా కలిపి వచ్చివేయవలెను. లేదా, తన ఇంటియందలి ఏదయినా ఏకాంతస్థలమునందు ఏకాంతముగాకూర్చుని వాయుమండలమునందు తన నిరాశాపూర్ణ, యాతనాపీడితమైన శ్వాసను బాగుగా కలిపివేయవలెను. కాని ఎవరియెదుటను సానుభూతియొక్క యాచనగాని, తన మనస్సుయొక్క వ్యధగాని బహిరంగపరచుటకు సాహసముకలుగదు.

రోగ, శోక, ఆర్త, అవమాన, అనాదర, ఖిన్న, పీడిత, వ్యధిత అయినప్పటికి లేక మర్మాహత అయినప్పటికి కూడ స్త్రీ గృహధర్మమునుండి ఉదాసీనురాలుగాని, లేక భర్తసేవనుండి విరక్తగాని యెప్పటికిని కాదు. పురుషుడు ఏమాత్రము బాధకలిగినప్పటికిని పక్కమీదనుండిఅయినా లేవక యిహలోకము, పరలోకముకూడా మరచిపోవునో అంతకన్న ఎన్నోరెట్లు అధికతరమయిన బాధకలిగినప్పటికి స్త్రీ యథాసంభవముగా సామాన్యగృహకార్యములయందు ప్రవర్తించకుండా వుండదు. పసిపిల్ల పాలుత్రాగినదో లేదో, పెద్దపిల్ల నీళ్లుపోసుకొనెనో లేదో, పొయ్యిమండినదో లేదో, భర్తకు వేళకు కాఫీ అందినదో లేదో, యీ మొదలయిన సంగతులే ఆమెకు భగవన్నామజపముగానుండును. పతి ఆమెవిషయములో ఎన్ని దుర్మార్గములు చేసినప్పటికి ఆమె అతనినితప్ప వేరుతలవదు. తలచుటకుప్రయత్నించదు. అతను ఆమెను పాదములతో తన్నుచున్నను, ఆమె అతని పాదారవిందధ్యానమునేచేయును. భోజనము దగ్గిరపెట్టుకుని పతియొక్క దారి చూచుచునే ఆమె మేలుకుని కూర్చుండుచుండును. నిమిషములు, గంటలు, జాములు గడచినప్పటికి ఆమె ధ్యానము భర్తవచ్చు దారిపైననే లగ్నమైవుండును.

స్త్రీజాతికి చిరకాలమునుండి పురుషునియొక్క మనస్సును అనుసరించి నడుచుట తటస్థించుచున్నది. అతనియొక్క మనోభావమును పొందుటకొరకు, అతని చిత్తాకర్షణకొరకు, వందలకొలది వుపాయములు చేయవలసివుండును. పురుషునికొరకే స్త్రీ తన శరీరమును అలంకరించుకొనును. కాని తన సంతోషముకొరకు

కాదు. పురుషుని సంతోషపెట్టుటకు స్త్రీ వాక్యచాతురి, హాస్యరేఖ తెచ్చుకొనవలసివచ్చుచుండును. కేవలం సేవాద్వారముననే అతని వశీభూతునిగా చేసికొనవలసివుండును. కావుననే "స్త్రీచరిత్రమునందు యీఅన్ని సంగతులయొక్క సన్నివేశము కలుగుచుండును". స్త్రీ తన పురుషుని వశీభూతుని చేసుకొనుటకుగాను తగినట్టి కొన్ని విలాసములు, వైభవములు మొదలైన బలవత్ప్రయత్నములు చేయవలసివచ్చును. పురుషునికొరకే ఆమెచేయు సర్వస్వము నయివున్నది. కనుకనే ఆమెయొక్క చరిత్రను స్తవయినట్లయితే అదికూడ పురుషుని కొరకే అయివుండును. మరియు అతడే దానికి వుత్తరవాది. స్త్రీకి దీనియందు ఏదోషమునులేదు. పురుషుడు తన చరిత్రసంబంధమైన మిక్కిలి భయంకరమైనసంగతి, లేక దోషము బహిరంగమయిన మీద కొంచము కూడ సంకోచపడుటగాని, భయపడుటగాని లేదు. కాని స్త్రీనిగురించి ఒక మిక్కిలి నిందాకరమైనమాటను, ఆమె అట్టిది యెప్పుడును చెయ్యకపోయినప్పటికి సందేహమాత్రమయినను దానిని వెల్లడించుటకు ఎన్ని ఆలోచనలుచేయునో తెలుసుకొనజాలము. మరియు చివరకు ఇందువలననే స్త్రీ ఏమిచేసినను దానిని చాటుగా వుంచవలసివచ్చుచుండును. కావుననే స్త్రీయొక్కచరిత్ర తెలుసుకొనబడుచున్నదా? లేదా? అనేసంగతికి కారణం లేక వుత్తరవాదిత్వము పురుషులమీదనేవున్నది. కాని స్త్రీమీద నామమాత్రమునకైనను లేదు. సామెతను నిర్మించుట పురుషులచేతులలోవున్నది.వారు దానిని ఏలాగుననైన నిర్మించుదురుగాక.దానిని ఎవరు నిషేధించగలరు? కాని ఎట్టిసామెతఅయినను కొంచము న్యాయముతోను, సానుభూతితోను ఉభయత్ర ఆలోచించి చేసినయడల దీనురాండ్రగు స్త్రీలు చాలా కృతజ్ఞలైవుందురు.

## విరహిణి

శ్రీమతి వెంపటి అన్నపూర్ణమ్మగారు

అది మనోహరమధురసాయంతనంబు
ఆమె సౌధాంతరవిలసితాసనమున
కరతలంబు కపోలభాగమునజేర్చి
యేమొయోచించుచుండెయధోముఖాన.
కలువపత్రంబులనుబోలుకన్నుదోయి
దుఃఖభారపుబాష్పముల్ దొరలనేల?
పగడమునుబోలునధరబింబంబు వన్నె
దరిగియుండగతంబేమొ? తరుణికిపుడు.
విన్నబోయెను వదనారవిందమకట!
శత్రుగతమధ్యజీవితేశ్వరునికొఱకొ?
బడలియుండినరీతిగన్పట్టుచుండె
విరహభారముననోయేమొవెలదిమేను.
కోకిలలపాట కామె చీకాకుపడదు
చంద్రకాంతిచే నామెకుచేటురాదు
మలయపవనంబుచే నామె యలతగనదు
అల్లె గదలక పతిని ధ్యానంబుసేయు
అట్టిదృఢచిత్తమున్నయాయతివపతికి
బంధనంబెంత? శత్రులబలమదెంత?
కష్టజలనిధిలంఘించికాంతహృదిని
జేరలేకుండునే— ?

## పుణ్యస్త్రీ

ఏభంగిన్ శుచినౌదునో పతిమనంబేభంగి రంజింతునో
యేభంగిన్ గులకీర్తిదాఁగలుగునో యేభంగివర్తింతునో
యేభంగిన్ మతిరాక యుండగలదో యేణాక్షులందంచునా
యాభంగిన్ మతియించుచుండఁదగుఁ బుణ్యస్త్రీకి నెక్కాలమున్.

## భక్తవిలాపము

శ్రీమతి అద్దంకి అనసూయాదేవిగారు

శ్రీకృష్ణా! ద్వారకాపురివాసా! భక్తవత్సలా! అనంతా! ఏడీ శ్రీదయితుడు? అదుగో. పొన్నమ్రానుక్రింద మురళీగానమొనర్చుచుంటివా? ఇదిగో వచ్చుచుంటిని. వెళ్లకుము, వెళ్లకుము. హాకృష్ణా! కృపాజలనిధీ! అంతులేని సంసారసాగరమున మునుగుచు దరిగానక సర్వము నీవన్యుని నిన్నుజూడ నిటువచ్చితి. కృపాసముద్రా! రాధాపతీ! దేవకీనందనా! రాకానిశాకరసదృశంబగు నీయాననముజూడ నుత్సుకతతోనుంటిని. గోపికాచిత్తచోరా! నవనీతాపహరణా! ఇంతలో నంతర్ధానమైతివా? అదుగో లేమావిమ్రానుక్రింద జగన్మోహన గానసుధాధారల వర్షింపుచున్నాడు. వచ్చుచుంటిని. కృష్ణా! ఆగుము. ఆగుము. ఆహా! జగత్కళ్యాణమూర్తీ! నీవెంత మోసగాడవు. మునిమానసాపహారుడవు. గోపికాచిత్తచోరుడవు. నవనీతాపహారుడవగు నిన్నునమ్ము మాబోంట్లు ఎంత అమాయకులోగదా? నిన్ను అర్థిజన భాగధేయుడందురేల? ఆశ్రితకల్పతరురాజమవందురేల? భక్తశోషకుడనక భక్తపోషకుడందురేల? అట్టినీకీర్తి నాయెడ వృథాయైనదేమి? అదుగో మాధవుడు. హాకృష్ణా! నిలుచుంటివా?

ఇదుగో కృష్ణుడు. అయ్యో! గోవిందా! నీవాకలతరురాజమవయితివా? అదుగో. అక్కడ కొంచెముగా గంతులిడుచుంటివా? పారిపోకుము. గోవర్ధనోద్ధారా! ఇదిగో, లక్ష్మీపతీ! నిన్ను పట్టుకొంటిని. అయ్యో! మరల హరిణమవైతివా? వైకుంఠవాసా! నిన్నేమని నిర్ణయింతును. ఆ, చిక్కితివి. ఇకనెందుబోయెదవు? ఆహా! ఇదేమి? చట్రాయివైతివి. అబ్బా! నిను తెలిసికొనలేక విసుకుచుంటినే; బ్రహ్మేంద్రాదులకునైన నీమాయ తెలియవశము కాదన్న నేనెంతదానను? ఒక్కమాటు దర్శనమీయరాదా? నీలీలానటనసామర్థ్యము తెలుపుచుంటివా? నానాస్థావరజంగమజీవకోటియెల్ల నీవయై వెలుగుచుంటివా? నటనాచక్రవర్తీ! సర్వప్రపంచము నీవగాచూచుటకు ప్రహ్లాదుడనుగాను.

సర్వమునీవనియే సృష్టిలీలావిచిత్రముల తిలకించినను మనస్సు ఒకచోనిలువక అనేక భ్రాంతులకులోనై పరిపరివిధముల ప్రాకిపోవును. నీభిన్నరూపములకంటె సచ్చిదానందరూపమొక్కటియె చూడగోరెద.

అల్లదె నీకై పరితపించుటజూచి కుముదినీమనోహరుడెటుల వెలవెల బోవుచున్నాడో చూడుము. నాఆశాపాశములకుగంట హృదయాంతరాకాశములో గ్రమ్మినచీకటివలె దశదిశలచీకటి ఎట్లు గ్రమ్ముచున్నదో చూచితివా?

హా! గోపాలబాలా! వేణుగానలోలా! రుక్మిణీపతీ! భక్తులకు నీజాడకనుపడనియ్యవా? నీవునాకుచిక్కవా? అదిగో సర్వప్రాణికోటులు నీమాయామోహజాలములో మునిగి జడులై, కర్తవ్యతావివేకశూన్యులై, అజ్ఞానతిమిరావస్థలోనున్న మూఢులకు సయితము తన సహజ ప్రభావకిరణములచే ప్రభాకరుడెట్లు దర్శనమిచ్చుచున్నాడో చూడుము.

ఓపీతాంబరధారీ! నానేత్రములకు నీవగుపడవా? ఇదిగో నిన్ను విడువను. నీవుయెక్కడ డాగినను నిన్ను కనుగొందును. నాహృత్పద్మములో నీవు లేకపోలేదు. నిన్ను చూడ నాజ్ఞాన నేత్రమును విప్పెదను. పరమాత్మా! అరిషడ్వర్గమునుండి నేను విడువబడలేదు. తెలిసెను. మహాప్రభూ! తెలిసికొంటిని. ఈషణత్రయమునుండి విముక్తిగాంచలేదు. ప్రభో! నీదర్శనము కాలేదు. ఇదిగో అరిషడ్వర్గముల పారద్రోలెద. బాహ్యప్రపంచావలోకనము మానెద. అంతఃప్రపంచావలోకనముచేసెద. అంతఃప్రపంచములో చతుర్దశభువనములగనెద. గంగాయమునా సాగరసరస్వతులచూచెద. పరబ్రహ్మాక్షరమగు ఓంకారనాదదశవిధవాద్యాలాపములవినియెద.

దేవాదిదేవా! మహానుభావా!

నిరయమును, నిష్కలంకమును, నిర్గుణమును, నిర్మోహమును, నిస్తులమును, నిశ్చలమును, సచ్చిదానందమును, అనంతకోటిసూర్యప్రభాభాసమానసమానదీధితిని తేజరిల్లునట్టియు నీమహాస్వప్రకాశమును దర్శించెద.

ఆసచ్చిదానందపరబ్రహ్మములో నే లీనమయ్యెదగాక!

## మా చిట్టితల్లి

శ్రీమతి కల్వాల పార్వతీదేవిగారు

౧

నీలితఘుక్కు మేల్ పరికిణీనిధరించియు సిల్కుడోరియాల్
పూలతోకన్నులన్మెఱుంగుపూతలనింపెషికంచుకంబునుం
దాలిచి ముద్దులొల్కువదనంబున చుక్కనుదిద్ది తీర్చి యీ
వేళను చిట్టితల్లి కనువిందొనరించుచునుండె...నిందుకా!

౨

జేబున పూవులందుఱిమి చేతను గిల్కలఁబద్దఁదాల్చి ము
స్తాబయితమ్మ! నాచిలకతల్లి! మఱేదొకముద్దునిమ్మ నే
నీబడియున్నవారలకు నేమిటుకానుకనీను? తల్లి! గా
రాబున నిన్నుఁబెంచి కనులారగ గాంచెదుముద్దుముచ్చటల్.

3

గిలకలఁబట్టుపద్యములఁగేరుచుపాడుచు నిన్నుఁజూడ నీ
చెలులదెవచ్చినిల్చిరిఁక చీకటిరోజులుగాననీవు పెం
దలకడనిల్లుసేరుము మనంబికనీపయినుంచు వన్నుపా
టలుమఱిరేమిఁదోచవు—అడావిడిలేదికకొంపలోపలన్.

# పిరికితనము, మనోబలతత్త్వము

శ్రీమతి కోకా భానుమతిగారు

పూర్వమునుండియు నేరమొనర్చినవారికి శిక్షకలదు. ఒకరి నవమానించినను, అక్రమదండన మొనర్చినను, నరహత్యచేసినను, దేశద్రోహమొనర్చినను శిక్షించుటకలదు. కాని బిడ్డలకు నోటమాటరాని పసితన మందు భయమును బోధించి, జాతీయద్రోహమొనర్చు తల్లులకుమాత్ర మెట్టిశిక్ష పరిపాలకులు విధింపలేదు. రాజు దండింపకున్నను దేవుడు దండింపకమానడను లోకోక్తి యసత్యముగాదు. దానిఫల మనుభవించు చున్నాము. బిడ్డయందు పిరికితన మెట్లు కల్గుచున్నదో, దాని పరిణామ మెట్టిదో కొంత విచారింతము.

బిడ్డలు జన్మించినదాది పండ్రెండు నెలలవరకు జ్ఞానముండదు. కొందరికి కొంచెము ముందుగాగాని, కొంచెము వెనుకగాని జ్ఞానము కల్గుచున్నది. జ్ఞానముకలుగక పూర్వము వారిమనస్సు అద్దములవంటివై యుండును. అద్దముముందెట్టివస్తు వుంచబడునో అట్టిరూపమే దానియం దగపడును. అటులనే పిన్నపాపలు ఒకటి రెండేండ్లవరకు తాము చూచు పనులనుచేయ ప్రయత్నింతురు. పసిబిడ్డలు రూపురేఖ లెట్లున్నను ముద్దు గొల్పుచుందురు. ఒకప్పుడు వా రిబ్బందిపుట్టించు కోరికలు కోరుచుందురు. అవి కొనసాగనందున పోరు పెట్టెదరు. అప్పుడు తల్లి యెంతఓదార్చిన నూరుకొనరు. ఒకప్పుడు తల్లికి ఇంట నెవ్వరు తోడ్పడువారుండక పోవచ్చును. అందుచే ఎల్లప్పుడు తల్లులకు బిడ్డలతో కాలముబుచ్చుటకు తీరికయుండదు. తల్లికి పనియున్న ప్పుడు బిడ్డలు ఆమెపని కంతరాయము కలిగింతురనియో, ఏడ్చెదరనియో, తల్లి బిడ్డ నాయులలోనుంచి యూచి నిద్రబుచ్చుటకై జోలపాడి జోకొట్టును. కాని, బిడ్డ ఇంచుకయు నిద్రింపనందున తల్లి విసుగు నొంది "అదిగో! బూచివాడు, నీవు నిద్రింపకున్న ఆబూచివాడు ఎత్తుకొనిపోవు"నని భయపెట్టినను బిడ్డ నిద్రింపకున్న, వీధిలోనికి బిడ్డను తీసుకొనిపోయి వికలాంగులగు బిచ్చగాండ్రనుజూపి "అదిగో! వాడే నిన్ను ఎత్తుకొనిపోవును. ఏడ్వకుండ నిద్రింపు"మని పరుండబెట్టును. పాపము బిడ్డలందులకు భయపడి, నిద్ర రాకున్నను నిద్రింతురు. ఇంకను అనేకవిధములగు భయంకరమగు కేకలువేసి బిడ్డలను భయపెట్టి నిద్రింప జేయుదురు. నాటినుండియు తల్లులు నిర్మలమగుబిడ్డలమనోభావమున భయమను వటబీజమును నాటు చున్నారు. వటబీజ మావగింజకంటె చిన్నదయ్యు నది మహావృక్షమును తనలో నిముడ్చుకొనియున్నది. ఒక్క మహావటవృక్షము, దానియొక్క శాఖోపశాఖలతో చాలప్రదేశము నీడచే నింపుచున్నది. దాని యొక్క వ్రేళ్లు భూమిలోనికి మిక్కిలి లోతునబోయి సారమంతయు పీల్చి వైచుటచే, దాని నీడయం దెట్టి ఫలవృక్షములుగాని, మంచి పంటలుగాని పండవుకదా! అటులనే పసిబిడ్డల మనోక్షేత్రములయందు జ్ఞానము కలుగకపూర్వము తల్లులు నాటినభయమను వటబీజము మొలకెత్తి వృద్ధియై మనోబలమును పీల్చివేయుచు, మనోభావమును భయమను నీడచే నింపుచున్నది.

బాల్యమునాటి బూచివానిభయ మెట్లు వ్యాపించుచున్నదో చూతము. పిల్లలకు మూడుసంవత్సరముల నుండి జ్ఞాన మభివృద్ధి పొందుచుండును. జ్ఞానముకంటె భయము వేయిరెట్లధికమగుచున్నది. అందుచే బిడ్డలు వికృతరూపులను జూచినను, క్రొత్తవారిని జూచినను భయపడుదురు. అట్టిబిడ్డల నెవ్వరైన భయపెట్టిన వారి మనోస్వాతంత్ర్యమువీడి వారు చెప్పినచొప్పున చేయుట కిచ్ఛగింతురు. నానాటికి బాల్యదశయందా పిరికి తనము వృద్ధిజెందుటగాంచి, మన మాకారణమరయక "మా బిడ్డలు పిరికివారు" అని అందుము. పిరికిబిడ్డలు చీకటిలో వెళ్లజాలరు. అతిచిన్నదైన కష్టము తటస్థించెనేని, వారికి ప్రాణము పోయినంతఅగుచున్నది. కొందరు

మనుష్యులు మాటలు ధైర్యముగ జెప్పుదురుకాని క్రియపట్ల శూన్యము. ఎందరో తమ నీడనుజూచి దయ్యమని భ్రమింతురు. తాడుమత్రొక్కి పామని భయపడి ప్రాణమును గోల్పోయినవారనేకులున్నారు. పూర్తిగా ధైర్యవంతులని జెప్పబడినవారు స్వల్పము. పిరికితనము తక్కువజాతులందు తక్కువ. బీదలగువారు తమ చంటిబిడ్డల నొంటరిగావిడిచి పనులకుపోవుదురు. వారి చిన్నపిల్లలు తండ్రులతో రాత్రులందు పొలములకుబోవుదురు. ఇట్టివారికి పెద్దవారైనకొలది ధైర్య మధికమగుచు నేయుండును.

మనము బిడ్డలకు చక్కని భూషణాంబరములిచ్చి ముద్దుగా బెంచుచున్నాము. వారికై దేండ్లప్రాయమున విద్యాబుద్ధులు గరపుటకై బడికి పంపుచున్నాము. కాని బిడ్డల నెట్లు ధీమంతులనుజేయవలెనో ఎన్నడును యోచింపము. బాలురు పెద్దవారై తమ స్వతంత్రబుద్ధి నుపయోగించి తమ పిరికితనమునకు వెతజెందుచుందురు. అట్టివారు తమ పిరికితనమంతరింపజేయుటకు విశేషప్రయత్నముజేయుదురు. కాని తుదముట్ట బాలున కుగ్గుపాలతో పెట్టిన ఈభయమనుమహాపిశాచము విడువక అనేకమగుమార్పులుజెందుచున్నది. సిగ్గు, పలువురిలో ధారాళముగా మాట్లాడలేకపోవుట, ఆత్మబలమం దపనమ్మకము, తమశక్తి చాలదనుకొనుట మొదలగునవి పిరికితనముయొక్క లక్షణములు. పట్టపరీక్షలకై రేయింబవళ్లు దీక్షగా జదువుచున్నారు. "మేమీపరీక్షయందు తప్పకుండా కృతార్థులమగుదు"మనునమ్మకము వారికుండదు. వీరికి శరీరబలమున్నను మనోబలములేక, మానవమనోబలమహిమ నెరుగలేకున్నారు. మనలో లెక్కకుమించిన పట్టభద్రులున్నారు. వీరిలో గంభీరోపన్యాసములు గావించువారుగాని, కుశాగ్రబుద్ధితో తీవ్రవాదములొనర్చువారుగాని మిగుల తక్కువగానున్నారు. దీనికి కారణము మనలోని మనోబలలోపమే.

పూర్వమున్న మహావీరు లిప్పుడు కానరాకున్నారు. భీముడు, బలరాముడు, పరశురాముడు, భీష్ముడు, రాణాప్రతాపసింగు, శివాజి, ఖడ్గతిక్కన మొదలగు వీరులవంటివారు నేడేల లేరు? అట్టివీరులగను వీరమాతలు నేడులేరు. అట్టివీరులను జేయుట కుత్కృష్టవిద్యగరపు విశ్వామిత్రుడు, ద్రోణాచార్యుడు మొదలగు బుద్ధిశాలురు నేడులేరు. గురువులేకున్నను కేవలభావనచే ఏకలవ్యుని రీతిని అసమానప్రజ్ఞ సంపాదింపవచ్చును. వీరరసమును పోషించి బాల్యమునుండియు, బిడ్డలను దృఢమనస్కులజేయుభారము తల్లిదే. శివాజితల్లి జిజియాబాయి, గ్రీకువీరుడగు కొరియోలేనస్సు తల్లి ఒలమ్నియాయును తమ పుత్రులను మహాప్రతాపవంతులనుజేసి జగత్ప్రఖ్యాతిగాంచిరి. ఇదిగాక క్రీస్తుపూర్వము 800 సంవత్సరములప్పుడు గ్రీసుదేశమున స్పార్టాయను రాజ్యమునకధిపతియైన లికర్గస్ యనువాతడు సామ్రాజ్యమందలి ప్రజలనెల్ల యోధులుగాజేయ నెంచి పుట్టినబిడ్డనెల్ల పరీక్షించి, అందవయవలోపమున్నవారిని జంప నాజ్ఞాపించెను. బాలుర నేడుసంవత్సరముల ప్రాయముననే ప్రభుత్వమువారు వశముచేసుకొని ఇరువదియేండ్లవరకు వారిస్వాధీనమందుంచుకొని శరీరవ్యాయామము, యుద్ధనైపుణ్యము మొదలగువిద్యల నేర్పుచుండిరి. ఈబాలురు విద్య నభ్యసించుకాలమందు కడుపునిండిన యాహారముగాని, మేనెల్లగప్పు దుస్తులుగాని, పరుండుటకు మెత్తని పరుపులుగాని యీయక చిన్నతప్పునకు తీవ్రదండన మొనర్చి కష్టములబెట్టుచుండిరి. అందుచే ప్రాణములపై ఆశవీడి, గౌరవమే ప్రాణమని యెంచు యోధులతో దేశమెల్ల నిండియుండెను. ప్రభుత్వమువారు స్త్రీలకుగూడ విద్యాబుద్ధులనుగరపి వీరులతల్లులగు రీతిని బెంచి యుక్తవయస్సునందు పరిపాలకులే తగినవరునకిచ్చి వివాహముచేయుచుండిరి. ఆకారణముననే 10,000ల స్పార్టాదేశీయులు 20,00,000ల శత్రువులమధ్య నిర్భయముగ వర్తించిరి.

భయమనునది మానవనిర్మాణమేగాని దైవనిర్మాణముగాదు. సృష్టియందు ప్రతిదానిని దేవుడు మంచియుద్దేశముతో నిర్మించెను. దైవసృష్టియందు మానవు లగ్రస్థానమును బొందియుండియు, చెప్పనలవిగాని

మహాకార్యములు చేయు సామర్థ్యముకల్గియు, మానవులు చేతగానివారైయుండుటకు కారణము మనోబలలోపమే. నేడు మనకు మిగుల సౌఖ్యముగూర్చు అగ్గిపుల్లలు, విద్యుచ్ఛక్తి, రైలుబండ్లు, పొగయోడలు, రసాయనశాస్త్రము, భౌతికశాస్త్రము, శస్త్రచికిత్స మొదలగునవి మనోబలమువలననే కదా చేయగలిగిరి. మానవమనోతత్త్వము చెప్పనలవిగానిది. మానవునికి పొందరానిపదార్థము లేదు. వశపరచుకొనజాలని జీవిలేదు. పలువురు ఒకకార్యము చేయుట దుర్లభమందురు. ఆకార్యము చేయజాలక, చేయుమార్గములుగానక, మనోబలములేక చేయజాలననుచున్నారు. నేడు మనము నాగరికత చెందియున్నాము. ప్రాణమీయజాలరుకాని వైద్యమునందు నేమి, నీటిపైనేమి, నీటిలోనేమి, భూమిపైనేమి యానమొనర్చుటకుమన కెన్ని సౌకర్యములుగలవు? విద్యుచ్ఛక్తి మనకెన్నివిధముల దాస్యమొనర్చుచున్నది? ఈశాస్త్రములన్నియు మనకెట్లువచ్చెను? వీటికన్నిటికి మనోధైర్యమేకదా మూలాధారము. అట్టిమహిమగల మానవమనోబలము మనము వ్యర్థముజేసి, ఔన్నత్యమును ప్రక్కలుచేసి పిరికితనమును శిశువులకు నాటుచుంటిమి. ఒకకార్యమును చేయుటకు నిశ్చయించిన, ముందువెనుకలరయక, కార్యసాధనమందుకల్గు చిక్కులు లెక్కసేయక ఏకాగ్రమనస్కులైయుండి కార్యమును కొనసాగించవలెను. లార్డు హాల్ డేన్ గారు 1907-వసంవత్సరమున ఎడింబరోవిశ్వవిద్యాలయమున నొకయుపన్యాసమిచ్చిరి. అందు "ఉత్కృష్టమానవుడు తనశక్తిని తాను గుర్తెరిగి, తానొనర్పగలకార్యము గుర్తెరిగి, తదేకదీక్షతో చేయవలెను. ఇది మానవుని మొదటివిధియైయున్నది. వెనుకముందు లరయక కార్యమును ఘనులు సాధించిరి, లేదా కార్యసాధనమొనర్చుచు మరణించిరి. న్యూటన్, నెపోలియన్, క్రాంవెల్ మొదలగు గొప్పవారిచరిత్రము లిట్టివే. మానవునకు బుద్ధిబలమునిచ్చి, యుక్తాయుక్తవివేకము వృద్ధిపొందించి, ప్రాపంచికజ్ఞానముకలుగజేయునది విశ్వవిద్యాలయము. ఇదియే మానవమనోబలతత్త్వమును వెల్లడిజేయు మహామహులను పెంచుస్థానము" అని చెప్పియున్నారు.

మనదేశ మిప్పుడు దీర్ఘనిద్రనుండి మేల్కాంచి నూతనాశయములతో నిండియున్నది. మనదేశము నుద్ధరింపగల్గినట్టి వీరులు, రాజ్యాంగతంత్రవేత్తలు, శాస్త్రజ్ఞులు, యిట్టివిద్యలు బోధింపగల ప్రజ్ఞాశాలురగు గురువులు కావలెను. దేశము సారవంతమై, ఖనిజసంపదతో నిండియున్నప్పుడు, దానిని ప్రాముఖ్యతకు పాటుపడకుండిన నేమి లాభము? బుద్ధిబలము, దేహబలము, వివేకము మొదలగునవియే మానవులకు సంపద. ఈనాటిబిడ్డలు కొలదికాలములో దేశవిషయముల పాల్గొనువారలు. అందుచే బిడ్డలశీలమును బాగుపరచి, వారికి క్రమముగశిక్షనిచ్చి, కార్యభారముధరించుశక్తి కలుగజేయుటకై తల్లిదండ్రులు పాటుపడవలెను. కొలదికాలము క్రిందటివరకు జపాన్ దేశము ప్రాముఖ్యమునకువచ్చియుండలేదు. ఇప్పటి జపాన్ చక్రవర్తి తండ్రియగు మంత్సుహిటో పదియేండ్లలో దేశము మిక్కిలి యున్నతస్థితికి తేగలిగెను. ఈనాడు జపాన్ దేశము ప్రపంచమందన్ని దేశములతో బాటు స్వతంత్రసంపద ననుభవించుచున్నది. దీనికి కారణము దేశీయులెల్ల ఏకాగ్రమనస్కులై, సర్వవిషయముల రాజునకుతోడ్పడి దేశము నున్నతస్థానమునకు దెచ్చిరి. మొన్నటివరకు ప్రాముఖ్యములేని చీనాదేశము నవనాగరికతగాంచుచున్నది. మన దేశీయులెల్ల సంఘీభావముతో పాటుపడిన సర్వసంపదలతో మనదేశము తులతూగకమానదు. కావున బిడ్డలు పెద్దవారై తమపైనున్న పౌరభారము వహించుటకు శరీరమనోబలములు కలుగజేయుటకు మొదట తల్లి బాధ్యురాలైయున్నది. తరువాత వారికి గరపు విద్యావిధానములోనున్నది. అనంతరము పదియారు, పదునెనిమిదేండ్లప్రాయమునందు స్వతంత్రబలముచే, స్వయంకృషిచే ఖ్యాతిగాంతురు. స్త్రీలు తమపైనున్న మహాభారమును మిక్కిలిశ్రద్ధతో దేశాభివృద్ధికై బాలబాలికల పెంచెదరుగాక!

## బొమ్మలకొలువుసరదా

శ్రీమతి కాకుటూరు పద్మావతిగారు

ఆలయంలో సరస్వతీదేవికి (శక్తికి) అష్టోత్తరశతనామపూజ, లక్షపత్రి పూజార్చనలతో వృద్ధులు; గానసభలహడావిడిలో యువజనులు; బొమ్మలకొలువు పేరంటంతో పసిబాలికలు. చేతులో బాణాలు మెరుస్తుంటే దసరాపద్యాలపాడుచు ఉపాధ్యాయులవెంటనరిగడిబాలురసమూహం. వింత వింత జిలుగుచీరలు పాదాలు దిగజీరాడగా చంటిపిల్లల చంకలనిడుకొని వీధులవడయాడుచున్న సువాసినులగుంపుతో ఏవీధిచూచినను కమలకానందంగావుంది ఈదసరాపండుగ.

దసరాపండుగ సమీపించినదని రాజ్యలక్ష్మి వుత్సాహంతో తాము పెట్టబోవు బొమ్మలకొలువుకొరకు చిల్లులఅట్టపటాన్ని కుట్టుచూకూర్చున్నది వీధిగుమ్మందగ్గర. శ్రావణమాసంవెళ్లినతరువాత రాజ్యలక్ష్మికి సరదాగా పేరంటంచెయ్యటానిక్కాని, కొత్తబట్టలు ధరించటానిక్కాని వీలుచిక్కలేదు. ఎప్పుడెప్పుడేదసరాపండుగ వచ్చి స్కూలుకి లీవు, ప్రవేటుకి సెలవు వస్తుందా అని ఎదురుచూస్తూవుంది. ఇంక దసరాపండుగ మూడురోజులుంది. ఇల్లంతా అలంకరించేరు. రాజ్యలక్ష్మి సంతోషానికి మేరలేకుండావుంది. సంవత్సరంనాడు దాచిపెట్టిన బొమ్మలసామానులలో కిలుముపట్టిన యిత్తడిసామానుకు చింతపండుగుజ్జు కలిపిపట్టించి వాళ్లమ్మ సౌభాగ్యమ్మ పెరట్లో నూతిదగ్గర తోముతోంది. చెల్లెలు రమాసుందరి చద్దిఅన్నంతిని చెయ్యికడుక్కొనివచ్చి పెరట్లో తల్లిదగ్గరకూర్చొని వెర్రివెర్రిప్రశ్నలు వెయ్యటంమొదలుపెట్టింది.

ఉత్తరాన్ని ఒకటి పోస్టుబంట్రోతు వీధివసారలో గిరవాటేసి వెళ్లేడు. రాజ్యలక్ష్మి లేచి వుత్తరాన్ని చేతపట్టుకొని "అమ్మా! అక్కయ్యదగ్గరనుంచి వుత్తరమొచ్చింది" అని చెప్పుచూ పెరట్లోకి పరుగెత్తుకువెళ్లింది. రాజ్యంచేతులో ఉత్తరాన్నిలాక్కోబోయి పరికిణీ కాళ్లకడ్డంపడటంచేత దొడ్డిగుమ్మంలో ధబేలునపడింది రమ. పెద్దయేడుపు వినబడడంచేత సౌభాగ్యమ్మవచ్చి రమానిలేవదీస్తూ "రాజ్యం! ఎన్నేళ్లొచ్చినా కాస్త చెల్లాయిని లాలించి ఆడించడంచేతగాదుగదా; ఎప్పుడూ చిట్టితల్లిని ఏడిపిస్తుంటావ్. దామ్మా! చిట్టీ!" అనిరమా నెత్తుకొని చావిట్లోకొచ్చింది సౌభాగ్యమ్మ. రాజ్యలక్ష్మికి కోపంవచ్చి ఆవుత్తరాన్నక్కడపారేసి ఏడుస్తూ గిరుక్కునతిరిగి వెళ్లిపోయింది. సౌభాగ్యమ్మ లేచి వుత్తరంతీస్తూ "రాజ్యం! మాట్లాడితేవస్తుంది నెత్తికినీళ్లకుండ. ఇంతమాత్రంమాటనకుండా ఎల్లాజరుగుతుందమ్మా? యింట్లో. లేచిరామ్మా! అక్కయ్య ఏమిరాసిందో కాస్తచదివిచెప్పు. రా! చెల్లాయి నువ్వూచక్కగా కలిసిమెలిసి ఆడుకోవాలిగాని దెబ్బలాడుకుంటారా? పండుగకు నీకేమి కొత్తబట్టలు కావాలోచెప్పవూ?" అన్నది సౌభాగ్యమ్మ. కొత్తబట్టలు అనివినగానే రాజ్యలక్ష్మికి సంతోషంవచ్చింది. లేచివచ్చి వుత్తరాన్నిచదివింది: "కమలంఅక్కయ్య వస్తుందట. రేపుమెయిల్లో బావగారేదోపనిమీద మద్రాసు వెళ్లుతున్నారట. అక్కయ్యనుకూడ తీసుకొచ్చి యిక్కడ దిగబెట్టి వెళ్లుతారట. స్టేషనుకురమ్మని వ్రాశారు నాన్నగారికి." "సరే యిదివరకు మీనాన్నగారిచేత వ్రాయించేను పండుగకు ఇద్దరిని రమ్మని. సమయంలోసమయం ఆయన చెన్నపట్నం ప్రయాణంకూడ దారకిల్లింది. అయినా ఓపూటైనాదిగకుండా వెళ్లడంచూడుమరి" అన్నది సౌభాగ్యమ్మ లోపలికివెళ్లిపోతూ.

కమల మాధవరావుగారి పెద్దకూతురు, విద్యావతి. హైస్కూల్లో స్కూలుఫైనలుదాకాచదివింది. ఇంకా యింట్లో అనేకగ్రంథాలుచదివింది. మూడేండ్లయిందేమో పెండ్లయి. అత్తవారింటికివెళ్లేక విద్యాభ్యాసానికివీలు చిక్కలేదు. పనిపాటలలో వడపలో వినయవిధేయతగా ప్రవర్తించి అత్తమామలచేత, భర్తయగు భాస్కరరావుచేత "మంచిపిల్ల" అనిపించుకొంది. కమలభర్త కాంగ్రెసువాలంటీరుఅగుటచేత తనుగూడా మురుక

బట్టలుకట్టడం అలవాటయింది. మరీపుట్టింటకూడా సీమబట్టల కవకాశం లేకుండా శుద్ధస్వదేశీబట్టలనిం పేసింది. పుట్టినింటికిసమీపమే అత్తవారు ఊరుఅగుట చేత తరుచు ప్రతిపండుగకు కమల వచ్చుచూపోవుచుండువాడుక.

సౌభాగ్యమ్మగారి యింట్లో బొమ్మలకొలువు పెట్టుట పూర్తిఅయినది. వడపలో పేర్చినబల్లలమీద పువ్వులబార్డరుగల ఖద్దరువస్త్రంపరిచి బొమ్మలనేర్పరిచినారు. పింగాణి, గాజు, మట్టి, లక్క, యిత్తడి మొదలగుసామానులు; కమల చిన్నప్పుడు స్కూల్లో నేర్చుకొన్న పేముపళ్లెములు, బుట్టలు అన్నీ సరిదినారు. వెల్ల వేయించిన గోడమీద శ్రీకృష్ణతులాభారం, లక్ష్మి, సరస్వతి, మోహిని మొదలైన చిత్రపటాలు; గాంధి, సరోజని, మోతీలాలు, జవహర్ లాలు మొదలైన కాంగ్రెసునాయకప్రముఖులఫోటోలు; చెంకిపటాలు, క్యాలెండరులుకొన్ని, అన్నీమళ్లీతుడిచి జాగ్రత్తగా తగిలించేరు. ఆఖరిఅంతస్థులో ఉల్లగోజాపువ్వులచాకింమీద వెండికుంకుమభరిణి, తాంబూలపళ్లెం, పన్నీరుసీసా, సెంటుబుడ్డి మొదలైన వివిధవిధవస్తువులు అమర్చేరు. సాయంత్రం పేరంటానికి వచ్చేపోయే పేరంటాండ్రకు విధివిరామంలేకుండావుంది. ఒక్కనిముసమైనా పనితీరు బాటపటంలేదు కమలరాజ్యాలకు.

ఇవ్వేళే విజయదశిమి. చిన్నమ్మాయి రమాసుందరిపుట్టినపండుగ. రాజ్యలక్ష్మికి, చెల్లాయికి వాళ్లమ్మతలంటి నీళ్లుపోసింది. క్రొత్తబట్టలుకట్టుకొని పూజచేసి, నైవేద్యం పెట్టింది బొమ్మలకి రాజ్యం. అంతాపిండివంటలతో ఆరగించిలేచేరు. మధ్యాన్నం నాలుగుగంటలలోపలనే చెల్లెళ్లిద్దరికి ముస్తాబుచేసింది కమల. మెడలో కాసులపేరు మెరుస్తుండగా వెండికుంకుమభరణిచేతబుచ్చుకొని పేరంటం పిలవటానికి బయలుదేరింది రాజ్యలక్ష్మి.

"అమ్మా! నేనూ పిలవటానికిపోతానే" అన్నది రమా.

"నీపుట్టినరోజుపండుగకు పిలుచుటకునువ్వువెళ్లకూడదు. తప్పు. ఏవమ్మా? చెల్లాయి మాతో రాకూడదు కదూ?" అన్నదిరాజ్యం చేతిరుమాలు సర్దుకుంటూ.

"ఈపూటకి రాజ్యం అక్కయ్య ఒక్కర్తే వెళ్ళుతుందిలే అమ్మా! పిలుపుకి. నేకూడావెళ్ళను. అసలు మాచిట్టి మంచిపిల్లమ్మా!" అన్నది కమల.

సాయంత్రం దీపాలుపెట్టేసరికి చావిడంతా పేరంటాండ్రతో నిండిపోయింది. పాటలతోను, కబుర్లతోను, గ్రామఫోను పాటలహడావిడితోను యిల్లంతా కలకలలాడుతూ పెండ్లియిల్లుమాదిరిగాఉంది. కమలం, రాజ్యం యిరువురు ముత్తయిదువులకు పసుపు, కుంకుమ, గంధం మొదలగు పరిమళద్రవ్యాలతో అటునించిటు, ఇటునించటు అత్యుత్సాహంతో తిరుగుతున్నారు. సౌభాగ్యమ్మ శెనగపప్పులు, వక్కలు పళ్లెంలో పెట్టి అందిస్తూవున్నది. ఒకపళ్లెంలో మంగళహారతి వెలిగించి చిట్టికి హారతినిచ్చింది కమల. విజయదశిమిపండ్లవాయనం, పుట్టినరోజు శెనగలవాయనం కూడ పుచ్చుకొని ముత్తయిదువలంతా లేచేరు. అప్పటికి రాత్రి తొమ్మిదయింది. చిట్టి నిద్రకళ్లతో నాన్నగారిదగ్గర కెళ్లింది.

"చిట్టీ! పేరంటం అయిందా?" అన్నారు నాన్నగారు.

"నాన్నగారూ! రాజ్యంఅక్కయ్య మంచిది కాదండీ!" అన్నదిచిట్టి.

"ఏంచేసిందమ్మా?"

"ఎప్పుడూ నాతో దెబ్బలాడే."

"ఏంకొత్తువెయ్యమన్నావమ్మా? చిట్టీ!"

ఏదోఆలోచించి చెప్పబోయింది. ఈలోపుగా వంటయింట్లోనుంచి "పిల్లలూ రండమ్మా! అన్నాలకు, తొమ్మిది దాటినట్టులుంది. మళ్లీనిద్దరపోతారు." అన్న సౌభాగ్యమ్మ కేకవినబడ్డది. చిట్టినెత్తుకొని భోజనానికెళ్లేరు వాళ్లనాన్నగారు.




# లాలిపాట

౧

(సంపాదకురాలు) శ్రీమతి నాగలింగమ్ బసవపున్నమ్మగారు

లాలిలాలీలాలి లక్ష్మీపతీశ!
బాలలోచనచంద్ర! భానుప్రకాశ! లా.
తనువాసనాశ్రయము తొట్టిగావించి
మనసనేఅడ్డదూలము వేసీ
"తత్వమసి"నాల్గువిధములచేర్లుజేసి
తనయిచ్ఛకర్మమున తగిలివ్రాగెదవు. లా.
పంచకోశములనే పొత్తిళ్లుబరచి
పంచేంద్రియములచేర్ల పట్టివ్రాగెదవు
సంచితాప్రారబ్ధ చమురులోమునిగి
కించిజ్ఞుడవై నీవు కడయేడ్చెదవురా. లా.
ఏలపోరెట్టితివి? ఏమిగావలెరా?
మేలైనగురుబోధ పాలుత్రాగారా
అల్లల్ల నీబుద్ధి చింతలేటికిరా
ఆలించి ఆత్మరుచి అనుభవముగనరా. లా.
పంచభౌతికశరీరపుమేడలోను
ఎంచగా ఏడంతస్తులుండేను
గాంచనేడిటికొక్కటి స్తంభమునను
మించికనుమేడలో నిద్రించవలెను. లా.
నీకన్న నీముక్కు నీచెవ్వేదన్న
నీకు తెలిపెటివాడ నేనెవ్వడన్న
ఏకమై వెలిగేటి వెలుగునీవన్న
నీకన్న వస్తువులు నిజములేవన్న. లా.
జాతివర్ణుడవుగావు నీచుడవుగావు
జ్ఞాత తెలిసితే నీకు యాతనలులేవు
లోతెతెగిదిరిగేటి లోకనిర్గుణుడవు
ఈరీతిసద్బోధలెత్తగేటిఘనుడవు. లా.
"ఏకమేవాద్వితీయం" బ్రహ్మమనుచు
ప్రకటంబుగ ప్రపంచమునీవెయనుచు
జోకతో శ్రుతిబల్క సొంపుగావినుచు
లోకేశ ఆత్మరూపునిగ నినుగనుచు. లా.
పుడమిలో చిదరామదాసునిబోధ
తడవుసేయకమీరు తత్పదముగనుడీ
ఆదిమధ్యాంతరహితుడవు స్వప్రకాశుడవు
జడమైనదేహములకు సాక్షివైనావు. లా.

౨

(సంపాదకురాలు) శ్రీమతి వేపులపల్లి వేంకటభోగలక్ష్మిగారు

లాలి శ్రీ అబ్బాయి! లాలికృష్ణయ్య!
ఏడవకుఅబ్బాయి!యదువంశతిలక! లాలి.
ద్వారకాపురిపాల! బాలగోపాలా!
భక్తపోషణబిరుద! భయమేలనయ్య! లాలి.
కందర్పజనకాయ! కారుణ్యధామ!
కరుణజూడుము సర్వకామితవరదా! లాలి.
గరుడవాహనదివ్య! గంభీరనామ!
కావవే సర్వేశ! కరుణాంతరంగా! లాలి.

లాలి! సుందరవదన లాలి సుకుమారా!
మారజనకా! మమ్ము మదినేలుకోరా. లాలి.
గోపికాజనపాల! గోపాలబాల!
గోవర్ధనోద్ధార! గోవిందనామా! లాలి.
పూతకీసంహార! పాతకనాశ!
పరమపూరుష!దివ్య! పద్మనాభయ్య! లాలి.
పన్నగశయన! నీపంతంబుమాని
నిద్దురనొందుము నందనందయ్య! లాలి.

## మేలుకొలుపు

శ్రీమతి బొడ్డుపల్లి బాలాత్రిపురసుందరమ్మగారు

మేలుకో శ్రీభరతమాత దయానిధే మేదినిసంత్రాత మేలుకో
మేలు మేలు నీదునుతులు జైలునుండి వేళాకువొచ్చిరి మేలుకో జననీ తెల్లవారజొచ్చెను॥
గాంధియిర్వినులాకు సంధిసమకూడెను సంతోషవార్తలమ్మ మేలుకో
వందిమాగధులు వారకామినులు వాద్యములు చెలరేగ మేలుకో జ॥ తె॥
నీదుకోరికలెల్ల సఫలామాయెనుతల్లి! గాథవినోదినీ! మేలుకో
కాదుకాదనకమ్మ కాంతనీబిడ్డలకు కళ్యాణమొసగూరె మేలుకో జ॥ తె॥
కష్టములో సుఖము యిట్టిదియనుమాట దృష్టాంతము మేలుకో
నీదుపట్టిమోతిలాలు స్పష్టపరచెను జనని మేలుకో జ॥ తె॥
అమ్మరో! నీబిడ్డలందారికంటెను అబలభాగ్యమెమెండు మేలుకో
మర్మములేకాను ధర్మమొసర్చివా సన్మార్గులబ్రోవ మేలుకో జ॥ తె॥
కొల్లాగనీసుతులు వల్లెయని మీయాజ్ఞ చెల్లింపుచున్నారు మేలుకో
సల్లలితంబుగ చల్లనిమాతల్లి యుల్లసంబుగ నిదుర మేలుకో జ॥ తె॥
నీదునుపుత్రుండు గాంధిమహాత్ముడు నీకుశుభమొసగూర్చె మేలుకో
పాదపద్మములాకు ప్రణమిల్లి మీసుతులు ప్రార్థించుచున్నారు మేలుకో జ॥ తె॥

## జన్మమదేలా?

'శాంతము లేక సౌఖ్యము లేదు' అనుమట్టు. "జన్మమదేలా జైలుకుబోనీ"

ధర్మముతోడ ఈజన్మభూమికి మావా నిర్మలత్యాగము నొసగనివాని జన్మ॥
నందనందాను జన్మమందిరమునాకేగి నందియామూలువీడీ సంతసింపానివాని జన్మ॥
వీరమాతలుకూ కారాగారవిముక్తులాకు చేరి నమస్కరింప చేతులెత్తానివాని జన్మ॥
గాంధీమహాత్ముని బంధవిముక్తునీ డెందమునెరుగని మందమాతులా జన్మ॥

# అమరవనిత

శ్రీమతి అమల గ్రంథకర్త్రి

౧

ఆనిగూఢగభీరవనాంతసీమఁ
ప్రళయఝంఝానిలమువీచె, భయముగొలుప
భూతములవోలెతలలూఁచె భూరుహములు;
నాఁటి భీకరతిమిరకాంతారమందు
నతులితానందవిశ్వాస నవిరతముగ
దుఃఖచిహ్నము లెయ్యెడఁదోచుచుండె;
భూతలముజాపు మెరుపు నభోవినీల
గాఢమేఘాలలో నాకు కానరాదు;
విహగగానము వీనులవినఁగరాదు;
మలయమారుతములలోన చలువలేదు;
మానససరోవరప్రాంతమధురసీమ
దుర్గమారణ్యదేశమై తోఁచె నాకు?
సరసియందలి కుసుమహాసంపుకలక
లంబులేమయ్యెనో? నిర్మలాంబువులను
చలువతరగల సుమనోజ్ఞకలన లేదు;
తొంటిమధురంపుశోభ తాఁదొలఁగెనేమొ
మానససరోవరప్రాంతమధురసీమ?
కడలునిండిన విసపుచీఁకటులనడుమ
కఠినహృదయాలు నీరుగాకరుగునట్లు
కెరలివినవచ్చె నిటులార్తగీతరవము:
"అరయకుండునుగాక స్వర్గాధినాథుఁ,
డేల లావణ్యవైభవమిచ్చె ధాత?
వినకపోవునుగాక నావిమలగీతి
యేలకంఠాన మాధుర్యమొసఁగెనాకు?
సాటిలేదని గర్వించి సారెసారె
కలరినంతన తప్పుగా నరయఁదగునె?
ఇంతమాత్రాన నన్ను శిక్షింపవలెనె?
స్వర్గసీమను వెడలింపఁజాలినంత
తప్పునొనరించితినె యోవిధాత నేడు?"—
బాలరోదన మాలించువారలెవరు
కంటకావృతనిర్జనకాననమున?—
"మదికలఁకబాఱె, కన్నులుమొనలెలేవు,
మరణవేదనమేల యమర్త్యనుకద,
బ్రతుకవలెనెమొ జీవచ్ఛవంబువోలె.
విమలకాంతి, మృదులపల్లవములతోఁట
లలరు, పూదేనియల సోనలొలుకుచోటు
లమలినామృతకాసారసముదయంబు,
నిశ్చలసమాధి వీడకనిలచియుండు
మానివర్యుల శాంతనిధానభూమి,
నిరుపమానసుగీతి కానినదములును,
మొలకలేనవ్వు మోములచెలులు, దివ్య
సౌధచయము, లమృతమయసతతసౌఖ్య
జీవనము, నిత్యకల్యాణసీమ, యహహ!
దూరమైపోతె స్వర్గవిహారసుఖము!
ఏమిగతి? దీనవకట! ఇంకేది వెరవు?
పాపపంకభూయిష్ఠమహాకూపమందు
నీవు దౌర్భాగ్యురాలవు నిలచియుండు."

౨

కాలవశతను తనపూర్వగతినివీడి
తిమిరవాహినీగర్భాంతరమునమునిగి
చేయునదిలేక ప్రకృతితాఁజిక్కవోయె,
చిమ్మచీఁకటిలో మెరసినది మెరుపు.
మెరుపువెలుఁగున కదరె నాతరుణియుచట;
ముడిసడలియున్న పెన్నెరి పుడమిఁబ్రాఁకె,
చెదరిజారిన తనపైఁటచెఱఁగుసర్ది,
వరుసపరులగు కన్నీటితెరలఁదుడిచి,
మెరుపువెలుఁగున కాసారమృదులమధుర

తరతరంగాలపై నాడు సరసిజముల
సుంత యానందమువిందఁజూచె నువిద.
అంత వినవచ్చె నీలవియత్పథాల
మధ్యమునునుండి స్వచ్ఛంపుమాటలిట్లు:
"సదమలంబగుభక్తియే చాలు నబల!
భక్తిచేపొందవచ్చు నేపదవినేని!"—

3

చల్లనయ్యెప్రపంచము, శాంతిసీమ
చలువవెలుఁగును వెదచల్లెచందమామ,
కలువవికసించె కాసారజలములందు,
పాడఁదొడగెను కోయిలల్ ప్రమదగీతి,
సుందరంబైన ప్రకృతి తాఁజూచి చెలియ
హృదయదుఃఖము నేమఱి ముదముతోడ
"సదమలంబగుభక్తియే చాలునంట!
భక్తిచేఁబొందనగున టేపదవినేని!"
అనుచునాలేమ హృదయమునందు మురిసి
నిలచి విశ్వమునంతనుగలయఁజూచి
పరమపావనజాహ్నవీవారిపోల్కి—
ప్రవిమలంబగు ప్రతిభతోఁబరగుచున్న
మానససరోవరమున ముమ్మారుమునిఁగి
నిలచి, యంజలినిండుగ నీరమెత్తి
స్వర్గమునుచేరనేగ తద్వారమునకు—
తరుణిరాగ తనంతఁదాఁ దెరువబడియె
స్థగితనవరత్నమణిమయద్వారమచట.
పరమభక్తితో నంజలిబట్టియువిద
"పాహి!సర్వజ్ఞ!మాంపాహి!పాహి!" అనుచు
సకలలోకేశు పాదాంబుజములవ్రాలె.

## పిలుపు

శ్రీమతి పరుచూరి భువనేశ్వరి గారు

బాబుజీ యిదెనీకు కబురంపెన్
జవాబుజాబులు పనికిరావట
జాగుసేయక రమ్మురమ్మిక
బాబుజీ యిదె నీకు కబురంపెన్.

లేచినది—ముప్రొద్దు—నేమో
పాచిపోయినదంచు బోలమున
గాచుకొనియుండెదవు కాపూ!
లేచిరావేమోయి! ముందుగ బాబుజీ.
దేశకల్యాణంబు నీలో
పేశలంబై యున్నదట నీ
కోసమేలండనుకుతా నీ
వేసమున పోయినవాడట. బాబుజీ.
వల్లభాయ్‌కనుపాపలందు త
టిల్లలెల్ మరపించిమెరసిన
సల్లలితమగుభక్తికిరణాల్
కల్లగాదట పట్టిపోవట. బాబుజీ.
ద్రోహవారిననిఖిలలోకాల్
జోడుకోడలతోడ బెరిగిన
నీదు నరచే నధివసించి సు
ఖాదిఘరులకు జీవమిడునట. బాబుజీ.
మండుటెండల నిప్పుకలను
దండిపడమటిశాంబరములను
క్రాగిపోవుచు తూగిపోవుచు
జోగులై నసను భోగివీవట. బాబుజీ.

ఎంతదూరము పోయినను నీ
వంతు పాపము వెట్టిచాకిరె
సుంతసుఖమే లేదుగాయని
చింతనొందకుమోయిరక్షక! బాబుజీ.
శాంతిసమరములోన నీవు ని
శ్శాంతభక్తికి పట్టుగొమ్మట
ఔపచారికతత్వముల నీ
వోపికే స్వాతంత్ర్యమటనోయ్! బాబుజీ.
కల్లుసారాయి నల్లమందుల
కాలుసేతుల నూడదీసి
మల్లి మనదేశాననడుగిడ
వల్లగాదని శాస్తిజేయుగ. బాబుజీ.
క్రూరమృగములవోలె దారుణ
మారణక్రియలన్నశించెడి
ప్రాచ్యపాశ్చాత్యాదివాస్తుల
ప్రథమశిక్షణకై కదలెనట. బాబుజీ.
విప్లవములు స్వరాజ్యసిద్ధికి
విప్లవములవుగాతమని వే
దప్రమాణముగా వచించెను
ప్రప్రథమునవె రిత్తగాదది. బాబుజీ.
తలకుపిలకలు మూడువెట్టి
మొలకుగావంచానుజుట్టి
బోసినోటను బిలుచు నిను జై
వేసికొన్న రుమాలవిసరున. బాబుజీ.
హైందవప్రజలోనిసమతా
మందదివ్యజ్యోతులింగ్లాం
డందుమంచుతుపాను విరిసే
మందుబోయగనున్నవట నోయ్! బాబుజీ.
చిట్టిపిడికెడు మేకపాలును
చిన్నగోధుమరొట్టముక్కయు
నున్న నిన్నే యుగయుగాలు
ఎన్నుకొని జీవించునటనోయ్! బాబుజీ.
మోటువాడను దెలియదేయని
మూతిబిగబట్టంగబోకుము
మోటువారికి మోటుగురువట
నీటువారికి నీటుగురువట. బాబుజీ.

కాన జగానమున్న సమకాలికులందున నీవమిన్న, నీ
కూనలుభావికాలమునకున్ దగిపోదురు, బాబుపేరులో
దేనెలుచిప్పిలున్, సమరదీక్షముగించినవెంటనే సుహిం
దూనవమోహనాంగియు నితోధికసౌఖ్యములొందు, హాలికా!

## నవనాగరికము

శ్రీమతి తూతికకమలాంబగారు

పసుపుమోమునరాయుపనిమోటుదోచెను
ఫేసుపౌడర్లపై ప్రీతిహెచ్చె
ముద్దులుగుల్కెడి దుద్దులపసవోయి
చెవులకు లోలకుల్ చెలువుమీరె
కాళ్లకందముగూర్చు కడియముల్ వోయెను
పట్టెలగొలుసులు బిట్టుదనరె
ముక్కున నగలుంట మోటుగాదోచెను
మోమునతిలకంబుగోము వోయె
ముడియుగొప్పునుసిగయును మోటులయ్యె
వాలుజడలందు మిక్కిలివాంఛలొదవె
భరతభూమినిజరియించు భామినులకు
కరముపెంపారుక్రొత్తనాగరికమునను.

# శాంతినికేతనము

శ్రీమతి జి. సీతాలక్ష్మీకన్య గారు

అభినవభారతమున వన్నెగాంచిన మహాపురుషులలో రవీంద్రనాథటాగూర్ గారొకరు. ఈయన వంగదేశీయుడు. మహాఋషి దేవేంద్రనాథటాగూర్ గారి పుత్రరత్నము. జమీందారీకుటుంబీకుడగుటచే, చిన్నతనమునుండియు సర్వసౌఖ్యము లనుభవించుచుండెను. విద్యయందపారకృషిసల్పి విద్వన్మణియై వన్నెగాంచెను. చిన్ననాటనుండియు సంగీతసాహిత్యకళలయం దభిరుచి మెండుగఁగలిగియుండెను. వంగదేశ సారస్వతమంతయు సమగ్రముగఁ బరిశీలించి విశేషజ్ఞానము సముపార్జించెను. కవిత్వమున విశేషప్రజ్ఞ నార్జించెను. బాల్యమునుండియు వంగదేశపుఁ బాటలఁబాడుచు నానందించెడి గానప్రియుడు. మరియు ఆంగ్లవిద్యను పూర్తిగనభ్యసించెను. ఇదిగాక ఐరోపాఖండమున విశేషవ్యాప్తిజెందిన గ్రీకు, లాటిన్, జర్మన్ మొదలగు భాషలనుగూడ నభ్యసించెను.

రత్న మెచ్చటనున్నను రత్నమే. కొంతకాలము మట్టిలోనుండి ప్రచ్ఛన్నముగ నుండినను సమయమగు నపుడు శోధకులు దీనిని జూచినపుడు విలువగ్రహించి కన్నుల కద్దికొందురు. ఈమహాకవి కల్పనాశక్తి, కవిచాతుర్యము ముందుగ హైందవజాతి గ్రహింపలేకపోవుట కడుశోచనీయము. నార్వేదేశమున 'నోబెల్' బహుమానసభ్యులు రవీంద్రుని కవితాశక్తిని గుర్తించి సుమారు లక్షరూప్యములు ఈయన "గీతాంజలి" యను కృతిరత్నమునకు బహుమానమర్పించిరి. దీనితో ఈయన యశశ్చంద్రికలు దిగంతములవరకు వ్యాపింపజొచ్చెను. మహాకవియని శాశ్వతకీర్తి రవీంద్రునికి లభించెను.

మహాత్ముల జీవితములు కడుఁబవిత్రములు. వారి ఆశయములు మహోన్నతములు. కవిహృదయము మహాగంభీరము. రవీంద్రుడు తనజనకుడగు మహాఋషి దేవేంద్రనాథటాగూర్ గారు తపస్సుజేసిన భోల్పుర సమీపమున "శాంతినికేతనము" (Abode of Peace) పేరిట నొకయాశ్రమమును స్థాపించెను. దీనిని టాగూర్ గారె స్వయముగ నడిపించుచున్నారు. ఇచ్చటి బాలికాబాలకులకు టాగూర్ గారె తల్లి, తండ్రి, గురుడు, దైవము. ఆజానుబాహువులతోడను, విశాలవక్షస్థలముపై పిల్లవాయువులతో దాండవించు తెలుపు నలుపు గలసిన నిడుదగెడ్డముతోడను, చల్లనిచూపులతో నందమొప్పెడు నక్షత్రసమానములగు నేత్రయుగ్మముతోడను, గాలిలో వ్రేలాడుచుండెడి వదులు లుంగీతోడను రవీంద్రునిగాత్రము కడు రమణీయమై ఆశ్రమవాసుల నాకర్షించుచుండును.

ఈమహనీయుడు తనతండ్రిగారగు మహాఋషి దేవేంద్రనాథటాగూర్ గారు తనవానప్రస్థాశ్రమమునఁ దపస్సుచేఁ గాలముగడపిన భోల్పురసమీపమున శాంతినికేతనమును నెలకొల్పెనని చెప్పియున్నాము. ఈ ఆశ్రమముచుట్టును పవిత్రములగు నదీనదంబులుగాని, విశాలములగు సరస్సులుగాని, రమణీయములగు పర్వతారణ్యములుగాని కానరావు. మహాఋషిగారి జ్ఞాపకార్థముగ నిర్మింపబడిన సుందరమగు తెల్లని కట్టడమొకటి మాత్రమీయాశ్రమమున ప్రథమమునగలదు. ఈఆశ్రమముచుట్టును విశాలములగు బయళ్లు మిట్టపల్లములతో గూడుకొని కనుచూపు మేరవరకును తాటివనములచేనిండి చూపరులకు సొంపు గొల్పుచుండును. నవీనవిశ్వవిద్యాలయభవనములమాడ్కి లక్షలకొలది ద్రవ్యమును వెచ్చపెట్టి కట్టించిన భవనరాజము లేమియు నీశాంతినికేతనమున ప్రథమదశయందు గానరావు. పేరునకుదగినట్టు శాంతినికేతనము వాతావరణమంతయు మిక్కిలి ప్రశాంతముగనుండి ఋష్యాశ్రమము మాడ్కిఁగన్పట్టెడిది.

రవీంద్రుడు మహాకవియేగాక సర్వకళాభిజ్ఞుడు. ఈయనకు భారతచిత్రకళలయం దభిరుచిమెండు. గానప్రియుడు. దేశభక్తాగ్రేసరులలో నొకడు. స్వదేశమునేగాక, ప్రపంచమునంతయు, సమదృష్టిచే జూచు

మహాజ్ఞాని. మానవకోటినంతను సోదరులరీతి ప్రేమించు మహోదారస్వభావుడు. భారతాశయములను ప్రపంచమునకంతటికిని బోధపరుప నెంచిన దేశభక్తుడు. ఇట్టి మహాశయములను కార్యరూపమున కొనసాగించు నిమిత్తము శాంతినికేతనమును స్థాపించి దానికై తన జీవితమును ధారపోయుచున్నాడు. ఈయాశ్రమమున బాలికాబాలకులందరు గురుకులవాసము చేయుచున్నారు. ఈయాశ్రమము నేర్పరిచిన క్రొత్తదినములలో బాలికాబాలకులందరు పూర్వము బౌద్ధభిక్షులు గురువులయొద్ద విద్యనార్జించినరీతిని శిక్షబొందుచుండిరి. ధనార్జనమందు విశేషబుద్ధిలేక కేవలవిజ్ఞానముకొరకె విద్యార్థులు పాటుపడుచుండిరి. రవీంద్రుడు వీరికి గురుదేవుడు. ఈగురుదేవునిచుట్టును బాలికాబాలకులు గుమిఁగూడి చక్కనికథలు వినుచు నానందించుచుండిరి. చిత్రకళలయందు విశేషప్రజ్ఞకలిగి చక్కనివస్తువులను చిత్రపటములను సిద్ధపరిచి ముఖ్యములగు పట్టణములకు ప్రదర్శనార్థము పంపుచుందురు. చిత్రలేఖనము, సంగీతము, నాట్యము మొదలగువానినన్నిటిని విశేషశ్రద్ధతో బాలికాబాలకు లభ్యసించుచుందురు. ఈశాంతినికేతనమంతయు నొకసమష్టికుటుంబముగ దోచుచుండును. ఈచక్కనియాశ్రమమును జూచుటకు వివిధదేశములనుండి యాత్రికులు వచ్చుచుందురు.

ఈయాశ్రమమున నందలాల్ బోసుగారు చిత్రకళలను బాలికాబాలకులకు నేర్పుచుందురు. మరియు శ్రీమతి సుకుమారిదేవిగారు బాలికలకు ప్రత్యేకముగ చిత్రకళలను నేర్పుచుందురు. దినేంద్రనాథ ఠాగూర్ గారు సంగీతకళను నేర్పుచుందురు. నాట్యకళల మణిపురమునుండివచ్చిన యువతీమణులిర్వురు నేర్పుచున్నారు. బాలికలలో పెక్కండ్రు నాట్యవిద్యయందభిరుచి గనపరుచుచున్నారు. ఈయాశ్రమమునందు కాశి, బుద్ధగయ, ప్రయాగలయందు గన్పట్టు ప్రశాంతపవిత్రవాతావరణము గన్పట్టుచుండును. ప్రత్యేకము బాలికాబాలకులు వసించుటకు "కళాభవన"మని పిలువబడుమందిరమున్నది. మరియు నిచ్చట ఆశ్రమవాసుల కుపకరించు చక్కని పుస్తకభాండాగారమున్నది.

కాలముగడచినకొలది మార్పు సహజము. శాంతినికేతనమున గూడ కాలము మార్పు తెచ్చిపెట్టినది. ప్రశాంతమగు నాశ్రమవృక్షములమధ్యను భవనపరంపరలు తలలెత్తినవి. నవీననాగరకతాచిహ్నములగు విద్యుద్దీపములు, మోటారుయంత్రములు ఆశ్రమప్రశాంతవాతావరణములో గొప్పమార్పును దెచ్చిపెట్టినవి. కాలక్రమమున మార్పు సహజముగ గల్గినను శాంతినికేతనము పవిత్రమగు యాత్రాస్థానమును బోలియున్నదనుట కొంతమాత్రము సందేహములేదు. ఇది గొప్పవిద్యాపీఠము. మానవసేవకై నిర్మింపబడినది.

శాంతినికేతనమున రవీంద్రుడు నివసించుభవనము కడురమణీయముగనున్నది. గదులన్నియు విద్యార్థులచే తయారుచేయబడిన చక్కనిచిత్రములచే నలంకరింపబడియుండును. రవీంద్రుడు మేడపై నివసించుచుండును. క్రిందిగదులలో రవీంద్రుని కుమారుడు రతిబాబు, కోడలు శ్రీమతి ప్రతిమాదేవియు వసించుచుందురు. అతిథులెవరైనను వచ్చినప్పుడు కుటుంబమంతయు వారిచుట్టుఁజేరి సత్కరించుచుందురు. గురుదేవుడిదియంతయుఁజూచి ఆనందించుచుండును.

స్వార్థమును పూర్తిగఁద్యజించి మానవసేవకై పాటుబడు పియర్సన్, విలియమ్సు మొదలగు పాశ్చాత్యపండితులుగూడ నీయాశ్రమము నలంకరించియున్నారు.

రవీంద్రుడు తన అపారప్రేమను మానవకోటిపై వెల్లివిరియఁజేసి విశ్వమానవసోదరత్వము, మానవసేవ, విశ్వభారతి మొదలగు మహోన్నతాశయములను కార్యరూపమున శాంతినికేతనమున కొనసాగించుచు, ఏసుక్రీస్తు, బుద్ధదేవుడు మొదలగు మహాపురుషుల శాంతితత్వమును లోకమునకు బోధించుచు లోకకళ్యాణమునకై పాటుబడుచు తన జీవితమును ధారపోయుచున్నాడు. దయామయుడగు సర్వేశ్వరు డీయాశ్రమమును చిరస్థాయిగనుండి అభివృద్ధిగాంచునట్లాశీర్వదించును గాక!

# పిల్లలు

శ్రీమతి రాజేశ్వరిగారు

"రాజ్యం! ఆచదువేదో కట్టిపెట్టి పిల్లనితియ్యమ్మా! ఒక్కమాటూ" అని కునుకు పాట్లు పడుతూ చెప్పింది మాఅమ్మ. దానికి పిచ్చిభయం, వెఱ్ఱిప్రేమ. అమ్మాయి యేకవ నేలేదు; గంటక్రిందటే పాలుతాగి పొత్తిళ్లలో ఒత్తిగిలి పుస్తకంలా పడుక్కుంది. మంచం కింద మండిగలో వున్ననిప్పు నిద్రపోతూంది. ఇట్టేవుల్లతో కదిపి, వర్షంవెలిసిందికదా అని కిటికీతలుపులు తెరిచేను.

సతీమణులసౌభాగ్యం ప్రకృతిలో ప్రతిఫలించింది. మందగమనం మబ్బులలోనూ, చంచలదృష్టులు మెరపుల్లోనూ, మనసుమెత్తన మందమారుతములోనూ, హృదయప్రసన్నత అంతరాళమంతటనూ ఆవిర్భవించేయి. గ్రీష్మాతపంతో మూర్ఛిల్లిన భూదేవికి శైత్యోప చారంచేసింది వర్షలక్ష్మి. నూతనమైన ఉత్తేజంతో - తలంటుపోసుకున్న తరుణిలాగు-సృష్టి అంతా కోలాహలమైంది.

ఈనీలిచీరకట్టిన నిశాలక్ష్మిని మృత్యుముఖంతో పోల్చిన కవులెంత కఠినహృదయులు? స్వప్నసామ్రాజ్యాలు చవిచూపించేనిశీథాన్ని! కాళిదాసు కబురంపిన మేఘశకలం ఆమె ముంగురులందలిదేకదూ! ప్రకృతిలో ఇట్టి విరామంయెప్పుడు లభిస్తుంది? ఐహికం అంతా విడిచి, మనసు రెక్కలుకట్టుకునేసమయం రాత్రి. పగటివేళ శాస్త్రజ్ఞానంవంటింది; ప్రతివస్తువు లోనూ ఉపయోగం నిరుపయోగంతప్ప వేరొకటి కనపడదు. భావఫలకంమీద సౌందర్య చ్ఛాయ హత్తుకోనడానికి నీలితెర అవసరం......

గాలితాకున చప్పట్లుకొట్టి పుస్తకం నాదృష్టిమరలించింది. దీపంవెలుగుతూంది గంట లాగు. కిటికీవదలి, పుస్తకం తలవైపుపెట్టి, అమ్మాయికి మెలకువరాకుండా పక్కలోచేరేను. అప్రయత్నంగా అమ్మాయి నావేపుతిరిగి లతములాపుకుంది. చేరదీసుకుని పడుక్కున్నాను. ఆలేతశరీరంయొక్క వెచ్చదనం సన్నజోకొట్టింది.

*　　*　　*　　*

నిద్ర! ఎంతటినిరీశ్వరవాదికైనా అస్తికత్వం కలుగచేస్తుంది నిద్ర. ఈశరీరం కట్టు బట్టలాగు విడిచిపెట్టి మనం యేఅదృష్టసీమలకో తర్లిపోతాం. సృష్టివిలాసంలో ఆత్మరహః క్రీడసలిపే మధుమృత్యువది!

*　　*　　*　　*

గదితలుపు మెల్లగకదిలి నట్లయింది. పారిపోయిన చైతన్యం తనగూటిలో ప్రవేశించి నాకళ్లు తెరిచింది. మాఅక్కయ్యవచ్చి గుమ్మంలో అట్టేనిలబడిపోయింది. మంచినీళ్లకను కున్నాను.

"ఎందుకు? అక్కయ్యా!"

"ఏమీలేదు." గద్గదికతో బరువై నాచెవిపడ్డాది ఆజవాబు.

గతుక్కుపడిలేచేను. నామంచం చెంతికువచ్చి చతికిలపడ్డాది మాఅక్కయ్య.

"నిద్దరపట్టలేదూ, అక్కయ్యా!"

"ఊఁ. ఊఁ. లాలి నిద్రపోతూందో లేదో అనీ—"

"ఇదుగో, నాపక్కలోనే పడుక్కుంది."

"రెండుగంటలైనట్టుంది, ఓమాటు అడ్డాల్లో వేసుకున్నావా?"

"పదిగంటలైన తర్వాత తాగింది......ఔనుకాని అక్కయ్యా! ఎందుకు లేచినావు? బావకాని యీమూడుగంటలరైలులో వస్తున్నారా ఏమిటి?"

"లేదే, ఇంకామొన్ననే కదూ వెళ్లేరూ? రేపుమెయిల్లో వచ్చేస్తారు......అయితే, రాజ్యం! రాత్రి అంతసేపుదాకా చదువుతున్నావు; భయంఅనిపించదూ?"

"ఎందుకు భయం?"

"ఊఁ. ఊఁ. లాలి ఒక్కర్తీ మంచంమీద నిద్రపుచ్చేనీ—ఎలా చదువుకుంటావని."

నాకేమీ సమాధానంతోచలేదు. "కావలిస్తే చదువుకో, నాకు నిద్రతేలిపోయింది, రెప్పలు బరువెక్కేదాకా యిక్కడే వుంటాను."

అర్థముకాని యీఆందోళనతో నానిద్రకూడా పూర్తిగా తేలిపోయింది. సరే అని కుర్చీలోనికిజరిగి పుస్తకంతీసేను. మాఅక్కయ్య నామంచంమీద చేరి నడుము వాల్చింది. వడగాడ్పువంటి నిట్టూర్పు నాచెవిసోకింది!

ఊహలకందరాని వ్యాపృతిలో నామనసు లీనమైపోయింది. అరమూసిన కనురెప్పలలోనుండి నీరెండలాగు దీపంకనిపిస్తూనేవుందినాకు. ఒడిలో జారిన పుస్తకంజారినట్లే నన్ను కౌగలించుకుని ఉండిపోయింది. జల్లువిడిచిన శ్రావణనిశిలాగు నిశ్శబ్దంగా నిద్రించింది మాఅక్కయ్య............

మనసు బరువంతా విదిలించుకుని టైముచూతామని లేచి మేజావైపు వెళ్లేను. నాలుగు దగ్గరైంది. అమ్మాయి కదిలినట్లయిందికదా అని దగ్గరకెళ్లేను. లేతపెదవుల నుండి నక్షత్రకిరణంలాగు చిర్నగవుతోచి మళ్లీ కరగిపోయింది. మళ్లీ అంతట్లోనే కాళ్లూ చేతులూ విదిలిస్తూ తనసూదిగోళ్లతో మాఅక్కయ్యపైటకొంగు లాగేస్తూంది.

ఏదోమహాపచారంచేసినట్టు మాఅక్కయ్య,చప్పునలేచిపోయి "లాలిని తియ్యమ్మా, రాజ్యం! ఎందుకొచ్చిన పుస్తకాలూ?" అంటూ, పైటచెఱగుతో కళ్లొత్తుగుంటూ గది గుమ్మందాటింది!

# గ్రంథపరిచయము

**మిత్రలాభము; కాకోలూకీయము:—**

పంచతంత్రకథాంతర్గతములు. గ్రంథకర్త సాహిత్యవిద్యాప్రవీణ బులుసు వేంకటరమణయ్యగారు. విష్ణుశర్మ సంస్కృతభాషను వ్రాసిన పంచతంత్రకథలను సులభశైలి నాంధ్రీకరింపఁదలచి శ్రీవారు తొలుత మిత్రభేదమును రచియించిరి. దానిని పుస్తకనిర్ణయసభవారు పఠనీయగ్రంథమగుట కర్హమని యంగీకరించిరి. వారి యాప్రోత్సాహము నాలంబనగాఁగైకొని తక్కినభాగములను రచింపఁబూని 'మిత్రలాభము; కాకోలూకీయము' అను నీరెండవభాగమును శ్రీవారు ఇపుడు వెల్వరించిరి. ఈభాగమును రచియించుటలో వారు బహుదేశప్రతులను సంప్రదించిరి. మిత్రభేదమునందువలెనే ఇందును పెక్కునీతులు చేర్పబడినవి. విద్యాశాఖాధికారు లాదరింతురుగాక అని కోరెదము. క్రౌనుసైజున 84 పుటలు. పబ్లిషర్: కె. శ్రీనివాసరావు; శ్రీవేదవ్యాస ముద్రాక్షరశాల; విజయనగరము.

**పరీక్షిత్తు:—**

గ్రంథకర్త విద్యార్ణవ, సాహిత్యసరస్వతి బిరుదాంచితులగు నూతలపాటి పేరరాజుగారు. ఫూల్‌స్కాప్ సైజు. 8 పుటలు, వెల 0-0-6. మంజరీద్విపదలో వ్రాయబడినది. బ్రాహ్మణశాపముతగిలి పరీక్షిత్తు భాగవతము చెప్పించుకొన్నకథ. దొరకుచోటు: నూతలపాటి పేరరాజు, ఆంధ్రపండితుడు, మడకశిర, అనంతపురముజిల్లా.

**నరసింహశతకము:—**

మంగళాద్రినరసింహస్వామిని గూర్చినది. గ్రంథకర్త్రి శ్రీమతి గుడిపూడి ఇందుమతీదేవిగారు. క్రౌనుసైజున 20 పుటలు. వెల 0-2-0. పద్యములు ప్రాయికముగా కందములు. గీతములు, మఱికొన్నివృత్తములు గలవు. భక్తిభావములతో నిండియున్నది. మద్రాసు టెక్స్టుబుక్కుకమిటీ వారంగీకరించినది. వలయువారు గ్రంథకర్త్రి పేర బెజవాడకు వ్రాయునది.

**రాజరాజేశ్వరీశతకము:—**

గ్రంథకర్త్రి గుడిపూడి ఇందుమతీదేవిగారు. గుంటూరుజిల్లా తాడేపల్లియందు వెలసిన రాజరాజేశ్వరిని గూర్చి చెప్పబడిన భక్తిమయపద్యములు. మదరాసు పాఠ్యగ్రంథనిర్ణయసంఘమువారు ఆమోదించిరి. క్రౌనుసైజున 20 పుటలు. వలయువారు గ్రంథకర్త్రి పేర బెజవాడ వ్రాయునది.

**పశునేత్రచికిత్స:—**

వెటరినరీ ఆయుర్వేదవైద్యభూషణులగు శ్రీయుత రేకెళ్ల శ్రీరాములుచౌదరిగారు రచియించినది. పశువైద్యగ్రంథనిలయమున తృతీయపుష్పము. గ్రంథమున గ్రంథకర్తగారి ఛాయాచిత్రము చేర్పబడినది. గ్రంథము రెండుభాగములు. మొదటిభాగమున పశువులనెట్లు అన్యదేశజులు పోషించి వానివలన పొందవలసిన లాభములను పొందుచున్నారో, మనదేశమున పశుపోషణ క్షీణించుటచే పశువులు ఒసగవలసినంతశక్తి నొసగజాలకున్నవో వివరింపబడినది. రెండవభాగమున నేత్రరోగములు, వానినిరోధము, ఏయే జాడ్యములకు సాధారణ చికిత్స, శస్త్రచికిత్స చేయించవలయును మొదలగువిషయములు సులభశైలిలో వ్రాయబడినవి. రైతులకీగ్రంథము మిక్కిలి ఉపయోగకారిగనుండును. క్రౌనుసైజు: గ్లేజుకాగితములు: 64 పుటలు, వెల రు 0-8-0. వలయువారు గ్రంథకర్తపేర కృష్ణాజిల్లా అంగలూరుకు వ్రాయవలయును.

**పశువైద్యవస్తుగుణదీపిక:—**

పశువైద్యగ్రంథనిలయమున చతుర్థపుష్పము. గ్రంథకర్త యేలేశ్వరపు శ్రీరాములుచౌదరిగారు. శ్రీమంత్ రాజా యార్లగడ్డ శివరామప్రసాదబహద్దరుజమీందారువారి పట్టాభిషేకమహోత్సవసమయజ్ఞాపకచిహ్నముగ ఈగ్రంథము ప్రచురింపబడినది. మద్రాసుప్రధానామాత్యులగు శ్రీయుత బొబ్బిలి మునిస్వామినాయుడుగారీగ్రంథమునకు వ్రాసిన పీఠికలో ఇట్లువ్రాసిరి: "శ్రీయుత యేలేశ్వరపు శ్రీరాములుచౌదరిగారిదివరకు 'పశువైద్యచింతామణి' 'పశునేత్రచికిత్స,' 'పశువ్రణచికిత్స' మున్నగు గ్రంథములను స్వానుభవపరిచయముల నాధారముచేసికొని విరచించి యాంధ్రకృషీవలుల కర్పించియున్నారు. వానిలో చేర్చ్కనిన వివిధవస్తుగుణముల నిర్దేశోపయోగములనుగూర్చి ప్రస్తుతగ్రంథమగు నీ'పశువైద్యవస్తుగుణదీపిక' విరచింపబడినది. పశుపోషణశీర్షికలో పశుపోషణావశ్యకత, పశుగణాహారనిర్వచనము మున్నగువిషయములను చక్కగ నిర్దేశించియున్నారు. వస్తుగుణదీపికలో పశువైద్యశాస్త్రమునందలి సూత్రములను క్రియారూపకముగఁ బరిణమింపజేయుటకు గావలసిన విషయవిస్తరణమును, వస్తుప్రకృతియును చేర్చ్కనఁబడియున్నవి. ఆంగ్లాయుర్వేదములందును, యునానీవైద్యశాస్త్రమునందును ఒక్కొక్క మూలికకొసగబడిన గుణములు సంపూర్ణముగ చేర్చ్కనబడియున్నవి. దేశభాషలలో శాస్త్రపఠన మవసరమని గుర్తింపఁబడు నీకాలమున నిట్టివస్తుశాస్త్రగ్రంథము లెంతయుఁ బ్రోత్సహింపఁదగినవి. శ్రీరాములుచౌదరిగారు పల్లెటూళ్లలో నానాటికి చివికిరూపుమాయుచున్న పశువైద్యశాస్త్రమును పునరుద్ధరించి భావికృషీవలుల కత్యంతకృతజ్ఞతాపాత్రులైరి." క్రౌను సైజు: గ్లేజుకాగితములు: 264 పుటలు. వెల రూ. 2-0-0. వలయువారిట్లు వ్రాయవలెను: యేలేశ్వరపు శ్రీరాములుచౌదరి, వెటర్నరీ ఆయుర్వేద వైద్యభూషణ, అంగలూరు, కృష్ణాజిల్లా.

**శ్రీవిఘ్నేశ్వరచరిత్రము:—**

ఆంధ్రావళీగ్రంథమాలిక ప్రథమకుసుమము. గ్రంథకర్త గొబ్బూరు వేంకటానందరాఘవరావుగారు. విఘ్నేశ్వరునిచరిత్రము ఇందు విపులముగ పురాణములనుండి క్రోడీకరింపబడినది. శైలిసులభ మేయనవచ్చును. కథానిర్వహణము రసవంతముగానున్నది. గంగిరెద్దువేషము, కుమారస్వామివిఘ్నస్వాములస్పర్థ మొదలగునవి వర్ణించుఘట్టములు హాస్యజనకములుగనున్నవి. మన పురాణకథలను ఇట్లు క్రొత్తవెలయించి పామరజనులకు అందుబాటులో నుంచుట మెచ్చదగుపద్ధతి. గాణాపత్యుల కీగ్రంథము శిరోధార్యముకాగలదు. క్రౌను సైజు: పుటలు 88; వెలరూ. 0-12-0. విశాఖపట్టణముజిల్లా ఎలమంచిలి ఆంధ్రావళీ సంఘకార్యదర్శిచే ప్రకటింపబడినది.

**కథామణిప్రవాళముక్తావళి:—**

మూడుభాగములు. మూడుభాగములును విమర్శనార్థము మాకార్యాలయమున కంపబడినవి. గ్రంథకర్తలు రూపనగుడి నారాయణరావుగారు. ఇవి సెకండరీపాఠశాలలందలి క్రిందితరగతులలోని విద్యార్థులకును, ఎలిమెంటరీపాఠశాలలందలి పైతరగతులలోని విద్యార్థులకును నుపయుక్తముగ నుండునట్లు వ్రాయబడినవి. మొదటిభాగమునందలి కథలు నాతిదీర్ఘములు, భిన్నమైన అభిరుచులకు అందునవి, నీతిప్రదములును. ఇందు కొన్ని భారతమునుండియు, సుప్రసిద్ధవిదేశీయగ్రంథములనుండియు, భూగోళశాస్త్రమునుండియు గ్రహింపబడినవి. రెండవభాగమున రెండుకథలుమాత్రమే గలవు. 'కాకసస్సందలి కారాగృహవాసి' అను మొదటికథ టాల్స్టాయ్ విరచితము. ఇది పచ్చికబయళ్లయందలి మానవసంసారయాత్రనుగూర్చి తెలుపుచున్నది. 'సువర్ణవాహినీరాజు' అను రెండవకథ రస్కిన్ మహాశయుడు రచియించినది. ఈకథకు హైందవభూమిక యీయబడి హైందవాభిరుచుల కనువగునట్లు కొన్నిమార్పు లొనర్పబడినవి. మూడవభాగమున పాండవుల

యజ్ఞాలవాసము, జీమూతవాహనుఁడు, స్వారోచిషమనుసంభవములను మూడుకథలు చేర్చబడినవి. జీమూతవాహనునికథ కరుణరసప్రధానమును, నీతిగర్భితమునగుట విద్యార్థులు అప్యాయముగ చదువగలరు. పుస్తకభాగములు మూడును క్రౌనుసైజున గ్లేజుకాగితములమీద ముద్రింపబడినవి. మొదటిభాగము 82 పుటలు: వెల ౬ అణాలు. రెండవభాగము 98 పుటలు: వెల ౮ అణాలు. మూడవభాగము 116 పుటలు: వెల ౧౦ అణాలు. పి. బుచ్చయ్యసెట్టి అండ్ సన్, పబ్లిషర్సు అండ్ జనరల్ మర్చెంట్సు, బళ్లారి వారివద్దదొరుకును.

## విషాదసంసారము :—

శ్రీ ఆదిభట్ల తరిణయ్యసిద్ధాంతిగారిచే వ్రాయబడినది. బ్రాహ్మణకులాచారములను విమర్శించు గ్రంథము. సురేంద్రమోహనభట్టాచార్యులవారి 'నారీబలి' యను వంగభాషాగ్రంథమునకు తెనుగుసేత. నరకుల్యాదురాచారమూలమున ఆడపిల్లలతండ్రి వైద్యశాస్త్రి సర్వభ్రష్టమగుట జాలిపుట్టించును. భావకవియైన శాస్త్రి పెద్దఅల్లుని త్రాగుబోతుతనముచేకలిగిన తప్పడుకవిత్వపుకూతలు హాస్యజనకములు. సూర్యకాంతము మంచిబుద్ధి, పాపయ్య పాడుబుద్ధి, రామభద్రచయనుల దుష్టబుద్ధి బాగుగ వర్ణింపబడినవి. శాంతిశీల, కరుణామయియు ఆత్మహత్య చేసికొనుటతో వైద్యశాస్త్రి విషాదసంసారచరిత్ర పూర్తియయ్యెను. వైద్యశాస్త్రి జీవితమును పూర్తియయ్యెను. క్రౌనుసైజు: గ్లేజుకాగితములు: 124 పుటలు: వెల 0—12—0 అణాలు. గ్రంథకర్తపేర బరంపురము వ్రాయునది.

## శాస్త్రవిషయములు :—

ఇది ఆకుండి వేంకటశాస్త్రిగారిచే రచియింపబడినది. ప్రకాశకులు: సీతారాం అండ్ కో, బుక్కుసెల్లర్సు, పబ్లిషర్సు, తెనాలి. క్రౌనుసైజున 38 పుటలు. వెల 0—2—0 అణాలు. 'దేశమాత' పత్రికలో 'వింతలు: విశేషములు' అనుశీర్షికక్రింద శ్రీశాస్త్రిగారు ప్రచురించిన శాస్త్రవిషయములకిది పుస్తకరూపము.

## భారతీయప్రబోధము :—

గ్రంథకర్త సాయంవరదదాసు. అహింస, మద్యనిషేధము, ఖద్దరు మొదలగువానిని ప్రోత్సహించుచు వ్రాయబడిన పద్యములగ్రంథము. ఇందు కీర్తనలును గలవు. క్రౌనుసైజున 16 పుటలు. వెల 0—1—0. పబ్లిషరు గద్దె లింగయ్యచౌదరి, యలమర్రు, కృష్ణాజిల్లా. ఇది దయానందగ్రంథమాలలో ప్రథమపుష్పము.

## శారదావ్యాకరణము:—

రెండవభాగము. మూడునాలుగు తరగతుల విద్యార్థులకు ఉపయోగముగనుండును. గ్రంథకర్తలు సుప్రసిద్ధాంధ్రపండితులగు శేషమళ్ల రాజగోపాలరావుగారు. విభక్తిప్రకరణము విపులముగగలదు. వ్యాకరణమున ప్రథమపాఠములు చేర్చుటకిది యెంతయుఅనువైయున్నది. క్రౌనుసైజున 72 పుటలు. వెల 0-3-0. వలయువారు గ్రంథకర్తపేర, 124 పళ్లాళవీథి, పరశువాకము, వేపేరిపోస్టు, చెన్నపురి అను చిరునామాకు వ్రాయునది.

## నైపీయజలచికిత్స :—

పాదర్ నీప్‌గారి జలచికిత్సావిధానమును తెనుగున వివరించుగ్రంథము. ప్రకృతిపత్రికనుండి పునర్ముద్రితము. గ్రంథకర్త పుచ్చా వేంకటరామయ్యగారు. క్రౌనుసైజు: గ్లేజుకాగితములు: 80 పుటలు. వెల రు 0—12—0. ప్రకృతి చందాదారులకు 0—8—0. జలముతోడనే రోగములనుకుదుర్చు విధానమును వివరించుగ్రంథము. సుప్రసిద్ధులగు నీప్‌గారి జీవితసంగ్రహము కూడ ఇందు చేర్చబడినది. నీప్‌గారి వైద్యవిధానమున జలమును, మూలికలును వాడుదురు. కేవల జలచికిత్సావిధానమునకును, కేవల మూలికాచికిత్సావిధానమునకును ఇది సమన్వయముచేయు విధానముగనున్నది.

**వైదర్భీవిలాసము:—**

మద్రాసు టెక్స్టుబుక్కు కమిటీవారు అంగీకరించినది. విద్యార్ణవ సాహిత్యసరస్వతి నూతలపాటి పేరరాజు గారును, వారి మిత్రులొకరును ఈ గ్రంథకర్తలు. విదర్భదేశ రాజు కూతురగు రుక్మిణీదేవి శ్రీకృష్ణుని వివాహమాడినకథ ఇందు మంజరీద్విపదలో అభివర్ణింపబడినది. స్త్రీలును బాలికలును పాటగా పాడుకొనుటకు అనువుగానుండి బాలికాపాఠశాలలయందు అవశ్యముగా ఉపయోగింపదగియున్నది. సందర్భానుసారముగ చేయబడిన వర్ణనములు చక్కగనున్నవి. గ్రంథము క్రౌనుసైజున 70 పుటలు. వెల రు 0—4—0. దొరకుచోటు యస్. పేరరాజు, తెలుగుపండితులు, బోర్డుహైస్కూలు, ఉరవకొండపోస్టు, అనంతపురముజిల్లా.

**సాహసికవీరచరిత్ర:—**

గ్రంథకర్త డాక్టరు దువ్వ శేషగిరిరావు. చారిత్రాత్మకకథలసంపుటి. పర్తబ్ సింగు, తులసీబాయి, అహమ్మదుషా, జులేకా, ద్వంద్వయుద్ధము, రత్నబహుమానము, ప్రవాసితుడు, అయేషా అను కథలుగలవు. ఇవి అనువాదములుకావోపు. అయినఆసంగతి తెలుపబడలేదు. సుప్రసిద్ధనవలారచయితలగు శ్రీ వేంకటపార్వతీశ్వరకవులు ఈగ్రంథమును సరిచూచిరి. క్రౌనుసైజున 116 పుటలు. వెల రు 1—0—0. వలయువారు గ్రంథకర్తగారిపేర తూర్పుగోదావరిజిల్లా పీఠాపురమునకు వ్రాయవలయును.

**ప్రేమచందుకథలు:—**

శ్రీ ప్రేమచందుగారు హిందీసారస్వతమున కథలువ్రాయుటలో గణనకెక్కిరి. మల్లికాగుచ్ఛ మను పేర వారికథలను కొన్నిటిని శ్రీ మాడపాటి హనుమంతరావుగారు పదిపదునైదుసంవత్సరములకు క్రితము భాషాంతరీకరించియుండిరి. నాడాదిగా పలువురు ప్రేమచందుకథలను తెనిగించుచున్నారు. రాణీసారంధా మొదలగునవి పద్యములలోగూడ తెనిగించబడినవి. ఇప్పుడు శ్రీ దినవహి సత్యనారాయణగారు ప్రేమచందుగారి కథలను అన్నిటిని తెనుగుచేయ నధికారమును పొందియున్నారు. సరస్వతీగ్రంథమాలలో 25-వ పుష్పముగ వెలువడిన ఈ ప్రేమచందుకథలసంపుటమునందు ఆరుకథలు గలవు. ఒక్కొక్కకథయు నవీనకల్పనలతో వెలయుచున్నది. 'కోతి' కథ అతికరుణముగనున్నది. 'నగలు' కథ స్త్రీలు ప్రత్యేకము చదువదగియున్నది. ప్రేమచందుగారికథలకు ప్రత్యేకవిమర్శ అనవసరము. మాతృకయందలిభావము లేశమాత్రమును చెడకుండ ప్రయత్నముతో వీనిని తెలిగించిన సత్యనారాయణగారిని స్తుతింపవలసియున్నది. ఆంధ్రులీగ్రంథమును ప్రచారములోనికి దెత్తురని నమ్ముచున్నాము. డెమ్మిసైజు: 112 పుటలు: వెల 0—12—0 అణాలు. దొరకుచోటు: సరస్వతీగ్రంథమాల: కాకరపర్రు; తణుకుతాలూకా; పశ్చిమగోదావరిజిల్లా.

**అహింసాప్రబోధము:—**

శ్రీ అన్నపూర్ణాదేవిగ్రంథమాలలో 5-వ సంచిక. గ్రంథకర్త్రి బాల సీతారత్నముగారు. పీఠికలో వివరింపబడినటుల సాధుజీవనయగు గ్రంథరచయిత్రి ఈగ్రంథమున "అహింసావాతావరణములో 'గాలీదానం' ప్రోవుజేసి వింతయగు ప్రకృతియార్చిన కనుమాలపుట్టగిలో నవనీతహృదయము కలుగించుకొనినది: చెవులకుఁ జిత్తముల 'కాట్టే' యొకమూసలోనె గరువుకట్టించి వేదాంతరసాయనము పేర టంకించినది." గ్రంథము క్రౌనుసైజున 42 పుటలు. వెల రు 0—4—0. దొరకుచోటు: శ్రీ అన్నపూర్ణాదేవి గ్రంథమాల, బ్రాడీపేట, గుంటూరు.

**భరతమాతృశతకము:—**

కల్లూరునందలి శ్రీ శారదాగ్రంథమాలయందు ద్వితీయకుసుమము. గ్రంథకర్త కల్లూరు అహోబలరావుగారు. భరతమాతయొక్క కీర్తి ఈగ్రంథమున గీతపద్యములలో కీర్తింపబడినది. పద్యములు దేశభక్తిని



శ్రీమతి రత్నాల కృష్ణాబాయిగారు, ఆమెసోదరి



శ్రీమతి చర్ల సుశీలగారు



శ్రీమతి వేదాంతము కమలాదేవిగారు



శ్రీమతి జయంతి సూరమ్మగారు

ఉద్దీపింపజేయునవిగానున్నవి. క్రౌను సైజు: 24 పుటలు: గ్లేజు కాగితములు. వెల చందాదారులకు 0—2—0; ఇతరులకు 0—3—0. దొరకుచోటు: భారతీభవనము, బళ్లారి.

### అన్నపూర్ణాదేవి జీవితము :—

శ్రీ అన్నపూర్ణాదేవి గ్రంథమాలలో ఇది రెండవసంచిక. గ్రంథకర్త్రి శ్రీమతి అట్లూరి వేంకటసీతమ్మగారు. శ్రీమతి మాగంటి అన్నపూర్ణాదేవిగారు త్యాగజీవిత మిందు కీర్తింపబడినది. ఈ గ్రంథమునుగూర్చి శ్రీ వున్నవ లక్ష్మీనారాయణగారిట్లు వ్రాయుచున్నారు: "గ్రంథకర్త్రి సీతమ్మగారు ఆంధ్రదేశమునకు క్రొత్తవారుకారు. ఈచరిత్రను ప్రసాదించి ధన్యులయినారు. అన్నపూర్ణాదేవిజీవితమువలెనే నీచరిత్రయును శ్లిష్టముగను మృదుమధుర శైలీసంయుతముగనూ వున్నది. చిక్కనిరచన, ముద్దులొలుకుమాటలు, తేనియలొలుకుపద్యములు, విశాలభావములు అన్నియు అన్నపూర్ణాదేవిజీవితమునకు కుదిరిపోయినవి." గ్రంథము క్రౌనుసైజున 42 పుటలు, గ్లేజు కాగితములు. వెల రు 0—2—0. వలయువారు శ్రీఅన్నపూర్ణాదేవి గ్రంథమాల, బ్రాడీపేట, గుంటూరు అని వ్రాయునది.

### బ్రహ్మరహస్యము :—

గ్రంథకర్త శ్రీమాన్ ఇవగంటి పున్నయ్యచౌదరి. ఈగ్రంథము భక్తిభావము, జ్ఞానభావము, అచలభావము, పూజావిధానములనుగురించి తత్త్వములుగా వ్రాయబడినది. క్రౌనుసైజున 50 పుటలు. వెల రు 0–8–0. దొరకుచోటు: ఇవగంటి పున్నయ్యచౌదరి. అప్పికట్ల (అప్పికట్లపోష్టు) బాపట్లతాలూకా, గుంటూరుజిల్లా. ఇందలి సారాంశమునవలోకింప యోగరహస్యానుభవము, ద్వైతాద్వైతవిశిష్టాద్వైతరహస్యానుభవములిమిడియుండుటయేగాక సర్వమతసమ్మతమగు పరమార్థరహస్యపరిపూర్ణానుభవము సైతము వెల్లడింపబడియున్నది. కవిత్వము మృదుమధురశైలిగలిగి నిర్దుష్టమైన ధారాశుద్ధిచే నలరారుచున్నది. ఇట్టి మోక్షగ్రంథమును ఆంధ్రసోదరసోదరీమణులెల్లరు ముఖ్యముగా పఠియించి పరమార్థమెరుంగుట శ్రేయస్కరమని మాయభిప్రాయము.

### మాతృదర్పణము:—

స్త్రీ గర్భముతోనున్న కాలమున నిర్వహింపవలసిన విధులు, శిశుపోషణము, ఆరోగ్యమార్గము, సామాన్యరోగములు, వానిచికిత్స, అంటువ్యాధులు, వానిచికిత్స మొదలగు విషయములు సులభబోధకశైలిలో ఈగ్రంథమున వ్రాయబడినవి. తల్లియగు స్త్రీ తప్పక ఈగ్రంథమును చదువవలయును. ఆకస్మికాపాయములు తన్నివారణోపాయములుగూడ ఇందు వివరింపబడినవి. ఇందు వ్రాసిన విషయములన్నియు గ్రంథకర్త్రియగు కే. రోజియమ్మగారు అనుభవజ్ఞులును వైద్యవిద్యయందు నిపుణులునునగువారినుండి గ్రహించినవే. కావున అనుభవప్రమాణముగల గ్రంథము. గ్రంథము క్రౌనుసైజున 42 పుటలు. గ్లేజు కాగితములు. వెల 4 అణాలు. దొరకుచోటు: డేవిడ్ సామ్సన్ సతి, వెస్లియన్ మిషను, మెదకు, హైదరాబాదు, దక్కను.

### శ్రీ తులసీరామాయణము:—

వేగుంజుక్క గ్రంథమాలలో 41-వ కుసుమము. సుందరకాండము. నిర్వచనము గ్రంథకర్త భాగవతుల నృసింహశర్మ. తులసీదాసురామాయణము సుప్రసిద్ధమైనది. అందు సుందరకాండము రసపుష్టము. నెనుకటి కాండములకంటె శర్మగారికవిత ఇందురాణదేరినది. సామెతలతో, జాతీయములతో కవిత్వము ధారాళముగ సాగిపోవుచున్నది. డెమ్మిసైజు. గ్లేజు కాగితములు. 126 పుటలు. వెల 0-12-0. విలాసము: వేగుంజుక్క గ్రంథమాల, బరంపురము, గంజాముజిల్లా.

# సమస్యాపూరణము

## సమస్య

"ముదితల్ నేరగరాని విద్యగలదే ముద్దార నేర్పించినన్"

మృదుగీతం బటునీతిశాస్త్రగతి గార్గీద్రౌపదుల్ సాక్షి మై
త్రేదమారాసి సమిత్క్షరాసిరతి సత్యార్ఘ్యాన్నులుక్ సాక్షి సా
ధ్వాదిగేహంబున రాజ్యమేలుమతి దుర్గారుద్రమల్ సాక్షి హా!

—పరుచూరి భువనేశ్వరి.

అదిరా! గానమురాదటన్ననుడి మాద్యత్కోకిలారావమా;
పదుపాయజ్ఞత చాలదన్న వతి నిచ్చావ్యాప్తిఁ గావింపరే;
సదనంబున్ సవరించు వారలిక రాజ్యంబేలగా లేరొకో;

—పేరేపు మహాలక్ష్మి.

కదనంబందున సత్యభామ బహుశౌర్యప్రౌఢి జూపింపదే?
మది వేదాంతకళారహస్యములరక్ మైత్రేయివాదింపదే?
విదితఖ్యాతిదశీర్య రుద్రమ మహావిశ్వంబుపాలింపదే?

—దేశిరాజు భారతీదేవి.

నిదురేగానక పైగలందునిమె ఝాన్సీలక్ష్మి న్యాయైకస
త్పథముంబాయక రాజ్యమున్నడపె రుద్రమ్మామహారాజ్ఞి తా
సదసద్విద్యలలో సరోజినియు శశ్వత్కీర్తినింగాంచె మా

—హరిలక్ష్మీదేవి.

కదనక్షోణి జరింపనేర్తురుగదా ఖడ్గంబుచేబట్టియున్
పదలాలిత్యము నర్థసౌష్ఠవముసొంపారంగ గ్రంథార్థముల్
జదువన్ నేర్తురుగాక రెంతయు మహాసంరంభమున్ జూపుమన్

—పిండిప్రోలు కొండయాంబ.

కదనంబందుజయించినారు రిపుసంఘాతంబు విజ్ఞానసం
పదచేభాగ్యములందరే జేసిరిగదా ప్రాజ్ఞేశులన్ తంత్రులన్
ప్రథితప్రాజ్యయశోవిశాలలు ఖనానాగాంబలన్ నారులౌ

—గండికోట సావిత్రీదేవి.

సుదతీరత్నము సత్యభామ మును రక్షోనాథుసంగ్రామమం
దెదురై గెల్చుట, చిత్రరేఖ సకలోర్వీశాత్మజాకారముల్
చదురేపారలిఖించి చూపుట, మదిన్జర్చింపనిద్ధాత్రిలో

—వడ్లమూడి శేషారత్నము.

కదనోర్విన్ శరబాడబంబున రిపుక్ష్మావాధపైవ్యాంబుధిన్
వెుదలంటన్ గ్రహియించి సద్విజయసమ్మోదంబునన్ సత్య యా
యదునాథున్ గన నాతఁడిట్లను మహాహర్షంబునన్ "గోమతీ!

—గంటి కామేశ్వరమ్మ.

కదనక్షోణి ఖరాసిధార రిపులన్ ఖండించె సంయుక్త స
త్కత్ప్రదుశైలిన్ రచియించె రాఘవుని చారిత్రంబు నా మొల్ల ధ
న్యాదయన్ రుద్రమదేవి యాంధ్రజనులన్ బాలించె; నీసృష్టిలో

—శేషమాంబ.

మదిలో నెంచ గృహస్థధర్మ పదవీమార్గోన్నతుల్ పొంద సం
పదలన్ దేలఁగ ధర్మసంతతుల సమ్మానంబువీక్షింప భూ
తదయన్ జెందఁగ నిందు నందుఁ దగ ధర్త్రల్ గ్రాల మూలంబులౌ

—సామినేని హనుమాయమ్మ.

విదితంబేగద మొల్ల సత్కవిత చెప్పెన్ మోహనాంగిన్ యశ
స్పదశుభ్రాంగిని; వెంగమన్ దెలియమే? సంగీతవిద్యావిశా
రదలౌ గారవు సత్యముఖ్యులగు నార్యల్ వేయి యేలానుడుల్?

—యం. రామలక్ష్మమ్మ.

చదువన్ లేదొకొ శాస్త్రముల్ బుధులతోఁ జర్చింపరో పాండితిన్
కదనంబందున శత్రుసేనలపయిన్ గావింపరో, దేశముల్
సదయత్వమ్మున నేలరో, పురుషులై శాసింపరో, యిద్ధరన్

—సామవేదం సీతారామమ్మ.

సదయాత్మ్మండగు వాసుదేవుసతియా సత్రాజితీదేవి తా
నెదనెంతేనియు భీతినొందక రథంబింపార గా నెక్కి యా
కదనంబందున గెల్చె గాదె నరకక్ష్మాపాలు నుర్వీస్థలిన్

—ఎమ్. వేదవల్లి తాయారమ్మ.

చదువుల్, సాములు, శాస్త్రచర్చ, ధరణీరాజ్ఞీత్వ, శిల్పంబులున్,
కదనంబందువరక్తి, గాన, కవితా, విజ్ఞాన, పారశ్యముల్,
సుఘలంజెమ్మెడిపాకశాస్త్రవిదితం, బాబాలలాలిత్వముల్

—ఆచంట సత్యవతమ్మ.

ఎదపైనన్ గుచరూపసంగతిని సాహిత్యంబు సంగీతమిం
పొదవం దాలిచి ధాతచేతలకు నేస్తోద్ధున్ సహాయంబుఁ ద
న్వదనంబందు వశించి జేయుసతి సంభావించి రక్షింపు నీ

—పంతుల సీతాలక్ష్మి.

రథమందున్ విలుకేలబూని రిపులన్ రట్టాడి ఖండించి స
న్మోద మొందించెను కృష్ణ సత్య యన, నెందున్ ముద్దియల్ చేర్వరే
పదలా! లిత్యకవిత్వచిత్రరచనా ప్రావీణ్య గాంధర్వముల్ ?

—సామవేదము చిరంజీవమ్మ.

విదుషీరత్నము లెందరో యిపుడు ప్రావీణ్యమ్ము దీపింప వ్రా
యుదు రీపత్రిక కన్నియేని బహుధా యోగ్యమ్ములై మించు స
త్కథలన్ వ్యాసములన్ గవిత్వముల; లెక్కాయేమి? లోకమ్ములో

—బెల్లంకొండ కనకమ్మ.

పదమొప్పెండిని విద్యచే నుదతిలో పాముద్ర గుర్వాళితోన్
చదువుల్ నేరిచి నాయకత్వము వహించంగల్గె విఖ్యాతిగా
సదసద్వేదిని భారతీపతిమహా శాస్త్రీయవాదంబులో
చదువుల్ ముఖ్యము భామినీమణులకే యంచున్ ప్రసిద్ధంబుగా
విదితంబౌటకుఁగాదె యార్యజను లా విద్యానుసంధాత్రినిన్
సుదతీమూర్తిగ నెంచి గొల్చిరి మదిన్ యోచింపఁగా నట్టిదో

—యేలూరిపాటి లక్ష్మీసరస్వతి.

విదితంబేగద జానకీసతి ధనుర్విద్యాప్రభావంబు శా
రదపున్ దీటగు మొల్ల తెల్లమగు మీరాబాయి సంగీతము
మ్మదిశాశోభితయోగినీతిలకముల్ మైత్రేయి ముఖ్యాంగనల్

—కే. రామసుబ్బమ్మ.

మొదలన్ కస్తురిబాయి విద్యయన యేమో యే మెరుంగున్ మహా
హృదయాలన్ కదలించు ధీగురుడు గాంధీశుండు బోధించగా
నెదిగెన్ జ్ఞానశిఖాకలాపము సముజ్జృంభద్ద్యుతిస్ఫారమై

—ఆరాధ్యుల వేంకటసుబ్బలక్ష్మి.

మొదటన్ తల్లులు దండ్రులున్ ముదముతో ముద్దారు ప్రాయంబులన్
చదువన్ వ్రాయగ శిక్షలందునుచుచున్ సంరక్షణల్ సేయగా
పిదపన్ భర్తలు తత్కళామహిమలన్ పెంపొందగా జేయుచో

—ఆతీ సూర్యకాంతం.

చదువన్నేర్తురు భారతాదివిలసత్సాహిత్యసద్గ్రంథముల్
కదలింపన్గలరే యొడండనయినన్ గానామృతంబొల్కుచున్
హృదయానందముగాక చిత్రరచనల్ సృష్టించు ప్రజ్ఞాన్వితల్

—భాగవతుల వేంకటజోగమాంబ.

☞ దోషబాహుళ్యమున పెక్కు పూరణములు విడనాడబడినవి.

—సంపాదకుడు.



దసరాపండుగ:—

"చిరకాలముక్రిందట నీభరతభూమి మహారణ్యముగానుండి అక్కడక్కడ చాలతక్కువసంఖ్యగల మానవులుండియుందురనియు, క్రమక్రమముగ మానవులసంఖ్య యితరప్రాంతములనుండివచ్చినవారిచే నెక్కువగమారి క్రమాభివృద్ధినొందినదనియు బహుజనాభిప్రాయము. అట్టికొద్దిసంఖ్యగలిగిన మానవరాశి యీభారతభూమి నున్నకాలమున స్వోదరభరణమునకై యితరజీవముల క్రూరముగజంపి, భక్షించు నెన్నియో బలాఢ్యమగు ప్రాణులుండెననియు నాప్రాణులనే రాక్షసులనియు, పిశాచములనియు జెప్పుచుండిరనియు ప్రసిద్ధము. ఇట్టి హింసాతత్పరతగల ప్రాణులలో మహిషాసురాదులు గొప్పవారనియు వినుదుము. ఈమహిషాసురాదుల ఘోరహింసాకృత్యమున కోర్వజాలక లోకహితమును గోరు దయాతత్పరులగు మహర్షులక్కాలమున, నాయారాక్షసుల బాధ తొలంగుటకు భగవతియగు మహాశక్తిని ప్రార్థింప శుద్ధదయాతరంగిణియగు నాకాళిక భక్తుల మొఱనాలకించి ప్రసన్నురాలయి ప్రత్యక్షరూపమున నావిర్భవించి మహాదుష్టులగు నామహిషాసురాదుల సంహరించి శాంతిగుణుల కానందమొసగి, అహింసాతత్త్వముయొక్క జయమును ప్రకటించి, లోకమునకు గొప్పహితము నొనర్చెను. ఆదినములలో నాశ్వయుజ శుద్ధపాడ్యమి మొదలు సప్తమివరకు ఋషులచే మహాకాళి ప్రార్థింపబడెననియు, అష్టమిరోజున దుర్గ ప్రత్యక్షమయ్యెననియు, నవమిని రాక్షససంహారమొనర్చెననియు, దశమి శాంతిమూర్తులకానందోత్సవము జరిగెననియు జెప్పబడును. అందుచేతనే యాచరిత్రస్మరణమునకై పాడ్యమిరోజుననే కలశస్థాపనమొనర్చి దుర్గారాధన ప్రారంభించుచుండుట నేటివఱకు గనుగొనుచుందుము. అష్టమిని దుర్గాష్టమియనియు, నవమిని మహానవమియనియు; దుర్గప్రత్యక్షత, మహాకార్యనిర్వాహణతలనుబట్టి ప్రసిద్ధము. దసరాయని జెప్పబడు పండుగదినము ఆపూర్వకాలపు శాంతప్రాణుల సౌఖ్యస్మరణముగ నిప్పుడును మనమందరము వేడుకతో నెన్నియోవైభవములు జరుపుకొనుచుందుము. ఇట్టిపదిదినములును, స్త్రీస్వరూపమున లోకహితము నొనర్చిన మహాకాళీదేవి ప్రసన్నదినములుగాన మనసమాజమంతయు ఏకదీక ధ్యానముతో దేవీపూజ యొనర్పదగిన సమయమని విన్నవించుచున్నాను."

—వీరపనేని సుశీలాదేవి.

విద్యావతుల ఉద్యోగములు:—

"ఆధునికకాలమున అంకురించిన నవీనాశయములు నవభారతావనిని నాశమొనరింపనచ్చునేమోయను నంతటి భీతిఁగొల్పుచున్నది. పాశ్చాత్యనాగరికతామహద్వీచికలచే త్రిశంకుస్వర్గమువలె అంతరాళమున నుఱ్ఱూతలూగుచు దేశము విపరీతాశయముల నభిలషించుచుండుట పరిపాటియైనది. ఇపుడిపుడు కొందరు సోదరీ

మణులు పురుషులతోబాటు స్త్రీలకుసహా సేవకోద్యోగములు కావలయుననుటయు, పురుషుల కేవిషయమునను తీసిపోని స్త్రీలు పురుషు లుద్యోగములు చేయుచుండ తాము వంటింటకూర్చొనుట గౌరవలోపమనియో లేక స్త్రీపురుషసమత్వహక్కునకు లోటువచ్చుననియో తమతమ ఉన్నతభావములను చంపుకొని, వినిర్మలహృదయాకాశములందు తావుగొన్న జాతీయాదర్శములకు స్వస్తిచెప్పి, పాశ్చాత్యవ్యామోహమారుతముచే నల్లాడుచు సేవకోద్యోగములకై తడవులాడుట కాలపరీక్షయో, దేశదౌర్భాగ్యమో, తోచరాకున్నది. మహాత్మాగాంధి గారివంటి లోకోత్తరుని మన్ననలచే ప్రీతిపాత్రలగన్న హిందూమహిళామణులు నేటిరాజకీయరంగమునందసమానసాహసధైర్యములు కనబరచి దేశదాస్యవిమోచనమునకు తమ సర్వస్వము నర్పించుచున్న మేటి ధీరలగు తోడిసోదరీమణులను గనియైనను సిగ్గుజెందవలయును. పురుషులతోబాటు సమానమైనహక్కు మనకు ప్రాచీనకాలమునందే కలిగియుండ నేడది మరల ప్రసాదింపుమని పురుషులనడిగికొనుట స్వీయగౌరవానర్హముగాదా? పురాతనకాలమున స్త్రీలు పురుషులతో సమానహక్కు కలిగియుండిరనుటకు గార్గీ, మైత్రేయీ సులభ మున్నగు నారీమణులచరిత్రములు ప్రబలనిదర్శనములు. ఆర్థికసాంఘికరాజకీయనైతికవేదాధ్యయన పండితప్రసంగవిషయానుగుణ్యమైన మహాసభలయందు విదుషీమణులు పాల్గొనుచు జగద్విఖ్యాతకీర్తిని గడించి సర్వజనామోదమునందుట సుప్రసిద్ధము. మనహక్కులన్నియు మనహస్తములందేయున్నవి. మనకోరులు ప్రసాదించవలసినవి లేశమాత్రమునులేవు. మనము గృహలక్ష్ములము. సర్వస్వాతంత్ర్యములు కలిగియున్న గృహరాణులము. సర్వము మనచేతులందిడుకొనియు సమానభాగస్వాములనదగు వ్యక్తులను 'భవతీభిక్షాందేహి' అని యాచించుట మహిళాజనమండలికి గలకీర్తిప్రతిష్ఠాత్మగౌరవాదులకు తీరనికళంక మాపాదించుకొనుటగాదా? అదియట్లుండ పురుషులకే చాలినన్ని ఉద్యోగములులేక అల్లాడుచుండ ఇక స్త్రీలుసహిత మాయుద్యోగములకు దేబెరింప రొట్టెకిక్లిష్టపరిస్థితుల నెదుర్కొనవలసివచ్చునో మీరే యూహింపుడు. ప్రతిసంవత్సరము పాఠశాలందు నూర్లకొలది విద్యార్థులు తయారై సేవకావృత్తికై ఇతరులపంచల నాశ్రయించితిరుగుచు యే గుమాగానో తమజీవితసర్వస్వము తమ పొట్టకూటికొరకు అమ్ముకొనుచున్నారు. నాడు పోతన వచించిన వాక్యరత్నములైనను వీరల కర్ణరంధ్రములజొచ్చి దృక్పథమునబడి ఆచరణమునకు రాజాలకుండుట విచారణీయాంశము. ప్రతిసంవత్సరము ఉద్యోగములనువాంఛించు యువకులసంఖ్య లెక్కకు మిక్కుటమగుచున్నది. ఉద్యోగస్థానములా మిక్కిలి తక్కువ. నూటికి ఒకటిరెంటికన్న యెక్కువదొరుకుట దుర్లభము. ఇట్లు పురుషులకే చాలినన్ని యుద్యోగములులేక కడునిడుమలగుడుచుచుండ స్త్రీలుసహిత ముద్యోగవాంఛితోవిద్య నార్జించి సేవకత్వమునకు పూనుకొనునెడల యిల్లుగుల్లయై, దేశమల్లరియై యెన్నికష్టముల నెదుర్కొనవలసివచ్చునో తెలపోయుడు. ఇట్లని స్త్రీ లుద్యోగములుచేయజాలరనియు, చేయుటతప్పనుభావమునను నేను వ్రాయలేదు. స్త్రీలు ఉద్యోగముచేయుటేకాదు, ఉద్యోగముల నిలుపజేయు నిర్వహణశక్తియందు సహితము పురుషులకేనాడును వెనుకంజవేయరనుట అతిశయోక్తి కానేరదు. ఎట్లన ఉద్యోగనిర్వహణమునకు ముఖ్యాంగములైన దయాశాంత్యాదిసుగుణములు మాతృస్వాభావికములగుట స్త్రీ పురుషునికంటె చక్కగా నిర్వర్తింపగలదు. రాజ్యములుపాలించిన రమణీమణుల సుచరిత్రములే ఇందుకు తార్కాణములు. స్త్రీలు యెప్పుడుగాని ఉద్యోగకాంక్షతో విద్య నభ్యసింపరాదు. తమజాతి పురోభివృద్ధికి దోహదమొనర్చునట్టియు, భారతజాతీయాదర్శములకు అడ్డురానట్టియు, భావిసంతానమును సుశిక్షితముగా నొనర్చునట్టియు, గృహలక్ష్ములను నామమును సార్థకపరచునట్టియు, గృహోపకరణముల నలవరచుకొనుటకు ముఖ్యముగా కావలసినట్టియు విద్యాపద్ధతులనే భారతరమణీయమణు లార్జింపవలయునుగాని స్వార్థమునకై యే సేవకావృత్తికైనను పూనుకొనరాదు. అట్లని యేవృత్తియందును స్త్రీలు ప్రవేశింపవలదనికాదు. మన దేశమునకు, మన జాతికి అవశ్యము

కోమలపీఠములంటి గౌరవప్రధానములగు ఉపాధ్యాయ, వైద్యవృత్తులందు స్త్రీలు అధికసంఖ్యాకులుగా ప్రవేశింపవలయును. ఉపాధ్యాయినీవృత్తి మిక్కిలి విశాలాశయములతో గూడుకొన్నది. ఇంచుకంతయును స్వార్థాభిలాషలేక తమజీవమూల్యకాలమునెల్లను విద్యార్థుల సుశిక్షితులుగానొనర్చుటకై సేవాదీక్షను వినియోగించినచో మన కష్టములన్నియు క్షణమున మటుమాయములైపోయి భావిసంతతిని యెట్టి ఉత్తమవిజ్ఞానధనులను దేశభక్తిపూరితులనుగా తయారుచేయఁగలమో తిలకింపుడు. నిష్కామసేవచేయు ఉపాధ్యాయినులు తమకును విద్యార్థులకునుగల పరస్పరసంబంధకర్తవ్యతాబాధ్యతలను గుర్తించి బాలబాలికల కోమలహృదయక్షేత్రములయందు పవిత్రవంతములగు బోధనాక్షరబీజములను గాఢముగ నాటినయెడల తమ స్వార్థవిరహితదైవసేవఫలోన్ముఖమై సువర్ణఫలములను దేశజననీపాదకమలములకడ నర్పించవచ్చును. ఇక వైద్యవృత్తిని గురించి యించుక చర్చింతము. పవిత్రవంతమైన వైద్యవృత్తి గొప్పబాధ్యతతోఁ గూడుకొన్నది. లేశమైన స్వార్థాభిలాషలేక యీ మహత్కార్యమునకు ఉద్యుక్తులైనవారలు పూజ్యులు. రోగియొక్క జీవితాశయములన్నియు వైద్యునిచేతులయం దిమిడ్చి ఉత్తమఫల మాకాంక్షించుచుండును గాన వైద్యుడు స్వలాభవిరహితాశయముతో ప్రజాసేవకు గడంగవలయును. తమ కాలమంతయును దేశప్రజాసేవకై వినియోగపెట్టువారలె ఈ వృత్తులయందు ప్రవేశించి స్వార్థరహితమైన సేవ యొనర్చినయెడల తమ కీర్తిచంద్రికలు దిగంతవిరాజమానములై మహిళాలోకమున కెక్కుడు మేలొనర్చినవారలగుదురనుట సత్యదూరము కానేరదు. దుర్భరవైధవ్యబాధచే గుందుచు హతాశలగు సోదరీమణులు ఈవైద్యవిద్యనార్జించి తమజీవితసర్వస్వమును, అమూల్యావకాశమును మహిళాప్రపంచసేవకై ధారవోసి అధఃపతితముగానున్న భారతావనిని సముద్ధరించి చరితార్థులు కాగోరెదను. ఈవ్యాససారాంశభాగద్వయ మచిరకాలమున కార్యరూపమున వర్థమానమై వెలయఁజేయుటకు పరమేశ్వరానుగ్రహము ప్రసాదింపబడుగాక."

—కె. రామసుబ్బమ్మ.

బాలికాపాఠశాలలు: నీతిపాఠములు:—

"ప్రాచీనప్రబంధములలోని స్త్రీల వర్ణనావిషయమునఁగానీ తత్సంబంధములగు విషయవివరణములవల్లఁగానీ యాకాలమున స్త్రీ లెంతయు విద్యావతులని యవగతమగుచున్నది. సీత, సావిత్రి మొదలగు వనితలంతటి సచ్ఛీలవతులుగనుండుటకుఁ గారణము వారు విద్యావతులగుటచేతనేయనుట స్పష్టము. సావిత్రిని తండ్రి 'చిత్రాశ్వ డల్పాయుష్కుఁడు, అతనిని గాక వేరొకనిని వరింపు'మని బ్రతిమాలినప్పుడు సావిత్రి పలికిన యుక్తియుక్తములగు వచనములు, ఆమె వివరించిన ధర్మసూక్ష్మములు పండితులకును దెలియరానివి. అట్టి విజ్ఞానమామె విద్యావతియగుటచేతనే కలిగినది. అట్లే మునిపత్నులు మొదలగు నితరస్త్రీలును విద్యావతులనుటకు మన కనేకతార్కాణములు గాన్పించుచున్నవి. నాఁటి వనితలకు నేఁడువలె విద్యోపార్జన కవకాశము లంతగ లేకున్నను విద్యావిషయమున వారి జననీజనకుల కంతటి పట్టుదలయున్నది గావుననే యెట్లో విద్య నేర్పించిరి. సామాన్యముగ బ్రాహ్మణులందరు పండితులేయైయుండిరిగాన వారింటికడ నేర్చుకొను శిష్యులతోఁబాటు బ్రాహ్మణబాలికలుసైతము విద్య నేర్చుకొనెడివారు. మిగిలిన జాతులలో ధనవంతులు పండితుల నింటికడ నియమించి తమతనయలకుఁ జదువు చెప్పించెడివారు. ధనికులుగానివారుసైతము వారివారి విద్యాభిలాషననుసరించి భాషాజ్ఞానమలవరచుకొనెడివారు. ఇంతయేల? పాఠశాల లత్యధికముగ లేనికాలమున స్త్రీలు చదువుకొనినఁ బాడైపోదురు, చెడునడతలు గలవారగుదురు అను మూర్ఖపుటాచారముచే గ్రుడ్డితనముగ విశ్వసించి బాల్యవివాహములు చేయుచు లేనిపోని మోటపనులను ముక్కుపచ్చలారని బాలికలచే చేయించెడికాలమున జననమందిన స్వర్గవాసిని శ్రీమతి భండారు అచ్చమాంబగారు విద్యోపార్జనమెట్లు చేసి

కొనెనో యాంధ్రదేశ మెఱుఁగకపోలేదు. అత్తవారింటికిఁ దవ తమ్ముని దీసికొనివెళ్లి యాతనిపాఠము నే
తను రాత్రులందుఁ జదివి యెంతటి ప్రతిభావతియాయెనో యామె రచించి ప్రకటించిన "అబలాసచ్చరిత్ర
రత్నమాల"ను తిలకించిన తేటతెల్లముగాఁగలదు. "స్త్రీలయొక్క స్వాభావికప్రవృత్తి సద్గుణములవైపునకే
గాని దుర్గుణములవైపునకుఁగాదని సిద్ధాంతీకరించుట నా ప్రథమోద్దేశములలోని యుద్దేశమే" యను నా
విశాలహృదయముగల విజ్ఞానవతి తలంపులెంతయు నభినందనీయములు. పైఁజెప్పినవిధముగ విరివిగఁ బాఠశాలలు
లేనికాలమునసైతము స్త్రీలు విద్యోపార్జనముచేసి సద్గుణములుగలవారై యుండిరి. ప్రస్తుతకాలమున నట్లుగాక
పాఠశాల లూరూర రెండు, మూడు కూడనున్నవి. ప్రత్యేకము బాలికలకే పాఠశాలలున్నవి. ఉన్నతతర
గతులు చదువుటకును, కళాశాలలోఁజదివి పట్టభద్రులగుటకునుగూడ స్త్రీల కీకాలమున నవకాశములు మిక్కి
లిగ నున్నవి. ఈ పాఠశాలలు ద్వివిధములుగ నిపుడు ప్రచాలనములోనున్నవి: ప్రజాపాలితములు, ప్రభుత్వ
పాఠశాలలు. ప్రభుత్వపాఠశాలలలోని విద్యాప్రణాళిక బాగులేకపోవుటవల్ల, నూతనమగు ప్రణాళిక నొక
దానిని విద్యాధికులు తయారుచేసి స్త్రీవిద్యాశాలలను కొన్నిటిని నెలకొల్పినారు. కాని యేకారణముచేతనో
యవి ప్రారంభింపఁబడిననాఁ డున్నంతటి యుత్సాహమును, తేజమును గోల్పోయినవని మనవిచేయవలసివచ్చి
నందులకెంతయు విచారము. దీనికిఁ గారణములు పెక్కులుగలవు. నిర్మాతలు కొన్ని యాదర్శములుగలవారే
యయ్యు నుపాధ్యాయులను నియమించుటలోని లోపము కొంత, పాలనములోని లోపము కొంత, అన్నిటి
కంటెను మించిన ధనలోపమును గారణము. ప్రభుత్వపాఠశాలల కట్లుగాక ధనము మిక్కిలిగనుండుట
చేతను, బరిపాలనము బాగుగనుండుటచేతను నందలి విద్యావిషయము లెట్లున్నను పాఠశాలలు సక్రమముగ
ప్రచలితములగుచున్నవి. ప్రతి పాఠశాలయందు బాలికలకు నీతిగరపుట యొక ముఖ్యోద్దేశమై యుండవలెను.
ప్రజాపాలితపాఠశాలలందు నీతివిషయమై యేవైన ప్రార్థనలు లేక పద్యములు మొదలగునవియేకాని ప్రత్యేక
ముగా నీతివిద్య నేర్పు నియమమున్నట్లు గాన్పింపదు. దినమునకు ఒకగంటయైన నీ నియమముండవలెను.
ప్రభుత్వపాఠశాలలలో నీతిబోధనము నియమితముగనుండును. కాని సామాన్యముగ పాశ్చాత్యపద్ధతుల
పైన నేర్పుండును. కళాశాలలందు బైబిలు నియతముగఁజెప్పుదురు. ఇట్టి పాశ్చాత్యసాంప్రదాయముల ననుస
రించియే బాలికాపాఠశాలలందును నీతిగఱపినచో బాలికలకుపలయు శీలముగల్గుట కవకాశములేదు. కాన
ముఖ్యముగఁ బురాణాదులందలి కథలను, పతివ్రతలచరిత్రములను జెప్పుచుండవలెను. ఆచెప్పునది బాలికల
కుత్సాహకరముగను సంతోషకరముగను ఉండవలెను. భగవద్గీతలను జదువునట్లు చేయవలెను. బాలికాపాఠశాల
లందు పురాణకథలను చెప్పునట్లు చేయవలయును. ఎట్లును పాఠశాలలలో బండితు లుందురుగాన వారిచే భగవ
ద్గీతాశ్లోకములలోని విషయములను దేటతెల్లముగను, సుబోధకమగునట్లును చెప్పించి స్త్రీలయొక్క ప్రాచీన
గౌరవమును, నాగరికతను, ప్రాచీనతేజమును తిరిగి నిలుపవలయును."

—గండికోట సావిత్రీదేవి.

సావిత్రీ చంద్రమతీ దేవులయందలి భేదము:—

"శ్రీ సావిత్రీదేవి మద్రరాజతనయ. శ్రీవేదసావిత్రీమహాదేవియొక్క వరప్రసాదిని. త్రిలోకసుందరి.
శాంతశమదమాదిగుణపుంజము. పతివ్రతాశిరోమణి. ఈమె బాల్యమందే రాజ్యచ్యుతుడైన సాళ్వభూపాల
తనయుడును సత్యవ్రతుడును వయోలావణ్యవిద్యామనోహరుండగు సుగుణాలంకృతుడును అగు సత్యవం
తుని త్రికరణశుద్ధిగావరించి పిదప అల్పాయుష్కుడని తెలిసినను, జననీజనకులు వలదని వారించినను నిశ్చల
చిత్తయై సత్యవంతునే పరిణయంబాడె. భర్తృసన్నిధానమగు కాననమునగల అంధులైన అత్తమామల సేవలచే
సంతృప్తులచేయుచు పతి చరణారవిందధ్యానముననే ప్రొద్దులుపుచ్చుచు పతి సేవాతత్పరయై ఇంటగల



శ్రీమతి దరిశి అన్నపూర్ణమ్మగారు



శ్రీమతి ఆచంట లక్ష్మీదేవిగారు



శ్రీమతి బొడ్డు సీతామహాలక్ష్మిగారు



శ్రీమతి ఇనగంటి రత్నమ్మగారు



శ్రీమతి మంత్రాల రామసీతమ్మగారు



శ్రీ. శే. అనంతగిరి సీతాలక్ష్మాంబగారు



శ్రీమతి చంద్రమణిదేవిగారు



శ్రీమతి నందివాడ శేషమ్మగారు

కృత్యములనెల్ల కడుంగడు నేర్పుతో చక్కదిద్దుచు భవిష్యత్కార్యసిద్ధికై భవానీదేవి భక్తితో నర్చించుచు దేవీప్రసాదలబ్ధమైన పాతివ్రత్యమహిమాతిశయముచే దండధరుంగాంచి కాలహస్తగతములైన పతిప్రాణముల కొఱకై యాతని యాచించి ప్రాణంబులబడయజాలక పాతివ్రత్యప్రభావమువలన వరత్రయమునుపొంది ధైర్యమునువిడువక మూర్తీభవించిన పాతివ్రత్యమోయన మహాభయంకరమగు యమపురికేగి యమునిప్రసన్నునిగా జేసికొని పతిప్రాణములబడసిన పతివ్రతాతిలకము. చంద్రమతీదేవి సార్వభౌమపత్ని. సత్యైకవ్రతులలో నొకడగు సత్యభాషాహరిశ్చంద్రునిసతి. వీరలకు లోహితాస్యుండను నొక కుమారుడుగలడు. వీరు విశ్వామిత్రప్రతిజ్ఞాకారణమువలన పలుకష్టములకు లోనైరి. ఈమె మహాసాధ్వి. భర్తఆజ్ఞానువర్తిని. ఈమె ఓర్పునకు వసుంధర. శాంతమునకు శ్రీదేవి. విశ్వామిత్రుని యాగధనార్థమై భర్తచే నొకబ్రాహ్మణునకు అమ్మబడి వానియింట బహుబాధలకోర్చి తుదకు తన అనుంగుపుత్రుని గోల్పోయి, ధనాభావమువలన శ్మశానపాలకునిచే నిందింపబడి పిమ్మట రాజాజ్ఞవలన భర్తచే నరుకబడి తన పాతివ్రత్యమహిమచే వాల్వేటు పుష్పమాలికకాగా తుదకు శ్రీమదుమామహేశ్వరి కటాక్షమును బొందిన మహాసాధ్వి. పతి ధనహీనుడని తెలిసి వరించినది సావిత్రి—సార్వభౌముని భార్య చంద్రమతి—వరుడు అల్పాయుష్కుడని తెలిసియు మనస్సును మరలింపలేదామె—భర్త తన్నమ్మినప్పటికి భర్తయం దలుకుపూనని సాధ్వీమతల్లి ఈమె—అట్టివాని వివాహమాడి మహత్తరమైన దారిద్ర్యకష్టములకులోనై భర్తృపదారవిందసేవయే పరమావధిగనెంచి ఇంచుకేనియు మనశ్చింతలేని మహారాజపుత్రి—తనను కొనిన విప్రునింట దాసియై భరింపశక్యముకాని కష్టపరంపరలకోర్చిన సార్వభౌమపత్ని—సావిత్రి అరణ్యమధ్యమున విగతజీవుడైన భర్తనుగాంచి భయశోకాకులితచిత్తయై తిరిగి ధైర్యమవలంబించి భగవతీకటాక్షవిశేషంబువలనను స్వకీయపాతివ్రత్యమహిమాతిశయంబువలనను ధర్మరాజహస్తగతంబైన పతిప్రాణంబులబడసిన ధన్య—చంద్రమతి పుత్రశోకాకులితచిత్తయై అర్ధరాత్రమున శ్మశానమునకేగి అందలి కాపరియైన భర్తను తెలిసికొని డబ్బులేమిచేత కృత్యము నెఱవేర్చుకొనజాలక పదంపడి రాజదండనకులోనై శ్మశానకాపరియైన తనభర్తచే నఱుకబడుసమయమందును భర్తయం దించుకేనియు యీర్ష్యనొందక పతి చరణారవిందధ్యాయినియై నిశ్చలచిత్తయై తనదైన పాతివ్రత్యప్రభావముచే భరతవర్షపరిపాలకులైన ఆకాశీఅన్నపూర్ణావిశ్వేశ్వరుల ప్రసాదమునకు పాత్రురాలైన మహిళామతల్లి. వీరుభయులలో సావిత్రీదేవి తెలిసియుం గొని తెచ్చుకొనిన కష్టములుగలది. తమంతట సంప్రాప్తములైన కష్టపరంపరలకోర్చినది చంద్రమతీదేవి. ఇదియే వీరిద్దరిలోగల భేదము. పాతివ్రత్యమహిమాతిశయమునకు ఇరువురు సమానులే."

—చదలవాడ ధర్మరాజుసతి.

## వ్యాసములు వ్రాయువారికి

గృహలక్ష్మికి వ్యాసములు వ్రాయువారు కొంచము మార్జనువదలి కాగితమునకు ఒకతట్టు నసే సిరాతో విడివిడి అక్షరములతో వ్రాయవలెను. పెన్సిలుతో వ్రాయబడినవియు కాగితమునకు రెండుప్రక్కల వ్రాయబడినవియునగు వ్యాసములు చేకొనబడవు. వ్యాసములను గూర్చి ప్రత్యుత్తరములు కోరువారు రిప్లయికార్డు వ్రాయవలెను. వ్యాసములు వాపసుకోరువారు తపాలాబిళ్లలు పంపవలెను. వ్రాయు ప్రతిలేఖయందును తమ చిరునామా పూర్తిగ నిచ్చుచుండవలయును.

—సంపాదకుడు.




### ప్రపంచములో మిక్కిలి చిన్న బిడ్డ:—

ఆఫ్రికాఖండమున ప్రిటోరియానగరమున విడ్డూరమగు చిన్న పసిబిడ్డ జన్మించినదట. ఆమె పేరు మేరీ. ఆఫ్రికాయందు వలస నెలకొన్న హిందూదంపతుల సంతానము. ఆబిడ్డ జన్మించి కొలదివారములే యైనది. ఆమె మిక్కిలి సూక్ష్మరూపమునుండుటచే సాధారణముగ పసిబిడ్డలు త్రాగుపాలబుడ్డి ఆబిడ్డ పాలుత్రాగుట కనుకూలించదు. ఆసుపత్రిలోని దాదు లాబిడ్డకై ప్రత్యేకముగ ఆడుకొనుటకుపయోగపడుబొమ్మకు గానువిలాసార్థము త్రాగించు చిన్నసైజు పాలబుడ్డి నుపయోగపరచుచున్నారు. ఇప్పు డీమేరీ యేడునెలలబిడ్డ. పుట్టినప్పు డతిసూక్ష్మరూపముతోనున్న యీబిడ్డను తూచుటకు త్రాసుపళ్లెములోనుంచినచో వత్తుడు కలుగునేమోయని వారాబిడ్డను తూచనేలేదు. పదునాలుగుదినములు జరిగినమీదట ఆబిడ్డనుతూచగా మూడుపౌనుల బరువుండెను. ఆబిడ్డ దూదిపొత్తులలోనుంచబడి ఆహారమునకై సెలైన్ ఇన్‌జక్షన్ యివ్వబడుచున్నది. బలవర్ధనమునకై బిడ్డశరీరమునిండ అవిశెనూనె రాయబడుచున్నదట. ఆ యవిశెనూనె బిడ్డ చర్మరంధ్రములగుండ యింకి బిడ్డకు పుష్టికల్గించును అని నమ్మబడుచున్నది.

### ఏడు మైళ్ల యీతపందెమున పదునొకండేండ్ల బాలిక నెగ్గుట:—

ఈమధ్య కలకత్తాయందు ఆనందాస్పోర్టింగు క్లబ్బువారి యాజమాన్యమున జరిగిన యీతపందెమున యిరువదియిద్దరు పోటీచేసిరి. అందు పదునెనమండుగురు యీదివలసిన నిర్దేశస్థలమును చేరిరి. ఇట్లు చేరిన వారిలో మొదటియామె శ్రీమతి అనుపమశీల అను వంగదేశబాల. పదునొకండేండ్ల చిన్నది. ఈమె 51 నిమిషములలో నిర్దేశింపబడిన 7 మైళ్లదూరమును ఈది ప్రథమబహుమతి బడసెను.

### ఒకానొక స్త్రీయొక్క విద్యావైచిత్రి:—

మేరీ ఫీల్డుకన్య అను ఆంగ్లస్త్రీ జంతువుల విచిత్రకృత్యములను ఫిలుమునకెత్తుటయం దమిత యభిలాష గలది. వీనిని ఫిలుమునకెత్తుటలో చిత్రసౌందర్యమేకాక జ్ఞానవ్యాపకదృష్టియు ఆమెకు గలదు. ఆమె తీసిన ఫిల్ములలో నిదియొకటి: ఒకపోతుసాలిపురుగు చక్కనిగూడును అల్లి అందొకయీగనుపట్టి దానిని తాను తినక తాను ప్రేమించిన ఆడుసాలీడునకు ఇచ్చుట. రెండవది: ఆడబాతు తానుబట్టిన జలచరమును ఈదికొని తీసికొనిపోయి తనప్రియున కర్పించుట. మూడవది: ఒకానొకతల్లిపక్షి తనపిల్లనోటికి ఆహారమునందిచ్చుట. జంతువుల విచిత్రచర్యలను ఫిల్మునకు ఎత్తుటలో ఈమె సాటిలేని ప్రఖ్యాతిగడించెను.

## తప్పిపోయినభర్త సినిమాలో దొరుకుట:—

1899-వ సంవత్సరము మేమాసమున ఎడ్విన్ రోబాలిన్స్-సైనికవృత్తి నవలంబించినవాడు-విన్‌డ్సర్ నందలి ట్రినిటీచర్చియందు వివాహము చేసికొనెను. జూన్ మాసమున అతడు దేశాంతరగతుడయ్యెను. వత్సరములుగ అతనియొక్కభార్య అతనికొఱకు అన్వేషించుచుండెను. జాడజవాబులేదు. ప్రాణముపిసిగి రోబాలిన్స్‌సతి ఈవిషయమును కోర్టునకెక్కించెను. అతడు మరణించియుండునని 1904-వ సంవత్సరమున మేమాసమున కోర్టువారు నిర్ణయించిరి. 25-సంవత్సరములు గడచిపోయెను. 1929-వ సంవత్సరమున ఏప్రిల్ మాసము రోబాలిన్స్‌సతి లండనుకువచ్చెను. అచ్చట ఒకసినిమాలో ఒకానొక అమెరికనుఫిల్ము ప్రదర్శింపబడుచుండగా ఆమెపోయెను. ఆఫిలుములందొకపాత్ర అచ్చముగ తనభర్తవలెనుండెను. ఇంకను పోల్చుకొనుటకై ఆమె ఆఫిల్మునే మరిరెండుసారులు దర్శించెను. అనుమానముతీరెను. 30 సంవత్సరములక్రితము తప్పిపోయినభర్త ఇట్లు దొరికెను. అది సైనికులకు సంబంధించిన ఫిల్ము. వాషింగ్టనునందలి సైనికశాఖవారికి వెంటనే ఈవిషయమై వ్రాసెను. విచారణ సలుపబడెను. ఆమెకు భర్త దొరకెను.

## ఒక్కఏడాదిలో ఏబదివేల ఆత్మహత్యలు:—

తలచినకార్యము నెరవేరకపోగా ఆత్మహత్యలు చేసికొన తలపెట్టినవారిసంఖ్య అమెరికాసంయుక్తరాష్ట్రములందు 1930-వ సంవత్సరమున ఏబదివేలు. ఈ ఏబదివేలలో ఇరువదివేలమందిమాత్రము తాము తలచిన ఆత్మహత్యలో కృతకృత్యులైరి. మిగిలిన ముప్పదివేలమందియు ఆత్మహత్యలో విఫలమనోరథులై దానికితోడు ఆత్మహత్యాప్రయత్నములో గలిగినవికృతరూపముతో విషాదజీవితమును నెట్టుచున్నారు.

## తిమింగలముకడుపులో దొరికిన దివ్యధనము:—

ఆఫ్రికాలోని తిమింగలములనుపట్టుకంపెనీకి చెందిన కాప్టెను ఇంగుబ్రయిట్‌సన్ ఈనడుమ నొకతిమింగలమును పట్టుకొనెను. ఇది మామూలుతిమింగలములకంటె నూరురెట్లు ఎక్కువ ఖరీదు తేగలుగునని ఊహింపబడుచున్నది. ఒక్కొక్క తిమింగలము కొవ్వునుండి తయారుచేయబడునూనె ఖరీదు 400 పౌనులు దాదాపు ఉండును. అనగా సాధారణపు తిమింగలము 400 పౌనులఖరీదన్నమాట. కాప్టెను ఇంగుబ్రయిట్‌సన్ పట్టిన ఈతిమింగలము 40,000 పౌనులకంటె హెచ్చువెల తేగలుగును. సాధారణపుతిమింగలములకంటె ఇది పెద్దదియు గాదు, దానికంటె ఇది హెచ్చుకొవ్వుకలదియు లేదు. దీనికడుపునందు సమమైనఆకారములేని పసుపురంగుగలముద్దయుండెను. దానితూకము ఒకహండ్రెడువెయిటు. ఆపదార్థమును ఆంగ్లమున యాంబర్‌గ్రిస్ (Ambergris) అందురు. అది ప్రపంచమున హెచ్చువెలగల పదార్థములలో నొకటి. అది ఔన్సు 20 పౌనులు. బంగారముకంటె అయిదురెట్లు ఎక్కువవెలగలదియన్నమాట. దీనిని అత్తరువర్తకులు విస్తారము వెలకుతీయుదురు. అత్తరుయొక్క సువాసనను శాశ్వతముగ నుంచుగుణము దీనికిగలదు. ఇట్టిది ఇంతవఱకు ఒకటిరెండుసారులు మాత్రము దొరికినది. తిమింగలములుతిను Cattle-fish (ఒకవిధమైన చేప) యొక్క జీర్ణముకాని ముట్టెవలన ఇది ఏర్పడునని ఊహింపబడుచున్నది.

## ఒకబాలికసాహసకృత్యము:—

11 సంవత్సరముల నాలుగుమాసముల వయస్సుగల ఒకబాలిక 15780 అడుగుల ఎత్తుగల బ్లాంకుపర్వతము నెక్కెనని లండనువార్తలు తెలుపుచున్నవి. ఇదివరలో 40 సంవత్సరముల క్రిందట $11\frac{3}{4}$ సంవత్సరములుగల ఒకబాలుడు ఈపర్వతమునెక్కెనట. ఈ బాలిక ఆబాలుని మించెను.

# డైరి

## ఆగష్టు

20:—సంయుక్తరాష్ట్రములలో గోండా, భారయిచుజిల్లాలో భూమిశిస్తులను వసూలుచేయు సందర్భమున ఉద్యోగులు స్త్రీలను అతిదారుణముగా బాధించిరని పండిత మాలవ్యాగారు కొంతకాలముక్రితము రాష్ట్రీయదొరతనమువారికి వ్రాసిరి. "ఈవిషయములనుగూర్చి దొరతనమువారు విచారణ చేయుచున్నారు" అని దొరతనమువారు మాలవ్యాగారికి వ్రాసిరి.

21:—

22:—శ్రీయుత డాక్టరు శివరాజు రామారావుగారి తల్లియగు సుబ్బమ్మగారు ధవళేశ్వరమున ఉపన్యసించిరి.

23:—రాజమండ్రి హితకారిణీసమాజమువారి యాదరణమున వితంతుశరణాలయబాలిక శ్రీమతి లక్ష్మీనరసమ్మగారికిని అనకాపల్లివాస్తవ్యులగు శ్రీయుత అయ్యలసోమయాజుల రామమూర్తిగారికిని వివాహమహోత్సవము ఆనందాశ్రమములో జరిగెను.

24:—

25:—శ్రీమతి హొన్నమయాంజిలోగారి నాయకత్వముక్రింద కాంగ్రెసువాలంటీరులు సైదాపేటలో సారాదుకాణములవద్ద పికెటింగుచేసినందులకు వారుఅక్రమప్రవేశముచేయుట, అక్రమనిరోధమునకలిగించుట, అల్లరిచేయుట మున్నగు నేరములుచేసిరని వారిపైని సైదాపేటసబుమేజస్ట్రీటుకోర్టులో కేసుచేయబడెను.

26:—

27:—

28:—విల్లింగ్డనుప్రభ్వీకి డింగీజ్వరము వచ్చెను. కార్యక్రమానుసారము జరుగవలసిన మీటింగులు వగైరా నిలిపివేయబడినవి.

29:—శ్రీమతి సరోజనీదేవి, భారతిభూషణములతో గాంధిమహాత్ముడు రాజపుటానాస్టీమరులో బొంబాయి నుండి సీమకుప్రయాణమయ్యెను.

30:—ఏలూరుపట్టణమున ఆంధ్రరత్న యువజనసమితి యాజమాన్యమున శ్రీమతి మద్దూరి వేంకటరమణమ్మగారు (అన్నపూర్ణయ్యగారి భార్య) నూతనపతాకవందనోత్సవము జరిపిరి.

:—మచిలీపట్టణమున శ్రీరామలింగేశ్వరస్వామివారిఆలయముయెదుట నూతన జాతీయ పతాకోత్సవము శ్రీమతి దిగుమర్తి జానకీబాయిగారిచే జయప్రదముగ జరుపబడెను.

31:—గంపలగూడెములో శ్రీమతి పాదర్తి సుందరమ్మగారు స్త్రీలసభను జరిపిరి.

## సెప్టెంబరు

1:—బరంపురమునందు హిందూస్థానసేవాదళశిక్షణపుతరగతి ముగియుసమయమున జాతీయపతాకోత్సవమును శ్రీమతి జయంతి సూరమ్మగారు జరిపిరి.

2:—చిటగాంగునోపిడులసమయమున కట్టాలీలో కొందరు మహమ్మదీయులు దోచుకొనుటకురాగా ఒక హిందూస్త్రీ ఆయుధపాణియై వారి నెదిరించెను. అంతట వారు పారిపోయిరి.

3:—ఏలూరులో శ్రీమతి వకుమర్తి సత్యవతమ్మగారి అధ్యక్షతనుజరిగిన స్త్రీలసభలో శ్రీమతులు ముల్పూరి చుక్కమ్మ, సత్తిరాజు శ్యామలాంబ, చుండూరి రత్తమ్మ, కంభంపాటి స్వరాజ్యలక్ష్మిగార్లు ఉపన్యసించిరి.

4:—నూతనముగ తూర్పుగోదావరిజిల్లాబోర్డునకు నామినేటు చేయబడిన కాకినాడవాస్తవ్యురాలు శ్రీమతి వేమగంటి పాపాయమ్మగారు అమలాపురమున జరిగిన జిల్లాబోర్డుమీటింగునకు హాజరై రాజభక్తి ప్రమాణముగైకొనిరి.

5:—

6:—మద్రాసునందలి చింతాద్రిపేటలో సమరసపన్మార్గయువక ఐక్యసంఘమునకు శ్రీమతి డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డిగారు ప్రారంభోత్సవము జరిపిరి.

7:—

8:—ఉత్కళదేశస్థురాలగు శ్రీమతి సరళాదేవిగారు ఈరోడు సభలకువెళ్లుచు కాకినాడలోఆగి హిందూస్థాని సేవాదళశిబిరమున ఉపన్యసించిరి. ఆమె హిందీఉపన్యాసమును శ్రీమతి దుగ్గాబాయమ్మగారు తెనిగించిరి.

9:—ఏలూరు పడమరవీథి మ్యునిసిపల్ హిందూబాలికాపాఠశాల వార్షికోత్సవము పాఠశాల సొంతభవనమున శ్రీమతి మూరుకన్యగారి అధ్యక్షతను జరిగెను.

10:—

11:—పోలవరమునజరిగిన మద్రాసు ఏజెన్సీవానులమహాసభలో శ్రీమతి పెద్దాడ కామేశ్వరమ్మగారు ప్రస్తుత దేశస్థితినిగూర్చి ఉపన్యసించిరి.

:—తమిళ నాడు మహిళామహాసభకు అధ్యక్షురాలుగ ఎన్నుకోబడిన శ్రీమతి సరళాదేవి, సన్మానసంఘాధ్యక్షురాలు శ్రీమతి పద్మావతిఆసరు, శ్రీమతి దుర్గాబాయమ్మ ఈరోడు చేరిరి.

12:—నెల్లూరు సంతపేటలో మురళీకృష్ణవిలాసములో స్త్రీలసంఘము నొకదానిని జిల్లాకలెక్టరు శ్రీమాన వేదన్ రాజాగారిసతీతిలకముచే స్థాపింపబడినది.

13:—దాదాబాయినౌరోజీగారి మనుమరాలు కుర్షదుబెన్ గారు సరిహద్దురాష్ట్రముల స్త్రీలనడుమ సాంఘిక సేవచేయుటకై పోయినది.

:—మదరాసు ఏజన్సీ మహిళామహాజనసభ పోలవరమున శ్రీమతి పెద్దాడ కామేశ్వరమ్మగారి అధ్యక్షతను కూడెను. శ్రీమతి చేబియ్యం పోదెమ్మగారు ఆహ్వానసంఘాధ్యక్షురాలు.

14:—

15:—రాజమండ్రి కంబాలపేటలో కోర్లమ్మగుడివీథిలో జరిగిన ఆదిఆంధ్రులసభలో శ్రీమతి తల్లాప్రగడ విశ్వసుందరమ్మగారు ఉపన్యసించిరి.

16:—బర్మాస్త్రీలు ఏడ్గురు ఐదుసంస్థలప్రతినిధులు శ్రీమతి హ్లాగంగుగారి నాయకత్వమున గవర్నరుగారిని దర్శించిరి. బర్మా రౌండుటేబిలు సభయందు బర్మాయొక్క భావిరాజ్యాంగవిధానమును నిర్ణయింపబడు సమయమున తత్సంబంధమగు చర్చలలో స్త్రీలు పాల్గొనకుండుట అన్యాయమనియు, స్త్రీలను గూడ ఈసభయందు సభ్యులుగ ప్రభుత్వమువారు నియమింపవలెననియు కోరిరి.

17:—శ్రీమతి పట్వర్ధనుసతి ఇంగ్లండుకు వెడలుటకు మద్రాసునుంచి బొంబాయికి పోయెను.

18:—

19:—సిమ్లాలో శ్రీమతులు శకుంతలాదేవి, గంధమాలసతిగార్లు క్రిమినలు ప్రొసీజరుకోడు 108-వ సెక్షను క్రింద అరెస్టుచేయబడిరి. ఒక్కొక్కరు వేయేసిరూపాయల ధరావతుమీద విడుదలచేయబడిరి. 26-వ తేదీని విచారించబడుదురు.

# శ్రీగాంధిగారి సముద్రయానములు

| నెం. | సంవత్సరము | ప్రదేశము | ఓడపేరు | విశేషములు |
|---|---|---|---|---|
| 1. | 1888 సం సెప్టెంబరు4. | బొంబాయి నుండిసీమకు. | ? | సముద్రయానమువలన తఱుచు అందఱికి వచ్చు వాంతిమొదలగు వ్యాధి రానే లేదు. సిగ్గుచే డెక్కుమీదకు రాకుండువాడు. |
| 2. | 1891 జూను 12. | సీమనుండి బొంబాయికి. | అస్సాము. | ఓడలో అందఱును అస్వస్థులైరి. సరిగా ఉన్నవాడు గాంధిఒక్కడే. డెక్కుమీదనుండి తుపానునుచూచి ఆనందించుచుండువాడు. |
| 3. | 1893 ఏప్రియలు. | బొంబాయి నుండి దక్షిణ ఆఫ్రికా నెటాలుకు. | ? | కాలవిలంబముచే మొదటితరగతి టిక్కెట్టు దొరకలేదు. బారిస్టరుగాంధి డెక్కుమీద నెక్కి ప్రయాణముచేయుటకు ఒప్పుకోలేదు. ఓడముఖ్యాధికారితో మాట్లాడి బతిమాలి మొదటితరగతిటిక్కెట్టు సంపాదించెను. ప్రయాణమున ఓడఅధికారితో గాంధి చదరంగ మాడువాడు. ఓడఅధికారి గాంధిని అతిగా ప్రేమించెను. |
| 4. | 1896. | నేటాలునుండి కలకత్తాకు. | పోన్‌గోలా. | సోదరయాత్రికుడగు ఒక ఇంగ్లీషు ఉద్యోగితో దినమునకు ఒకగంట చదరంగము. ఉరుదు, తమిళభాషల అభ్యసనము. స్టీమరు కేప్టెనుతో స్నేహము, ఆధ్యాత్మికప్రసంగము. |
| 5. | 1896 డిసెంబరు 1. | బొంబాయి నుండి నేటాలుకు. | కుర్‌లేండ్. | కిరాయిలేదు. ధర్మపత్నితో, తన ఇరువురి పిల్లలతో, స్వర్గీయుడగు తన బావగారి కుమారునితో రెండవతూరి దక్షిణఆఫ్రికాకు. కుటుంబముతో జలయాత్రచేయుట కిదియే మొదలు. ఓడకామందు గాంధికి క్లయంటు, మిత్రుడు. కావున ఆయోడలో గాంధికి స్వగృహములో నున్నట్లేయుండెను. గొప్ప తుపాను వీచెను. యాత్రికులు బెగ్గడిల్లిరి. ఇట్టితుపానులు లోగడ చూచియుండుటను, తనకు సముద్రరోగము |

| | | | | |
|---|---|---|---|---|
| | | | | రాకుండు కారణమునను గాంధి యాత్రికులలో నిబ్బరముగ తిరుగుచు కేప్టెనుసందేశములు వారి కందించుచుండెను. ఓడ డిసెంబరు పదునెనిమిదవ తారీఖుననో, పందొమ్మిదవతారీఖుననో డర్బనురేవున లంగరువైచెను. |
| 6. | 1901. | దక్షిణాఫ్రికా నుండి బొంబాయికి. | ? | ... |
| 7. | 1902. | బొంబాయి నుండి దక్షిణ ఆఫ్రికాకు. | ? | ... |
| 8. | 1914. జూలై | దక్షిణఆఫ్రికా నుండి ఇంగ్లండుకు. | ? | శ్రీమతి కస్తూరిబాయితో. దక్షిణాఫ్రికా సత్యాగ్రహ సంగ్రామదివసములలో గాంధి మూడవతరగతిబండ్లలోనే కూర్చుండి పయనముచేయువాడు. కావున ఓడలో మూడవ తరగతిటిక్కెట్టుకొనెను. ఆగష్టు 4-వ తేది యుద్ధారంభము. 6-వ ఆగష్టున గాంధి ధర్మపత్నితో సీమలోదిగెను. |
| 9. | 1915. | ఇంగ్లండు నుండి ఇండియాకు. | పి. అండ్ ఓ. | మూడవతరగతి టిక్కెట్టుకు ప్రయత్నము. ఓడలో ఆటిక్కెట్లు లేకపోవుటచే రెండవతరగతిలో ప్రయాణము. గోఖలేగారి యాజమాన్యమున బొంబాయిలో గొప్పస్వాగతము. |
| 10. 11. | 1915. | కలకత్తానుండి రంగూనుకు. రంగూను నుండి కలకత్తాకు. | ? | డెక్కుమీద. |
| 12. | 1931. ఆగష్టు 29. | బొంబాయి నుండి ఇంగ్లండుకు. | రాజాపుటానా. | మానవకోటిలో అయిదవవంతగు భారతీయుల ప్రతినిధిగా. సెప్టెంబరు 12-వ తేదీని లండనుచేరెను. |

# పత్రికాపరిచయము

**జమీందారీ రైతు.—**

నెల్లూరుజిల్లా జమీందారీరైతు సంఘపక్షమున ప్రకటింపబడు వారపత్రిక. పునరుద్ధరింపబడి 22-8-1931 తేదీని వెలువడిన మొదటిసంపుటపు 20-వ సంచిక అందుకొన్నారము. నెల్లూరుజిల్లా జమీందారీరైతులు, జమీందారీరైతుల ఆర్థికవిచారణ మొదలగు చక్కని వ్యాసములుగలవు. 'నమ్మి, నమ్మకపో' అను ముక్కలు చాల బాగున్నవి. దరిమిలాను ప్రచురింపబడిన సంచికలుకూడ క్రమముగ మాకుచేరుచున్నవి. ఈపత్రిక బాలారిష్టముల తప్పించుకొని చిరమువెలయుగాకయని కోరెదము. సాలుచందా రు 4-0-0. సంపాదకుడు: నెల్లూరు వెంకటరామానాయుడు. కార్యస్థానము: నెల్లూరు.

**ఆంధ్రప్రభ:—**

మాసపత్రిక. సంపాదకుడు మద్దూరి శ్రీరామమూర్తి. ౧-వ సంపుటము రెండవసంచిక విమర్శనార్థము మాకార్యాలయమునకు పంపబడినది. బుద్ధవరపు పట్టాభిరామయ్యగారి 'భరతమాత' యను పద్యవ్యాసమునకు ప్రథమస్థాన మీయబడినది. బండారు తమ్మయ్యగారి 'క్రీడాభిరామకర్తృత్వము' అను సారస్వతవ్యాసము చదువదగియున్నది. నిముసము తెరిపిదొరకని రెవిన్యూడిపార్టుమెంటునందు చిక్కుకొనియున్నను సారస్వత సేవ చేమరకున్న తమ్మయ్యగారిని కొనియాడుచున్నాము. వీరనంది సంస్కృతమునుండి తెనిగింపబడిన దివాకర్ల వేంకటావధానిగారి 'ఉపదేశము' అను పద్యవ్యాసము ధారాళకవిత్వమునకు నిదర్శనముగానున్నది. ఆకుండి వేంకటశాస్త్రిగారు భాసమహాకవినిగూర్చి వ్రాసిన వ్యాసము ఆసంస్కృతనాటకకారుని చరిత్ర, సారస్వతసేవ తెలుపుచున్నది. 'నా మాతృభాష-నా మాతృదేశము' అను కుందూరి ఈశ్వరదత్తుగారి (బి.యే.) వ్యాసము ఈ ఆంధ్రప్రభకు ప్రభ తెచ్చునదిగానున్నది. ఈ పత్రికాకిశోరము బహుకాలము ప్రభగాబ్రతికి ఆంధ్రసేవసల్ప పరమేశ్వరు డనుగ్రహించునుగాక! డెమ్మిసైజు. గ్లేజుకాగితములు. 32 పుటలు. సాలుచందా రు 1-0-0. కార్యస్థానము: సూర్యారావుపేట, కాకినాడ.

**సత్యాగ్రహి:—**

లవణసత్యాగ్రహావసరమున ముద్రణశాసనమునకు మదరాసురాజధానిలో సత్యాగ్రహి ప్రథమకబళమైనది. ఇందుకు కారణము అందలి నిర్భయవిమర్శనములే. రాజమహేంద్రవరమున టవున్ స్కూలులో విద్యార్థిగానుండినప్పుడే నిర్భయమునకు, దేశభక్తికి నిలుకడభూమియైన ఆత్మకూరి గోవిందాచార్యులుగారు సత్యాగ్రహి నిర్భయముగ నిర్వహించుచు దేశసేవచేయ అర్థమును, ఆరోగ్యమును పనుదీయక వెచ్చించుచున్నారు. సత్యాగ్రహి తిరిగి పునరుద్ధరింపబడి మా కార్యాలయము నలంకరించినది. దీనికి మామనఃపూర్వక స్వాగతములు. ఆంధ్రులెల్లరును అందు ముఖ్యముగ పశ్చిమగోదావరిమండలమువారును—ఈపత్రిక వారిదగుట—సత్యాగ్రహికి జపము ప్రసాదింతురుగాకయని కోరెదము. సాలుచందా రు 3-0-0. ప్రతిసోమవారము ప్రచురింపబడును. కార్యస్థానము: ఏలూరు, పశ్చిమగోదావరిజిల్లా.

**ప్రజామిత్ర:—**

తెలుగు జాతీయవారపత్రిక—సంపాదకులు యన్. వి. రంగాచారిగారు. ఇది బెజవాడనుండి ప్రచురింపబడుచున్నది. బెజవాడప్రాంతముగ ఇట్టి వారపత్రికయొక్క అవసర మెంతేనిగలదు. ప్రజలలో ప్రబోధము పుట్టింపవలయునన్న పత్రికలేవలయు. మాకందిన సంచికలనుబట్టి ఈపత్రిక రైతువిషయములకు ఎక్కువ ప్రాముఖ్యము ఇచ్చుచున్నది. ప్రతిశనివారమును ప్రచురింపబడును. సాలుచందా: రు 3-0-0.




### పెండ్లికొడుకు లేనిదే పెండ్లి యెట్లు?:—

పందిళ్లపని పూర్తియైనది, పాకలుతీరినవి, సర్వముసంసిద్ధమొనర్పబడినది. వారయాత్రికులు ఒక్కొక్కరే వచ్చుచున్నారు. బంధుసహితముగ పెండ్లికొమారుని తీసికొనిరావలసిన మూల్టానుస్టీమరు బంధువులను మాత్రము కొనివచ్చుచున్నదని లండనువిడిదిలో తెలిసినది. శోభనదేవత తారాడవలసినతావున శోకదేవతతాండవించినది. అందుమీద లండను దేవతలు సిమ్లాగ్రహములను చీదరించి కర్తవ్యముపదేశించినవి. కలకత్తాకార్యక్రమమును సగములోత్రెంచుకొని వైసురాయి సిమ్లాకువచ్చినాడు; పెండ్లికొడుకును పిలచినాడు; అనునయించినాడు; అడిగినదిచ్చినాడు; పోయిరమ్మన్నాడు. మహాత్ముడు సంతుష్టాంతరంగుడై రౌండుటేబిలు సమావేశమునకు ప్రయాణమైనాడు.

### పెండ్లికొడుకు సిమ్లానుండి ప్రయాణమైనాడు:—

ఆగష్టు 27-వ తేది. గురువారము. గోధూళికాసమయమున .మహాత్ముని సిమ్లానుండి కల్కాకు గొనిపోవుటకు ఆప్రదేశములమధ్యఅద్దెకుతిరుగు రెండుమోటారుకారులు ఆపబడినవి. ఆఱుగంటలైనది. సంప్రదింపులింకను సమాప్తముకాలేదు. ఎమర్సనుతో మహాత్ముడింకను మాట్లాడుచునే ఉన్నాడు. ఆఱు అయిన తరువాత ఆఅద్దెబస్సులు సిమ్లాలో ఉండుటకు మునిసిపలుకౌన్సలు ఒప్పుకొనవు. కావున అవి వెళ్లిపోయినవి. రైలుకందిచ్చు తుదిబస్సుకూడ వెళ్లిపోయినది. సంప్రదింపులై సమాధానమగుసరికి మఱికొంతకాలము అతిక్రమించినది. ఇక అప్పుడు బయలుదేరి బొంబాయిపోయి సకాలమున రాజపుటానాఓడనందుకొనుటకు వీలుచాలదని మహాత్ముడు ఎమర్సనుతో చెప్పెను. 'మీరు ప్రయాణమునకు సిద్ధముకండు. నేనేదో ఏర్పాటుచేయుదును'అని ఎమర్సను పలికెను. ఇక నారాత్రికి ప్రయాణమెట్లును లేదని మహాత్ముడును అతనిపార్టీయుసామానైన సర్దుకొనలేదు. ఇంతలో ఎమర్సనువద్దనుండి టెలిఫోనువార్తవచ్చినది. "రైల్వేవారితో నేనుఏర్పాటుచేసితిని. కల్కావఱకు స్పెషలుట్రెయిను. ఈస్పెషలుట్రెయిను మహాత్ముని గొనిపోవువఱకు కల్కానుండి ఢిల్లీపోవుబండి నిలుపబడును." ఏర్పాటుచేయబడిన ఈప్రత్యేకపుబండికగుచార్జీ ప్రభుత్వమువారు భరింప

రాదనియు తానేభరింతుననియు గాంధిపట్టుబట్టెను. తుదకు మహాత్ముడు పదునారుఇంటరు క్లాసుటిక్కెట్లచార్జీ ఇచ్చుటకు నిర్ణయమయ్యెను. ప్రయాణమునకు సర్వము సిద్ధమగు సంతలో మేఘుడు ఆనందమున కుంభవృష్టిగ వర్షింపనారంభించెను. స్టేషనుకు రిక్షాలో పోవుటకు మహాత్ముడు అంగీకరింపలేదు. ఫర్ గ్రోవునుండి స్టేషనుకు మూడుమైళ్లను ఆపార్టీ వారందఱును ఆవర్షములో నడిచిపోయిరి. ముప్పదియైదునిముసములుమాత్రము పట్టినది. రెండుమెతుకులు కొఱుకుటకైన వేళలేదు. కాని హితబృందము దొరికినంతవఱకు పండ్లు మొదలైనవి తెచ్చియిచ్చిరి. ప్రయాణముసిద్ధమైన అస్వల్పకాలములోనే జడివానయైనను స్టేషనులో గుమిగూడిన జనమునకు లెక్కలేదు. అసంఖ్యాకమగు ఆప్రజాసమూహము నుండి బయలుదేరి మిన్నుముట్టిన జయధ్వానములకు రైలుకదలెను.

ఏలభయము? :—

స్టీమరు కదులుటకిక నెన్నియో నిముసములవ్యవధిలేదు. మిత్రులు బంధువులు మహాత్మునివద్ద సెలవుతీసికొని రాజపుటానానుండి వెడలిపోవుచున్నారు. అప్పుడు మాతాజీ కస్తూరిబాయి మహాత్ముని పాదములంటినది. 'సెలవా?' అని చెప్పబోయినది కాబోలు. గువ్వకు తక్కువైనది. నేత్రములు అర్థనిమీలితములు. అందు నీటిచుక్కలు. 1914 లో ఆమె అతనితో సీమపోయియున్నది. ఇప్పుడుపోవుటకు అనారోగ్యమడ్డువచ్చినది. తడికళ్లు, పొడిశ్వాస, వాడుమొగము. కస్తూరిబాయిని గాంధి చూచినాడు. ఏలభయము అన్నాడు. ఇదియొకవంక కస్తూరిబాయికి మందలింపు. ఒకవంక భరతమాతకు సమాశ్వాసము. ఒకవంక దేశప్రభుత్వమున పాలుగోరు భారతరమణీలోకమునకు అభయహస్తము. ఒకవంక ఆత్మశక్తియందు నమ్మకముగల మానవులకు హెచ్చరిక. మహాత్ములవాక్యము లిట్టివిగదా?

"ఎంత తపంబు చేసి జనియించినవో":—

మూల్టానుకు పట్టవలసినభాగ్యము. రాజపుటానాకు పట్టినది. యుగయుగముల వఱకు అది భారతదేశచరిత్రమునందు విరాజమానమగుచునే యుండగలదు. పదునైదు దినములు దానికి మహాత్ముని పాదధూళిదొరికినది. ఆగష్టు 29-వ తేదీమొదలు సెప్టెంబరు 12-వ తేదీవఱకు దాని జీవితమున రసమయఘట్టము. ప్రపంచమందలి రాజనీతిజ్ఞులకు దాని నామస్మరణమే; మతవేత్తలకు దానిఅభిదానమంత్రోచ్చారణమే. పత్రికలు దానిని ప్రకటించినవి; ఉపన్యాసకులు దానినిప్రచురించిరి. ఈఓడ లార్డు ఇంచికేపుగారిది. మహాత్ముని మూలమున తనఓడనామము ప్రపంచమునందలి ప్రతిపరమాణువునకును తారకమంత్రమగుచుండగా ఇంచికేపుగారు ఇంటివద్దకూర్చుని 'ఈగాంధి వైసురాయిస్థానమును ఆక్రమింప అభిలషించుచున్నాడు' అని నోరుకొలందిమాటలాడినాడు. రాజపుటానా నోరుండినజంతువేయగుచో ఇందలి అన్యాయమును తనయజమాని కెఱింగించియుండెడిదే. ఈఓడకంటెను ఇందలి నల్లపిల్లి భాగ్యముచేసినది. మహాత్మునిజీవమునిలుపుటకైనమేకపాలలో దానికి భాగము.

మహాత్ముని పక్కలో దానికి భాగము. ఈ ఋణానుబంధము ఎక్కడిది? ఎప్పడిది? స్వర్గమునకుగూడ తన సారమేయమును గొనిపోయినాడు ధర్మరాజు. ప్రక్కనున్న మేకపిల్లకు మోక్షమిప్పించిగాని తాను వరముగొనలేదు తపశ్శాలిని సులక్షణ. మేకకొఱకే బుద్ధుడైనాడు సిద్ధార్థుడు. భారతభూషణములగు ఆభూతహితార్థబుద్ధుల అవతారరాశియగు గాంధి ఈనల్లపిల్లిని సాకుటలో ఆశ్చర్యమేమి? మహాత్ముని పాదధూళిదాల్చుటకు అరాజపుటానాయు; ఆతనిప్రక్క శయనించుటకు, ఆతని పాలలో భాగస్వామిఅగుటకు ఈనల్లపిల్లియు ఎంతతపంబుచేసిజనియించినవో?

నెల్సను, గాంధీ: సముద్రరోగము:—

ఆంగ్లావని పడసిన నావికపుత్రులలో నెల్సనునామము స్థిరప్రతిష్ఠగలది. ఆనావికుడు ఆంగ్లావనికి గొనివచ్చిన నావికవిజయములు పెక్కు. ఆవిజయములవలన గలిగిన లాభములనంతములు. వృత్తిచే సముద్రముమీదనే తిరుగుచుండుచుండవలసిన నెల్సనుకు ఓడయెక్కి సముద్రముమీదికి పోయినపుడెల్ల సముద్రరోగమువచ్చితీరునది. దానిఉద్ధతి రెండుమూడు రోజులకుగాని తగ్గునదికాదు. ఆంగ్లేయులకు అనేకనావికవిజయములను సంపాదించిన నెల్సనును సముద్రరోగము పట్టిపీడింపగలుగగా ఆఆంగ్లేయులనుండి భారతీయులకు స్వరాజ్యవిజయమును గొనితెచ్చుటకు జన్మమెత్తినగాంధిని—తన అరువదిమూడేండ్లవయస్సులో వేళ్లమడచిచెప్పగలిగినన్నిసారులుమాత్రము సముద్రముమీదప్రయాణము సల్పినవానిని—సముద్రరోగము కన్నెత్తి చూడజాలకపోయినది. సముద్రయానమిదియాతనికి పండ్రెండవసారి. మొదటిసారియే ఆరోగ మాతనికి పొడసూపలేదు. ఇక ఇప్పుడేలవచ్చును? తోడిప్రయాణీకులు ఓకిరింతలతో ఓటుగఱచుచుండ గాంధి ఓడమీదిపిల్లికి పాలుపోయుచు, దానిని మచ్చికచేయుచు, క్రూరవాంఛతోగలిసి గోవిందలుకొట్టినాడు.

గాంధీ: సరోజిని:—

గాంధియు సరోజినియుకలసి పనిచేసినపుడెల్ల వారువిజయమును బడయుచున్నారు. ఐరోపామహాసంగ్రామమప్పుడు సైనికులకు కావలసినదుస్తులు తయారుచేయుట, గాయములు తగిలినవారికి వలయుగుడ్డలుకట్టుట, కత్తిరించుట మొదలగు పనులను మిత్రమండలి తరఫున చేయుటలో సరోజినియు గాంధియుకలసిపనిచేసిరి. మిత్రమండలికి విజయముకలిగినది. దర్శన లవణసత్యాగ్రహమున గాంధి, సరోజినీదేవుల పాట్లు దేశీయులస్మృతిపథమున నెప్పుడును నిలిచియేయుండును. ఆలవణసత్యాగ్రహము గాంధిఇర్వినుసంధితో ఫలోదయాంతమైనదైనది. ఇప్పుడు గాంధియు సరోజినీదేవియుకలసి లండనుపోయియున్నారు. రౌండుటేబిలు సమావేశమున పాల్గొనుచున్నారు. మానుషశక్తియు దైవశక్తియు మేళవింపునొందుచున్నవి. వెనుకటి సంప్రదాయమునకు ఇప్పుడుమాత్రమేల భంగముకలుగును? విజయము రెక్కలు కట్టుకొనివచ్చి వాలగలదు.

ఇచ్చట గణనాథపూజ: అచ్చట గాంధి ప్రథమోపన్యాసము:—

సెప్టెంబరు 15-వతేది. జయవారము. వినాయకచవితి. ఇచ్చట హిందూదేశమున ముప్పదియారుకోట్లభారతీయులును గణనాథుని ఆహ్వానించి పత్రములతో, ఫలములతో, పుష్పములతో, కుసుమములతో, ఉండ్రాళ్లతో భక్తిమయచిత్తమున విఘ్నోపశాంతికొఱకు పూజించుచుండగా అచ్చట ఆంగ్లదేశమున ఫెడరలుస్ట్రక్చరుకమిటీయందు ఈముప్పదియారు కోట్లభారతీయుల ఏకైకప్రతినిధి గాంధి లోకవిజయాకరమైన అంకురితమందస్మితములతో, సహజమైన ముక్తకంఠముతో, వెన్నతోనేర్చిన స్పష్టవచనములతో తన ప్రథమోపన్యాస మును ఇచ్చినాడు. వినాయకపూజతో తలపెట్టినకార్యములకు విఘ్నములుండజాలవుగదా? గాంధిరాయబారము నిర్విఘ్నసమాప్తిసంది భారతీయులకు కార్యోన్నతసిద్ధి కలిగించును. ఇందుకు విఘ్నవినాశకుండే పూటకాపు.

ఈ రాయబారము ఫలింపనిచో:—

రామాయణమున అంగదరాయబారము, భారతమున శ్రీకృష్ణరాయబారమును సుప్రసిద్ధములైయున్నవి. గాంధిరాయబారము ముందర నవి దివిటీముందరదీపములగుచు న్నవి. ముప్పదియారుకోట్లప్రజాసంఘమునకు ఏకైకప్రతినిధియై ఆఱువేలమైళ్లు గావంచా గుడ్డ కట్టువస్త్రముగా; మేకపాలు ఆహారముగా; పకులు, ఆను, కదుళ్లు వాడుముట్లుగా ప్రయాణముచేసిన రాయబారిని ప్రపంచము పుట్టినయెఱుగదు, పెరిగి ఇంతవఱకు ఎఱుగదు. కావుననే నేటి ఈఅపూర్వరాయబారినిగూర్చి ప్రపంచము రినరెండు డాక్టరు హోమ్సుగారి ముఖమున నిట్లుపలుకుచున్నది: "గాంధి హిందూదేశోద్ధారకుడు మాత్రమేగాదు. అతడు ప్రపంచోద్ధారకుడును. తన్ను తమదాస్యవిమోచనునిగా తలంచుకొన్న భారతీయులకేగాక హింస, యుద్ధము, ద్వేషము, మృత్యువు అనువానినుండి తమ్ముకాపాడగలవానినిగా భావించు ఇతరదేశీయులకును అతడు లండనుమహానగరములో ప్రాతినిధ్యమువహించును. గాంధి విశ్వ మునకు ఉత్తమజీవితవిధానమును బోధించినాడు. ఆవిధానమును అతడు విజయశిఖరము నకు గొనిపోయి దాని ప్రముఖత ప్రతిష్ఠింపగలుగునా? ఇదియే అతడు లండనులో ప్రత్యు త్తరమీయవలయు ప్రశ్న; విడదీయవలసినసమస్య. నేడు ఆంగ్లావనియందు గాంధీ నెదుర్కొ నినసమస్య ప్రపంచచారిత్రమున ఏమానవుని ఇదివరకు ఎన్నడును ఎక్కడను ఎదుర్కొని యుండలేదు. ఇదివరకెన్నడును ఇట్టిసమస్యను పరిష్కరించి మానవలోకము నుద్ధరింపగల గాంధివంటి తగుపురుషుడును ఉద్భవించియుండలేదు. ఒక్కభారతదేశమునకేగాక ప్రపంచ మునకంతటికిని మహాత్ముడగు ఆయనకై ప్రార్థనలు సలుపుదము. ఏలయన ఆయనను విశ్వ సింతుము; ఆయనపక్షమున నిలుతుము. మహాత్ముడు విఫలుడైన ప్రపంచహృదయమే బద్ధలగును." విశాల వియత్పథమునుండి తథాస్తుదేవతలు ఈవాక్యములను ఆమ్రేడిత మొనర్చుచున్నవి.

"భారతసోదరీమణులననుసరింతుము":—

లండనుఆక్స్‌ఫర్డువీథియందలి విటమినుకేఫ్‌వారు కారణముచూపకయే ఐదుగురుపని కత్తెలను పనినుండి తొలగించిరి. మిగిలినపనికత్తెలీఅన్యాయమును భరింపజాలకపోయిరి. తొలగించినవారిని తిరిగి నియమింపవలయునని వీరు విటమినుకేఫ్‌మందిరసోపానములపై ధవళవస్త్రధారిణులై నిలిచి పికెటింగు ప్రారంభించిరి. క్రొత్తపనికత్తెలను గొనివచ్చి విటమినుకేఫ్‌వారు పనిప్రారంభించిరి. కాని పికెటింగుమూలమున వారి వ్యాపారము మందగించెను. పికెటింగుచేయుచున్న ధవళవస్త్రధారిణి ఒకతె ఇట్లుచెప్పెను: "హిందూదేశసేవికల పికెటింగుపద్ధతియందు మాకు విశ్వాసముగలదు. శాంతియుతమగు పికెటింగునందు మేము హిందూసుందరీమణుల అడుగుజాడల ననుసరింతుము. మే మెవరికి అడ్డురాము. మా సంకల్పమునకు సిద్ధియగువఱకు మే మీపికెటింగును విడనాడము. అవసరము అగుచో కారాగారములకుపోవుటకును మేము సంసిద్ధలమైయున్నాము." భారతదేశసేవికల పికెటింగు పద్ధతికి ఇంతకంటె ఎక్కువ యోగ్యతాపత్రమేమికావలయును? అనుసరణము శ్లాఘించుటలో ఉత్తమపద్ధతిగదా? మొన్నటి సత్యాగ్రహసమరమున పసుపుపచ్చచీరలుగట్టి పికెటింగు యొనర్చిన భారతదేశసేవికలను దలపించుచున్న ఈధవళవస్త్రధారిణులను లండను పౌరులు విఱగబడిచూచుచున్నారు. కాని అచ్చట పోలీసువారిదర్శనము మాత్రములేదు. ఇదియే ఈదేశమున అగుచో పోలీసువారి కర్రపెత్తనమునకు హద్దుఉండకపోయెడిదే. ఓభారత నారీ! నిన్ను పరిపాలించుజాతికిచెందినస్త్రీలు నీపికెటింగుపద్ధతి ననుసరింపుచున్నారు. నీవు వారికి దేశికురాలవైతివి. నీవుధన్యవు. విజయమునీదే.

హాస్టలుసూపరింటెండెంటే తార్పుడుకత్తె:—

లాహోరునగరమున యూజెట్‌రోడునందు ప్రభుత్వమువారు ఒకఆరోగ్యపాఠశాలను నిర్వహించుచున్నారు. ఆపాఠశాలయందు చదువుకొనువారు దానికి చెందిన వసతి గృహమునందే వసింపవలయునను నిర్బంధముకలదు. ఒకమర్యాదకుటుంబమునకు చెందిన హిందువుకు— అప్పరుసబార్డినేటు ప్యాసుచేసి డి. పి. డబ్లియు శాఖయందు ఉద్యోగము చేయుచున్నవాడు—తనకొమార్తెల నిరువుర నాపాఠశాలయందు ప్రసూతివైద్యవిద్యనేర్వ జేర్పించెను. నియమముప్రకారము ఆబాలికలు వసతిగృహమునందే వసించుచుండిరి. పాఠములు చెప్పుమిషతో ఈబాలికలను హాస్టలుసూపరింటెండెంటు—క్రిస్టియనువనిత—తనకడకు రప్పించుకొనుచుండెను. సూపరింటెండెంటు ఇంట ఇరువురు క్రిస్టియనుయువకులుండిరి. తన పాలనమున నున్నవారి నీతిరక్షణమున కంటవత్తిడుకొని మెలంగవలసిన సూపరింటెండెంటే ఇచ్చట తార్పుడుకత్తెయయ్యెను. పాఠశాలాధికారిణి కీకంపు తెలియరాగా సూపరింటెండెంటును వెంటనే పనినుండి తొలగించెను. యువకు లిరువురును గవర్నమెంటునౌకరులు. ఈదుష్టచేష్టితము

నకుగాను వారు సిక్కులీవుమీదనుండిరి. ఆహిందూబాలికల భావిజీవితము బుగ్గియయ్యెను. అంతతో పోవునా? ఈవిషయము లాహోరుప్రాంతమున స్త్రీవిద్యానిరోధమునకు కారణభూతమగుచున్నది. తమ బాలికలను విద్యాలయములకు బంపుటకు తలిదండ్రులు తటపటాయించుచున్నారు. గతమాసమున అమృతసరప్రాంతమున అజ్ఞాతయావనయగు విద్యార్థిని అపహరింపబడుటమూలమున ఆప్రాంతమునగలిగిన అలజడినిగూర్చి ప్రస్తావించితిమి. ఈ మాసమున ఇది. "ఇప్పుడిప్పుడే మొలకయెత్తుచున్న స్త్రీవిద్యాంకురము ఈవడదెబ్బలకు తాళగలదా?

**ఉవిద ఉలేమాలసమక్షమున ఉపన్యసింపరాదు:—**

వారణావతిమునందలి మహమ్మదీయులు విదేశవస్త్రవిసర్జనవిధానము నాలోచించుటకు సమావేశమైరి. ఆసభయందు శ్రీమతి రహమత్ బీబీ అనునామె ఉపన్యసింపదలచెను. "ఉలేమాల సమక్షమున ఉవిద ఉపన్యసించుటకు మనశాస్త్రము ఒప్పుకొనదు. కావున ఈ సభయందు ఆమె ఉపన్యసింపరాదు" అని కొందరు పెద్దలనిరి. ముఖ్యనాయకులలో నొకడగు మౌలానా అజదుసోభానీగారందుమీద లేచి "మీరు చెప్పునది సరికాదు. స్వర్గీయ మౌలానా మహమ్మదాలీగారి మాతృదేవి బీయమ్మయు, వారి సతీమణియు ఉలేమాలు ఉండిన పెక్కుసభలలో ఉపన్యసించియుండిరి. అప్పుడీఉలేమాలు ఉలకకుండిరేమి?'' అని ప్రశ్నించెను. అయినను సభలోని ఉలేమాలు తామెక్కినగుఱ్ఱమును దిగలేదు. చేయునది లేక మౌలానా అజదుసోభానీగారు వల్లకుండిరి. శ్రీమతి రహమత్ బీబీగారు ఉపన్యసింప మానిరి. పూర్వాచారపిశాచమా! నీవు హిందూదేశమున పీటలువెట్టుకుంటివా? బహిరంగ సభలో స్త్రీ పల్లెత్తిపలుకరాదా?

**ఈ వీరబాల సిద్ధసంకల్పయగుగాక:—**

సెప్టెంబరు 16-వతేది. బుధవారమురాత్రి. తొమ్మిదిగంటలయ్యెను. హిజ్లీయందలి డిటెన్యూలక్యాంపునందు గలాభాపుట్టెను. గాభరాపడి పోలీసులు తుపాకులు పేల్చిరి. పలువురకు గాయములుతగిలెను. ఇరువురు ప్రాణములువిడిచిరి. అందు సంతోషమిత్రుడను గ్రాడ్యుయేటు ఒకడు. అతని శవమును ప్రజలు ఊరేగింపుచుగొనివచ్చి కలకత్తాలో అక్రూరదత్తు వీథియందలి ఆతని ఇంటిముందఱ దింపిరి. ఆదేశభక్తుని బాలభార్య శవమును సమీపించినది. చైతన్యమును గోల్పోయిన భర్తముఖమును రెండుమూడునిముసములు అనిమేషనయనములతో చూచినది. లేనకన్నులు ఆర్ద్రములైన కాలేదు, పొడిగ్రుడ్లుపడినవి. డగ్గుత్తికనొందని ఎలుంగున ఆమెనాథుని స్వర్గీయమైన ఆత్మనుద్దేశించి "ఆర్యపుత్రా! నీవు ఇహలోకమును విడిచిపోయితివి. జన్మాంతమువఱకు నీవు తలంచియుండిన పవిత్రకార్యమును నిర్వహించుటకు నీభార్యనిటవిడిచిపోయితివి. ఆపవిత్రకార్యము నిర్వహింపబడుగాక!" అనిప్రతిజ్ఞాపూర్వకముగ నామెపలికెను. దుఃఖభరమును దూలింపగలిగినఆధృతిమతి ఈప్రతిజ్ఞాభర

ఘమును ప్రతిఘటింపజాలకపోయెను. ఆమెమూర్ఛయనుసమాధిలో మునిగినది. మృత్యుదేవి ప్రళయతాండవసమయమునగూడ ప్రతిజ్ఞాభంగభయమునుండి ప్రాణనాథుని పవిత్రాత్మను రక్షింప బాసచేసిన ఈవీరబాల సిద్ధసంకల్పయగునట్లు పరమేశ్వరుడనుగ్రహించునుగాక!

## ఇర్విను కొడుకు : చర్చిలు కొడుకు :—

ఇర్విను గాంధితో సంధిచేసికొనుటచే అతనికి గాంధిమీద అభిమానమనుభావము వ్యాప్తమయ్యెను. ఒకానొకఆంగ్లపాఠశాలలోని బాలు రిందుమీద తమతోడివిద్యార్థి యగు ఇర్విను చిన్నకొడుకును 'గాంధి' 'గాంధి' అనుపేరున పిలుచుచు ఉడికింపజొచ్చిరి. ఆబాలు డిది సహింపజాలక ఇంటికిపోయి తండ్రితో 'నాన్నా! ఈగాంధిని వదిలేద్దూ' అని బ్రతి మాలినాడు. ఒక ఇంగ్లీషుకొడుకిట్లు తనతండ్రితో గాంధిని వదిలివేయమనుచుండగా ఒక ఇంగ్లీషుతండ్రి తనకుగా తనకొడుకును గాంధిని చూచిరమ్మనుచున్నాడు. ఈఇంగ్లీషుతండ్రి యెవరు? శ్రీయుత విన్‌స్టన్ చర్చిలుగారు. గావంచాగాంధి తనతోమాట్లాడకోరగా చర్చిలు—గాంధియను సూర్యునిచూడజాలని దివాంధము—మొగముచాటువైచి తనకుబదులు తన కొడుకును 'బాబూ! గాంధిని చూచిరా' అన్నాడు. అవస్థ.

## రేపు :—

రేపు అక్టోబరు రెండవతేది. అది మనమహాత్ముని జన్మదినము. నిరు డాతనిజన్మ దినమును ఆతడు దేశమున ఎఱవాడచెరసాలయందుండగా జరుపుకొన్నారము. ఈవత్సరము అతడు విదేశమున మనకు రాయబారియైయున్నాడు. ఆతనిశరీరమునందలి ప్రతిరక్తకణమును భారతమాతకొఱకే వెచ్చింపబడుచున్నది. ఆతని జీవితమునందలి ప్రతిక్షణమును దేశారా ధనకృత్యములతో తేజరిల్లుచున్నది. అట్టివాని జన్మదినమున మనకు కర్తవ్యమేమి? ఆతనికి ప్రియతమమైన ఖద్దరువస్త్రవ్యాపనముచేయుటయే. రేపు ప్రతిభారతీయుడును ఒక్కొక్క రూకయైన ఖద్దరుకై వెచ్చించువో మహాత్ముని జన్మదినోత్సవము ఉచితరీతిని జరిపినవా డగును. ఇప్పుడుఅఖిలభారతచరకాసంఘమున నిలువయున్న పదునైదులక్షలఖద్దరువస్త్రములు రేపు సెలవై పోవునట్లుచేసినచో మహాత్మునిఆనందమునకుమేరయుండదు. భారతీయులీవిషయ మున శ్రద్ధధానులగుదురుగాక! మహాత్ముడింకను పెక్కువత్సరములుజీవించి మానవకళ్యాణ మూర్తియై, పాంచభౌతికమగు ఈప్రపంచమున భగవంతునకు ప్రతినిధియై వెలుగొందునట్లు అనుగ్రహింప పరమేశ్వరుని మడిచేతులతో మనఃపూర్వకముగ ప్రార్థింతుము.

## గృహలక్ష్మి ముఖచిత్రము:—

శ్రీమతి దిగుమర్తి బుచ్చికృష్ణమ్మగారు రచియించినది. దీని కామె ఇడిననామము 'గృహలక్ష్మి'. చిత్రకళాప్రదర్శనములందు బహుమానములందినది. హిందూగృహములను విడిచిపోయినలక్ష్మి నితిరిగిపొందుమార్గమును గృహలక్ష్ములకుపదేశించు ఈఉత్తమచిత్రమును గృహలక్ష్మికి ప్రసాదించిన శ్రీబుచ్చికృష్ణమ్మగారికి మాకృతజ్ఞత తెలుపుకొనుచున్నాము.

# చిత్రముల వివరణము

## కీ. శే. అనంతగిరి సీతాలక్ష్మాంబ

ఈమె సుప్రసిద్ధదేశభక్తులగు అనంతగిరి పేరనార్యకవిగారి సతీమణి. కోయంబత్తూరుజిల్లా ధారాపుర నివాసులగు దేవరకొండ వేంకటరామయ్యగారి నాలవతనూజాత. 1903-వసంవత్సరము మే నెల 26 లేదీన ధారాపురమున జననమందినది. బాల్యమునుండి దైవభక్తి, మితభాషిత్వము, పెద్దలయెడవిధేయత మున్నగు సద్గుణముల పేరెన్నికగన్నది. తెలుగుబ్రాహ్మణులగుటచే ఇంటిలోవాడుక భాష ఆంధ్రమేదైనను, దేశభాష అరవమగుటచే వయిదవతరగతివరకు పాఠశాలయం దరవము నభ్యసించుసమయముననే యింటియందు తెలుగువ్రాయుట, చదువుట ప్రత్యేకోపాధ్యాయునివలన ధారాళముగ నేర్చి, హార్మోనియము వాయించుట, గాత్రసంగీతము నభ్యసించి, శ్రావ్యమైన కంఠధ్వని కలిగియుండుటచే, పెండ్లిపేరంటములం దింపైనపాటలు, త్యాగరాయ కృతులు పాడుచు బంధుమిత్రుల కానందముగూర్చి వారిమెప్పు పొందుచుండినది. 1916-వసంవత్సరము జూన్ 5 తేదీ బెంగుళూరు అలుసూరుపేటలో మేనత్తగారిభర్త శ్రీయుత కల్యాణసుందరంగారియింట వివాహము జరిగినది. వివాహానంతరము తెలుగుపుస్తకముల విశేషముగజదివి ఆంధ్రభాషాజ్ఞాన మభివృద్ధిచేసికొని భర్తగారు బాలభారతీగ్రంథాలయము, బాలభారతీవారపత్రిక నిర్వహించుటలో శక్తికొలది తోడ్పడుచుండినది. కొన్నిసమయములందు భర్తతోపాటు అచ్చుపనులను స్వంతముద్రణాలయమున నిర్వహించుచుండినది. భర్తగారిసోదరియు విద్యావతియునగు లక్ష్మీవరసమ్మగారి నిరంతరసత్సహవాసముచే దేశహితకార్యములం దుత్సాహముతో పాల్గొనుచుండినది. 1921-వసంవత్సరమున సహాయనిరాకరణమునందు భర్తయైనకవిగారు నాలుగునెలలు బళ్లారికారాగారమందు శిక్షననుభవింప ముద్రణాలయముపై 1000 రూప్యములు ధరావతు అడుగుటచే మూసివేయబడగా, బంధుమిత్రులందరు భావగారినివాసస్థానమగు సవప్రగ్రామమున నుండుమని యెంతబోధించినను వినక, భర్తగారి సోదరియగు లక్ష్మీవరసమ్మగారితో బాటు అనంతపురమందే నిలిచి రాటపుపరిశ్రమ, స్వదేశీవిషయములందు దీక్షతో పనిచేయుచు, నాసమయమందే తటస్థించిన పుత్రికామరణమునుగూడ సహించి యుత్సాహము చూపగలిగినది. కారణాంతరములచే భర్తగారితోపాటు స్వగ్రామమగు అనంతపురంతాలూకా సవప్రగ్రామము చేరిన పిమ్మట గ్రామపునర్నిర్మాణకార్యములందు భర్తగారికనేక విధముల తోడ్పడుచు, పార్థివపదార్థ, హోమియోవైద్యపద్ధతుల నభ్యసించి బీదజనులకు అందుముఖ్యముగ శిశుచికిత్సయందు శ్రద్ధాభక్తులు చూపుచు కవిగారికెంతో సహాయపడుచుండునది. మరియు నిరంతరము లెక్కకు మిక్కిలిగా నింటికరుదెంచు అతిథుల సేవాసపర్యలందు చూపుచుండిన ఉత్సాహము తీసుకొనుచుండిన శ్రద్ధాభక్తులు, గ్రామజనులయెడ చూపుచుండిన ఆదరములచే మిక్కిలి ఆకర్షింపబడి గ్రామజనులచే నెక్కువ గౌరవింపబడుచుండినది. ఇట్టి యీమె యీనిజాషాఢ శు ౬ సోమవారం 20-7-31 తేది పగలు 3 గంటలవేళ కష్టప్రసూతిచే, వృద్ధయగు అత్తగారిని, ప్రియభర్తను, వరుసగ 9, 6, 3 సంవత్సరముల వయస్సుగల కొమారుని, యిద్దరుకూతుర్లను శోకసాగరమునముంచి, యిహలోకమును వదలి పరమపదించినది. పరమేశ్వరు డీమె యాత్మకు శాంతినొసంగుగాక!

## ఆదుర్తి లక్ష్మీబాయమ్మ

ఈమె శ్రీయుతులు వరాహగిరి జోగయ్యపంతులుగారి కొమారిత; శ్రీ వి. వి. గిరిగారిసహోదరి. వితంతువు. ఖద్దరువ్యాపనమునందత్యంతాసక్తిగలయామె. సత్యాగ్రహమున స్వచ్ఛందసేవకురాలుగ చేరినది.

ఖద్దరుహాకింగు, ఊరేగింపులయందు పాల్గొనినది. ఈమధ్య బరంపురంపట్టణజాతీయోపసంఘమున కధ్యక్షురాలుగ నెన్నుకొనబడినది. గంజాంజిల్లా కాంగ్రెస్ సంఘమునకును ఉపాధ్యక్షురాలుగ నియమింపబడినది. గ్రామములలో నీమధ్య సంచారముచేసి ఉపన్యాసములిచ్చినది. ఇపుడు విదేశవస్త్రవిక్రయనిరోధమున పాల్గొనుచున్నది. విద్యావతి.

## మంత్రాల రామసీతమ్మ

ఈమె గంజాంజిల్లాకు చెందిన బ్రాహ్మణవనిత, అఖిలభారత చరఖాసంఘపు బరంపురం ఖాదీదుకాణదారగు మంత్రాల లక్ష్మీనరసింహంగారి భార్య. అసహాయవాదిని. గతఉప్పుసత్యాగ్రహమున స్వయముగ ఉప్పుచేసి ప్రభుత్వదృష్టిచొప్పుననేమాచరించియు, ఏకారణమువలననో కారాగృహమున పెట్టబడక విడిచిపెట్టబడినయామె. ఖద్దరుహాకింగు, నగరసంకీర్తనములయందు పాల్గొనుచుండును. ఈమధ్యజరిగిన సారాయిపికెటింగునందును, నేడు విదేశవస్త్రవిక్రయనిరోధమునందును పాల్గొనుచున్నది.

## సరళాదేవి

ఈమె ఉత్కళవనిత. కరణములకుటుంబమునకు చెందినది. ఘోషాపద్ధతి విడిచిపెట్టినది. గంజాంజిల్లాలోని ఉప్పుసత్యాగ్రహమున పాల్గొనిన మొదటి యువతీమణి. చాలస్వరాజ్యచందాను ప్రోగుచేసినది. మంచివక్త. ఈమె 1930 జూను మొదటిరోజులలో ఛత్రపురమువద్ద అరెస్టుచేయబడి 6 నెలలు విడిశిక్ష విధింపబడి వేలూరుచెరసాలలో కాలముగడపెను. మరలివచ్చి కొంతకాలము ఆంధ్రదేశసంచారముచేసి, ఇపుడు ఉత్కళప్రాంతమున రాబోవు కాంగ్రెస్‌నుగూర్చి పాటుపడుచున్నది. హిందీభాషను, కొంత ఆంగ్లమును నేర్చినది. గతమాసమున ఈరోడు తమిళనుహిళామహాసభకు అధ్యక్షతవహించినది.

## చంద్రమణిదేవి

ఈమె ఉత్కళవనిత. బాలసోర్‌జిల్లాలోని ఆగార్‌పడాయం దీమె 1908 లో జన్మించెను. తండ్రియగు పండిత గంగాధరరథోగారు సంస్కృతజ్యోతిషములందు గొప్ప విద్వాంసుడు. తల్లిపేరు శ్రీ పార్వతీదేవి. చంద్రమణిదేవికి 7-వ యేటనే వివాహమై మరి 5 నెలలతరువాతనే వితంతువయ్యెను. ఈమెతండ్రి ఈమె 13-వ యేటనే కాలగతినొందెను. తరువాత నీమె ఒరియా, సంస్కృత, హిందీభాషలయందు విద్యనభ్యసించెను. కొంచెము ఆంగ్లభాషయు నేర్చెను. ఈమెవారను లీమెకు విషప్రయోగముచేసిరి, నీటముంచి చంపివేయ యత్నించి విఫలులైరి. ఈమెతండ్రికి స్నేహితుడు, కాశీపండితుడు నగు గంగాధరలాలుగా రీమెకు సాయముచేసిరి. ఈమె తన 21-వ యేటివరకును కటకము, పూరీ, బాలసోర్, సంబల్‌పూర్, గోడాజాత్‌లలో ఆర్యసమాజమతప్రచారకార్యమునుచేసెను. ముగ్గురు బ్రాహ్మణబాలవితంతువులకు పునర్వివాహము చేయించెను. 1930 లో శాసనోల్లంఘనసత్యాగ్రహోద్యమములోచేరి బాలసోర్‌లో పనిచేసి గంజాంమండలములోని రంభ, గంజాములకువచ్చి ఉపన్యాసములిచ్చి 144 నిషేధపుటాజ్ఞ నుల్లంఘించి, ఒరిస్సా విద్యార్థిమహాసభయందు ఉపన్యాసమిచ్చి ప్రభుత్వమువారిచే నిర్బంధింపబడి వేలూరు స్త్రీలజెయిలులో జూలై 14 నుండి 1931 జనవరి 13 వరకుండి తిరిగివచ్చి కటకమున నియంత్రితురాలై ఉప్పుచట్టముక్రింద ఫిబ్రవరి 15-వ తేదిని 6 నెలల శిక్షనొంది సంధిపరతులవలన విడివడి మరల ఉత్కళప్రాంతమున కాంగ్రెస్‌ప్రచారమునుగావించుచున్నది.

## వేదాంతం కమలాదేవి

ఈమె కాకినాడలోని డాక్టర్ వేదాంతం వేంకటకృష్ణయ్య, ఎల్. సి. పి. యస్. గారి సతీమణి. బ్రాహ్మమతావలంబకురాలు, విద్యావతి, సంగీతసాహిత్యములం దభిప్రేమాభిమానముగలయామె. సంఘసంస్కారము, స్త్రీ విద్యాభివృద్ధులగూర్చి యిదివరకు పాటుపడుచుండిరి. కాకినాడ కాంగ్రెసునందు స్త్రీ

సేవాదళాధిపురాలుగనుండి కస్తూరీబాయిసతి యాశీర్వాదమునుబడసెను. ఆంధ్రరాష్ట్రీయోపజాతీయసంఘము నందు, అఖిలభారతకాంగ్రెసుకమిటీయందును సభ్యురాలుగ నుండెను. ఉప్పుసత్యాగ్రహశాసనోల్లంఘనోద్యమములందు తీవ్రముగపాల్గొని గోదావరి, విశాఖపట్టణం, గంజాంజిల్లాలలో ప్రచారముచేసి నౌపడా ఉప్పుగల్లీదాడియందు నాయకత్వమువహించి 1930 మే 20-వ తేదీరాత్రి అరెస్టుచేయబడి మరునాటిఉదయం నరసన్నపేటలో 6 నెలల ఖైదీశిక్ష, బి. తరగతి ఈయబడెను. 6 గురు బిడ్డలనువిడిచిపెట్టి యిష్టపడి కష్టముల పాలై వేలూరుచెరసాలలో శిక్షాకాలముగడపి విడుదలబడి మరల ఇపుడు కాంగ్రెసు సేవచేయుచున్నది.

## జయంతి సూరమ్మ

ఈమె పూర్వము 'యంగిండియా' 'హ్యుమానిటీ' 'జ్యోతి' పత్రికలకు సంపాదకులుగనుండిన బ్రాహ్మమతప్రచారకులను శ్రీ జయంతి వేంకటనారాయణగారి భార్య. నారాయణగారు స్వరాజ్యాందోళనమున రెండుసార్లును ప్రథములుగ ఏడాదిచొప్పున కారాగారశిక్ష ననుభవించిరి. సూరమ్మగారు, వెనుక తనభర్త జెయిలున కేగినపుడు గంజాంజిల్లాలో అనేకగ్రామములందు, పట్టణములందు సంచారముచేసి ఉపన్యాసములిచ్చి ఖద్దరుహాకింగు చేసియుండెను. గత ఉప్పుసత్యాగ్రహమున బరంపురంలో నిషిద్ధలవణమును పలుమారుకొని, వాలంటీర్లనుచేర్చి, లెక్కలేనిగ్రామములు సంచారముచేసి ప్రచారముచేసి ఉప్పును విరివిగ విక్రయించి స్వరాజ్యనిధి చేకూర్చి, నౌపడా ఉప్పుదాడికినిపోయి, యచట ఉపన్యసించి తనభర్త జెయిలుకువెళ్లిన నెల రోజులవరకు తీవ్రప్రచారముచేసి 1930 జూను 19-వ తేదీని బరంపురంలో ఎరెస్టుచేయబడి 6 నెలలు ఖైదీశిక్ష, బి. తరగతి విధింపబడెను. 9 గురు బిడ్డలనువిడిచిపెట్టి సంసారమునుత్యజించి స్వరాజ్యోపాసనచేసి వేలూరుజెయిలులో కాలముగడపి ధన్యురాలయ్యెను. గంజాంజిల్లానివాసినియై బరంపురంలో ఎరెస్టుచేయబడి జెయిలుకువెళ్లిన ఏకమాత్రనారీరత్నము—ఆంధ్రవనిత ఈమెయే. ఈమెనుగాంచి జిల్లాయంతయు నేడు గర్వపడుచున్నది. విముక్తినిబడసిన వెనుక ఇపుడును సంచారప్రచారములందు గ్రామపట్టణములయందు సకలవిధములగు స్వరాజ్యాందోళనములలో పాల్గొనుచున్నది. మద్యవిక్రయనిరోధమున పాల్గొనినది.

## చావలి అన్నపూర్ణమ్మ

మీమాంసశాస్త్రమున మీనుమిగిలిన పండితులును, తూర్పుగోదావరిజిల్లా అమలాపురమునందలి న్యాయవాదిప్రముఖులలో నొకరునునగు చావలి యజ్ఞేశ్వరసోమయాజిశర్మగారి (బి. యె; బి. యల్.) ధర్మపత్ని. ఈమె పతిపాదములసన్నిధినిగూర్చుండి వేదాంతమీమాంసాదిశాస్త్రరహస్యముల గ్రోలినది. ఈసంచికయందు ముద్రింపబడిన స్త్రీలయాధిక్యత అను ఈమెవ్యాసమును చదివినవారికి ఈమెవైదుష్యముయొక్క లోతును బాతును తెలియనగును.

## ఏలూరుపాటి లక్ష్మీసరస్వతి

ఈమె పండితకుటుంబమునకుచెందిన విద్యావతి. గోదావరతీరము కొవ్వూరుపోస్టు తాళ్లపూడిశివారు వేగీశపురము నివాసిని.

## ఆచంట లక్ష్మీదేవి

ఆయుర్వేద వైద్యశిఖామణులు ఆచంట లక్ష్మీపతిగారి తనయ. లండనునగరమున యం. ఆర్. సి. పి.; యల్. ఆర్. సి. యస్ పరీక్షలనంది ఎడింబరో మొదలయినచోటుల ఆసుపత్రుల ప్రసూతివైద్యవిద్యయందు అనుభవశిక్షనందినది. మాతృదేశమునకువచ్చి ఉన్నతోద్యోగమునకుదిరి పనిచేయుచున్నది.

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.